శ్రీరామచంద్రకృతినం
ద్వంద్వాతీతం గురోర్గురుమ్,
యోగీశ్వరం జ్ఞానధనం
వందే నాగేశ్వరం గురుమ్.

# PREFACE

This book is the result of my work, as the niversity Reader in Telugu. It is based on the ctures delivered by me in Nov. 1928, under e auspices of the Madras University, and is ıly an amplification of the matter contained ıcrein.

Andhra Bharata is doubtless the earliest and ıost important work extant in Telugu from linguistic as well as an artistic point of view; ıd it is only proper that a critical and historical ppreciation of the Telugu language and literature ıould begin with a study of that great work.

Critics are often prone to remark that the ıst word on Telugu Bharata has already been ıid, and that there is nothing more to be worked n the subject. But it may be said that they ave to realise that Mahabharata is a diamond ith many facets still demanding the view and ppreciation of the critic. Telugu language nd literature have to be studied more critically rom a historical point of view, their gradual levelopment has to be traced, the underlying nfluences that moulded their development in lifferent ages have to be noted, and the real place and importance of Bharata, especially of Tikkana's poetic expression and art, in Telugu

literature, have to be brought out, by a comparison of the Telugu text with that Sanskrit original. As such, this sort of and work has been brought under the pı of the Telugu Department. For the pre have to confine myself to Virataparva alc purposes of comparison, as no authorised ı of the original text for other Parvas is av so far.

In this connection, it is with feeli reverence and gratitude, that I thank Bahadur, Sir. R. Venkataratnam Naid Kt., M.A., D. Litt., Ex Vice Chancellor University, for having encouraged me in up this subject on hand as part of my woı I have to thank N. Bangarayya garu, B.A., help he has rendered me in this work w was here as a Fellow of the Telugu depa I express my deep sense of gratitude to M Desoddharaka, K. Nageswara Rao Pantu the noble Patron of Telugu Literature, kindness with which he accepted to incl work in his Andhra Grandhamala, a promptness with which he got it thro press. My thanks are also due to the Uı authorities for having permitted me to this work.

I

# పీఠిక

మద్రాసు విశ్వకళాపరిషత్తులో తెలుఁగురీడరుగా
ండి క్రిందటి సంవత్సరమున నేను జేయఁగలిగిన పరిశోధ
ఫలితమే యీ గ్రంథము.

ఆంధ్రభాషావాఙ్మయముల చరితమును, వాని
క్రమపరిణామమును అన్వేషించి విమర్శించుటయే ప్రాచ్య
రిశోధనాలయమందలి యాంధ్రశాఖ చేయఁదగిన పనిగా
న్నది. భారతమే యీ భాషలో మొదటి యుద్గ్రంథ
గుటచే, తద్భాషావాఙ్మయ పరిణామమున కిది యెంత
అకుఁ దోడ్పడినదో తెలిసికొనవలసిన యావశ్యకత
లదు. ఇంతకుఁ బూర్వ మనేకు లనేకవిధముల దీనిని
మర్శించియే యున్నారనుట వాస్తవమే. కాని నన్న
ార్యుఁడు చెప్పినట్లుగా విశ్వజనీనమై పరఁగు నీ భారత
త్నము దాని నాశ్రయించువారి దృక్పథమునుబట్టి
ంత కాంతుల నీనుచు నేయుండు ననుటకు సందేహ
ు లేదు. కావున భారతకవితకుఁ దత్తద్దేశకాలపరిస్థితు
కు నెట్టిసంబంధము కలదో, ఇది యాంధ్రభాషావాఙ్మయ

పరిణామమగున కెట్లు తోడ్పడినదో, కవిత్రయము యొక్క--అందు ముఖ్యముగా కవిబ్రహ్మయొక్క--కవితానిర్మాణ చాతుర్య మెట్టివిశేషగుణములు కలదగుటచే సర్వాతిశాయియై వెలయుచున్నదో పరిశీలించి వివరింపఁగల విమర్శన లింకను బయలుదేఱవలసియున్నవి. గీర్వాణసారస్వత మహావృక్షశాఖకుఁ గట్టినయంటుగా బయలుదేఱి విజృంభించిన యాంధ్రసారస్వతము నందు ఆంధ్రజాతీయతాగుణ మెంతవఱకు నిలిచియున్నదో పరిశీలింపవలసియున్నది. ప్రాచీనాంధ్రభాషాస్వరూపమును గుర్తించి, దానికితర ద్రావిడభాషలతోడను, సంస్కృత ప్రాకృతములతోడనుగల సంబంధ బాంధవ్యములను నిర్ణయించి, తద్భాషా చరిత్ర నన్వేషించుటయు నావశ్యకంబే. ఆంధ్రసారస్వత మహావృక్షమునకు 'లలితస్కంధము' ఆంధ్రభారతము. ఈ స్కంధము నాశ్రయించినచో, నావృక్షమునకు 'మూలంబగు' దేశీయపుఁ బలుకుబడియు, పైకి విజృంభించిన ప్రబంధాదిశాఖల యథార్థస్థితియు మనకు సులభముగ గోచరించును. కావుననే యిది యింకను భాషాసారస్వత విమర్శకుల కవశ్య మాశ్రయపాత్రం బగుచున్నది. కేవల భాషాంతరకర్తలుగ నెన్నఁబడుచున్న భారతకవుల కళా చాతుర్యవిశేషములను మూలగ్రంథముతోఁ బోల్చి విడదీయవలయునను తలంపే నన్నీవిమర్శనమునకుఁ బు(

కొల్పినది. ప్రమాణముగా గ్రహింపఁదగిన మూలగ్రంథ పాఠము తక్కినపర్వములకు లభింపకపోవుటచే నీవిమర్శనము ప్రధానముగ నొక్కవిరాటపర్వముపైననే యాధారపడవలసినదైనది. తిక్కన దీనినిగూర్చి చేసిన ప్రశంసనుబట్టి యీతని కవిత కిది మూలకంఠదమనుటయు స్పష్టమే. తక్కినపర్వములనుగూడ మూలముతోఁ బోల్చి చూచిన దో తిక్కనార్యుని కళాప్రతిభల మహత్త్వ మింకను బయలుపడుననుటకు సందేహము లేదు. ఇట్టి విమర్శనల ప్రయోజనమును నిర్ణయించి యిందేమైన గుణలేశములు గలిగిన చో గ్రహించి నన్నుఁ గృతార్థునిఁ జేయ సహృదయులగు పండితులను ప్రార్థించుచున్నాను.

ఇంతకుఁ బూర్వ మీవిశ్వకళాపరిషద్ధ్యక్షులై యుండి యీ భారతవిమర్శనము విషయమున నన్నుఁ బ్రోత్సహించిన శ్రీ దివాన్‌బహదూర్ సర్ రఘుపతి వేంకటరత్నంనాయుఁడు (కె. టి., ఎం. ఏ., డి.లిట్.) గారికి వినయపూర్వకమగు నాకృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాఁడను. ఈ గ్రంథమును బ్రకటించుకొన ననుజ్ఞయొసఁగిన విశ్వవిద్యాలయాధికారులకును, ఈ పరిశోధనాలయమున 'ఫెల్లో'గానున్న కాలమున నీగ్రంథపరిశోధన విషయమున నాకుఁదోడ్పడిన శ్రీ నండూరి బంగారయ్య(బి.యే.)

గారికిని నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. నా ప్రార్థన నంగీకరించి యీగ్రంథమును దమ ఆంధ్రగ్రంథమాలలోఁ జేర్చికొని యింత శీఘ్రకాలమున ముద్రించి యాంధ్రలోకము నెదుటఁ బెట్టిన యత్యుదార స్వభావులు, నాంధ్రభాషా పోషకులు, దేశోద్ధారకులు నగు (శ్రీ) కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారికి నా కృతజ్ఞతాభివందన శతముల నర్పించుచున్నాఁడను.

కోరాడ రామకృష్ణయ్య

# విషయసూచిక

భారతాంధ్రీకరణము—తిక్కన: ౧౬౩-౩౫౪

విరాటపర్వకథ, అందలి వస్త్వైక్యము, ౧౯౯-౨౦౩; పాండవప్రవేశము, ౨౦౩-౨౨౭; శమీవృక్షముపై నాయుధనిక్షేపణము, ౨౨౮-౨౩౫; బృహన్నల సారథిగాఁగుదురుకొనుట, ౨౩౫-౨౪౦; విరటునికొలువు-భీముఁడు, ౨౪౦-౨౫౬; కీచకవధఘట్టము, ౨౫౬-౩౫౩; కీచకవధానంతర విశేషములు, ౩౫౩-౩౬౪.

౪

తిక్కనార్యుని కళాప్రతిభలు: ౩౬౫-౪౫౯

విరాటపర్వము—ప్రబంధలక్షణములు, ౩౬౯-౩౮౦; మూలకథపై తిక్కన వేసిన యాంధ్రతాముద్ర, ౩౮౦-౩౮౫; తిక్కనార్యుని వర్ణనలు, ౩౮౫-౩౯౧; ప్రకృతి వర్ణనలు, ౩౯౧-౩౯౭; తిక్కన మనోవృత్తివివరణశక్తి, నాటకకళా చాతుర్యము, ౩౯౭-౪౦౫; తిక్కన శృంగారవర్ణనలు, ౪౦౫-౪౧౭; పాత్రపోషణరీతులు, ౪౧౬-౪౨౦; రసపోషణరీతులు, ౪౨౦-౪౨౪; నాటకరీతులు, ౪౨౪-౪౨౮; తిక్కనార్యుని భాషాశైలులు, ౪౨౮; పూర్వోత్తర సందర్భములకు జక్కనిపొందిక కల్పించుట, ౪౨౮-౪౩౦; ఉపమాలంకార ప్రయోగము, ౪౩౦-౪౩౩; సందర్భానుకూలముగ భావమును స్ఫురింపఁజేయు పదరచన, ౪౩౩-౪౩౬; ఆంధ్రభాషా జాతీయప్రయోగ నైపుణ్యము ౪౩౬-౪౪౧; అర్థముమాఱిన ధాతువులు, పదజాలము, ౪౪౧-౪౫౭; కారకవిశేషములు, ౪౫౭-౪౫౭; ఉపసంహారము ౪౫౮-౪౫౯.

# ఆంధ్రభారతకవితావిమర్శనము



## ౧

### ఆంధ్రవాఙ్మయము; ఆంధ్రమహాభారతము.

ఆంధ్రవాఙ్మయలక్ష్మికి ఆంధ్రభారత మనంతతేజోవిరాజమానం బగు శిరోలంకారము. ఆంధ్రవాఙ్మయ మహావృక్షమునకు మూలబీజము, మూలాధారము. ఆంధ్రభాషాస్రవంతి కడ్డుతగిలి నిలువఁబెట్టిన యొకపెద్దయానకట్టు. ఆంధ్రభాషా వాఙ్మయ ప్రపంచమునకు—లేదా బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునకు మూలభూతంబై, త్రిపురుషోపశోభితంబైనను ధర్మాద్వైతస్థిత్యుపబృంహితంబై నెగడిన దీయాంధ్రభారతామ్నాయంబు. ఈయద్వైతభావము హరిహరనాథాశ్రయణము మూలముననేగాక, తిక్కనార్యుని కళాప్రతిభమూలమునఁగూడ సిద్ధించినదనవచ్చును. కవిత్రయంబున ముఖ్యుండగు తిక్కనార్యుం డీయాంధ్రభారతమునకు వలెనే యాంధ్రవాఙ్మయ ప్రపంచంబునకుఁ గూడ మూలమై నిలచియున్నాఁడు. భట్టుమూర్తి తన గ్రంథాదిని స్మరించిన మూర్తిత్రయము మనభారతకవిత్రయముకంటె కొంచెము భిన్నమైనను, అతఁడు కుండలీంద్రున కొసగిన స్థానము మాత్రము ముఖ్యముగా గమనింపఁదగియున్నది.

"మహిఁ బున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవ న్మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్"

ఇందాంధ్రవాఙ్మయ ప్రపంచమునకు వాగనుశాసనుఁడు స్రష్ట. శ్రీనాథుండు పోషణకర్త. ఇఁక కుండలీంద్రుండన్నదో యాప్రపంచ మునయొక్క మహనీయస్థితికి మూలమై నిలచె నని చెప్పియున్నాఁడు. ఆంధ్రవాఙ్మయమున తిక్కనార్యుఁడు వాగనుశాసనశ్రీనాథాదుల నతిక్ర మించి తన్మహనీయస్థితికి మూలమై నిలిచెనని చెప్పఁదగియున్నది. ఆంధ్ర భాషావాఙ్మయప్రతిష్ఠకు భారతమే ముఖ్యకారణము. అది పంచమ వేదంబై పరమామ్నాయంబగుటయేగాక యాంధ్రవాఙ్మయమున మూల గ్రంథమై యామ్నాయసదృశంబై పరమప్రమాణంబై వెలుగొందు చున్నది. వాఙ్మయమున మొదటి గ్రంథంబగుటయేగాక, భాషాప్ర యోగ విషయమునఁగాని, కవితాప్రావీణ్యవిషయమునఁగాని దీనిని మించినగ్రంథము లీభాషలోఁ బూర్వమునఁ గాని, పరమునఁగాని బయలు దేరియుండలేదనుట సాహసోక్తి కానేరదు. ఇందు నన్న పార్యుని కవితాప్రవాహగాంభీర్యమునకు తిక్కనార్యుని యసమాన కవితాకళాచాతుర్యము (Poetic Art) వన్నె వెట్టుటచే దీనికిట్టి మహా ప్రతిష్ఠ గలిగినది. ఒక కవియొక్క సహజశక్తి యాతఁడు తన నైపుణ్య మును వెలయించుటకుగా సేకరించిన వస్తువుయొక్క మహత్త్వమును బట్టియే వ్యక్తమగుచుండునని సాహిత్యవిమర్శకుల మతము. అర్జునుని యస్త్రకళానైపుణ్యమునకుఁ దగిన గాండివ మాతనికి దొరకినట్లే తిక్క నార్యునిప్రతిభకుఁ, గవితాశక్తికి దగినవస్తువు భారతకథ యం దాతనికి లభించినది.

ఇన్నగమునందు గాండివ
మున్నది యదిగాని మద్భుజోద్రేక విలా
సోన్నతికోర్వవు పెద్దయు
నన్నుప లీవిండ్లు గుఱుచ లల్ప బలంబుల్.

అని యర్జునుఁడు చెప్పినట్లుగా, తిక్కన మొదట నిర్వచనోత్తరరామాయణమును రచించి చూచి యది తన కవితావిలాసోన్నతి కోర్వదని తలంచికాఁబోలు నీ భారతకథను చేపట్టినాఁడు. అందును, మొదటి మూఁడుపర్వములును నన్నయ యుద్దేశమునకును, ఆతని వైదికసంపత్తికి జీవితచరితకుఁ దగినవై యాతనిపాలఁ బడుటయు, నంతకంటెను రసవత్తరంబై యూర్జితకథోపేతంబగు భాగము తిక్కనపాలఁబడుటయు, ననునది యాంధ్రలోకము చేసికొనిన మహాపుణ్యఫలమని చెప్పవలసియున్నది. ఇందాతని యప్రతిమాన కవితావైపుణ్యమేగాక, యాతని నీతికుశలత, యుద్ధకళాపరిచితి, లౌకికజ్ఞానసంపత్తి, రాజకీయవిషయ పరిజ్ఞానము మొదలగు నసాధారణ గుణములన్నియు వ్యక్తమగుటకుఁ దగినయవకాశము లభించినది. ఇయ్యది యాంధ్రావళి కనవరతము మోదముఁగూర్చుచు, నాంధ్రజన సామాన్యమునకుఁ బురాణశ్రవణ పఠనయోగ్యంబై, ఆంధ్రకవిజనంబుల కనుకరణయోగ్యంబై, రసికులకు భిన్నరసాస్వాదనమునుగొలుపునదై, లక్షణకర్తలకుఁ బరమప్రమాణంబగు లక్ష్యంబై, నీతివేత్తలకు నీతిదాయకంబై, భాషాతత్త్వజిజ్ఞాసువులకు ప్రాచీనాంధ్రభాషా జాతీయ ప్రయోగచమత్కృతులం జవిగొల్పునదై, సాంకేతికలక్షణలక్షితంబును, సాంకేతికజీవిత(Conventional life) సహితంబును గాక సహజమును, సచలనము, సరళము, స్వాభావికము నగు నుత్తమకవితచే నొప్పారినదై, తరువాతికాలమునందలి యాం

ధ్రకవితకు మార్గదర్శకంబై నెగడినది. భారతకవుల నూతనకల్పనలే తరువాతి ప్రబంధవాఙ్మయమునకు మార్గదర్శకములైనవి.

ఈకారణముచే నాంధ్రభాషావాఙ్మయముల పరిణామక్రమము తెలిసికొనవలయునన్నచో ఆంధ్రభారతమును సవిమర్శంబుగ బఠించు టత్యావశ్యకం బగుచున్నది. నన్నయ భారతభాగమే ప్రస్తుతముపలభ్యమానములగు నాంధ్రభాషాగ్రంథములలో మొదటిదగుటచే నాంధ్రభాషకు, అంతకు పూర్వాపరములగు స్థితిగతులను బరికింపవలె నన్న నన్నయభాషతోఁ బోల్చిచూచికొనవలసినదే. ఆంధ్రభాష కాకాలమున లక్షణము లేకుండుటచేఁ దరువాతి కవులందఱు నన్నయ భారతమునే లక్ష్యముగాఁ జేసికొనిచెప్పవలసినదేగాని తెలుఁగుపల్కు మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా రాదని దాక్షవాటి కవిరాక్షసుఁడీ నియమంబుచేసెననియు,

ఆమూఁడుపర్వములలో
నామాన్యుఁడు నుడువు తెనుఁగు లరసికొని కృతుల్
తాము రచించిరి తిక్కసు
ధీమణి మొదలైన తొంటి తెనుఁగు కవీంద్రుల్.

అని యప్పకవి చెప్పుచున్నాఁడు. ఇట్లు భాషావిషయమునఁ దెనుఁగున భారతము పరమప్రమాణమైన గ్రంథమైనది. నన్నయకవితాశైలికిని, ఆతని భాషకును, ఆతని భాగమందలి తెలుగు జాతీయమునకు నాతఁడు స్వయముగా నెంతవఱకు బాధ్యుఁడో గ్రహింపవలెనన్నచో నాతనికాలమందు, నంతకుఁబూర్వమునను గల గ్రంథములు లేదా శాసనాదులు, ఇతర సన్నిహితభాషాస్థితిగతులు—నీమొదలగువానితో నీగ్రంథమును బోల్చి తెలిసికొనవలసియున్నది. కవిరాక్షసుఁడు చేసినట్లుగా నప్పకవిచేఁ

జెప్పఁబడిన నియమమును తరువాతి కవులు నందు ముఖ్యముగా తిక్కనార్యుఁడు నెంతవఱకు పాటించిరో యను విషయము పరిశీలింపఁదగి యున్నది. సంస్కృతబహుళంబగు శైలి నవలంబించి రచించిన శ్రీనాథాదులుగాని,తరువాతి ప్రబంధకవులుగాని తెలుఁగుపలుకు, తెలుఁగు జాతీయము తిక్కనార్యుఁడు ప్రయోగించినంత నాతఁడు ప్రయోగించిన రీతిని బ్రయోగించియుండలేదు కావున నన్నయకుఁ బూర్వమునందలి ప్రాచీనాంధ్రభాషాస్వరూపమును దెలిసికొనుట కిప్పుడిప్పుడు బయలువెడలుచున్న శాసనాదు లెట్లు కొంతవఱకాధారము లగుచున్నవో, అట్లే నన్నయతరువాతికాలమునందలి తెలుఁగు నుడికారమును దెలిసికొనుటకు తిక్కన తన భారతభాగమున వాడిన భాషయె ముఖ్యాధారమగుచున్నది. తరువాతి కవులలో నింతబహుళముగా శుద్ధాంధ్రభాషాజాతీయప్రయోగమును జేసినవారు లేకుంటచే నీతనినే ముఖ్యముగాఁ బేర్కొనవలసివచ్చుచున్నది. ఇంతకుఁబూర్వము పాల్కురికి సోమనాథాది శైవకవులు కొందఱుమాత్రము జానుతెనుంగు కొంత వాడినను,తిక్కన తిరువాతి కాలములో నన్నపార్యుఁ డవలంబించిన సంస్కృతి భూయిష్ఠరచనయే సర్వసామాన్యమై కవిజనాదరణపాత్రమై యుండుట తటస్థించినది. తిక్కనార్యుఁడును గొంతవఱకా రచనయే చేసినను, మొత్తముమీద క్రమక్రమముగా నడుగంటుచున్న దేశీయపుఁ బలుకుబడి నామాత్రమైనను చిరస్థాయిగా నిలుపవలె ననెడి తలంపుతో స్వీయ భాషాభిమానముకలవాఁడై యద్దానిని పనిపట్టి తనగ్రంథమున వెలయించినాఁడు. ఇందగపడు ప్రాచీనాంధ్రభాషాప్రయోగ చమత్కృతులను మఱియొకచోఁ గానము. ఈవిధముగా నన్నయకంటెను గూడ తిక్కన యాంధ్రభాషకు మహోపకారము చేసినవాఁడైనాఁడు. నన్నయ తిక్కనలు తమగ్రంథమున వెలయించిన యానాఁటిమాతృభాషాస్వరూప

మును దర్శించుటకుగా నాంధ్రమహాభారత మపేక్ష్యపఠనీయంబగుచున్నది. ఇట్లు భాషావిషయముననేగాక కవితాకళాసౌందర్య విషయమునను ఆంధ్రవాఙ్మయమున భారతమునకుగల ప్రాముఖ్యము మఱి యే గ్రంథము నకును లేదనియే నిస్సందేహముగాఁ జెప్పవచ్చును.

అయితే భారతమనునది సంస్కృతభాషలో వ్యాసమహర్షి చే రచింపఁబడినది గదా. ఆంధ్రకవులు స్వయముగ రచించినది కాదు, భాషాంతరీకృత గ్రంథమున కిట్టి ప్రాశస్త్యమా యనుప్రశ్న కలుగవ చ్చును. ఆంధ్రవాఙ్మయమున మొదటిది భాషాంతరీకృతగ్రంథ మగు టచేఁ గాఁబోలు తరువాత నాలుగైదువందల యేండ్లవఱకు నట్టి గ్రంథ ములే బయలుదేరుట తటస్థించినది. కాని వీనిలో నే యొక్కటిగానైనను భారతకవితకంటె మిన్న యనిపించుకొనఁ దగినదిగాని, తిక్కనార్యుని కవితతోఁ బోల్పఁదగినదిగాని బయలుదేరలేదు. కావుననే యాంధ్ర భారత మాంధ్రకావ్యములలో నుత్కృష్టమై వ్యాసభారతముకంటెఁ గూడ నాంధ్రావళికి మోదమున్ గూర్చుచున్నది. పేరునకు భాషాంత రీకృతమె యైనను స్వతంత్రగ్రంథమగు మూలముకంటెను రసవ త్తరంబై యున్నది. ఒకకవియొక్క గొప్పతన మాతఁడు చేపట్టిన విష యముయొక్క గౌరవమునుబట్టియే గాక, ఆ విషయమును- ఆ వస్తువును- దానె ట్లుపయోగ పఱచికొనినాఁడు- ఎట్టిశిల్పచాతుర్య మును చూపినాడు దాని కేవన్నెచిన్నెలువెట్టి యెట్టి నూతనవస్తువు- నూతనసృష్టిగాఁ జేసి చూపి తన ప్రతిభను మెఱయించినాఁడు- అనుదానిని బట్టి యుండును. ఆ కావ్యమునంతను ఆవరించియుండు నాతని యాత్మశక్తియె (Personality) తన్మహత్వమునకుఁ గారణ మగుచుండును. అదియె మనము ముఖ్యముగ గమనింపఁదగిన విషయము. షేక్స్పియర్ కాళిదాసాదులు గ్రహించిన వస్తువు సర్వ

లోకసామాన్యమగు పాతపురాణ గాథలలోనివే. వారి శక్తిప్రతిభలే యీ పాతకథలను నూతనసృష్టిగ మార్చి వారికి శాశ్వతకీర్తిని గడించినవి. ఈశక్తిని గనపఱచలేని కవిత యుత్తమమైన కవితగానేరదు. కవిహృదయము పొంగిపొరలి రావలయును. కాని యీపొంగు నుత్తమకవి తన కళా (art) శక్తిచే మాటుపఱచును. తిక్కనార్యుఁడు భారతము రచింపఁబూనినపుడు కవిత్వతత్త్వ నిరతిశయానుభావానందభరితాంతఃకరణుఁడై యుండినాఁడు. వ్యాసునికథనే తాను జెప్పుచున్నను తన కళాచాతుర్యమును జూపకపోలేదు. ఇట్టి కవిత యాంధ్రవాఙ్మయమున చాల అరుదనియే చెప్పవచ్చును. భారతకవుల తరువాతనాంధ్రవాఙ్మయమున శబ్దాడంబరము, సాంకేతిక జీవితవర్ణనము, అలంకారికనియమానుకూల రచన, భావనాశక్తి చూపుటకుఁగాను వికృతపు వర్ణనలు పెరిగిపోయినవి. ఇట్టివి కవితను శృంఖలములుగాని యలంకారములుగావు. శబ్దశిల్పమేగాని నిజమైన కవితాశిల్పము చాల తగ్గిపోయినది. కవిత్వము బాగుండవలెనని మఱి పది పద్యములవర్ణన పెంచుట ఔచిత్యమునకు భంగము కలిగించును. శిల్పగోపనమే కవితాకళాచాతుర్యమును వెలయింపఁజేయునది (Art lies in concealing art). తెలుఁగుకవులలో దీనిని చక్కఁగాఁ బాటించినవాఁ డొక్క తిక్కనయనియే చెప్పవలసియున్నది. అతని కవితలో కథాకథనగౌరవము, లేదా, వేగమే పైకిఁ గనబడునుగాని కావ్యశిల్ప మగపడదు. దానిమాటున నిది దాఁగి యుండును. ఇదియే తిక్కనయు, భారతకవులయు మహత్వమునకు మూలబీజము. మూలము వ్యాసునిదే యైనను వీరు దానినొకవిధముగ స్వతంత్రగ్రంథ మనిపించునట్లే రచించినారు.

ఒక గ్రంథమును జదువునపుడు మన మేదృష్టితో చదువుచున్నామను విషయముగూడ ముఖ్యముగా గమనింపఁదగియున్నది. మహాభా

రత మధ్గ్రంథము. దాని ననేకు లనేకోద్దేశములతో నాశ్రయించు చుందురు.

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్షణంబనియును
నైతిహాసికు లితిహాసమనియు
పరమపౌరాణికుల్ బహు పురాణ సముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ
వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు.

అని నన్నపార్యుండే చెప్పియున్నాఁడు. మనము దేనికొఱకు దాని నాశ్రయించుచున్నాము అనుదానినిబట్టి—లేదా మన దృక్పథమునుబట్టి యాయా వస్తు స్వరూపమునందలి విశేషగుణములు బయలు వడుచుండును. కావున సాహిత్యవిమర్శకులు భారత కవితను ఆంధ్రవాఙ్మయమును గూడ కావ్యకళాదృష్టితోఁ జదివినఁగాని యందలి కళాసౌందర్యరసామృతమును జవిగొనలేరు.

## విమర్శన పద్ధతులు

ఏ వాఙ్మయమందైన నాయా కవులు రచించిన గ్రంథములను ప్రత్యేకముగాఁ జదువుకొని యందలి విశేషములను తెలుపుచు, వాని

తోఁ దృష్టినొందుట యొకపద్ధతి. సాహిత్యపద్ధతిని— లేదా ఆలంకారిక పద్ధతిని రీతి గుణ దోష పాక శయ్యాలంకారాదుల విశేషములను వ్యక్తపఱచుచు, నాకవి ప్రాచీన నియమములను సరిగా ననుసరించెనా లేదా యని చూచి దానినిబట్టి యాతని కవితాప్రాశస్త్యము నెన్ను పద్ధతి మఱియొకటి. ఒక గ్రంథములోని విశేషాంశములకును, దానిని రచించిన కవియొక్క జీవితచరిత్రకును గల సంబంధము నారసి యాతఁ డట్టిగ్రంథము నారీతిని రచించుటకు గల కారణములను సాధనసంపత్తిని దెలిసికొని, వానికి పరస్పరసంబంధము, సమన్వయము కల్పించుచు, నా గ్రంథమును,ఆ కవియొక్క యితరగ్రంథములతోడను, అట్టి గ్రంథములరచించిన యితరకవుల కృతులతోడను బోల్చి యద్దానివలన బయలు దేరు సారస్యములను వెలిపఱచుట మూఁడవపద్ధతి. ఒకకవికి, నాతని రచనలకుఁ గల సంబంధము నేగాక, వీనికి, నాయా దేశకాల పరిస్థితులకును గల సంబంధమునుగూడ నన్వేషించి, యాయా యుగములయందలి కవితారీతులకును, ఆయా కవుల రచనలకును సమన్వయము చూపి యొకకవి కాలప్రవాహమునఁబడి గతానుగతికముగఁ బోయెనా, క్రొత్తమార్గములఁద్రొక్కి తనస్వాతంత్ర్యమును, ప్రతిభను విశేషముగ వెలయించెనా యని పరిశీలించి, ఆయా యుగములయం దాయా కవుల స్థానమును నిర్ణయించుచు నా వాఙ్మయముయొక్కయు, నందలి భిన్న శాఖలయొక్కయు సక్రమ పరిణామము నన్వేషించి తెలుపుట నాల్గవ పద్ధతి. వీనిలో మొదటి రెండు పద్ధతులే పూర్వకాలమునుండియు మన దేశమున నవలంబింపఁబడుచున్నవి. మిగిలినరెండును పాశ్చాత్యసాహిత్య విమర్శనరీతుల నెఱిఁగినవారిచే నిటీవలి కాలమున నవలంబింపఁబడుచున్నవి. ఆంధ్రభారతము నీ రీతిగఁ జదివికొని యాంధ్రవాఙ్మయమున దీనికెట్టిస్థానము కలదో, తత్పరిణామమున కిది యెట్లు తోడ్పడినదో తెలిసికొనవలసియున్నది.

భారతకవుల నూతనకల్పనలు తరువాతి ప్రబంధవాఙ్మయమున కెట్లు మార్గదర్శకము లైనవో పరిశీలింపవలసియున్నది. వీరి స్వతంత్రకవితా ప్రాగల్భ్య మెంతవఱకు గలదో తెలిసికొనవలెననిన, మూలము వ్యాసరచితము గావున, దానితో సరిపోల్చిచూచినగాని వీరి ప్రతిభావిశేషము కళాచాతుర్యమును బయలుపడవు. కావున మూలముతోఁ బోల్చిచదువుట యావశ్యకమగుచున్నది. మూలప్రతు లనేకరీతులుగా నుండుటచే భారతకవు లేప్రతినిబట్టి రచించినారను సమస్య యొకటి బయలుదేఱుచున్నది. ఇట్లు సవిమర్శంబగు భారతపఠన మాంధ్రవాఙ్మయ పరిణామచరిత్ర కెంతయు నావశ్యకంబగుచున్నది.

ఇదివరలో నాంధ్రవాఙ్మయస్వరూపము, పూర్వకవులు, మధ్యకవులు, ఆధునికకవులు, అని కాలమునుబట్టి చేసిన కవులవిభాగము మూలమునను, లేదా రామాయణకవులు, భారతకవులు, ప్రబంధకవులు, శతకకవులు, అని తద్విరచిత గ్రంథములనుబట్టి చేసిన కవులవిభాగము మూలమునను, లేదా, ఆయా కాలములం దాంధ్రవాఙ్మయపోషకులగు ప్రభువులను బట్టి చేసిన విభాగము మూలమునను, నిరూపింపఁబడుచుండినది. ఆంధ్రవాఙ్మయచరిత మా వాఙ్మయశాఖలయొక్క సక్రమ పరిణామరీతిఁ బట్టి (Gradual development or evolution of types of Telugu Literature) పరిశీలించి విభాగించుట యుక్తతరంబై గన్పట్టెడు. ఆంధ్రవాఙ్మయమును తత్క్రమపరిణామమును బట్టి ఆరుయుగములుగ విభాగింపవచ్చును.

అందు మొదటిది ప్రాఙ్నన్నపార్యయుగము. ఈ యుగమున మనకు లభించిన గ్రంథము లేమియు లేవు కాని గద్యపద్యాత్మకములగు శాసనాదులు మాత్రము కొన్ని గలవు. వీనినిబట్టి నన్నపార్యుఁడు ప్రారంభించినయాంధ్రకవిత హఠాత్తుగా నానితోడనే బయలు వెడలినదిగాని

యాతడే సృష్టించినదిగాని కాదనియు, తమిళవాఙ్మయ మంతటి ప్రాచీ వాఙ్మయము లేకున్నను కన్నడభాషయందు ప్రాచీనతమంబగు వాఙ్మయము బయలు దేరిన కాలమునుండియైనను ఆంధ్రకవితయు బయలుదేరుటకుఁ దగిన పరిస్థితులు లేకపోలేదనియుఁ దెలియుచున్నది.

ఈయుగమందలి యాంధ్రభాషాస్వరూపము దీనికొకవైపున ప్రాకృతభాషలతోఁ గలిగిన సంసర్గప్రభావమును, మఱియొకవైపున ద్రావిడకర్ణాటభాషలతోఁగల సన్నిహితసంబంధమును గూడ సూచించునదై యున్నది.

రెండవది — పురాణయుగము — భారతాది గ్రంథములు నితర పురాణములును దెనిఁగింపఁబడినకాలము. ఈయుగమందలి గ్రంథములు భాషాంతరీకృతములే యని చెప్పవలసియున్నను ఆంధ్రభాషలో నిజమైన-సహజమైన-కవిత యీకాలముననే బయలుదేరినదనుట నిశ్చయము.

మూఁడవయుగము-శ్రీనాథయుగము— ఇది, కవులకు సహజ కవితయం దాదరము తగ్గి స్వీయపాండిత్య ప్రకటనాకౌతూహలము పెరుగుచున్నకాలము. సంస్కృతవాఙ్మయమునందలి వస్తువునే గ్రహించి దానిరూపమును గొంత మార్చి దాని నొకప్రత్యేకస్వరూపము గల దానిగాఁ జేయఁ గవులు యత్నించుచుండినకాలము. కావుననే యిది తరువాతి ప్రబంధయుగమునకును, వెనుకటి పురాణయుగమునకును మధ్యనున్న యొకవిధమగు సంధియుగమని (age of transition) చెప్పఁదగియున్నది.

నాల్గవది ప్రబంధయుగము—మనువసు చరిత్రాది ప్రబంధములు బయలుదేరినకాలము. ఇంకనుఆంధ్రవాఙ్మయము సంస్కృతవాఙ్మయము యొక్క యాశ్రయమును వీడకున్నను, ఈభాషలో ప్రత్యేకస్వతంత్ర

మగు వాఙ్మయశాఖ యొక్కటి బయలు దేరినదని చెప్పుటకిప్పటి
కాశము గలిగినది. కాని యిది కవితలో స్వాభావికత్వము కొం
కంతరించి, సాంకేతికనియమములు పెరుగఁజొచ్చిన కాలము.

ఐదవది-దక్షిణదేశవాఙ్మయ యుగము—ఈకాలమున నా
వాఙ్మయ మహావృక్షము నూతనశాఖలను బెట్టఁదొడంగినది. దీని
దాధునికయుగ చిహ్నములు కొన్నికనఁబడుటచే నిది క్షీణదశనొ
చున్న ప్రబంధయుగమునకును నాధునికయుగమునకును మధ్యను
యొకవిధమగు సంధియుగమని చెప్పవచ్చును.

ఆఱవది—పాశ్చాత్యసంసర్గమువలన నూతనచైతన్యముతో, న
శాఖలతో ప్రకాశింపఁజొచ్చిన వాఙ్మయము గల ఆధునికయుగ

ఆయా యుగములందలి వాఙ్మయమున కప్పటి దేశకాలపరి
లెట్లు తోడ్పడినవో, కవుల కేయే కాలముల నేయే నూత్నోద్బోధ
కలిగినవో, ఒకయుగమందలి కవిత తరువాతి యుగములందలి క
కెట్లుమార్గదర్శకంబైనదో, పరిశీలించి కనుగొనినఁగాని వాఙ్మయచరి
సంపూర్ణముగాఁ దెలిసికొనినవారము కాలేము. ప్రస్తుత మాంధ్
షలో భారతమే మొదటిగ్రంథముగా నేర్పడుటకును, అది యట్టి
షలో నా కాలమున నారీతిగా రచింపఁబడుటకును గల కారణ
దెలిసికొనవలయునన్న, నంతకుఁ బూర్వమునఁ గల దేశభాషావాఙ్
పరిస్థితులను గొంత పరిశీలింపవలసియున్నది. ఈసందర్భమున నీ ద
దేశమునందలి యితరద్రావిడభాషలలో నాంధ్రమునకంటె ప్రా
బగు వాఙ్మయముండఁగా, నాంధ్రమున లేకుండుటకుఁగల కారణము
గూడఁ దెలిసికొనవలసియున్నది. కావున ప్రాచీనదేశకాలపరి
లెట్టివో, అవి యేయే కాలములందేయే ప్రదేశముల నేయే భాషల

దెట్టివాఙ్మయము బయలు దేరుట కెట్లుద్బోధకంబులైనవో యించుక తెలిసికొనప్రయత్నింతముగాక.

క్రీస్తునకు పూర్వము చిరకాలము క్రిందటనే అనగా-నార్యులీదేశమునఁ బ్రవేశింపక పూర్వమే-అనార్యజాతులవారు కొందఱీదేశమున పశ్చిమమార్గమున వచ్చి ప్రవేశించి, యీదేశము నాక్రమించి నట్లుగాఁ జెప్పఁబడుచున్నది. వీరివెనుక నార్యులువచ్చి యంతకుఁబూర్వమనార్యులచే నాక్రమింపఁబడి యున్న దేశమును తా మాక్రమింపఁదలఁచి వారితోఁ బోరాడి క్రమముగా వారిని తూర్పుదక్షిణభాగములకుఁ దఱుమఁజొచ్చిరి. ఈ సమయమున నీ యనార్యజాతులలోఁ గొందఱు క్రొత్తగా వచ్చిన యార్యులతోఁ బోరాడుచు, వారి కార్యకలాపములకు భంగము కలిగించి యనేకవిధముల బాధించుచు నచ్చటనె యుండి, కొంతకాలము గడచిన పిదప నాప్రదేశముల స్థిరపడిన యార్యులలోఁ గలసిపోయియుండ, మఱికొన్ని తెగలవారా యుత్తరభూములను విడిచి క్రిందిభాగములకు వచ్చి, మధ్యదేశమును, దక్షిణదేశమును ఆక్రమించి, యచ్చట నంతకుపూర్వము నెలకొనియున్న యాదిమ నివాసులగు కిరాతజాతులతోఁ గలసి, వారికంటె తాము కొంత నాగరకత గలవారగుటచే నా యాదిమజాతులను స్వాధీనము చేసికొని, చిన్న చిన్న రాజ్యములను స్థాపించి పరిపాలింపఁజొచ్చిరి. ఉత్తరదేశమున నిలిచి పోయినవారు తమకంటె బలవంతులును, నాగరకులునగు నార్యులతోఁ గలసి వారల యధికారమునేగాక, వారి భాషనుగూడ నంగీకరించి తామే యద్దాని నవలంబింపవలసినవారైరి. ఆర్యభాషాధ్వనుల నుచ్చరించుట కలవాటు లేనట్టియు, భిన్నభాషాసాంప్రదాయముల కలవడినట్టియు వీరి నోళ్లలోఁబడి నలిగి యార్యభాష కొంత వైరూప్యమును జెంది ప్రాకృతరూపమున బరిణమించినది. అగ్రవర్ణములవారు

ఉత్తమతరగతులవారు మాత్రమే వైదికభాషను,—తరువాతికాలమున సంస్కారమునుబొంది సంస్కృతమను పేరుఁ బొందిన భాషను,—వ్యవహరించుచుండగా, తక్కినవారందరు నీయనార్యజాతులవారితోఁ గలిసి ప్రాచీనప్రాకృతమునను వ్యవహరించుచు వచ్చిరి. క్రమక్రమముగా దేశభేదములనుబట్టి ప్రాకృతభేదములు నేర్పడుటయేగాక యీ యనార్యజాతులతోడి కలయిక యెక్కువైనకొలఁదిని ఆ ప్రాకృత భాషలలో ననార్యభాషాసాంప్రదాయములు కూడ పెరుగఁజొచ్చినవి. ఇది యుత్తరదేశభాషల స్థితి. ఇక దక్షిణదేశమునఁ జేరిన యనార్యజాతులవారు ఆయా ప్రాంతములయందలి యాదిమ నివాసులతోఁ గలసిపోయి వారికంటెఁ దాము కొంత నాగరకు లగుటచే, వారిపైఁ దమ ప్రభావమును నెఱపి తమభాషను వృద్ధినొందించుకొనుటచే ప్రాచీనద్రావిడభాషయనున దొకవిధముగా నేర్పడియుండును. దీనిలో నాదిమ నివాసుల భాషయుఁ గొంత కలసియుండును. కాని దానిని వేఱుపఱచుటకుఁ దగినపరిస్థితు లిప్పటి కేర్పడలేదు. ఈ దక్షిణ దేశము మూఁడుప్రక్కల సముద్రముచేఁ జుట్టబడియుండి, యుత్తరమున పర్వతారణ్యములచే నావరింపఁబడియుండుటవలన, నిచ్చటఁజేరిన యీ యనార్యజను లాయాప్రదేశములందు రాజ్యములను స్థాపించుకొని, మధ్యమధ్య తమలోఁ దాము పోరాడుకొనుచున్నను మొత్తముమీద పరదేశరాజుల యొత్తిడి కేమియు లోనుగాక, తమభాషావాఙ్మయముల యభివృద్ధికిఁ దగిన ప్రోత్సాహము కలుగఁజేయుచు వచ్చిరి. అప్పటివారి వాఙ్మయము రాజుల వీరకృత్యములను, వదాన్యతను దేశీయాచార వ్యవహారములను దేశీయుల స్థితిగతులను ప్రధానవిషయములుగాఁ జేసికొని దేశీయవృత్తములలోఁ జేయఁబడిన వర్ణనలతో నిండిన రచనలు పాటలు గలదై యుండెను. భాష సంస్కృత

సంపర్కము లేక కొంతవఱకు ద్రావిడభాషలయొక్క ప్రాచీన స్వరూపమును దెలుపునదై యుండెను. ఆ ప్రాచీనభాషలో మహత్తులకు బహువచనమున 'ర్' ప్రత్యయము జేర్పఁబడుచుండెడిదికాని, యమహత్తులకు బహువచనప్రత్యయమే లేదు. తరువాతికాలమున ప్రచారములోనికి వచ్చిన 'కళ్' ప్రత్యయము తొల్కప్పియార్కు పూర్వము విశేషము వాడుకలో నున్నట్లగపడదు. లింగవివక్షకూడ నంతగాఁ బాటింపఁబడినట్లగపడదు. స్త్రీ పుం రూపములకంటె నపుంసకరూపములు—లేదా లింగరహిత (common gender)రూపములు విశేషముగా వ్యవహారములో నుండెడివి. ఆరువిభక్తులలోను పదమునకు ఇన్, ఇల్ అను ఔపవిభక్తిక ప్రత్యయములు మాత్రమే చేర్పఁబడుచుండెడివి. చతుర్థికి 'కు' షష్ఠికి 'అ' అనునవి కూడ వాడుకలోఁ గలవు. అనగా 'ఇన్' అనునదే ద్వితీయ, తృతీయ, షష్ఠి, సప్తములకన్నిటికిఁగూడ నుపయోగపడుచుండెడిది. అనేకపదములు ముఖ్యముగా ధాతువులనుండి యేర్పడిన కృద్రూపములు, గుణవాచకపదములు మొదలగునవి తరువాతి భాషలో నంతరించినవి. ఈ కాలమున భూతభవిష్యద్రూపములేగాని వర్తమానార్థకరూపములు ప్రత్యేకముగా వాడుకలోనికి రాలేదు. తుమున్నంతములు, ప్రేరణార్థకరూపములును గూడ కొన్ని తరువాతికాలమున నంతరించినవి. ఆంధ్రకన్నడభాషల ప్రాచీనస్వరూపముకూడ దీనిని పోలియె యుండునని తలంపనగును.

పిదప నార్యజను లీప్రాంతమునకు వచ్చి చేరినకాలఁది నార్యభాషాసంపర్కము దీనికిఁ గలుగుచు వచ్చెను. అది కాలక్రమమునఁ బెరుగఁ జొచ్చినను దక్షిణదేశప్రాంతములవారు దానిని దమభాషలోని కెక్కనీక కొంతవఱ కడ్డుతగిలిరి. అట్లయ్యు నార్యభాషాప్రభావము దీనిపైఁ బ్రసరింపకపోలేదు. ఈ భాషను మొదట వ్యాకరించి దీనికి లక్షణమును జేసిన

వారార్యబుషులుగనో లేక బౌద్ధ జైన మతస్థులుగనో కనబడుచున్నారు. కవులలోఁగూడ పలువురార్యులే యున్నారు. కాని వారు దేశభాష నభ్యసించి దేశీయులతోఁ గలసి దేశీయులకొఱకే దేశభాషయందు గ్రంథములను రచించిరి గాని, స్వల్పసంఖ్యాకులై యుండుటచేఁ గాఁబోలు లేదా తామచ్చటికిఁ జేరుటకుఁబూర్వమే దేశము భాషావాఙ్మయమును బ్రోత్సహించుచున్న దేశీయరాజులు పరిపాలనయం దుండుటచేతనో,— దేశభాషనణఁగఁద్రొక్కి సంస్కృతముననో, ప్రాకృతముననో సంస్కృతభూయిష్ఠముగు దేశభాషనో రచించుట తటస్థింపలేదు. ఇది ప్రాచీనంబగు ద్రవిడదేశవాఙ్మయస్థితి. తరువాతి కాలపు వాఙ్మయములో సంస్కృతముయొక్క పాలు హెచ్చినను, మొదటి నుండియు కవులా దేశభాషా స్రవంతినిలో వచ్చిపడుచున్న సంస్కృత భాషాప్రవాహము నరికట్టుచు నుండుటచే, నితర దక్షిణదేశభాషలలో వలెఁ గాక, యీ భాషయొక్క ప్రాచీనస్వరూపము కొంత నిలిచి యుండుట తటస్థించినది. ఆంధ్ర కన్నడదేశము మధ్యదేశంబై, ద్రావిడదేశమున కుత్తరభాగమున నుండుటచేఁ గాఁబోలును, దీని కుత్తరహిందూదేశముతోడను, అచ్చటి రాజ్యాంగస్థితులతోడను సంబంధ మెక్కువయి అచ్చటి భాషావాఙ్మయస్థితియు దక్షిణదేశము నందలిదానికంటె కొంత వేఱయినది. ఉత్తరహిందూదేశ మార్యజనాక్రాంతమైన సందర్భమున నచ్చటినుండి వెడలి దక్షిణదేశమార్గమును బట్టిన నాగులను ననార్యజాతులలోని కొన్ని తెగలవారీ మధ్యదేశమునఁ గూడనిలచి యీ ప్రాంతములనున్న యాదిమనివాసులతోఁ గలసిపోయి యిచ్చట నివాసముల నేర్పఱచుకొని యుండిరి. కాని వారిభాష యీ మధ్యదేశమునందలి యాదిమనివాసుల భాషతోఁ గలియుటంజేసి దక్షిణ దేశమునందేర్పడిన భాషకంటె కొంచెము మాఱురూపు చెందినది.

ఇది యిట్లుండ మఱికొంతకాలమున కు త్తరదేశమునందలి యాదిమనివాసులతోఁ గలిగిన కలయికచేఁ గాఁబోలును వైదికాచారములందు శ్రద్ధలేనివారై యనార్యాచారముల నవలంబించుటంజేసి యార్యజనసంఘముచే వేదబాహ్యులుగఁ దలంపఁబడినవారును, విశ్వామిత్రసంతతివారుగను, దచ్ఛాపహతులుగను నైతరేయబ్రాహ్మణమున నే పేర్కొనఁబడినవారుననగు మిశ్రతెగలవారుకొందఱు ఆయార్యదేశమును వీడివచ్చి, యార్యదేశ పరిసరభూములందు, అనగా వింధ్యకు దక్షిణభాగమునను, దక్షిణాపథమని చెప్పఁబడు మధ్యదేశమున దండకారణ్య భాగములను జేరుట తటస్థించినది. అంధకారబంధురంబగు నరణ్యప్రదేశమునఁ జేరి నివసించుటచే వీరిలో గొంద ఱాంధ్రులని పిలుపఁబడిరి. కాలక్రమమున వీరు తూర్పుదక్షిణభాగముల నాక్రమించికొని వచ్చు సందర్భమున, మధ్యపరగణాలలోని 'తేల్' నామక నదీప్రాంతవాసులగుటచే తెలుఁగువారని చెప్పఁబడిన దేశీయజనసంఘముతోఁ గలసిపోయియుందురు. కావుననే యాంధ్రులు తెలుఁగు వారగుట తటస్థించియుండును. ఇది దేశీయపదంబగుటచేతనే, ఆంధ్రపదమునలె ప్రాచీనకాలమున నంతగా వాడుకలోనికి రాలేదు. తరువాతివారు దీనికి త్రిలింగ త్రినగములనుండి వ్యుత్పత్తిని కల్పించిరి. పిదప వీ రుచ్ఛస్థితి బొందుసరికి కృష్ణా గోదావరీ నదులకు మధ్యభాగము నాక్రమించుకొనియుండిరి. వీరిభాష ప్రాచీన ప్రాకృతము. అక్కడ వేదబాహ్యులుగ దలంపఁబడినను, మొదట నార్యజాతులలోనివారే గావున, వీరికి నార్యవిజ్ఞానమునందును, ఆర్యభాషయందును విశేషాభిమాన ముండకతప్పదు. వీ రధికసంఖ్యాకులుగనే వచ్చి యీ దేశజనులలోఁ గలసియుండుటచే నీ దేశమునఁ దమ విజ్ఞానమును భాషను వ్యాపింపఁజేయుచు, స్వయముగ క్షత్రియజాతులలోనివారగుటచే దమ బుద్ధిబలముచేతను, దేహబలముచేతను,

ఈ దేశజనులపై తమ యధికారమును నెఱపి, క్రమముగ బలవంతులై రాజ్యమును స్థాపించికొనిరి. వీరు చంద్రగుప్తుని కాలమునాఁటికే యొక లక్షపదాతులు, రెండువేల యశ్వములు, వేయిగజములతోఁ గూడిన సైన్యము కలవారై యుండిరి. ఆ కాలమునందు చంద్రగుప్తుని సైన్యము తరువాత వీరిదే గొప్పసైన్యమనియు, వీరిరాజ్యమున ప్రాకారవేష్టితము లగు ముప్పది గొప్పపట్టణములు గలవనియు యవనరాయబారియగు మెగస్థనీసనునాతఁడు తెలిపియున్నాఁడు. వీరిముఖ్యపట్టణము కృష్ణానది యొడ్డునఁగల శ్రీకాకుళమే. వీరీ మధ్యదేశమున స్వతంత్రులే యైయుండి యశోకునికాలమున నాతని సామ్రాజ్యాధిపత్యమును మాత్ర మంగీకరించియుందురు. ఆతని 12-వ శిలాశాసనమునందు, ఇక్కడ-అనగా స్వీయరాజ్యమునందుఁ లెనే, యవనులు, కాంభోజులు, నాభకులు, భోజులు, పితినికులు, అట్లనె ఆంధ్రులు, పుళిందులు మొదలగువారిలో గూడ-వారి రాజ్యములందుగూడ-నశోకుని చేఁ బ్రకటింపఁబడిన ధర్మ శాసనమును జను లనుసరించి ప్రవర్తించుచున్నారని తెలుపఁబడినది. దీనినిఁబట్టి తక్కిన తెగలతోపాటు ఆంధ్రులు నొకవిధముగ స్వతంత్రులుగనే యున్నట్లు తెలియుచున్నది. అశోకుని తరువాత వచ్చిన వారంత బలవంతులు కాకపోవుటచే, సామ్రాజ్యము కొంతవఱకు విచ్ఛిన్నమై, దూరమున నున్న కళింగాదిరాజ్యములు స్వతంత్రముగ విజృంభింపసాఁగిన తఱుణమున నాంధ్రరాజ్యమును పశ్చిమోత్తర దిక్కులకు విజృంభించి కొంతకాలమున కనఁగా, క్రీస్తుపూర్వము మొదటి శతాబ్దమున—మగధరాజ్యమునుగూడ నాక్రమింపఁగలిగినది. ఈ యాంధ్రరాజుల కాలమున బౌద్ధమతము, బ్రాహ్మణవైదికమతముగూడ వర్ధిల్లినవి. వీరు బుద్ధభిక్షువులకొఱకు కనేకగ్రామముల నిచ్చియుండుటే గాక, స్వయముగా నశ్వమేధాది క్రతువులను జేసినవారుగా నుండుటచే

వీరికాలమున నాంధ్రదేశమున బౌద్ధమతముకూడ విశేషముగ వ్యాపించి బౌద్ధస్తూపములు మొదలగునవి నిర్మింపఁబడినను, ఆర్యమతము కూడ ప్రబలముగనే యున్నదని తలంపఁదగియున్నది. భాషావిషయమున్నచో ప్రాకృతమే యాకాలమున రాజభాషయగుటచే దేశభాష లడుగంటి యున్నవి వానికి ప్రోత్సాహములేదు. దేశియులలో మాత్రము వాడుకలో నుండియుండును. గ్రంథరచన యేమాత్రము జరిగినను ప్రాకృతభాషలోనే జరిగినట్లు కనఁబడుచున్నది. సంస్కృతభాషగాని, కవితగాని విశేషాదరమును బడసినట్లు లేదు. హాలుని చేత రచింపఁబడినదిగాఁ దలంపఁబడుచున్న "శాలివాహన సప్తశతి' యనుగ్రంథము ప్రాచీనప్రాకృతమున నున్నది. ఇది మహారాష్ట్రి ప్రాకృతమునకుఁ జేరునదిగానుండును. గుణాఢ్యునిచే రచింపఁబడిన 'బృహత్కథ'యు ప్రాకృతముననే గదు. కాని యిది భూతభాషయగు పైశాచీప్రాకృతమున రచింపఁబడుటచే, మొదట శాలివాహనుని యాదరము బడయలేదనియు, కొంతభాగము గ్రంథ మగ్నిసమర్పణమైనపిదప దాని మహత్వమును, నుత్కృష్టతను దెలిసికొని మిగిలినదాని నాతఁ డాదరించెననియుఁ జెప్పఁబడెడి కథను బట్టి యీరాజునకు స్వీయభాషయగు మహారాష్ట్రి ప్రాకృతమందున్న యభిమానము పైశాచీప్రాకృతమున లేకపోయెనని తలంపవచ్చును. మొత్తముమీఁద ప్రాకృతభాషకే రాజాదరము కలదుగాని దేశభాషకే మాత్రము లేదనుట స్పష్టము. కావున నాకాలమున దేశభాషారచనలకవకాశమే లేకపోయినది. అయినను ఈమధ్యదేశమందలి_అనగా నీ తెలుఁగు కన్నడ ప్రాంతములందలి దేశభాషలలో నీకాలముననే ప్రాకృతపదము లనేకము ప్రవేశించినవి. ఆ కారణముచే నివి విశేషముగా మార్పుచెంది ప్రాకృతవికారము లేయని తలంపఁబడునట్టి స్థితికి వచ్చినవేయైనను, మహారాష్ట్రిదేశమునందువలె దేశభాషలు కేవల మంతరించి

పోయి ప్రాకృతభాషకే యెడమిచ్చియుండలేదు. ఈ కాలమునందు ప్రాకృతభాషలతోడి కలయికమూలముననే యీ మధ్యదేశమందలి యాంధ్రకన్నడభాషలు, దక్షిణదేశభాషలనుండి యంతగా మాఱి పోవుట తటస్థించినది. తరువాతికాలమున సంస్కృతభాషాప్రవాహము వీనినింకను ముంచివేయుటచే నఱింత మాఱి యివి ప్రాకృతభాషా రూపములే యనియు, సంస్కృతమునుండి, ప్రాకృతమునుండియేర్పడినవే యనియు, లాక్షణికులందఱు తలంచునంతటి స్థితి యేర్పడినది. కావుననే "ఆద్యః ప్రకృతిః ప్రకృతి శ్చాద్యే ఏషా తయో ర్భవే ద్వికృతిః" అని సంస్కృతము, ప్రాకృతము ననురెండును, ప్రకృతులనియు నీయాంధ్ర భాష, వానినుండి తక్కిన ఉత్తరహిందూస్థానభాష లేర్పడినట్లే యేర్పడిన వికృతిభాష యనియుఁ దెలిపెడి భాషాలక్షణసూత్రములు, కారికలు బయలుదేరినవి. సంస్కృతభాషయందుఁగల గౌరవముచేతను, ఈ భాషలలో ననేకపదములు సంస్కృతప్రాకృతములనుండి వచ్చిచేరినవి కనఁబడుచుండుటచేతను, తక్కిన దేశములందు ప్రాకృతభాషలు వ్యవహారములో నుండుటచేతను ఇటీవలి కాలమున భాషాలక్షణమును జెప్పఁదొడంగిన లక్షణకర్తలీభాషలను వికృతులేయని తలంచిరి. ఇంతేగాక చాలకాలమువఱకు నివి యపభ్రంశభాషలనియు వీనియందుత్తమనాయకుని గుణములను కీర్తించుచు నుత్తమగ్రంథములు రచింప కూడదనియుఁగూడ నొకమూఢవిశ్వాసము ప్రబలియుండినది. కావుననే దేశభాషకు లక్షణమేమి టనువారివాదమును ప్రతిఘటించుటకుఁగా నీ యాంధ్రభాషలో మొదటిలక్షణకర్తలగు కేతనపెద్దనాదులు కొంత ప్రయత్నము చేయవలసివచ్చినది.

ఆంధ్రులు క్రీ. శ. మూడవశతాబ్ది వఱకు నీదేశమును పాలించిరి. వీరితరువాత బృహత్పలాయనులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు

తెగలలోనివారే యైనను ఆర్యమతవిజ్ఞానముల ప్రభావము వీరిపై విశేష
ముగఁ బ్రసరించుటంజేసి, ప్రతిష్ఠకొఱకై సూర్యచంద్రవంశములలోని
వారమని చెప్పుకొనుటకుఁ దమ వంశముల, నందు జేర్చుకొని, అగ్నిష్టో
మాగ్నిచయన వాజపేయాది క్రతువులను జేసి యశ్వమేధావభృథస్నాన
పవిత్రులైనట్లు చెప్పుకొని, శాసనములను సంస్కృతభాషయందుఁ
బ్రకటించుచు సంస్కృతభాషయందే విశేషాభిమానము కలవారై
యున్నను, దేశభాషాభిమానమును నాగ్రము వీడక దేశభాషావాఙ్మయ
రచనకుఁ బ్రోత్సాహము కలుగఁజేసి "మునుమార్గకవితలోకంబున వెల
యఁగ దేశికవిత పుట్టించి తెనుంగు నంధ్రవిషయమున నిలిపినవారై
నారు. మొదట వీరు పశ్చిమదేశభాగమును వాతాపినగరము రాజధాని
గా సుమారు రెండు శతాబ్దములు పరిపాలించి, పశ్చిమచాళుక్యులు
బాదామిచాళుక్యులని పేరుగాంచినవారగుటచే, వీరీదేశమును పాలించిన
కాలములో కన్నడకవులనుగూడ ప్రోత్సాహించియుండిరనుటకు సందే
హము లేదు కావుననే కన్నడభాషయందలి కవిత యాంధ్రభాషాకవిత
కంటె ముందుబయలుదేరుట తటస్థించినది. అయితే వీరికాలమున
బయలుదేరిన కన్నడకవిత యిప్పటివఱకు లభింపకపోవుటచే, వీరి
తరువాత నెనిమిదవశతాబ్ది మధ్యభాగమున దేశము నాక్రమించుకొనిన
రాష్ట్రకూటరాజులలోనివాఁడును అమోఘవర్షుఁడను నామాంతరముగల
నృపతుంగుని 'కవిరాజమార్గమే' మొదటిగ్రంథముగా నెంచఁబడు
చున్నది. ఈనృపతుంగుఁడు తొమ్మిదవ శతాబ్దప్రారంభముననున్న
వాఁడు. ఇట్లు రాష్ట్రకూటరాజులలో నే కన్నడకవులుగూడ నుండుటచే
వీరు చిరకాలమునుండి యీదేశభాషాకవితను ప్రోత్సహించుచు నుండి
యుండిరనుటకు సందేహము లేదు. చాళుక్యులనుండి యీదేశమును
వీరు జయింపకపూర్వము చిరకాలమునుండి-అనగా నాంధ్రరాజ్య

మంతరించిన కాలమునుండియునుగూడ—వీరు పశ్చిమదేశమున నుత్తర భాగమున నధికారులై యుండిరి. డక్కన్‌యొక్క దక్షిణభాగ మనగా మైసూరు ప్రాంతమును కొంతకాలము కదంబులు, వారితరువాత గాంగులు పరిపాలించిరి. ఈగంగవంశపురాజులలో నొకఁడగు దుర్వినీతుఁడు సుప్రసిద్ధులగు ప్రాచీన కన్నడకవులలో నొకఁడుగా, 'కవిరాజమార్గ' మున నృపతుంగునిచే (బేర్కొ)నఁబడియున్నాఁడు.

"విమలోదయ నాగార్జున, సమేతజయబంధు దుర్వినీతాదిగళీ
క్రమదోళ్ నెగళ్తెగద్యా, శ్రమపదగురుతా ప్రతీయం కైకొండర్."

ఇఁక సమంతభద్రుఁడను నాతఁ డైదవశతాబ్దాంతమున నున్నట్లును, జినేంద్రవ్యాకరణము, శబ్దావతారము, పాణినీయటీక మొదలగు గ్రంథములను రచించి యత్యంతప్రసిద్ధుఁడైన 'పూజ్యపాదుల' శిష్యుఁడై 'భారవి 15 సర్గలకు టీకరచించినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. దీనినిబట్టి యైనవశతాబ్దినుండియు నీప్రాంతపురాజులు మిగులసంస్కృత భాషాభిమానముకలవారయ్యును, కన్నడభాషలో కవితను ప్రోత్సహించుచు రచించుచునున్నట్లు తెలియుచున్నది. మఱియు జైనమతాభిమానులగు, సమంతభద్రపూజ్యపాదాదులు సంస్కృతభాషాపండితులై కన్నడమున మొదటిశిష్టకవులగుటచేతనే, యీభాషలోని ప్రాచీన కవితయు సంస్కృతభూయిష్ఠరచనయే యగుట తటస్థించియుండును. ఇట్లు క్రీస్తుశకము నాలుగైదవశతాబ్దముల కాలముననే కన్నడభాషలో కావ్యములు బయలుదేరుటకుఁ దగినపరిస్థితు లేర్పడినవని మనము తలంప వచ్చును. చాళుక్యులకు పూర్వ మాంధ్రదేశమును పాలించినరాజులు సంస్కృత ప్రాకృతములయందే విశేషాభిమానము కలవారై దేశభాషను ప్రోత్సహింపకుండుటయే యీభాషలో నాకాలమునఁ గవులు బయలుదేరకుండుటకుఁ గారణము. ఈకాలపురాజులశాసనములన్నియు

ప్రాకృతముననో, సంస్కృతముననో రచింపఁబడి దేశభాషలో రచింపఁ
బడకుండుటయే వీరి కీభాషయందుఁగల యనాదరమును సూచించు
చున్నది. చాళుక్యరాజులు మొదట పశ్చిమదేశమున దేశభాష యగు
కన్నడము ప్రాముఖ్యమును జెంది కవితారచన కర్హమైన స్థితిలోనికి
వచ్చుటనుజూచి దాని నచట పోషించినవా రగుటచే, వారీపూర్వదేశ
మునకు వచ్చిన పిమ్మటగూడ నీదేశమందలి భాషను ప్రోత్సహింపఁ
దలంచి, తమశాసనములను సంస్కృతభాషలోవలెనే యాంధ్రభాషలోఁ
గూడ రచింపించి ప్రకటింపఁజొచ్చిరి.

ఏడవశతాబ్దిప్రారంభమున రెండవపులికేశివల్లభుఁ డీవేగిదేశముపై
దండెత్తివచ్చి యద్దాని నంతకుపూర్వ మాదేశము నేలుచున్న సాలం
కాయనులనుండి యాక్రమించుకొని క్రీ. శ. 615సంవత్సరమున తనతమ్ముఁ
డగు కుబ్జవిష్ణువర్ధనుని నీదేశమునకు పాలకుఁడుగా నియమించెను. కాని
కొద్దికాలములో నీతఁడు స్వతంత్రుఁడై తూర్పుచాళుక్య వంశమునకు
మూలపురుషుఁ డయ్యెను. ఈ కుబ్జవిష్ణువర్ధనుని కాలమునుండియు నీ
యాంధ్రభాషలో వ్రాయఁబడిన శాసనము లున్నట్లు తెలియుచుండుట
చే సత్యాశ్రయ బిరుదాంకితుఁ డగు పులికేశికాలము నుండియే యాంధ్ర
భాషకు నవలంబనము దొరికినదని నిశ్చయింపవచ్చును.

## చాళుక్యులకాలమున నాంధ్రభాషాస్థితి

ఈచాళుక్యుల రాజ్యారంభకాలమున నాంధ్రభాషాస్థితి, దాని
స్వరూపము ఎట్లుండెనో, అది నన్నయ భారతమురచించునప్పటి కెట్టి
స్థితికెట్లువచ్చెనో తెలిసికొనవలసి యున్నది. కాని యిందుకు సాధన
ములు విశేషముగా లేవు. అంతకుఁ బూర్వపురాజుల శాసనములు కొన్నిం
టిలో నాయా యూళ్ళ పేర్లును, వానిసరిహద్దులునుమాత్రము తెలుఁగుపద
ములతోఁ దెలుపఁబడుట క్వాచిత్కముగా తటస్థించినది. శాసనములు
సంస్కృతముననో, ప్రాకృతముననో రచింపఁబడినవి. అంతకుపూర్వ

మాంధ్రరాజులయొక్కయు మొదటిపల్లవులయొక్కయు శాసనములు కేవలము ప్రాకృతముననేయుండ సాలంకాయనుల శాసనములు కొన్ని ప్రాకృతమునను కొన్ని సంస్కృతమునను గనఁబడుచున్నవి. ఈ సాలంకాయనులు చిత్రరథస్వామిపాదానుధ్యాతులు. వీరిలోఁ గొందఱశ్వమేధయాగమునుజేసినట్లును, పరమమాహేశ్వర, పరమభాగవతయను బిరుదులు వహించినట్లును దెలియుచున్నది. వీనినిబట్టి యీకాలమున నార్యమతమునకు, సంస్కృతభాషకుఁ గొంత ప్రాముఖ్యము కలుగుచున్నదని తలంపవచ్చును. అయినను గ్రామనామములు మాత్రము దేశభాషాపదములతోడనే తెలుపబడినవి. సాలంకాయననందివర్మ పెదవేగిశాసనములో, ప్రోలూరు, ముండూరు, చెంచెఱువు, కంబురాంచెఱువు, ఆఱుంతొఱ్ఱె, అను దేశభాషాపదములు కనఁబడుచున్నవి. తరువాతి చాళుక్యులశాసనములలో సంస్కృతమున రచింపఁబడిన వానియందు గ్రామావధులను సూచించుటకుఁ దెలుఁగుపదములు ప్రయోగింపఁబడుటయేగాక, మఱికొన్నిశాసనము లాంధ్రముననే రచింపఁబడినవియుఁ గానవచ్చుచున్నది. నన్నయకు పూర్వమునందలి యాంధ్రభాషాస్వరూపమును దెలిసికొనుటకు నాతనికి పూర్వమున బయలుదేరినచాళుక్యరాజుల యాంధ్రశాసనములే మనకాధారములు. వానిని రెండుతెగలుగా విభాగింపవచ్చును. అందు ప్రాచీనములగునవి కేవలగద్యమున రచింపఁబడుటయేకాక ప్రాకృతభాషాసంసర్గము విశేషముగ నుండుటచేఁ గాఁబోలును సులభముగ నర్థముకాక శాసనపరిశోధకులను మిక్కిలి చిక్కుపెట్టుచున్నవి. అంతకంటె నర్వాచీనములగునవి సంస్కృతపదసమాస భూయిష్ఠములై కొన్ని గద్య పద్యములతోఁ గూడినవియుఁ గొన్ని పద్యమయములైనవియుఁ గానవచ్చుచున్నవి. వీనిలోఁగూడ వికృతరూపములుగల పదములు, నన్నయ

నాటికి రూపుమాటిపోయిన పదములు ననేకములున్నను, సంస్కృత పదములు విశేషముగనుంకుటచే నా ప్రాచీనశాసనము లంత దుర్బోధము లగుచుండవు. ఇప్పటికి బయలువడిన వానిలో ప్రాచీనమైనది క్రీ. శ. ౬33 సం. ప్రాంతమువాడు, కుబ్జవిష్ణువర్ధనుని కుమారుఁడగు జయసింహవల్లభుని కాలమునాటిది. దక్షిణహిందూదేశ శాసనములు 6 వ సంపుటములోఁ బ్రకటింపఁబడి యున్నది. కుబ్జవిష్ణువర్ధనుని తెలుఁగుశాసన మొకటికలదని తెలియవచ్చుచున్నది గాని, యది ప్రకటింపఁబడలేదు.

౧. "స్వస్తిశ్రీమత్ సకలలోకాశ్రయ జయసింఘ

౨. వల్లభమహారాజులాకుఱ్ ప్రవర్ద్ధమానవిజయరా

3. జ్య సంవత్సరంబుల్ ఎణుంబోది అన్నేణ్టి అమ్మకఱ్ పూణ్ణ

౪ మనాణ్డు ప్లాంబిండిరాజులముట్ల్యకలిముడిరాజుల్

౫ ప్లానింశ సముద్రరకైనాకుబణి సేసిన కల్చివీ

౬. టికుల్లు నుద్దికదు మూట్రికినిత్య త్రీఉ త్తరంబున పులొ-

౭. ంబున చెఱువుపడుమాఱకోఱ్ ఎణుంబోది పుట్ట్యుత్తి

౮. ల్లిపట్టు సేను [1*] తూప్పుఱ్ఱనకోటి తా[లు]తోంట శాయు
పదు ..

౯. గంబు ఇచ్చిరి పాఱ్ఱపదువారంబుల్లావి[ం]డీశ్వరఁబున కళా

౧౦. కణ్డుసమిచ్చికుడుచు వారు ఇల్లికాను ఏ వెఱుగు నా

౧౧. రువిత్య త్రీగాణంబ [ద్దో] ల్గొట్టు [న]ంగాణంబు చువ్వు
టూరు గాణంబు

..........ప్రచ్చినవారు బారాణసివేప్రు

..........లీశిస(ము)ద్రంబుమలా

..............డి సెనవదికి

..............రనుఇచ్చె.

ఇది జయసింహవల్లభుఁడు తనకుఁ 'బణిసేసిన' ఏ యుద్ధముననో సహాయముచేసిన ప్లావిండిరాజులకు 'విత్ప త్త్రి' గ్రామము నిచ్చినట్లుగాఁ దెలుపుచున్నది. ఇందు సంస్కృతపదములకంటెఁ దెనుఁగు పదములే విశేషముగ నున్నవి. ఎఱుంబొంది, అన్నేటి, నాకు బణిసేసిన,మూటికి, పులొంబున చెఱువు, ఎఱుంబొందిపుట్టు, ఆల్లిపట్టు సేను, తాటితోంట, పడువారంబు, ఇచ్చిరి, కుడుచువారు మొదలగునవి.

దీనితరువాతఁ దెలుఁగున రచింపఁబడినశాసనము ౬౭౫ ప్రాంతమున నున్న మంగిదొగరాజు కాలమునాటి లక్ష్మీపురముశాసనము.

౧. స్వస్తిశ్రీ మగిదొగరజులముడ్లు
౨. విట్రజులప్రతమరా
౩. ?ల్యాంబున కడువం [డ్లు]
౪. లఇచ్చినరెడ్డుపటి
౫. మిరియమ్ముబోళ
౬. జకు వెంగరి పె
౭. డశిన రెడ్డువట్టి
౮. పదేన్దుంబు అడ్లుష
౯. ట్టుద్రుగ్గాదేవి నేలయు
౧౦. ఉఋవుటురిబోళ
౧౧. రెడ్డుట్టియు తూఱ్పు
౧౨. ఈ రెడ్డుట్టి ఐచువరు
౧౩. కళరేని బారనాసి

౧౪. వేగవిలాళు వేప్లు
౧౫. ము వే శెలుపులు
౧౬. వేవురు పటాను
౧౭. చమ్విన చన్నంగు
౧౮. ............
౧౯. యశ్యేయశ్యేయు
౨౦. దాభూమి తశ్యేశ్యే
౨౧. తశ్యేతధాఫలం
౨౨. స్వదత్తాపరద
౨౩. తావాయో
౨౪. పవనున్దరా.

ఇందును తెనుఁగుపదములే విశేషముగా నున్నవి. ‘ధొంగ’ ‘ప్రతమ’ ‘బోళ’ బారణాసి, మొదలగుపదము లాకాలమందలి వ్యవహార రూపములకు ప్రాకృతభాషాసంపర్కమును సూచించుచున్నవి.

దీని తరువాతిదిగాఁ గనఁబడుచున్నను, అంతకంటె నర్ధముగాని భాషలో నున్నది ‘అహదనకరశాసనము—ఇది మూఁడవ విష్ణువర్ధనుని కాలమున బయలుదేరినదిగాఁ జెప్పఁబడు చున్నది. ఈతఁడు ౭౦౯-౭౪౬ వఱకు రాజ్యముచేసినట్లు తెలియుచుండుటచే, నిది పై లక్ష్మిపురము శాసనమునకు నిరువది ముప్పదిసంవత్సరముల తరువాతిదై యుండును. మూఁడవవిష్ణువర్ధనుడు మంగిదొగరాజు పుత్రుఁడే యగుటచే నివి తండ్రికొడుకుల కాలములలో బయలుదేరిన వగుచున్నవి. కొన్ని చోట్ల నర్ధముకాకున్నను మొత్తముమీద నీయహదనకరశాసనము, భాష, శైలి విషయములందు పైలక్ష్మిపురశాసనమునకు దగ్గరగానున్నట్లు కనఁబడుచుండుటచే నిది మూఁడవవిష్ణువర్ధనునికాలపుదే యయియుండునని

తలంపఁదగియున్నది. ఇప్పటికి సుమారు నూటయేఁబది సంవత్సరముల తరువాత తొమ్మిదవ శతాబ్దాంతిమభాగమున గుణగ విజయాదిత్యుని కాలమున బయలుదేరిన అద్దంకి, ధర్మవరపుశాసనముల భాషకును, వీని భాషకును విశేషభేద మగపడుచుండుటచే నివి వానికంటె మిగుల ప్రాచీనములే యని తలంపఁదగియున్నది. ఇవి వానివలె సంస్కృత సమాసప్రాబల్యమును, తత్సాంప్రదాయ ప్రభావమును గాక ప్రాకృత భాషాసంసర్గ ప్రాబల్యము నేచూపుచున్న విసలె నున్నవి.

అహదనకర శాసనములోని తెలుఁగుభాగము.

"స్వస్తిశ్రీ ప్రిథివీపల్లవపట్టనబున ఊరివారు కరిగళ్లవడవరికి ఊరిస్వామ్యుళ్ ఇచ్చిన స్తితి. రెణ్ణువాడలపట్టనావ్రరకు, అరియు, డగు తెఱయు, సిద్ధాయంబు దణ్డు దసపరాధంబును సర్వబాద పరియారువు ఊరుదాయ నేసి ఇచ్చి. [రి] దీనికి వక్రంబులేదు. వచ్చిన వారు గళలేని ఉరిస్తితిదప్పినవారు దీనికివక్రంబు వచ్చిన గచ్చురు రెణ్ణువడల ఏలేమువరులేముల చేసినదియు చన్న వీరిపయి నాడువరు గళ్గిన వీళేముళచేసిన సేయుడు సను. మహానభియుళ్ నరాళోక మహాసత్థవుళ్ విరాపవమహానభియుళ్ గజ్జంబు సెడ్లనడువుళ్ శమ ప్తభువన శ్రియకనడిరజు బద్రపెరెయ ఊరిపనిన వ్రసివర వయ్యేటి మహానభిళ్ వయ్యేటిమహాభిళ్ పనికొళు చేసేరక వఇచ్చినవ్రసి వయ్యేటి మహానభియుళ్ మరల కొన్డుకళ్ సర్వలోకశ్రియ మహాసత్థవళ్ పెద్దళ్ నెరవద్యమహా సత్థవళ్ పసిణ్డిముడ్డు వెటన్దలచరువయ్య విష్ణువర్ధన మహాసత్థనళ్, పసుత్తేవుల కొన్డుకళ్ అచ్చవఱ్ఱనియు కొణ్డుకళ్ గజ్జ సెడ్లల నడువుళ్ ప్రిథిమహా సత్థవళ్ వెటన్దళ్ పొనికణ్డిఅము కొళనడువు విష్ణువర్ధన, మహాసత్థవల కొణ్డుకలు నిరవద్యప్రిథివి కనడిరజుళ్ గునవనమహానభియుళ్ ముద్దకఇచ్చికొళ్ రమిస్వరా ప్రిథివీ

మహాసర్ధ్ఞవళ్ అపజయనువకోల కొన్డుకళ్ కొరిన్దికొళ్, కరిగల ప్రిథివీ మహాసత్థ్రవల కొన్డుకళ్ నన్దిమహానవిల నడువు శ్రీమహాసత్థ్రవళ సకల లోకశ్రయ్య ప్రిథివీమహాసర్ధ్ఞవల దివకరయ్య పఞ్చకొళ్ శ్రీజప్టి పెన్దట్టబ్బగడ్డాన్డు."

అహదనకరశాసనమును లక్ష్మీపురశాసనముతోఁ బోల్చి చూడఁగా భాషావిషయమున తరువాతివానితోకంటె దీనితో విశేషసామ్యమున్నట్లగపడుచున్నది. పైమూఁడుశాసనములు గూడ ప్రాకృతభాషాసంపర్కమును విశేషముగఁ గనబఱచుచున్నవి. దీనితరువాత లభించిన తెలుఁగుశాసనములందువలె, నీభాషలో కలిసిపోయిన తత్సమపదబాహుళ్య మిందు కనఁబడదు. అన్ని సంస్కృతదీర్ఘసమాసములును గనుపడవు. కాని తరువాతిశాసనములలోని బిరుదావళి మొదలగువిషయము కొంత సంస్కృతములోనే రచియింపఁబడియుండుటచే, నా దీర్ఘసమాసములన్నియు తెలుఁగులోనికి దింపుట కవసరము లేకపోయిన దేమో! యుద్ధమల్లుని శాసనములో మొదటిబిరుదావళులు, సంస్కృతములో, వ్రాయఁబడక దీర్ఘసంస్కృత సమాసములతోఁగూడిన తెలుఁగుపద్యములుగనే వ్రాయఁబడినది. తక్కినపద్యములందలిభాషలోఁగూడ 'సర్వబాదపరియారువు', 'సవ్వలోకశ్రయమహాసర్ధ్ఞవళ్' వంటి ప్రాకృతరూపములు కనఁబడవు. సంస్కృతసమాసములే ధారాళముగా గ్రహింపఁబడుచు వచ్చినవి. 'ఉరిస్వాముల్, మహానభియుల్, సెడ్లు, సెడ్లనడుపుళ్, పెద్దఞళ్, పసుక్షేవుల కొణ్డుకళ్'—ఇట్టి పదములు తెలుఁగులో నన్నయభాషలో మనకు పరిచితము లగు రూపములతో నింకను స్థిరపడక, ప్రాకృతము మూలముగా నీభాషలోనికి వచ్చుమార్గములో నున్నట్లగపడుచున్నవి. కావుననె యీ రూపములు సులభముగ నర్థమగుట లేదు. ఇవి భాషయొక్క ప్రాచీనస్థితిని దెలుపుచున్నవి. ఈ

కాలమున తెలుఁగుపలుకుబళ్లు ప్రాచీన ద్రావిడ సాంప్రదాయములనుండి ప్రాకృతభాషాసంసర్గసహాయముచే నూతనపరిణామమునుబొందుచున్న సంధిస్థితిలో నున్నవని చెప్పవలసి యున్నది. 'ళ' కారాంత బహువచనరూపములఁ జూడుఁడు:

'మగిదొగరజుల' 'విట్టజుల,' 'రెండువాడల,' 'కొమ్మకలు,' మొదలగు కొన్ని బహువచనాంతరూపములలో 'లు' కారమే కనఁబడుచున్నది. మఱికొన్ని 'కనడిరజుళ్' 'మహానభియుళ్' 'కొణ్డుకళ్' మొదలగునవి 'ళ'కారాంతములై యున్నవి. కావున నీకాలపు వ్యవహారములలో, ప్రాచీన ద్రావిడ బహువచనప్రత్యయమగు 'గళ్' అనునది కొన్ని పదముల చివర 'గళ్' గాను, మఱికొన్నిచోట్ల 'గళు'గాను, అట్లే 'కళ్', 'కొళ్', 'కొళు', 'కొల్', 'లు', 'ళ్', 'లు'అను పెక్కురూపములను జెందియున్నట్లగపడుచున్నది. అందు సామాన్యముగా దేశీయపదముల చివర 'కళ్', 'కలు' లును, తత్సమపదంబుల చివర 'ళ్', 'ళు' లును గనఁబడుచున్నవి. ఇట్లు తత్సమపదముల చివర, 'ళ్' కారమాత్రమే యుండ దేశ్యపదములు 'గళ్' ప్రత్యయాంతములై యుండుటచే 'కొణ్డుకళ్' మొదలగు పదములలో 'ళ్' కారముమాత్రమే బహువచనసూచక ప్రత్యయమనియు, 'కొణ్డుక' మొదలగునవే అనఁగా కాంతములే—పదములనియెడి భావమప్పటికే జనులమనములలో నేర్పడుచున్నట్లున్నది. కావుననే 'ళ' కారము మాత్రమే తత్సమపదముల చివరఁజేర్పఁబడుచువచ్చినది. ఈ 'ళ' కార మచ్చటచ్చట 'ల' కారముగ నప్పటికే మాఱినది; కాని, 'ళ' కారమునకే యింకను, ఎక్కువ ప్రాచుర్యము కలదు. తెలుఁగులో బహువచనప్రత్యయము 'లు' గానేర్పడుచున్నకాల మిదియే యని తలంపనగును. కావున నీకాలముననే అనుచితవిభాగము (incorrect breaking) చే 'కొణ్డుక', 'చిలుక' మొదలగు కకారము చివరగల

శబ్దము లేర్పడియుండునని యూహింపఁదగును. నన్నయకాలమున కీపరిణామము పూర్తియైనది.

'కొణ్డుకళ్' అనుపదము ప్రాచీనభాషకుఁ జెందినదే యని చెప్పవచ్చును. ఇది కొడ—కొణ్డ—అనుపదమునకుఁ 'కళ్' ప్రత్యయము చేర్చుటవలన నేర్పడినది. *కొడ-(కోడ?)-కొణ్డ- అనగాఁ లేతదనము - యౌవనము (Tenderness, tender age, youth) అని యర్థము కలదు. దీనినుండి లేతవయసుగలవాఁడు-బాలుఁడు-అను నర్థ వచ్చినది. తమిళమున 'కుఴ' (ழ) 'కుఴ'(ழ)వు, 'కుయ' అనురూపములుకూడ కలవు. కన్నడమున 'కొడ' యను రూపముకలదు. ప్రాచీన భాషయందలి 'ఴ' కారము తెలుఁగున 'డ'కారముగా మాఱుచుండుట ప్రసిద్ధమే. (Cf. అ.కోழி, తె.కోడి, కన్న. కోళి). కన్నడమున సామాన్యముగా 'ళ'కారముగా మాఱుచుండును. ఈపదమున 'డ'కారముగనే నిలచిన ట్లగుపడుచున్నది. కన్నడమున నీపదము 'కొడగూసు'=చిన్నపిల్ల—బాల (A young girl - a maiden) అనుపదములోఁ గాన వచ్చుచున్నది. తెలుఁగున "కోడె, కోడెకాఁడు, కోడెదూడ," అనునవి. 'కొడుకు' అనుపదమునకు సంబంధించినవే. ఈ'కోడ' అనుదానికి స్త్రీలింగద్యోతకమగు 'అళ్' చేర్పగా 'కోడలు' అయియుండును. డకారస్థానములోఁ గొన్నిపదముల దకారముకూడఁ గనఁబడుచున్నది:— 'కొదమె, కొదమ=యౌవనము తలసూపినది (పశుపక్ష్యాదికము) Cf కొదమపెంటి, కొదమతుమ్మెద etc ఇట్లు 'కొడ-కొణ్డ' అనుదానికి బహువచన ప్రత్యయము 'గళ్' అనునది చేర్పఁబడుటచే 'కొణ్డగళ్'

---

* Cf "మழవుం కుழవుం ఇళమై ప్పెరుళ"—తొల్కప్పియం.

కొడగళ్, కొడగలు, కొడకలు, కొడుకులు; కొణ్డుగల్, కొణ్డుకళ్ అను రూపము లేర్పడియుండును. తరువాత 'ళ్'–'ళు' బహువచన ప్రత్యయముగా విడదీయఁబడినది. దీనినిబట్టి 'లు' అని తెలుఁగులో నిప్పుడు మనము వాడుకొనుచున్న బహువచన ప్రత్యయము 'ళు' 'ళ్' అను రూపమున నున్నపుడే 'గళ్' 'కళ్' తోఁగూడిన పదమునుండి విడదీయఁబడినట్లును, తత్సమాదులగు నితరపదములనుండి బహువచన రూపము చేయుటకుగాఁ జేర్పఁబడుచున్నట్లును తెలియవచ్చుచున్నది ఇట్టిశాసన రూపములు ప్రాచీనద్రావిడప్రత్యయమగు 'గళ్' యొక్క రూపపరిణామచరిత్రను కొంత తెలుపుచున్నవి. 'కళరేని' 'కళ్గి' అను రూపములకు 'కళ్' అను ధాతువు మూలము కావచ్చును. లక్ష్మి పురశాసనమందుగూడ 'కళరేని' అని 'ళ' కారరూపమే కనబడుచుండుటచే నిది వ్రాతగాని పొరపాటుగాక ఆకాలమున నిది 'ళ' కారము తోడనె యుచ్చరింపబడుచున్నట్లుగాననగు. 'శేము' 'నరాళోక' అను పదములలోగూడ నీ ళకారమె కనబడుచున్నది. ఇట్టిప్రాచీనశాసనములలోని భాషకు తరువాతిశాసనములలోని భాషకంటె, ప్రాకృత భాషాసంసర్గ మెక్కువగా నున్నట్లగపడుచున్నదని మనము ముఖ్యముగా గమనింపఁదగియున్నది. ఇప్పటి కింకను ఈ భాషలో రచింపఁబడిన శాసనములలో పద్యములను రచించు నాచారముగాని, భాషకట్టి గౌరవస్థితిగాని వచ్చినట్లు కనఁబడదు. ఈ రాజులయొద్ద దేశభాషా కవులుగాని, పండితులుగాని లేరేమో! ఈశాసనములయందు కేవలము సంస్కృతమునకేగాక, దేశభాషయగు తెలుఁగునకుగూడ స్థానము దొరకుటయె యొక విశేషము.

ఈ శాసనములకు తరువాతఁ దెనుఁగున రచింపఁబడిన వానిలో మనకు లభ్యమగుచున్నవి సుమారొక నూరు నూటయేబది సంవత్సర

ములుతెరువాతివి. అవి క్రీ.శ. ౮౪౮-౮౯౨ వఱకు రాజ్యముచేసిన గుణగ విజయాదిత్యుని కాలము నాటివి. అందు అద్దంకిశాసన మొకటి. ఇది గుణగవిజయాదిత్యుని సేనానాయకుఁ డగు పాండురంగఁడను నాత డాదిత్యభట్టారకునికి ధర్మపురమున నిచ్చిన దానమును దెలుపుచున్నది. అద్దంకిలో నిది దొరకుటచే నద్దంకిశాసన మని చెప్పఁబడినది. ఇది ౯ వ శతాబ్దాంతిమభాగమున బయలుదేరినదని చెప్పవచ్చును. అనఁగా వెను కటి శాసనములకు నూరు నూటయేబది సంవత్సరముల తరువాతను, నన్నయకు పూర్వము సుమారు ౧౫౦ సంవత్సరముల ప్రాంతమునను బయలుదేరిన దనవచ్చును. ఈ శాసనము గద్యపద్యాత్మకమై యుండు టయు నాపద్యము దేశీయచ్ఛందస్సు ననుసరించిన తరువోజ యగుట యును పెద్దవిశేషము. దీనినిబట్టి నన్నయకు పూర్వము సుమారు ౧౫౦ సంవత్సరముల క్రిందటనే తెలుఁగులో పద్యరచన ప్రారంభమైన దని తలంపనగును. ఆ శాసన మిట్లున్నది.

"పట్టంబు గట్టిన ప్రథమంబు నేణ్డు
బలగర్వం బొప్పగ బై లేచిసేన
పట్టంబు గట్టించి ప్రభుబణ్డరంగు
బంచినసామంత పదువతోఁ బోయి
కోట్లముల్ వం డెండు గొని వేంగినాటి
గొఱల్చియ త్రిభువనాంకుశబాణ నిల్పి
కట్టెపు దుర్గంబు గడుబయల్సేసి
కండుకు ర్బిజవాడ గావించె మెచ్చి"

"పండరంగు పరమమహేస్వరుండు ఆదిత్యభటరనికి ఇచ్చిన భూమి ఎనుబొదివుడ్ల ఆడ్లుపట్టు నేల-దమ్మపురంబున దమ్మవులు వీని రక్షించినవారికి అశ్వమేధంబున ఫలంబు అగు"

ఇందు వెనుకటి శాసనములందువలెనే యిప్పుడు సులభముగా నర్థముకాని దేశీయపదములు కొన్నియు (పదువ, బాణ, గొఱిల్చియ) ఎనుబొది, అఙ్లు, ఆదిత్యభట్టారనికి, అని కొంత వికృతరూపములతో గన్పడునవి కొన్నియునున్నను, మొత్తముమీఁద గద్యపద్యములు సులభముగా నర్థ మగుచున్నవి. తత్సమపదములు విశేషముగనే చేరి భాషలో నైక్యమై కనఁబడుచున్నవి. దీర్ఘసమాసములు మాత్రము విశేషము లేవు. దేశీయపదము లధికముగా నున్నను, వెనుకటి శాసనములందువలె ప్రాకృతసంపర్క మంతగాఁ గనఁబడదు. ఈ తెలుఁగుభాషపై ప్రాకృతభాషా సంసర్గప్రభావము (Influence) బాగుగ మఱ్ఱి మెఁగ ముపట్టి, సంస్కృతభాషాప్రభావము విజృంభింపఁ జొచ్చిన కాలము నిది సూచించుచున్నది. ఇంతకుపూర్వము చాలకాలము క్రిందటనే ప్రాకృతభాషల వెనుకకుఁద్రోసి ఆర్యమతము సంస్కృతభాషయు ప్రాధాన్యమును వహింపఁ జొచ్చినవి. కాని వాని ప్రభావ మిప్పటి కీశాసనమున మనకుఁ గనఁబడినది. ఎంతకాలమునుండియో యట్టి సంసర్గ సమ్మేళనము లుండినఁగాని యిన్ని తత్సమపదములు భాషలోఁ జేరి కలసిపోయి యుండవు. ఈ తత్సమభాషలో ధారాళమగు శైలి—అనఁగా మన కిప్పుడు సుపరిచితంబగు శైలి యేర్పడుటయేగాక శాసనములలోనె గద్యలను పద్యములను కలిపి రచించు నాచారము ప్రబలుటచే గద్యపద్యాత్మకమగు వాఙ్మయముకూడ బయలుదేరి యుండు నని తలంప వచ్చును. ఒకవిధముగ నన్నయకాలపుశైలి, గద్యపద్యాత్మకంబగు రచనారీతి యాతనికి సుమారు రెండువందలయేండ్ల క్రితమే యేర్పడి యున్నదని యీ శాసన నిదర్శనమునుబట్టి నిశ్చయింప నగును. అయితే మఱియొక విశేష మేమనఁగా నీశాసనములలోని పద్యము లన్నియు దేశీయచ్ఛందస్సునకు సంబంధించినవే గాని, అనగా, సీసము తరువోజ

అక్కర మొదలగునవేగాని సంస్కృతఛందస్సునకు సంబంధించినవిగాఁ గనఁబడకుండుట. వీని నీ భాషలోనికిఁ దెచ్చినవాఁడు నన్నయయే యై యుండును. అంతకు పూర్వము కర్ణాటభాషలో నీ మార్గమును త్రొక్కిన పంపాదికవులే వీనికి మార్గదర్శకులై యుందురనుటకును సందేహము లేదు.

ఇట్లీయద్దంకిశాసనమేగాక గుణగవిజయాదిత్యుని ధర్మవరపు శాసనమును, ఈతని తరువాతివాఁడగు చాళుక్యభీముని సాటిమతియొక్క శాసనముగూడ తొమ్మిదవశతాబ్దముననే యాంధ్రభాషయందు సంస్కృతభూయిష్ఠంబై గద్యపద్యాత్మకంబగు రచనారీతియు తత్సముభాషాశైలియు నేర్పడినవని స్పష్టపఱచుచున్నవి.

మూఁడవ విజయాదిత్యుని (గుణగవిజయాదిత్య) ధర్మవరపు శాసనము.

"విజయాదిత్య పాదపద్మభ్రమరాయమాన శ్రీ మత్కడెయ రాజు గుణగణాభరణుణ్డు దనకెసి ఈస్వ (శ్వ) రున (కుం) గాత్రిఁ కేయుణ్డుం బోలె చౌషష్టికల (లా) విసా (శా) రదు (ణ్డ) య్న (అ) య్యపయ్యయు, సకలశాస్త్రార్థపారగులయ్న పె(ద) పణ్డరంగులు అయ్లమపగ్గిఁడలుంగర (న) మ్మనపణ్డరంగును ఈధమ్మఁ ని[ర్వ్వ హ] నోద్యోగమ్మున (కు) బృహస్పతి సమానులయ్న పెగ్గిఁడకా (డెయ) గారి కొడుకు (బె) జెయరాజుసకు (త్తుఁ) ణ్డని ఆత్మానుమతంబునం బంచిన వ్రసా (దం) బని సమస్తరా (జ్యభ)ర నిరూపిత మహామన్త్రాధిపతి (మ) (హే) శ్వరపకుపాతి దేవబ్రాహ్మణ గురుభక్తి పరుణ్డు స (శ) క్తిత్రయ సంపన్నుణ్డుమయ బెజయారాజు బెజెయేశ్వరంబుగల స (శ) నివ్వఁ [హ] నంబునేసి దిస (శ) సున్నంబ్రాకారంబు

మటంబును నేమియించి.........బున్వా.....వచ్చిన వారుదంబు సల్పినవారు......ది (ం) జగద్యంబుల నలన (శా) స్వ (శ్వ) తంబు ......యను ఇ (ఈ) భూమిలోన

ఈ శాసనము కేవల తత్సమ భాషాగ్రథితంబై "సంస్కృతభూయిష్ఠ రచన" కలదై యున్నది. పెగ్గడ, గుడ్లు, పన్చినవారు, వచ్చినవారు అనుకొద్దిపదములఁ దక్క దీనియందు దేశీయపదములు విశేషముగా లేవు. "పాదపద్మభ్రమరాయమాణ, సమస్తరాజ్యభరనిరూపిత మహామన్త్రాధిపతి" మొదలగు దీర్ఘసమాసము లేగాక, నెమియించి, నిర్వహానంబునేసి, అని క్రియారూపములుకూడ చాలవరకు తత్సమరూపములె. గద్య రచన, అందులో శాసనములలోని గద్యరచన, యిట్టిదై యుండుటను బట్టి, యిట్టి శైలి కా కాలమున గల ప్రాచుర్యము వ్యక్తమగుచున్నది. పద్యములు లేక, ప్రౌఢంబగు గద్యశైలిలో రచింపబడినదని ప్రత్యేకముగా సూచింపనుద్దేశముతోఁ గాఁబోలు తుది నిది 'గద్యంబుల నలశాశ్వతంబుగా నుండునట్లు రచింపబడినదని చెప్పఁబడియున్నది. దీనినిబట్టి పద్యరచన, గద్యరచనయను రచనాభేదముకూడ పాటింపబడుచున్న దనుట స్పష్టము. ఈ గుణగవిజయాదిత్యునికి సమకాలికుండై పశ్చిమచాళుక్యరాజ్యస్థానం బాక్రమించి యేలుచుండిన రాష్ట్రకూటరాజగు అమోఘవర్షనామాంకితుఁడగు 'నృపతుంగుఁడు' కన్నడభాషలో నీ కాలముననే రచించిన 'కవిరాజమార్గము' అను లక్షణగ్రంథమునఁ దనకు పూర్వమున ననేకకవులు గద్యకావ్యములను రచించినట్లుగాఁ జెప్పియున్నాఁడు.

" మిగె కన్నడ కబ్బంగళొ
ళగణిత గుణగద్యపద్య సమ్మిశ్రితమం

నిగదిసువ గద్యకథా
ప్రగీతియం తచ్చిరంతనాచార్యర్కళ్॥

విమలోదయ నాగార్జున
సమేతజయబంధు దుర్వినీతాదిగళీ
క్రమదొళ్ నెగళ్దిగద్యా
శ్రమపదగురు తాప్రతీయం కైకొండర్.

చిరంతనాచార్యులగు విమలోదయాదులు గద్యాశ్రమపదగురు తాప్రతీతిని పొందిరని చెప్పుచున్నాఁడు. కాని యిందు విశేష మేమనఁగా కీరిచే రచింపఁబడిన యీ గద్యకావ్యములు "అగణితగుణ గద్యపద్యసమ్మిశ్రిత"ములుగా నుండుట యే. గద్యపద్యసమ్మిశ్రిత కావ్యములను సంస్కృతాలంకారికుల పద్ధతిని చంపూకావ్యము లనకుండఁగా, 'గద్యపద్య సమ్మిశ్రితమం' అని పైనిచెప్పుచు 'గద్యకథా ప్రగీతియంనిగదిసువర్' అని యట్టివానిని గద్యలుగనే పరిగణించుట విశేషము. గద్యపద్యమిశ్రితములగు కావ్యము లా కాలమున గద్యలనియే చెప్పఁబడుచుండెడివేమో? సంస్కృతమునందైన నీకాలమున కింకను చంపూకావ్యములు విశేషముగ ప్రబలినట్లు గానరాదు. చంపువులలో మొదట ప్రసిద్ధిగాంచినది భోజునిరామాయణచంపువుగనే కనఁబడుచున్నది. చంపూకావ్యములను సంస్కృతమున వాడుకలోనికి దెచ్చిన దాతఁడే యేమో యని తలంచుట కాతఁడు రామాయణచంపువు మొదట, నీరీతి గ్రంథరచనను సమర్థించుకొనుచున్నవాడువలెఁ జెప్పిన

"గద్యానుబంధరసమిశ్రిత పద్య సూక్తిః
హృద్యాహివాద్యకల యాకలితేవగీతిః"

అను శ్లోక మవకాశమును గలుగఁజేయుచున్నది. ఇంతకుఁబూర్వము కావ్యభేదములలో "చంపువును" బేర్కొన్న సంస్కృతాలం

కారికలలో మొదటివాఁడు 'దండి' కలఁడుగాని, ఈతఁడు వీని కేమి యు నుదాహరణములను జేర్కొనలేదు. ప్రాచీనచంపువులైన నేమి యు గానవచ్చుట లేదు. మఱియు దండి దక్షిణదేశీయుఁడుగాఁ గనఁ బడుచుండుటచేతను, నీతఁడు పేర్కొన్న కావ్యభేదములలో 'సంఘాత' మనునది – (భిన్నకవికృతమగు పద్యసమూహము)– ఒకటి యుం డుటచేతను, ఇది ద్రావిడభాషాగ్రథితమై భిన్నకవికృత పద్యసము చ్చయరూపంబై సంఘవాఙ్మయ మనుపేరఁ బరగుచున్న 'అగనా నూరు, పురనానూరు, అఘనాన్పురల్, ఎట్టుత్తొగై' మొదలగు ద్రావిడ గ్రంథములను మనమున నిడికొని, దక్షిణదేశమున దేశభాషలలో ప్రచారములో నున్న కావ్యభేదములనుగూడ గ్రహించి కావ్యాదర్శ మునఁ జేర్కొనెనా యను సందేహము కలుగుచున్నది. ఇంతేగాక ద్రావిడవాఙ్మయమున మూఁడవసంఘమునకుఁ జెందినవాఁడుగాఁ జెప్ప బడుచున్నట్టియుఁ, బ్రాచీనసంఘవాఙ్మయమును పోగుచేసి కొన్నిటి కుపోద్ఘాతపద్యములను రచించినట్టియు "పెరిందేవనార్" అను ద్రా విడకవి మహాభారతము నాప్రాచీనకాలమందే తమిళభాషలో రచిం చుచు గద్యపద్యమయంబుగఁ జేసినట్లు చెప్పుదురు. ఆతనిగ్రంథమం తయుఁ బూర్తిగా నిపుడు దొరుకకపోయినను, నితరగ్రంథములలో నచ్చటచ్చటదొరకు, కొన్నిభాగములనుబట్టి యిది చంపువే యని తెలి యుచున్నది. కావున నిట్లు దేశభాషలలో గద్యపద్యసమ్మిశ్రితంబులగు గాన్యములనురచించుట చిరకాలమునుండియు నాచారముగ నున్నట్లు న్నది. మొత్తముమీఁద నన్నయభట్టవలంబించిన 'చంపూ' మార్గ మాతఁడు స్వయముగాఁ దెనుఁగునఁ దెచ్చి పెట్టినదిగాక, యంతకు పూర్వమే కొన్నిఁ తెలుఁగు శాసనములయందును దేశభాషలందలి కవి త్వమునను పాడుకలోనుండిన మార్గమే యైయున్నదనుట స్పష్టము. నృప

తుంగుఁడు తనకుఁబూర్వమే యనేకులగు కవు లిట్టిరచనల గావించిరని చెప్పియుండెగదా. ఈతనితరువాతను, కన్నడవాఙ్మయమునఁ బ్రసిద్ధి జెందినవారై రత్నత్రయమని పేరుగాంచిన పంప, పొన్న, రన్నకవులు కూడ నీచంపూమార్గమునే యవలంబించిరి. కేవల చంపూమార్గమునే గాక దీర్ఘసమాసములతోఁ గూడిన సంస్కృతభూయిష్ఠరచనయు వీరు చేయఁదొడంగిరి. ఈనాటి యాంధ్రశాసనములలోను, నన్నయకు పూర్వకాలపు శాసనములలోనుగూడ దేశీయచ్ఛందమునకు సంబంధించిన పద్యములే గనబడుచున్నను, అప్పటి కన్నడశాసనములలోను, కవిరాజ మార్గము మొదలుగాగల కన్నడభాషా కావ్యములలోనుగూడ సంస్కృత వృత్తములు ధారాళముగాఁ బ్రయోగింపఁబడి యున్నవి. అనఁగా నీనాటికే దేశీయరాజుల ప్రోత్సాహముచే బయలుదేరిన కన్నడభాషా వాఙ్మయములో సంస్కృతపదములు, దీర్ఘసమాసములు సంస్కృతఛందోవృత్తములు, ఆలంకారిక సాంప్రదాయములు, మొదలగునవి ప్రవేశించుటే గాక, సంస్కృతగ్రంథముల ననుసరించి రచించు నాచారముకూడ బయలుదేరినదనుట. ఇదేకన్నడభాషాసంసర్గబలముచే ఆంధ్రవాఙ్మయమునగూడ సంక్రమించినది. కవిరాజమార్గమున నృపతుంగుడు దండికృతమగు కావ్యాదర్శమును, భామహాదుల గ్రంథములను అనుసరించియున్నాఁడు. ఆదిపంపకవియు, దనభారతమును సంస్కృతమున వ్యాసకవి రచితంబగు గ్రంథము ననుసరించియే రచించినట్లు చెప్పుకొన్నాఁడు.

> " వ్యాసమునీంద్ర రుంద్ర వచనామృతవార్ధిఁయ నీసువెంకవి
> బ్యాసనె నెంబగెబ్బఁమెనగిల్ల గుణార్ణవనోళ్పుమన్మనో
> వాసమదాగె పేళ్దపెనదల్లదె కబ్బమెదోషమల్తిఁగం
> దోషమె కాణె నెంనటివమల్కొయె పేళ్వొనిదావదోషమో॥

విశేషమేమనఁగా నీతఁడు తన ప్రభువగు నరికేసరియొక్క పరా
క్రమాదికమును ముఖ్యముగా నీగ్రంథముమూలమున గీర్తింపఁదలఁచిన
వాఁడగుటచేతను, పరాక్రమవిషయమున భారతమున ప్రధానపురుషుఁ
డర్జునుఁడే యగుటచేతను, వ్యాసభారత కథను స్వీయోద్దేశమున కను
కూలమగునట్లుగా మార్చికొని తన ప్రభువగు నరికేసరికి నా యర్జునునితో
నభేదము నాపాదించి, యాభారతకథను 'విక్రమార్జునవిజయ'మను
పేర కన్నడభాషలో రచించెను. అనఁగా పంపకవి దృష్టిలో భారత
కథయందు ప్రధానమైనవిషయ మర్జునవిక్రమమన్న మాట. తద్విక్రమా
ర్జితరాజ్యమును నాతనికే పట్టముగట్టెను. మఱికొద్దికాలమునకె యాంధ్ర
భాషలో నన్నయభారతమును రచింపఁదలఁచినప్పుడు తనకుఁ బూర్వ
మున రచించిన యీతని గ్రంథమును జదివియుండును. కవితావైఖరి
విషయమున నీతని ననుసరించియుండె ననుటకును సందేహము లేదు.
సంస్కృతవృత్తములను ధారాళముగా దెనుఁగున రచించుటలో నీపంప
భారతమే యీతనికి మార్గదర్శకంబై యుండును. సంస్కృతప్రాకృత
కర్ణాటాంధ్రభాషయందు కవిరాజశేఖరుడైన నారాయణభట్టీతనికి
స్నేహితుఁడు సహాధ్యాయుఁడునుగదా. భారతరచనయం దీతనికిఁ
దోడయి యుండెనుగదా. ఈతఁడును సకలభాషావాగనుశాసనుఁడు.
చాళుక్యరాజులకుఁ గులబ్రాహ్మణుఁడై యుండుటచేతను నాకాలమున
నీదేశమునకుఁ గన్నడదేశముతో నెక్కుడు సంబంధ ముండుటచేతను,
కన్నడభాషలో నీతఁడు బాగుగ పాండిత్యము గలిగియుండు ననుటకు
సందేహము లేదు. ఆంధ్రమున తొలుత నట్టి యుద్గ్రంథమును రచింప
దలఁచినవాఁడు తనకు పూర్వము సన్నిహితభాషలలో నున్న గ్రంథము
లను ముఖ్యముగా పంపని భారతమును జదువక యుండఁడు. కాని
భారతరచనలో నీతని యుద్దేశము వేఱయినది. ఈతని నీగ్రంథ

రచనకు ప్రోత్సహించిన ప్రభువుయొక్క యాదర్శములును వేఱు. ఈతఁడు ధర్మధురంధరుఁడు, మనుమార్గవర్తనుఁడు, సమస్తవర్ణాశ్రమ ధర్మరక్షణమహామహిముఁడు, కావ్యగీతిప్రియుఁడు. పురారాతి పదాబ్జ పూజాసక్తమతి. ఇట్టి చాళుక్యకులావతంసునిచే ననేక భాషాపండితుల సమక్షమునఁ బ్రార్థింపఁబడినవాఁడై యామహారాజు కోరిక దీర్చుటకుఁ గడంగెను. ఇట్లు నన్నయ భారతమును రచించినది యొకమహారాజుకోరిక చెల్లించుటకుఁ బండితులప్రీతికొఱకు, వైదికమతవ్యాప్తి కొఱకు నైయున్నది. "సర్వవేదశాస్త్రముల యశేషసారంబని భారత బద్ధస్పృహులగువారికి బహుయాగఫలంబు గలుగునని, గోశతంబు వేదవిప్రులకు దానము చేసినఫలంబు గలుగునని, ధర్మవేదాంత నీతిపురాణేతిహాసలక్షణములన్నియుఁ గలిగి విశ్వజనీనమై పరగుచున్నదని తలంచి యీభారతసంహితారచనబంధురుఁడైనాఁడు. కావ్యనాటకములు పెక్కు వినిన రాజు, మహాకవితార్కికవైయాకరణపౌరాణిక బృందంబుతోఁ గూడిన విద్వత్సభయును, వ్యాసరచితభారతమునే, యవిరళజప హోమతత్పరుఁడు, సంహితాభ్యాసుఁడునగు నన్నపార్యుని దృష్టిపథమున నున్నవి. అట్టిరాజును, నా విద్వజ్జనమును మెప్పించుటయే యాతనిపని. స్వయముగ వైదికాధ్యయనసంపత్తి కలవాఁడగుటచే నాపని యాతని కత్యంత ప్రియమైనది. భారతమును వైదికదృష్టితోఁ జూచి దానికిఁదగినట్లు జగద్ధితమునకై రచించినాఁడు నన్నయ్య. తిక్కన యద్వైతభావదృష్టితోఁ జూచి, కావ్యకళాదృష్టితో నాంధ్రావళిమోదముం బొరయుటకుగా రచించినాఁడు. ఆయాదేశములం దా యాకాలముల నాయాకవుల దృక్పథములనుబట్టి వారువారు చేసిన భారతరచన ఇట్లాయాకాలములం దాయారూపములను బొందుట తటస్థించినది. రాజ్యపరిస్థితులనుబట్టి కన్నడభాష, క్రమపరిణామ

మను బొంది రాష్ట్రకూటుల ప్రోత్సాహముచే నేడెనిమిది శతాబ్దములకుఁ బూర్వమే గ్రంథరచనకుఁ దగినస్థితిలోనికి వచ్చిన తెల్గు ఆంధ్రభాషయు నాంధ్రశాలంకాయన, విష్ణుకుండి, చాళుక్యాది రాజుల ప్రభుత్వకాలమున నాయామార్పులకు లోనై క్రమపరిణామమును బొందుచువచ్చి యెనిమిది తొమ్మిదిశతాబ్దముల నాటికే గ్రంథరచనకుఁ దగినస్థితిలోనికి వచ్చినది. శాసనములలో గద్యపద్యరచన ప్రారంభ మైనది. చిన్నగ్రంథములును బయలుదేరి యుండును. కాని తుదకు భాషలోని వెనుకటి చిల్లరగ్రంథముల నణఁగద్రొక్కివేయఁగల యుద్గ్రంథమును రచించి యాదికవి యను విశాలకీర్తిని బడయు మహాపుణ్యము నన్నయకును, అట్టిగ్రంథము రచించుటకుఁ గారకుఁడై యాంధ్రభాషకు మహోపకారముచేయఁగల పుణ్యము రాజరాజునకును దక్కినవి.

పై శాసనములోని "విజయాదిత్య పాదపద్మభ్రమరాయమాణా," "గుణగణాభరణాభ్యాం," "చౌష్షికలావిశారదుణ్ణు," మహేశ్వరపక్షపాతి దేవబ్రాహ్మణ గురుభక్తిపరుణ్ణు"—ఈ మొదలగు సమాసములు నన్నయ యనశారికను దలపించుచున్నవి. ఇది యొకవేళ 'సర్వసామాన్యంబగు రచనాశైలి కాక శిష్టరచనాపద్ధతియే యైనను, ఇది నన్నయకు రెండుశతాబ్దములు పూర్వమే యేర్పడి యున్నదనుట నిశ్చయము.

ఈ విజయరాజు తరువాత వచ్చిన చాళుక్యభీముని కాలపుశాసనమునందు గద్యపద్యాత్మకంబై కొంచెము దేశ్యపదము లెక్కువగాఁ గలిగియున్నను ముత్తమువీద పైశైలినే పోలి మఱింత కావ్యపద్ధతి దలపించుచున్నది.

## చాళుక్యభీమమహారాజు శాసనము

స్వస్తి సర్వలోకాశ్రయ......క్యభీమమహారా(జులవి) జయ రాజ్య సంవత్సరంబు [యే?] నగు నేణ్టి ఉత్త (రా) యన స(ంక్రా)న్తి స్తితిధర్మార్థ పురమ్మున......(స్వస్త్య) నేకగు (ణ) గణాలంక్రిత (స) మస్తమహీమణ్డల ప్రకాశితకీర్తి శ్రీమత్పండరంగు॥

అని గద్యమున పండరంగునిగూర్చి చెప్పినపిదప నాపండరంగుని విజయములు పరాక్రమాదికము ఒక సీసపద్యములోఁ గావ్యపద్ధతిని వర్ణింపఁబడియున్నవి.

" ల + నెన్నేలు నలరామనిభునితోట
నెడఁటి (నబో) యలనడవిసా(న్పె)
లోహాసనం బెక్కి రాహాను నొడిచిన
వల్లభుకొల్పన నెల్ల నెఱుంగ
కన్నరాభూపతి వెన్నాజిలోం జూచె (పె?)
సంకిలండను కేని బింకముడిచె
దణ్డువై వచ్చిన బైణ్డౌనచోఅనిం
జేకొనికాచె భూ(లోకం) బెఱుంగ
కిరనపురముడహాలనిరుతంబుద లెనాండు
నచలపురముసొచ్చె నచలితుణ్డు
వల్లభుణ్డుగుణాకె నల్లుణ్డు వన్నినం
బణ్డురంగచూనె పణ్డరంగు.

[నాబ] ర [ర]

నరెయమ జెవో నాన్నినల్లాతణ్ణయ్న అయ్యపరాజుతమ్ముణ్ణు
బెజెయరాజు ఈ పురమున నీ శాసనంబు గుడినిల్పె నడియసేయ
కున్న సే.........".

వర్ణనాంశమును మధ్య నొకపద్యముగా జెప్పి యద్దానిని 'నాబ
రగి' యని తరువాతి గద్యముతోఁ గలుపుట చంపూకావ్యపద్ధతిని
భారతకవుల రచనాపద్ధతినిఁ దలపించుచున్నది. 'అనేకగుణగణాలం
కృత సమస్తమహీమండల ప్రకాశితకీర్తి" అను నిట్టి దీర్ఘ సమాసము
లున్నను, సీసపద్యమంతయు చాలవరకు దేశీయపదములతో నిండి
యున్నది. ఎడఱిన, ఒడిచిన, కొల్పు, బింకముడిచె, మొదలగు ప్రాచీన
దేశ్యప్రయోగము లిప్పుడు మాఱురూపుజెందిన విందు కొన్ని గలవు.
ఇందలి సీసపద్యపాదములందు సర్వత్ర ప్రాసయతియ గనఁబడుచున్నది.
దీనికిఁ దరువాతికాలముననను నన్నయ కించుక పూర్వముననను బయలు
దేరిన "దీర్ఘాసి" శాసనములోఁగూడ నీ నియమమే పాటింపఁబడినది.
కావున నన్నయభారతమున సీసపద్యములలోఁ బాటించిన సాంప్ర
దాయ మాతనికిఁ బూర్వము ౧౫౦ సం॥ లనుండియు వచ్చుచున్న
దనుట స్పష్టము. కాని యిది యేకారణముననో నన్నయతరువాత నంత
రించిపోయినది. ఆతనితరువాతి కవు లీనియమమును పాటింపలేదు.
ఆ శాసనపద్యరచనను గమనింపుడు.

దీర్ఘాసిశాసనము

" శ్రీశకవర్షంబులు భూసతిపైశైల, నందాబ్జభవసంఖ్యనొందవేంగి
దేశంబు గిమిడియ గోసల గ్రిడిసింగి, దేశంబు మఱియొడ్డదేశ మనగ
జనిన భూపాలురనని నొచ్చె చలమర్తిఁ, గణ్డడైనెగడినమణ్డలికణ్డా-
భూసురవంశుండు వాసవనిభభోగి, బఃాపతిసౌజన్యగుణయుతుణ్డు

దీర్ఘాసిధగవతిదేవి దేవాలయా, మునముంద టంగడు ఘనతరముగ
మణ్డపమెత్తించె భణ్డనవిజయుండు, గణ్డగోపాలుణ్డఖణ్డవత్తి
దీవియవెట్టె నద్దేవికి నవ్వేల, దనమనోవల్లభినజనేత్రి
దీవియవెట్టె బద్మావతియును (నా) శ్రీ, ణీనశశులుగలయంతకును
మదమున.

గగనభూమిచంద్ర ఖరకరోదకశిఖి
మారుతాత్మమూర్తి మహిషమథన
యి [ష్టపూర్తి] ఫలము లెల్ల కాలంబును
మెచ్చుతోడ దమకు నిచ్చుచుండు".

ఈ పద్యరచనాశైలికిని నన్నయరచనకును విశేషభేదమేమియుఁ గనఁబడదు. దీనినిబట్టి నన్నయకాలపు భాషాసాంప్రదాయము లెగాక యతనిచేఁ బాటింపఁబడి తరువాత తెలుఁగుకవితలో నంతరించిన దేశీయ ఛందస్సాంప్రదాయ విశేషములుకూడఁ గొన్ని యాతనికిఁ బూర్వము నూరునూటయేబది సంవత్సరములనుండి వచ్చుచున్నవని తెలియుచున్నది.

ఇట్టివానిలో మఱియొకటి యక్కరపద్యరచన. వీనిని నన్నయ తరువాత నాతని యారణ్యపర్వభాగపూరణసందర్భమున నెఱ్ఱాప్రెగ్గడ యొక్కఁడు రచించినేగాని మఱియెవ్వరును రచించినట్లు కనఁబడదుకాని నన్నయకు నూరుసంవత్సరములక్రిత మాంధ్రభాషలో రచింపఁబడిన యుద్ధమల్లుని శాసనములో మాత్ర మీపద్యములు కనఁబడుచున్నవి. కన్నడభాషాకవిత్వమున నీరీతిపద్యములు విశేషముగా రచింపఁబడి యుండుటచేతను, సంస్కృతమం దిట్టివి లేకుండుటచేతను, నివి దేశీయసాంప్రదాయమునుబట్టి వచ్చినవే యని యూహింపఁదగియున్నది. కన్నడ వాఙ్మయములోఁగూడ నీ'యక్కర'పద్యము లింతకుఁబూర్వమే వాడుక

లోనికివచ్చి, తెలుఁగుభాషలోపలనే 13 వ శతాబ్దమునకే యంతంరిచుట నాఁటియొక విశేషము.

## యుద్ధమల్లునిశాసనము

1. స్వస్తినృపాంకుశాత్యున్తవత్సల-సత్యత్రిణేత్ర
   విస్తరశ్రీయుద్ధ మల్లుణనవద్య-విఖ్యాతకీర్తి
   ప్రస్తుతరాజాశ్రయుణ్డు త్రిభువనా-భరణుణ్డు సకల
   వస్తుసమేతుణ్డు రాజ సల్కి-భూ-వల్లభుణ్డర్తి.

2. పరగంగ బెజవాడం గొమరస్వామికి-భక్తిన్దొగుడియు
   నిరుపమమతినృపధాముణ్డెత్తిచ్చె-నెగిదీర్చెమఠంబు
   గొరగల్గాకొరులిన్దు విడిసిబృన్దంబు-గొనియుణ్డువారు
   ×రిగాక యబ్బారనాసిరవచ్చిన-పాపంబుగొన్దు.

3. వెలయంగనియ్యొట్టు డస్సినులినుకై-విడిసినబ్రోల
   గలతౌనపతులును రాజుపట్టంబు-గట్టినపతియు
   నలియబై యార్వరల వెల్వాటించిన-నశ్వమేధంబు
   ఫలంబుపేక్షించినలింగంబడిసిన-పాపంబుదమకు.

4. జనసుతచేబ్రోలనుణ్డి బెజవాడ జాత్రకువచ్చి
   త్రినయనసుతుడొండు పోటుమెచ్చకతివిరియిన్నెలవ
   యనఘుండు సేకొని యిందు బ్రత్యక్షమైయున్న నిచ్చ
   గని మల్లణ్డెత్తించెగుడియు మఠంబునుంగార్తికేయునకు.

5. రమణతో బెజవాడకెల్ల బెడంగును కతుయుగాను
   న్దమతాతమల్లపరాజు వేరడు దానుంగట్టించెం
   గ్రమమున దానికి కలశమిడ్డట్లుగా మొగమాడు
   నమరంగ శ్రీయుద్ధమల్లు డెత్తించె నమితతేజుండు."

పై దీర్ఘాసిశాసనపు భాషకును దీనిభాషకును సంస్కృత సమాస పదముల ప్రయోగవిషయమున విశేషభేదము లేదుగాని, మొత్తము మీఁద దీనియందు వెనుకటిదానికంటె దేశీయతాగుణ మెక్కువగా నున్నట్లున్నది. దీర్ఘాసిశాసనములో తత్సమభాషయెక్కువగానున్నది. ప్రయోగింపఁబడిన దేశ్యములోనైనను ప్రాచీనరూపములు, క్రొత్తవిగా గనబడునవియు లేవు. యుద్ధమల్లునిశాసనములో సంస్కృతదీర్ఘ సమాసములు పదములు లేకపోలేదు. కాని కొన్ని ప్రాచీనపదములు గలవు. 'నెగిదీర్చెమహంబు, లింగంబకెసిన, ఒండుసోటు మెచ్చక, ఇడ్డట్లు, తివిరియన్నెలవ, వేరడు, మొగమాఁచువు- మొదలగు పదములం దొకవిధ మగు నాంధ్రదేశీయత యచ్చుపడియున్నది. కావుననే దీర్ఘాసిశాసన పద్యమువలె నంతసులభముగా నిది యర్థము కాకపోవుట. దీర్ఘాసిశాసనము నన్నపార్యుని తత్సమభాషను విశేషముగాఁ బోలియుండ నిది నన్నెచోడ తిక్కనాదులయు, శైవకవులయు భాషను పోలియున్నదని చెప్పవచ్చును. ఆంధ్రవాఙ్మయమున మొదటిదై నిలచిన భారతమును నన్నయ తత్సమబహుళముగా-సంస్కృతబహుళముగా రచించుటచే నెప్పటికిని మార్పుజెందని సంస్కృతబహుళంబగుభాషకే మన మెక్కువగా నలవాటుపడుటచేతను, తరువాతి ప్రబంధకవులందఱు నీశైలినే యాదరించియుండుటచేతను, నన్నెచోడ, తిక్కనాదుల గ్రంథములలోని దేశీయభాష మన కిపుడు సులభముగ నర్థముకాని క్రొత్తభాషగాఁ గనఁబడుచున్నది. యుద్ధమల్లునికి ౭౦, ౮౦, సం॥ముల పూర్వముననే గుణగవిజయాదిత్యుని కాలమున బయలుదేరిన ధర్మవరపుశాసనములందు నన్నయకవితనుబోలిన కేవల తత్సమబహుళంబగు రచన గానవచ్చుచుండ, నాతని యీ బెజవాడశాసనము కొంతవఱకు దీర్ఘసమాసములు కలదైనను, దేశీయపదబహుళంబై యుండుటనుబట్టి

నన్నయకుఁ బూర్వమే యీ రెండువిధములగు రచనారీతులును వాడుకలోఁ నుండినట్లూహింపఁదగియున్నది. నన్నయ భారతరచనకు గడంగినప్పటి పరిస్థితులు ఆతని యుద్దేశములు ఆతని సంస్కృతాదిభాషాపాండిత్యము మొదలగునవి యాతనిని తత్సమబహుళంబగు సంస్కృతభూయిష్ఠరచననే చేయునట్లు ప్రోత్సహించియుండును. కావున నీతఁడు సంస్కృతపదజాలము నాంధ్రభాషయం దపారముగాఁ గలిపివేసి పైశాసనభాషలోఁ గానవచ్చిన ప్రాకృతవికారములు లేని చక్కని శైలిని గూర్చికొని, భాష కపూర్వమగు నొకరీతి మార్దవమును సంపాదించిపెట్టి, యీభాష 'Italian of the East' అను పొగడ్తకుఁ దగినదానినిగాఁ జేసెను. ఇదియె తరువాతికవులకు శిష్టకవితాపద్ధతి యైనది. నన్నయభట్టు ఆంధ్రభాషను వ్యాకరించి, వ్యాకరణము రచించినను లేకున్నను, భాషాప్రయోగవిషయమున నీతఁడు చేసిన యనుశాసనముచేతనే యాంధ్రభాషావాగనుశాసనుఁ డను బిరుదమునకుఁ దగినవాఁడైనాఁడు. ఇంతకుఁబూర్వపుశాసనములలోనిభాష యెంత 'గాసటబీసట'గా నున్నదో మనము చూచియే యున్నాము. ఒకదానిలోనిభాష మఱియొకదానితో సరిపోదు. క్రొత్తక్రొత్తపదములు క్రొత్తక్రొత్త రూపములతో ననేకవిధములఁ గానవచ్చుచుండును. భాష వ్యవహారమున మాత్రముండి యందు సర్వజనాదరణీయంబై ప్రామాణికత్వమును బడయఁగలిగిన వాఙ్మయము బయలుదేరని కాలమున నీస్థితిలోనె యుండును. ఏప్రాంతమున నేరూపములు వ్యవహారమందుండునో యవి యాప్రాంతముల రచింపఁబడిన శాసనములలోనికెక్కుట తటస్థించును. ఒక్కపదమునకె యనేకరూపములు వ్యవహారమున నున్నప్పు డొక్కశాసనముననే యాపదమునేకరూపములఁ గనఁబడుచుండును. ఇందుకు పైశాసనము[illegible] బహువచ





సాంతరూపములె ప్రబలమైన నిదర్శనము. కొన్ని పదములు చివర ఁ
మఱికొన్ని 'గదు' 'క్,' కు, లు, లతో గూడి యనేకరూపముల
గానవచ్చుచుండినవో యింతకుపూర్వము చూపియేయున్నాను.
మాడ్లు, ఊడ్లు, గుడ్లు, దేవడ్లు ఇట్టిరూపములన్నిటికిని నన్నయ
మాణికరూపమును గల్పించియుండును. బహువచన ప్రత్యయ
కావలసి వ్యవహారమునఁ గలిగిన వికృతరూపములన్నియు పోయి
అను రూపము ప్రామాణికరూపమైనది. రాముణ్ణు-దేవడ్లు మొద
రూపములకు వర్ణసమీకరణవిధానముచే నేర్పడిన 'రాముండు' దేవు
అనురూపములే నన్నయచే గ్రహింపఁబడి ప్రామాణికత్వమును బడసి
మగణ్ణు, 'అచ్చువాణ్ణు' మొదలగు రూపములనుండి గ్రహింపబడిన మగ
అచ్చువాణ్డు అనురూపములే నన్నయచే నాదరింపఁబడి వాడుకయ
స్థిరపడినవి. ప్రతమ(ప్రతమరాజ్యంబున)– స్తితి–తౌనపతులు, పెడ
పదేన్దుంబు, కళిదు, మొదలగు వ్యావహారిక రూపములు నన్నయ యా
మును బడయకపోవుటచే ప్రామాణికత్వమును బడయక, తరువాతి
మున వ్యవహారములోఁగూడ క్రమముగా నంతరించినవి. 'చే
చూసిన' యను రూపములుమాత్ర మిప్పటికిని వ్యవహారములో నున్న
'సర్వబాదపరి యారువు'–మహానభియుళ్' మొదలగు ప్రాకృతసంస
రముతోఁ గూడిన రూపము లాశాసనము రచింపఁబడినకాలములో వ
హారమున నున్నను, తరువాతి శాసనములలోనే కనఁబడుట లేదు. ఆ
వానిని నన్నయ యాదరించనేలేదు. పదేన్దుంబు, కంబురాం చెఱు
మొదలగు పదములలోని 'బ' కారములు మకారములై తుంబు–తూ
కంబుర–కమ్మర, ఈరీతిని మార్పుజెందినవి. వీంగు వీండు, వాంఢ
మూండు అని దీర్ఘముపై నిండు సున్నగల పదములు శాసనములలో ;
నున్నలేక నిండుసున్నతోఁ గూడినవిగానుండ, వీని యుచ్చారణమ

శైథిల్య మా నాటికే కలుగుటచే నన్నయ వీని నట్లే యాదరించినాఁడు. కాని నిండుసున్నరూపముకూడ మిగుల ప్రచారములో నున్నదనుటకు నన్నెచోడాదు లద్దానిం దరువాతికాలమున గ్రహించుటయే నిదర్శనము. ఇట్లు నన్నయకుఁ బూర్వపుశాసనములభాష యొకరూపమున ప్రామాణ్యమును బడసినదికాక వ్యవహారమున భిన్నరూపములు గలదై యుండ, తనకాలమునకుఁ బలువురుశిష్టులచే నంగీకరింపఁబడి తనమండలమున వ్యవహరింపఁబడుచున్న భాషారూపములనే గ్రహించి నన్నపార్యుఁ డొక యుద్గ్రంథమును రచించినవాఁడగుటచేతను, ఆభాషయే దేశప్రభువును భాషాభిమానియునగు రాజనరేంద్రుని యంగీకారముద్రను ఆతనికొల్వులోని సర్వవిధ పండితజనసమాదరణగౌరవములను బడసినదగుటచేతను ఆంధ్రభాష. కీతని రచనమూలముగా నొకవిధమగు ప్రామాణికత్వము సిద్ధించినది. ఈతనిగ్రంథము ప్రమాణగ్రంథమైనది. ఈతఁడు వాగనుశాసనుఁ డైనాఁడు.

అయితే యీశిష్టభాష, తత్సమరూప బహుళంబగు భాష, సంస్కృతసమాసభూయిష్ఠంబగు భాష—పండిత జనసమాదరమును బడయుచున్నను, సర్వజనసామాన్యంబుగాకుండుటచే వ్యవహారమునకుఁ గొంత దగ్గరగానుండి దేశ్యపదబహుళంబగుభాష నే గ్రహింపవలయునను వాదమొకటి తరువాతికవులలో బయలు దేరినది. దీనినే నన్నిచోడ సోమనాథాదులు జాను తెనుఁగను పేరున వ్యవహరించినట్లు కనఁబడుచున్నది ఇది వీరు స్వయముగాఁ గల్పించినదికాక నన్నయకుఁబూర్వమున నే జనసామాన్యముచే నాదరింపఁబడుచుండి, గీతములు, గౌడుగీతములు, ద్విపదలు, షట్పదులు, పర్వతపదములు; వెన్నెలపదములు, గద్యంబులు, పాటలు మొదలగుననేకరూపములనుండిన దేశీయకవితయం దవలంబింపఁబడిన శైలియై యుండుననుటకు సందేహము లేదు. కాని విశేషమేమనఁగా నన్నయా

దుల సంస్కృతబహుళంబగు శైలి ప్రబలినతోడనే యా జాను తెనుఁగు–కేవల దేశ్యపదభూయిష్ఠంబగు శైలి యంతరించినది. ఆపాటలు, పదములు మొదలగు దేశీయకవితకు ప్రభుత్వావలంబనము, శిష్టజనాదరణము లేక పోవుటచే, పామరజన, స్త్రీజనముల పాలఁబడి గ్రంథస్థము గాక కాలక్రమమున నంతరించుట తటస్థించినది. ఇప్పటికా కవితా శైలి కొన్ని శాసనాదులలోను, పనిపట్టి యచ్చటచ్చట రచించిన నన్నిచోడ, సోమన, తిక్కనాదుల గ్రంథములలోను మాత్రమే గానవచ్చుచున్నది. పనిపట్టి యననేలయనఁగా, నీ నన్నిచోడాదులు దేశికవిత జాను తెనుఁగున నె రచింపవలయునని తాము శాసించుచునే సంస్కృతదీర్ఘ సమాసముల తోఁగూడిన రచననుగూడ సందర్భానుకూలముగనైనను ధారాళముగా చేయుచువచ్చిరేగాని, దానిని విడనాడలేకపోయిరి. అనగా నాకాలమునకె తెలుఁగుభాషపై సంస్కృతభాషాప్రభావమట్టిదై యున్నదని తెలియుచున్నది. అప్పటికె దృఢంబగు సంస్కృతభాషాశ్రయము లేక దేశితెలుఁగుభాష స్వతంత్రముగ నిలువలేనంతటిస్థితిలోనికివచ్చినదన్న మాట. తిక్కనమాట యెటులున్నను, ఈ శైవకవులు సంస్కృతభూయిష్ఠరచనను నిరసించుచునే తాము దానిని వదలలేకపోయిరనుటనుబట్టియే, యీ సంస్కృతభాషకును, సంస్కృతాలంకారికపద్ధతులకు, నాకాలపు టాంధ్రభాషాకవితలపై నెట్టిగట్టిపట్టు చిక్కినదో వ్యక్తమగుచున్నది. తిక్కనార్యుఁ డీజాను తెనుఁగు పేరెత్తకయే దేశ్యబహుళంబగు రచనను చేసినాఁడు.

ఇక నన్నిచోడుఁడు దేశికవిత్వపక్షము నవలంబించి, దీనికిఁ బ్రతికక్షులగువారిని అనఁగా "మార్గమువదలంగ మదిదలంపని" వారిని కుకవులని నిందింపవలసినవాఁడగుటనుబట్టియే, యాతనికాలమున దేశికవితావిషయమున మార్గకవుల కెట్టి నిరసనభావము కలదో మన మా

హింపవచ్చును. ఇంతకుపూర్వము నన్నపార్యుని భారతరచనా సంద
ర్భమున సంభవించిన ఘోరరణముకూడ ఈ మార్గదేశిపద్ధతులకుఁ దత్ప
క్షావలంబకులకునై యున్నది. ఈరణమునందు నారాయణభట్టు దేశి
కవితాపక్షమునే యవలంబించి, కన్నడభాషాకవిత ననుసరించి రచింపు
మని నన్నయను హెచ్చరించుచు, నాతనికిఁ దోడయి నిలచెను.
నన్నయయు కన్నడకవులవలెనే సంస్కృతబహుళంబుగ రచింపఁదొడం
గుటచే మార్గకవితాపక్షమువారితో నొకవిధమగు సమాధానము కుదు
ర్చుకొని మూఁడుపాళ్లు సంస్కృతము నొకపాలు దేశ్యమును గలిపి దేశి
కవితలోనే భారతమును రచించెను, కావుననె రాజాస్థానమునందలి
పండితసమాజమును మెప్పింపఁగలిగియుండును. వారిలో కేవలము
మార్గకవితాపక్షపాతులగువా రీతని కవితయందలిఁ యక్షరరమ్యత
నాదరించి సంతృప్తిఁ జెందియుందురు. కాని తరువాతి యాంధ్ర
కవులలో పలువురు (ముఖ్యముగా ప్రబంధకవులు) ఈమార్గమునే
యవలంబించి తమకుఁ గల సంస్కృతభాషా పాండిత్యప్రకర్షను మఱిం
తగాఁ బ్రకటించుకొన యత్నింప, మఱికొందఱు, ముఖ్యముగాఁ
ప్రాచీనశైవకవులు పండితులమెప్పునకై గాక జనసామాన్యముకొఱకై
రచించినవారగుటచేఁ దమ రచనలను దేశ్యపదభూయిష్ఠంబుగఁ జేసి
ప్రాచీనాంధ్రభాషా స్వరూపమును కొంత నిలిపినవారైరి. ఇట్టి కవిత
నిజముగ తిక్కనసోమనాథాదులతోనే వెనుక బట్టినది. కాని తరు
వాతి కవులలో నొకవైపు సంస్కృతపు వెఱ్ఱి ముదిరినట్లుగనే, మఱి
యొకవైపున నచ్చతెనుగువెఱ్ఱియు ముదురుటచే నాపేరుతో నొకవిధ
మగు కృత్రిమభాషాకవిత్వము బయలుదేరుట తటస్థించినది. నన్నెచో
డాదుల దేశికవితలోని జానుతెనుఁగుమాత్ర మిట్టిదికాదు. జానుతెనుంగు
కవిత్వమునుగూర్చి నన్నెచోడుని భావములను దిలకింపుము.

"సరళముగాగ భావములు జానుదెనుంగున నింపు పెంపుతో
బిరిగొన వర్ణముల్ ఫణితిపేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మృదుమధుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలగాన్."

ఇక్కడ భావములు సరళముగా జానుదెనుంగున నింపై యుండ వలెనని చెప్పెను, గాని వర్ణములఫణితి, ప్రాణముల మృదుమధుత్వరసము, అక్షరములు, సూక్తులు నార్యులకుఁ గర్ణరసాయనంబులై యుండుట, నీమొదలగునవి యాతనిదృష్టి కవితయొక్క బాహ్యస్వరూపమునందే దగుల్కొని పండితులను మెప్పించుమార్గమునె యన్వేషించుచున్నట్లున్నది. నన్నయ యక్షరరమ్యతచేతను వలెనే యాతఁడును అక్షరములను సూక్తులను పండితులకు గర్ణరసాయనముగ రచియించి వారిమెప్పు బడయఁదలఁచినవాఁడువలె నున్నాఁడు. ఇంతేగాక సంస్కృతాలంకారిక పద్ధతులననుసరించిరీతిగుణభావరసాలంకారాదులతోను, అష్టాదశవర్ణనలతోను గూడిన ప్రౌఢకావ్యములను "ప్రబంధముల"ను పేర రచించు నలవాటుకూడ నీనన్నెచోడుని కాలమునుండియే బయలుదేరినది. కావ్యలక్షణమునుగూర్చి చెప్పుచు

"మృదురీతిసూక్తు లింపొదవింప మేలిల్లు
భావమ్ము లెలమి క్రీడావహముగ
మెఱుగులఁ గన్నులు మిఱుమిట్లు వోనంగఁ
గాంతిసుధాసూతి కాంతిఁ జెనయ
వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ
రసములు దళుకొత్తి రాలువాఱ
దేశిమార్గంబుల దేశీయములుగా న
లంకారములఁ దా నలంకరింప

నాదరించి విని సదర్థాతిశయముల
బుధులు నెమ్మనమున నిధులు నిలుప
వలవదే రచింప పరకవీశ్వరునకు
నూత్నరుచిర కావ్యరత్నవీధి"

అని దేశిమార్గంబులందు దేశీయపద్ధతినే యనుసరించి జానుతె
ను రచింపవలెనని యాతని ముఖ్యోద్దేశమేయైనను, ఈతఁడవలం
న దేశీయమార్గము నాదరించి విని (దేశికావ్యముల నాదరించి
వారే యుండరని యాతని సందేహము కాబోలు! నటిస్థితి యా
ముననుండ నోపు) పండితులు నెమ్మనమున సంతసింపవలయునని
చినవాఁడగుటచేతనే, ఆలంకారికపద్ధతిని వర్ణనలతోడను అలంకా
ములతోను సంస్కృత దీర్ఘసమాసములతోను, అపూర్వకల్పనల
డను నింపి దీనిని ప్రకృష్టమైన బంధముగల కావ్యముగా—ప్రబం
గాఁ జేసినాఁడు. ఆంధ్రప్రబంధ మహావృక్షముయొక్క మూల
మిదియే యని తెలుసుకొనవలసియున్నది.

"చతురోక్తుల నుతపదబహు
గతుల నలంకార భావకాంతి రసార్థో
న్నతిఁ గృతినతి రసికులు వర
సతిగతి నెఱిగింపవలదె సౌభాగ్యమునన్."

'పదబంధంబుల నగ్గలించి బుధశబ్దభ్రాజియై సద్గుణా
స్పదమై దుష్కృవిహృత్సరోజవనముల్ భంజింపుచున్ భూరి స
మ్మదలీలన్ విలసిల్లి సత్కృతి జగన్మాన్య ప్రభావంబునన్
మదనాగంబును బోలెఁ గ్రాలవలదా మాటెందు లేకున్నతిన్."

ముదమున సత్కవికావ్యము
నదరగ విలుకాని పట్టి నమ్మును బరహృ
ద్భిదమై తల యూపింపని
యదికావ్యమె మలరిపట్టినదియుం గరమే.

"జంగమమల్లికార్జును నిసర్గకవిస్తవనీయసూక్తియు
క్తిం గొనియాడి సత్కవితఁ గేనము లేకను రక్తయైన భా
షాంగనఁ దక్కఁ గేలిన మహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా
భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబుగాన్."

కావున నాంధ్రవాఙ్మయక్షేత్రమునఁ బ్రబంధబీజములఁ జల్లిన వారిలో మొట్టమొదటివాఁ డితఁడె యని తలంపఁదగియున్నది; తిక్కనార్యుఁ డీతని గ్రంథమునుజూచినను జూడకున్నను, తరువాతివాఁ డగుచున్నాఁడు. అయితే నన్నయ తిక్కనలనువలె తరువాతి కవులెవరు నీతనిని బేర్కొనకుండుటచే, నీతఁడా ప్రబంధశాఖకు మార్గదర్శి యని చెప్పుట కవకాశము మాత్రము కలుగుటలేదు.

ఇఁక నీనన్నెచోడుఁ డవలంబింపవలయునని చెప్పిన జాను తెనుంగనునది సంస్కృతపద బాహుళ్యముతోఁ గూడిన రచనకు భిన్నమై దేశీయ పదభూయిష్ఠంబగు రచనయైనట్లు పాల్కురికి సోమనాథుని వృషాధిపశతకములోని యీ క్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

"బలుపొడతోలు సీరయును బాపసరుల్ గిలుపారు కన్ను వె
న్నెల తలసేదుకుత్తుకయు నిండిన వేలుపుటేరు, వల్గు పూ
సలుగల ఏని లెంకపని జాను తెనుంగున విన్నవించెదన్
వలపు మదిం దలిర్ప బసవా బసవా బసవా వృషాధిపా.

తా నిట్టి జానుతెనుంగును, ద్విపదరచనను, అవలంబించుటకుఁ గల కారణము నిట్లు చెప్పుచున్నాఁడు.

"ఉరుతర గద్య పద్యోక్తులకంటె
సరసమై పరగిన జానుఁదెనుంగు
చర్చింపగా సర్వసామాన్య మగుట
గూర్చెద ద్విపదలు కోర్కి దైవార."

—బసవపురాణము.

" ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృతభూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబుగామి
జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు."

గద్యపద్యాది ప్రబంధపూరిత సంస్కృతభూయిష్ఠరచన సర్వసామాన్యముగాకుండుటయు జానుదెనుంగున ప్రసన్నత కలుగుటయు నిశ్చయమేగాని, పై వృషాధిపశతక పద్యములోని భాష యిటీవలికాలపు టచ్చతెలుఁగు గ్రంథములను దలపించుచున్నది పలెనున్నది. జాను తెనుంగిట్టిదియని చూపుటకుమాత్రమే సోమనాథుఁడైనను ఆపద్యమును రచించినాఁడుగాని తన కావ్యములలో ధారాళముగా సంస్కృత పదములను వాడకపోలేదు. అట్లని తెలుఁగుపలుకుబళ్లను, దేశీయశైలిని వదలనులేదు. దేశీయతకొఱకు గ్రంథమును వికృతంపుటాచ్ఛికసమాసములతో నింపనూలేదు. నన్నయాదులవలె విశేషము సంస్కృతపద భూయిష్ఠముగను చేయలేదు. కావలసినంత సంస్కృతమును గ్రహించి తెలుఁగుపలుకుబడికిఁ దగినట్లుగా దేశీయ సంప్రదాయానుసారము దేశికవిత రచించి సామాన్యజనులకు సుబోధంబగునటుల రచించినాఁడు.

ఇట్లు జనసామాన్యమున మతవ్యాప్తికై "లోకహితార్థంబుగ' రచించుటయే ప్రధానోద్దేశమైనను, యీతనికిఁ గావ్యకళాదృష్టియు లేకపోలేదు. తన కాలమునందలి పండితులు తనరచనలనుజూచి యేమం దురో, మెత్తురో మెచ్చరో యను సంకోచమును లేకపోలేదు. సం స్కృతవృత్తములను గద్యపద్యాదులను వదలి దేశీయచ్ఛందమున ద్విపద లలో కావ్యమును రచించుట శిష్టకవిజనామోదముకు బషయదేమో యని, తత్సమర్థనకు దిగినాఁడు. తెలుఁగుభాషలో కావ్యరచన మేమి యను శిష్టవాదమీతనికిని గొంత యడ్డుతగలకపోలేదు. ఆవాదమును నన్నె చోడునికంట సూటిగా నెదుర్కొని సమాధానమును జెప్పఁదొడంగెను.

"ఉూర్చెద ద్విపదలు గొర్కొనై వాఱఁ
దెలుగుమాట లనంగవలదు; వేదముల
కొలఁదియ కాఁ జూడుఁ డిల నెట్టులనిన
బాటితూమునకును బాటియౌ నేనిఁ
బాటింపనోలయుఁ బాటియకాదె.

అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయె కాదె కవి వివేకంబు.
అలరుచు బసవని దలఁచు తలంపు
బలుపునగాఁజేసి భావమ్ము మెఱసి
యకలంక లింగ రహస్య సిద్ధాంత
సకలవేదపురాణ సమ్మతంబైన
యాతత బసవపురాతన భక్త
గీతార్థసమితియే మాతృకగాఁగఁ
బూరితంబై యొప్పు ప్రాసలలోన
దారంబు క్రియ బురాతనభక్తవితతి

చరితలలోపల సంధిల్ల బసవ
చరితమె వర్ణింతు సత్కృతియనగ. "

తెలుఁగుభాషలో సత్కృతి రచించుటేమి యని మీరనవలదు. వేదమువలె నీకవితను జూచుకొనుఁడు. ఏలయనఁగా దీర్ఘసమాసములు శబ్దాడంబరమును లేకయే యల్పాక్షరముల ననల్పార్థరచన గావించుటలోఁ గదా కవి సామర్థ్యంబు తెలియునది. ఇంతేగాక ఇది తెలుఁగున రచింపఁబడినను నిందు లింగరహస్య సిద్ధాంతసమ్మతంబులును, సకల వేదపురాణ సమ్మతంబులు నైన విషయములే ప్రతిపాదింపఁబడుటం జేసి వేదములవలెనే గ్రహింపవలసినదని శిష్టసంప్రదాయకులను హెచ్చరించుచున్నాఁడు. పురాతన భక్తగీతార్థసమితిని మాతృకగాఁ గొని రచించినట్లుగాఁ జెప్పుటచే నింతకుపూర్వము చాలకాలమునుండియు శైవభక్తులచరిత్రములు జాతీయ ఛందోఫణితిని రచింపఁబడిన గీతములుగను పదములుగను జనసామాన్యముచే పాడుకొనఁబడుచు వ్యాప్తి నొందియున్నవని స్పష్టమగుచున్నది. ఇట్టి వాఙ్మయ మంతయు సంస్కృతబహుళంబై సంస్కృత ఛందోఫణితి ననుసరించి రచింపఁబడిన నన్నయాదుల పురాణకవిత ప్రబలిననాటినుండియుఁ గ్రమముగా నంతరింపఁ జొచ్చినది. ఈబసవపురాణములో నల్పాక్షరముల ననల్పార్థ రచన గావించెదననిమాత్రమె చెప్పికొన్నను, పండితారాధ్యచరిత్రలో తన ప్రౌఢిని గనుపరుప యత్నించినాఁడు. నన్నిచోడునిపై వలెనే యీతనిపైనను నాలంకారికసంప్రదాయముల ప్రభావ మెట్లు పనిచేసెనో యిచ్చట స్పష్టమగుచున్నది.

" సత్కృతి యన నూత్నసంగతి దనరఁ
దొమ్మిదిరసములు దొలఁకాడ వాని
యిమ్మడి వర్ణన లెసఁగఁ దద్విగుణ

మను నలంకారంబులనలారవాని
ద్విగుణార్థ భావముల్ దీటుకొనంగఁ
దేట తెనుంగున ద్విపద రచింతుఁ
బాటిగాఁ దత్కథా ప్రౌఢి యెట్లనిన
జాతులు మాత్రానుసంధానగణ వి
నీతులుగాగ యనియతగణ్మై ర
నియును "ప్రాసోవా" యనియు 'యతిర్వా' య
నియుఁ జెప్ప ఛందోవినిహితోక్తిగాన
ప్రాసమైనను యతిపై వడియైన
దేసిగానిలిపి యాదిప్రాసనియతి
దప్పకుండఁగ ద్విపదలు రచియింపు
నొప్పదు ద్విపదకావ్యోక్తి నావలదు
ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృతభూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబుగామి
జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు
అట్టునుగాక కావ్యము ప్రౌఢి పేర్మి
నెట్టన రచియింప నేర్చినఁజాలు
నుపమింప గద్యపద్యోదాత్తకృతులు
ద్విపదలు సమము భావింప నెట్టనిన."

బసవపురాణమునఁ దెనుఁగున కవిత చెప్పుటయేమి యనునాక్షేపణకు సమాధానము చెప్పుటకై యత్నించినాఁడు. ఇక్కడ ప్రౌఢ కావ్యము ద్విపదలలో రచింపనగునా! అది యొప్పదు! అను వారి యాక్షేపణను పరిహరింపఁజూచుచున్నాఁడు. ఆలంకారిక నియమము

లనన్నిటిని బాటించి ప్రౌఢముగ రచించినచో 'గద్యపద్యోదాత్త కృతులు' ద్విపదలలోనైనను రచించుట దుర్లభము కాదు. ద్విపదలు నట్టికృతులకు సమమే యగును అనిచెప్పి తాను పాటింపఁదలఁచిన యాలంకారిక నియమములనన్నిటి నీక్రిందివిధమున జెప్పినాఁడు.

" సరళత సరణి ప్రసన్నత చెన్ను
పరిణతగణపదపద్ధతి శబ్ద
శుద్ధి ప్రయోగప్రసిద్ధి గళాస
మృద్ధి నానుడి వడి మితియతియర్థపుష్టి
..........................
..........................
యమకంబు గమకంబు యతి గతిగార
కము పూరకము క్రియ కాంతి విశ్రాంతి
రంగు బెడంగు మెఱుంగు సమాస
సంగతి యక్షరశయ్యా సంఘటన
నిపుణత రసికత, నెఱిసమాసార్థ
ముపమాన మవధాన ముత్ప్రేక్ష లక్ష్య
లక్షణవ్యక్తి యలంకారయుక్తి
దక్షత సుమతివిచక్షత యనిన
జాతుల రచనాప్రణీతులఁ గావ్య
నీతుల రీతుల నేతు లుట్టంగ
వరకవుల్ గొనియాడ వర్ణనకెక్క
ధరఁజెప్పు కృతియ యుద్యత్కృతి గాక
..........................
వసిగూర్చు కృతులు నా పద్దును బెరుగు
బిసుకుచందము బిలిబిలికృతుల్ గృతులె

అటుగాన యభినుతానందితోక్తి
పటుగద్యపద్య ప్రబంధసామ్యముగ
కావ్యకళా ప్రౌఢిఁగల్పింతు ద్విపద
కావ్యంబు భావ్యంబుగాఁగ నట్లయ్యు
నవికలవేదవేదాంతేతిహాస
వివిధాగమపురాణ విహితసూక్తముల
నిదమిత్థమనుచోట నివియె ప్రామాణ్య
పదములుగాగ ద్విపదలు సంధింతు

..........................

దేసిగా వచియింతు ద్విపదకు వల్లఁ
బ్రాసంబులును బొందుపడఁగఁ దావలయు
ననుచుఁ దదీయ సూక్తాక్షరపంక్తిఁ
జెనకక యింతొప్పఁ జెప్పనే యనుచు
సన్నుతిజేయుచు సత్కవు లలర
దిన్నని సూక్తుల ద్విపద రచింతు.

ఇట్లు తాను ద్విపదలనె రచించినను పటుగద్యపద్యప్రబంధ సామ్యముగ కావ్యకళాప్రౌఢిని గల్పింతుననియు, నట్టికావ్యముల కిది తీసిపోదనియు సమర్థించుకొనినాఁడు. కొంతవఱకు మతవ్యాప్తికై రచించుచున్న సోమనాధుడే తన కృతులయం దట్టి పాండిత్యప్రకర్షఁ జూప యత్నించినవాఁడై యుండ నన్నెచోడుని విషయమునఁ జెప్పెడిదేమి.

అపభ్రంశభాషయగు తెలుఁగులోను తమకావ్యములు వ్రాయఁగూడదను సంస్కృతభాషా పండితుల వాదమునకు జడిసియో, లేక తమ కావ్యములు వారి మెప్పుబడసినగాని నిలువవని తలంచియో తమ దేశికవిత

లో నా సంస్కృతకవితాలక్షణముల నన్ని[illegible] దింపివేసి భాషా కావ్యముల నీదేశికవులు రచించుచున్నను, ఈ భాషాకవితల కిట్టి యపవాదము పెద్దన శ్రీనాథాదుల కాలమువఱకుఁగూడ పోయినట్లు కనఁబడదు. ఈ భాషలలో ననేకోత్తమగ్రంథములు రచింపఁబడిన తరువాతఁగూడ విన్నకోట పెద్దనకాలమున నెట్టిస్థితి ప్రబలియున్నదో, తెలుఁగన్నను తెలుఁగుకవితయన్న నెట్టి యీసడింపు గలదో ఆతని యీ క్రిందిపద్యమునలనఁ దెలియుచున్నది.

"విలసద్భావరసాద్యలంకృతులచే విఖ్యాతి గీర్వాణ భా
షల కబ్బంబుల కెన్ని మంచితనము ల్సంధిల్లు నాచందమై
వళియుం బ్రాసయు నంతకగ్గలములై వర్తిల్లు సత్కావ్యముం
దెలుఁగంచుం జెవిబెట్టలేమి యుడుపం డేగల్గునే మందిలన్."

భావరసాలంకారాది గీర్వాణభాషాకావ్యవిశేష లక్షణము లన్నియుఁ దెనుఁగుకావ్యములలోని కొక్కుమాఱుగా దింపివేసి, తెలుఁగు భాషను, తత్కావ్యములను గీర్వాణభాషాకావ్యముల కేవిధమునను దీసిపోకుండునట్లుగా - గీర్వాణభాషాకావ్యములే యనిపించునట్లుగా రచించుటయేగాక, యింకను దేశీయలక్షణమునుండి వళియుఁ బ్రాసయునను మఱి రెండలంకారములనుగూడఁ దొడిగి తెలుఁగుకావ్యమును రమ్యతరంబుగఁ జేసినప్పటికి, నిది తెలుఁగుభాషలో రచింపఁబడినదన్నమాత్రముచేతనే, చెవిని బెట్టలేనివారికి మం దెచ్చటనుండి తేగలమని యడుగుచున్నాఁడు పెద్దన. కాని యీతఁ డిట్టివారి రుగ్మతను కుదుర్చుటకుగా నొకమంచిమందే కనిపెట్టినాఁడు. తెలుఁగు దేశభాషయని గదా వీరు దీనిని చులకనచేయుచు దానిలో రచింపఁబడిన కావ్యములను చెవిబెట్టనొల్లక, యీభాష మాకు తెలియును గావున దాని కిక లక్షణమెందులకు పొమ్మనుచున్నారు. దీనిని సంస్కృతభాషావికార

మగు ప్రాకృతమే యనినచో దీనియందును శ్రద్ధవహింతురని తలంచినాఁ బోలు "సంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయము గానఁ-వలయు దల్లక్షణంబులు పరుసదెలియ"యని చెప్పి గడుసుదనముతో వారి వాదము నెదుర్కొనుటకు యత్నించినాఁడు. ఇక కావ్యలక్షణమును జెప్పుచు

"యుక్తివిశేషము కబ్బం, బుక్తివిశేషంబుగాదు యోగ్యునకైనన్
యుక్తివిశేషము సాధ్యం, బుక్తివిశేషంబసాధ్య మూహింపంగన్."

కావ్య మనఁగా యుక్తివిశేషముగాని ఉక్తివిశేషముకాదు. ఒక కావ్యముయొక్క గుణావగుణములు లేదా ఒక రచనయొక్క కావ్యతా గుణము—అందు వివరింపఁబడిన భావరసాదివిశేషములను బట్టి అందలి యర్థయుక్తినిబట్టియే నిర్ణయింపఁబడవలసినదిగాని, అది యేభాషలో రచింపఁబడినది యను దానినిబట్టి అనఁగా ఉక్తివిశేషమునుబట్టి నిర్ణయింపఁబడదు. అట్లయినచో నేదో యొక్కభాషలోనే కవిత బయలుదేరవలసినదిగాని, లోకమునందలి భిన్నభాషలలో కవిత యుండుట కవకాశమే లేకపోవలసివచ్చును. ఆయా కవులకుఁ గలిగిన లోకానుభవమునుబట్టియు, ప్రతిభామహిమను బట్టియు, శక్తివిశేషమునుబట్టియు, నపూర్వార్థకల్పన- లేక అర్థయుక్తివిశేషము, సాధింపఁదగిన దగుచున్నది. దానినిబట్టియే యాయా కావ్యము లుత్తమోత్తమకవిత కాదర్శభూతంబు లగుచుండును కాని ఉక్తివిశేషమెట్టి గొప్పకవిచేతను సాధింపఁదగినదికాదు. ఎట్టికవియైనను తనభావములను తా నెఱింగిన భాషలో రచింప దొరకొనునేగాని, యన్యభాషలో రచింపనేరడు. తెలుఁగుకవులు తెలుఁగు కవితను గీర్వాణభాషలో రచింపవలయుననుట యసందర్భమైనమాట. కావునఁ దెలుఁగున రచింపఁబడినను, అది యర్థయుక్తివిశేషము గల సత్కావ్యంబైనచో, లోకము గ్రహింపవలసినదే యను తనభావములను గావ్యలక్షణమును

తెలుఁగుమిషచే వెల్లడించినాఁడు. ఇట్లింతకాలమునకు నెందఱెన్ని సత్కావ్యములను తెలుఁగులో రచించినను, నన్నయ కాతనికాలమున సంభవించినట్లే ఆయాకవుల కాయాకాలములందు, గీర్వాణభాషలోనే గాని దేశభాషలో కవితఁ జెప్పెడి దేమి యను నపభ్రంశవాదు లగు పండితులతో "ఘోరరణము" సంప్రాప్తించుచునేయున్న ట్లగ పడుచున్నది. ఇదియే నన్నపార్యుని భారతము బయలుదేఱిన తర్వాత నంతకుఁబూర్వమునఁగల జానుదెనుఁగు రచన లంతరించుటకుఁ గారణము.— గుణగవిజయాదిత్యుని కాలమునను అనఁగా తొమ్మిదవశతాబ్ది ప్రారంభముననే పొడసూపిన యీ శిష్టకవితా శైలి ప్రాకృతజనకవితా శైలి యగు జానుదెనుంగుశైలితో డీకొనుచు వచ్చివచ్చి, రాజాశ్రయముకల దగుటచే నన్నయకాలమున జానుతెనుంగు నోకమూలకుఁ ద్రోసి విజయము గాంచినది.

ప్రధానవిషయ మేమనఁగా నన్నయనాఁటికే, అంతకుఁబూర్వమే నన్నయ భారతకవిత్వ మారీతిని రచింపఁబడుటకుఁ దగినపరిస్థితు లొక విధముగా నేర్పడియున్నట్లు తెలియవచ్చుచున్నదనుట. ఆ రీతి యేది, ఆ పరిస్థితు లెట్టివి యనఁగా—నారీతి గద్యపద్యాత్మకమగు చంపూ రచనారీతి, దీర్ఘసమాసజటిలంబగు సంస్కృతభూయిష్ఠ రచనారీతి, సంస్కృతాలంకారిక నియమానుసరణరీతి, సంస్కృత ఛందోనియమానుసరణరీతి, వైదికమార్గ ప్రవర్తకంబగు రీతి, పురాణగ్రంధ రచనానుకూలంబగు రీతి. ఇవియే, యీరీతివిశేషములే, యతనికిఁ బూర్వమునను, సమకాలమునను దేశీయ ఛందములో జానుదెనుంగున రచింపఁబడి ప్రాకృతజనులలో వ్యాప్తిఁ జెందియున్న దేశీయవాఙ్మయమునుండి యాతని కవితను వేఱుపఱుచుచున్నవి.

నన్నపార్యుఁడు నిజముగ సకలభాషావాగనుశాసనుఁ డనిపించు కొనఁదగిన ప్రతిభాశక్తి, విజ్ఞానసంపత్తి, పాండిత్యప్రభావము మొద లగు విశేషలక్షణములు గలవాఁడేయైనను, ఈతని కట్టి యుద్గ్రంథము గచించుటలో బాహ్యపరిస్థితులుకూడ కొంత తోడ్పడినవని చెప్పక తప్పదు. వీనిలో ముఖ్యమైనది యీతనికిఁ గలిగిన కన్నడవాఙ్మయ పరి చయము, కన్నడ దేశీయకవులతోడి స్నేహము, సహవాసము; అష్ట భాషాకవిత్వ చతురుఁడును, కన్నడకవియు నగు నారాయణభట్టు తో డ్పాటు. ఆంధ్రవాఙ్మయ సాధనిర్మాణమునకు వలయుసామగ్రి విష యమున నన్నయ కన్నడవాఙ్మయమునకుఁ బోవలసిన యగత్యము లేదు గాని, యీ కన్నడవాఙ్మయ పరిచయము తన్నిర్మాణవైఖరి నాతనికి సూచించియుండును. భాషాసామగ్రి సిద్ధముగనే యున్న ట్లిదివఱకే చూచియున్నాము. ఛందస్సామగ్రి కొంత నన్నయ సేకూర్చుకొనవలసి యున్నది. నన్నయకుపూర్వమునఁ గల శాసనములన్నియు, సీసములు, గీతములు, ఆటవెలఁదులు, అక్కరలు, తరువోజలు, మొదలగు దేశీయ ఛందోవృత్తములతోనే, లేదా గద్యంబులతోను, గూడియుండుటను చూచియున్నాము. నన్నయకాలమువఱకు సంస్కృతవృత్తములలోఁ జేయఁబడిన యాంధ్రకవితారచన బయలు దేఱినట్లు గానరాదు. శాసన ములలోనికే రెక్కినవు డాకాలమున నీ దేశీయవృత్తములలో ననేకములగు దేశికావ్యములు, లేదా పాటలు మొదలగునవి రచింపఁ బడి ప్రాకృతజనులచేఁ బాడుకొనఁబడుచుండు ననుటకు సందే హము లేదు. ఇప్పటి స్త్రీలపాటలవలెనే యీకవిత శిష్టకవిత బయ లుదేఱిన పిదప నంతరించినది. నన్నెచోడుఁడు పామరజనములు గౌడు గీతములను పాడుకొనుచున్నట్లును, పాల్కురికిసోమన ఆతతబసవపురా తన భక్తగీతార్థసమితియే మాతృకగాఁగ తన బసవపురాణమును రచించి

నట్లును చెప్పినారుగదా. ఇట్లు గీతములే గాక ద్విపదలు, మంజరులు మొదలగువాని ననేకవిధముల పాటలుగాఁ బాడుకొనుచుండిరి. ఇప్పటికిని స్త్రీలపాటలన్నియు నీ దేశీయఛందములోనే యున్నవిగాని సంస్కృత వృత్తములు వానిలోని కెక్కనేలేదు. అట మాత్రాగణబద్ధములగుటచే నివ్వచ్చినచోఁ గొంచెము సాగుగించియుఁ, గుదించియు పరుస కనుకూలముగాఁజేసి పాడుకొనుచుండెడివారు. తమిళమున నాయా 'పాట్టు'లు పాడుకొను రీతులను దెల్పుటకు 'ఓశై'లు గలవు. సామాన్యముగా దంపుళ్ల పాటలన్నియు తరువోజలే యనుటకు విన్నకోట పెద్దనార్యుని యీ తరువోజపద్యలక్షణమునఁ జేసిన సూచనయే నిదర్శనముగనున్నది:

తరువోజ:—

"నలనామకంబులు నగణాంతములుగ
నాలుగంఘ్రులయందు నాలుగు గూర్చి
పలులు మూఁడెడలను వరుసతో నిల్ప
పలయు మూఁడవగణ వర్ణంబు మొదల
నిలుపంగ నివ్విధి నిర్మించి విశ్వ
నృపతికి నిచ్చిన నింపుసొంపారఁ
దలకొని తగుఁ బ్రోలు దంపెడిచోటఁ
దరుణులచే సొంపుదనరుఁ దరోజ."

అప్పగింతపాటలు, నలుగులపాటలు మొదలగున వనేకము లీ తరువోజలో, ద్విపదలో, మంజరులో యయియుండును. సీసపాదభాగము లక్షణమున వీనితో సరిపోవుచుగావున నివియన్నియు మొట్టమొదట నొకటేరూపముగల్గియుండి కాలక్రమమున భిన్ననామములతో యతిక్రించిద్భేదముగలవై వ్యవహరింపఁబడజొచ్చినట్లున్నవి. ఈరీతి వృత్తములు,

సీసములుగూడ కన్నడభాషలో లేకుండినను తమిళచ్ఛందములోని 'పాట్టు'లతోఁ బోల్పఁదగియుండుటచేతను, ఈ దేశీయచ్ఛందమునకు సంబంధించిన పద్యములు, పాటలు మొదలగునవి మిగుల ప్రాచీనకాలమునందలి మూలద్రావిడభాషలోనుండి యీ తమిళము, తెలుఁగు, కన్నడము మొదలగు భాషలలోనికి సంక్రమించినవేగాని, అక్షరగణబద్ధములను గీర్వాణఛందస్సంప్రదాయము ననుసరించి వచ్చినవిగాఁ గనఁబడవు. ఈసీసభేదములు, తరువోజ, మొదలగునవి కన్నడభాషలోఁ గనఁబడకపోవుటకుఁ గారణము తెలియదు. కాని యీభాషలు మూలభాషనుండి విడిపోయినతర్వాత నాయా దేశస్థితిగతులనుబట్టియు, నాయా కవుల రచనా సౌకర్యాదులను బట్టియు, నీ ఛందస్సంప్రదాయము లు భాషాస్వరూపము మాఱిపోయినట్లే, కొంతవఱకు మాఱిపోవుట తటస్థించినది. ఇంతేగాక ప్రాచీనకాలమున జను లేదోవిధముగా పాటలను రచించి పాడుకొనియుందురు. వానిలోఁ గొన్ని మిగుల వ్యాప్తిఁ జెంది సర్వజనాదరణీయములైన పిదప, కొంతకాలమునకు వాని లక్షణము నిర్ణయమై వానివలెనె మఱికొన్ని రచింపఁబడుచువచ్చియుండును. మఱి కొంతకాలమైన పిదప లాక్షణికులు బయలుదేఱి లక్షణ మేర్పఱతురు. ఈ లాక్షణికనియామకము లేర్పడినపిదప బయలుదేఱిన పాటలు పద్యములు నాలక్షణము ననుసరించి యొక్కరీతి నేయుండునుగాని, మిక్కిలి ప్రాచీనమగు రచనలకుఁ బోయినచో నీనియమము లంతగాఁ బాటింపఁబడినట్లు కనఁబడదు. ప్రాచీనతమిళవాఙ్మయమందలి పాటలలో నిప్పుడు యతియని మనము వాడుకొనెడి యక్షరసామ్యము (సంస్కృతమందువలె కేవల విరామము-విశ్రమము కాదు) 'మొనె'యని యనఁబడునది యాయా పద్యములలో నాయా స్థలములయందు మాత్రమే రావలయునని నియతమైయుండక, ఆయా కవుల యిష్టానుసారముగా నొక్కొక

పాటలో రెండవగణము మొదటను, మఱియొకదానిలో రెండు మూఁడు గణముల మొదటను మఱికొన్నిటిలో నన్నిగణముల మొదటను వచ్చుచుం డును. అట్లే తెలుఁగులో సీసముల విషయమున జూచుఁడు. ఎనిమిది పాదములను ప్రాసలుంచుట, ఆరుపాదములనే యుంచుట, మొదట నే వడి నిల్పినారో దానినే చివరవఱకు నిలుపుట, భిన్నపాదములందు ప్రత్యేకముగా వడి నిలుపుట మొదలగు భేదములనుబట్టి సీసభేదము లేర్ప డినట్లు లాక్షణికులు చెప్పియున్నారు. ప్రాచీనకాలములో వడిగాని, ప్రాసవడిగాని నిలుపుట కవుల యిచ్ఛానుసారమైయుండును. తరువాతి లాక్షణికులు వీని నన్నిటిని పోగుచేసి విభాగించి వాని కాయాపేర్లు పెట్టి నారు. ఉత్సాహచివర నొకగీతము రచించినచో నదిగూడ సీసభేదమే యన్నారు. లక్షణములో యతిప్రాసవిచ్ఛేదమున్నను నడకలోను పాట గా పాడుటకు నివి యొకరీతిగానే యుపయోగపడుటంజేసి మొదటికాల ములో నీ విభేదమంతగా పాటింపఁబడియుండదు. కాలక్రమమున నీ లక్షణనియమములు పెరిఁగినకొలఁది నీ సీసభేదములన్నియు నక్కరల వలెనే కవులచే విడనాడఁబడి యంతరించినవి. నన్నయతరువాత నివి కవులచే నాదరింపఁబడకుండుట నప్పకవియే యిట్లు చెప్పుచున్నాఁడు:

"సప్తవిధము లివియ శబ్దశాసనుండు
పంచమామ్నాయఫక్కిలో బల్కెగాని
కడమకవు లాఱుసీసముల్ విడిచిపెట్టి
చెలఁగి నరుసీసపద్యమే చెప్పినారు."

పండరంగని ధర్మవరముశాసనములోను, దీర్ఘాసిశాసనమునను గూడ సీసపద్యములందు ప్రాసయతి నియమముపాటింపఁబడుటంజేసి, నన్నయకుఁబూర్వము చిరకాలమునుండి యీయలవాటాతనికాలమువఱకు వచ్చినదనుట స్పష్టము. కన్నడమున నీప్రాసయతి వాడుక లేదు. అక్కర

)_త్తములు కన్నడభాషలలో మిగుల ప్రచారమునందున్నను, తెలుగు
ాషలలోఁగూడ నన్నయకుఁబూర్వము నూరుసంవత్సరముల కాలమందలి
సనములలోనే గానవచ్చుటంజేసి కన్నడభాషా కవితనుండియే తెలుఁ
లోనికి వచ్చినవని తలంప నవసరము లేదు. దేశీయ వృత్తములన్నియు
ాకృతజనుల పాటలలోనే యేదో యొకరూపమునఁ గనఁబడు
న్నవి. కాని నియమము, లక్షణము లేక పోలికనుబట్టియు, పాడు
స వలయు సౌకర్యమునుబట్టియు, మార్పుఁ జెందుచుండుటచేఁ గాల
మమున నాయాభాషలలో భిన్నరూపములను జెందియుండును.
ద స్త్రీలు సామాన్యముగా పాడుకొనుచుండు 'తులసిమాహాత్మ్య'మను
ట రగడభేదముగానుండుట నీక్రింది పాదములవలన మనము తెలిసి
నవచ్చును :

"శ్రీకరముగ విష్ణుపూజ చేసి వసిష్ఠమౌని మ్రొక్కి
యీ కథంత తులసి మహిమ విస్తరింతుగా
పుత్రపౌత్రలాభవృద్ధి భూతికరము సర్వదా ప
విత్రకరము మీరు గట్టిగాను తెల్సియుండీ
తొల్లివచ్చు నీ పురాణ దొడ్డరా జుదయనుండు
ఎల్లజగము మెచ్చ రాజ్య మేలుచుండెనూ
ఎలమి బహుదినాలు రాజ్య మేలుచుండి సుతులు లేక
చెలమువలన తప్పి పూజ చేయుచుండెనూ
అంతలో వసిష్ఠమౌని యచటికి కేతెంచెనపుడు
చింత దీర తనావిధము చెప్పుకొనియెనూ
వృద్ధులైతె నేమిగనుక వెరపులేదు మీకు కార్య
సిద్ధియగును తులసిపూజ చేసుకొమ్మనెన్
అన్న మొదలు రాజు భూమి దున్ని లెస్సపదును జేసి

వన్నెమీరగాను తులసివనము వేసెనూ
పాలునెయ్యి మంచి చెఱుకుపానకమున తేనె నారి
కేళ జలముచేత కొన్నినాళ్లు పెంచిరీ
సాధనమున షోడశోపచారములను దంపతుల్ప్ర
మోదమొప్ప పూజ యే-డాదిచేసిరీ
అంత ముసలితనముపోయి యింత వయసువచ్చె రాజు
కాంతగూడి మంచిసుతుల కాంచెవేడ్కలా
భరతుడనుచు పేరు చెలగ శౌర్యమీర రాజ్యమేల
భరతవర్ష మతని పేర ప్రబలమాయెనూ
సరసమైన శ్రీతనర్చు—జాతసంయుతాంగమునగ
పరమశోభనం బిదీ—ప్రథమపటలము

...................................

...................................

తులసి యింట నుంచు వార్ని తులసిపూజ చేయువార్ని
తులసియందు భక్తియుంచి మెలగువారినీ
తులసిచూసి మ్రొక్కువార్ని తులసి యనుభవించువార్ని
తెలసి నీవు (యముడు) వారిదిక్కు తిరిగిచూడకూ.
పౌండ్రకుండ నేటిదొడ్డ భాగవతులు చేసినారు
దండికీర్తనం బిదీ దాసు మనువుడీ.

ఇట్లే దేశీయములగు పాటల నన్నిటిని దేశీయ ఛందమునందలి జాతులలో రచింపఁబడినవిగా మనము గుర్తింపవచ్చును. ఈపాటలు సామాన్యముగాఁ గరువాతికాలమునందైనను సంస్కృత వృత్తములలో రచింపఁబడకపోవుటను బట్టి దేశీయకవిత— లేదా ప్రాకృతజనకవితా ప్రవాహమంతయు దేశీయ ఛందోమార్గమునందే ప్రవహించుచున్న

దనియు, శిష్టకవితమాత్రమే సంస్కృత ఛందోమార్గము ననుసరించిన దనియు తెలియుచున్నది. అంతకుపూర్వము దేశీయమార్గమున ప్రవహించుచున్న తెలుఁగుకవితను సంస్కృత ఛందఃప్రవాహముతోఁ గలిపి పారించినవాఁడు నన్నపార్యుఁడే యైయున్నాఁడు. ఈ విషయముననే కన్నడకవులగు పంపాదుల గ్రంథము లీతనికి ప్రోత్సాహము కలిగించి యుండును. కన్నడవాఙ్మయమున జాతీయరచనలతోఁగూడిన కావ్యములు 'చత్తాణ,' 'బెదండె' యనునవి ప్రాచీనకాలమునఁ బ్రసిద్ధము లైయున్నట్లు కవిరాజమార్గమున నృపతుంగుఁడు తెలిపియున్నాఁడు. కాని యట్టివి తరువాతికాలమున సంస్కృతఛందోమార్గము ననుసరించి రచింపఁబడిన శిష్టకవిత బయలుదేఱిన పిదప, నాంధ్రభాషలోవలెనే యంతరించిన ట్లున్నది. అక్కరలు, ద్విపద, షట్పద, గీతి, మంజరి ఈ మొదలగు జాతులు కన్నడాంధ్రములు రెంటిలోను గలవు. ఇక తెలుఁగున, సీసము, తరువోజ మొదలగు కొన్ని విశేషములుగానున్నవి. ఈసీసము, తరువోజ, ఉత్సాహ మొదలగువానిలోఁ జేరు సూర్యేంద్రగణములకును, కన్నడమునందలి బ్రహ్మ విష్ణుగణములకునుగూడ తమిళమున రెండేసి 'అశై' లతోఁ గూర్పఁబడిన గణములలోఁ గొన్నింటితో సామ్యము కలుగుటచే నిట్టిగణములతోఁ గూర్పఁబడిన 'యహవల్' పాట్టు, పై తెలుఁగుపద్య భాగములతో సజాతీయముగావచ్చు ననుటకు సందేహము లేదు. అట్లె చంద్రగణములలోఁ గొన్ని మూఁడేసి 'అశై' లతోఁగూడిన గణములతో (శీర్‌లతో) నేకీభవించును గావున నట్టి గణములతోఁ గూడిన యక్కరాదులుగూడ తమిళ 'పాట్టు' లతో సామ్యముగలవౌను. యతి ప్రాస నియమములు సంస్కృత వృత్తములలో వానికంటె భిన్నములై ప్రాచీనములుగఁ గనఁబడుచున్నవి. తెలుగుపద్యములలో ప్రాచీనశాసనముల కాలమునుండియుఁ గానవచ్చుచున్న ప్రాసయతి యనునది సీసపద్య

ముబని లెనే కన్నడభాషలోఁగానరాకున్నను తమిళపాట్టులలోఁగాన వచ్చుటంజేసి ప్రాచీనంబగు దేశీయఛందమునకు సంబంధించిన కొన్ని విశేషములు కన్నడమున సంతరించియుఁ దెలుఁగున నిలచియున్న ట్లగపడుచున్నది.

ద్రావిడభాషలలోని దేశీయఛందోలక్షణములనుబరికింపగా నివి సంస్కృతఛందోలక్షణములకుఁ గొంత భిన్నములై యున్నవని తెలియును. ప్రాచీనశాసనములలో సంస్కృతవృత్తములు కనఁబడుట లేదు. తమిళకవితయందుఁగూడ సంస్కృతవృత్తము లిటీవలి కాలమువఱకు చేర నేలేదు. ఆంధ్రకన్నడములందు ప్రాకృతజనులయొక్కయు స్త్రీలయొక్కయు పాటలయందు నప్పటికి నిప్పటికినిగూడ నీసంస్కృతవృత్తములు చేరలేదు. ఇంతేగాక ప్రాచీనకాలమున శిష్టకవిత బయలుదేఱక పూర్వము కేవల దేశీయపద్యములలో రచింపఁబడిన కావ్యములున్నట్లు నిదర్శనము లగపడుచున్నవి. ఇట్లు ప్రత్యేకఛందోలక్షణములకును,పద్యములకును,పాటలకును, ఆధారభూతంబగు ప్రాచీనభాషయు,సంస్కృత ప్రాకృతములకంటె భిన్నంబై యుండవలయుననుట సంభావ్యం బగుచున్నది. సంస్కృతప్రాకృతభాషాసాంగత్యముచే నెట్టిభాష మాటిపోయి గుర్తించుటకైన వీలులేని నూతనరూపమును బడసినదో, అట్లే సంస్కృతవృత్తములు, తచ్ఛందస్సంప్రదాయములు తత్ప్రస్తారక్రమము మొదలగువానివలన నీప్రాచీనదేశీయచ్ఛందోమార్గము మఱుగువడిపోయినది. ఆంధ్రకవిత్వము నీ సంస్కృతఛందోమార్గమునుబట్టి రచించిన వారిలో మొదటివాఁడు నన్నయయే యని నాయూహ.

ఇట్లీతఁడు తెలుఁగనినచోఁ జెవిఁబెట్టలేనిస్థితిగల కాలములో నీయాంధ్రకవితను భావరసాద్యలంకృతులచే విప్పారునట్లుగాఁజేసి, సంస్కృతఛందోవృత్తములను భాషావిశేషములను, దేశీయఛందముతోడను తెలుఁగు నుడికారముతోడను సమ్మేళనముబొందించి గీర్వాణ

భాషలకబ్బంబుల కెన్ని మంచితనములు గలవో యవి యన్నియు
నీదేశభాషాకావ్యమున కబ్బఁజేసి, యతియుఁ బ్రాసయును విశేషా
లంకారములుగ నమర్చిపెట్టి సర్వజనాదరణీయంబు, ముఖ్యముగా
పండిత జనాదరణీయంబు నగు నుద్గ్రంథమును రచించినవారఁ డయ్యెను.

ఇట్లు భాషాస్వరూపవిషయమున నేగాక ఛందోవిషయమునను
గూడ ప్రత్యేకసామ్యము గలవిగాఁ గనఁబడుచున్న యీద్రావిడభాష
లేకాలమున నెట్లు విడిపోయినవో నిశ్చయించి చెప్పుట కవకాశము
లేకున్నను, ఈభాషలయందలి మూలధాతువులను, ఆధాతువులకు వేరు
ధాతువులు, పదములు, ప్రత్యయములు చేరి భిన్నార్థములను సూచించు
భిన్నపదము లేర్పడినరీతులను, ఈ ధాతువులనుండి క్రియారూపము
లేర్పడిన విధానమును, విభక్తినిరూపణ విధానమును సరిపోల్చిచూచిన
చో, ప్రాచీనభాషాస్వరూపము కొంత తేటపడఁగలదనియు, దానినిబట్టి
యీ భాష లేస్థితిలో విడిపోయినది తెలుసుకోవచ్చుననియు తోఁచు
చున్నది.

## ప్రాచీనభాషాస్వరూపము-జన్యభాషలు

ఈభాషలలోని పదములచరిత్ర నన్వేషించినచో నవి యీయా
భాషలలోఁ గాలక్రమమున నెట్టి మార్పులనుబొంది క్రొత్తక్రొత్తరూప
ములను బడసినవో తెలియుటయేగాక యీ భాషారూపములన్నిటికిని
సమానమైన ప్రాచీనధాతుస్వరూపము కూడఁ బొడగట్టుచుండును. ఈ
భాషలలోనిపదజాలమునకు మూలమగు ధాతువులనేకములు మూలరూప
ములతోడనే వీనిలో వ్యవహారమునఁ గూడఁ గానవచ్చుచుండును. ఈ
ధాతువులనుండి క్రియారూపములు ప్రస్తుతము మన తద్ధర్మార్థరూప
ములవంటివి భూతభవిష్యత్ కాలసూచకములై యొకధాతువునకు మఱి

యొకధాతువును జేర్చుటచే నేర్పడియుండినవి. ఈ భాషలన్నిటిలో గూడ వర్తమానార్థక క్రియారూపము లాలస్యముగనే బయలు దేఱిన ట్లగపడుచున్నది. ధాతువులకు కు,దు,తు,ఉ, అను ప్రత్యయములు, కాలద్యోతకములై చేర్పఁబడుచు వచ్చినట్లు మొదటి ద్రావిడ వ్యాకరణకర్తయగు తోల్కప్పియార్ అనునాతఁడే చెప్పియున్నాఁడు. వీనిలో 'కు' అనునది భవిష్యదర్థమునను, 'తు' అనునది భూతార్థమునను సామాన్యముగాఁ జేర్పఁబడుచుండెడివి. తోల్కప్పియర్ నాఁటికే యీరూపములు మిగుల ప్రాచీనములగుటచే నివి యేధాతువుల యవశిష్టరూపములో తెలియక, కు, దు, తులను ప్రత్యయములని తెల్పినాఁడు. ఈ కువర్ణాంతధాతువులు భవిష్యద్వర్తమానములకు రెండింటికి నుపయోగపడుచుండెడివి గావున, తరువాతకాలమున కన్నడాంధ్రవ్యాకరణకర్త లీ 'కు' 'గు' అంతమునే ధాతువుగా గ్రహించి ధాతుపాఠములలో పఠించినారు. భాషలో వర్తమానభవిష్యదర్థముల వివేచన కావలసివచ్చిన కాలమున నీ 'గు' అంతరూపమునకు_ఇరు_ఉరు, ఉండు ఉన్న_మొదలగు సహాయధాతువులు చేర్పఁబడుటచే శైయ్గిరు_శైయ్గింద్రు; పోగుందు; పోగుత్తు, పోవుతు, పోవుచు వెలుఁగుచున్న, ఇత్యాదిరూపము లేర్పడినవి.

తోల్కప్పియార్ సంస్కృతభాషావ్యాకరణ సంప్రదాయానుసారముగా 'కు' అనుదానిని ప్రత్యయముగా విడఁదీసెనే గాని యిది యేధాతువుయొక్క యవశిష్టభాగమో పరిశీలించిన ట్లగపడదు. ద్రావిడభాషలలో నొకధాతువును మఱియొక ధాతువునకుఁ జేర్చి యర్థభేదమును సూచించుట యలవాటుగా నుండుటచే, వెళ్, తర్, తున్_మొదలగు ధాతువులకు 'ఆగు' 'అగు' 'అక్కు' అను ధాతువును జేర్చుటచే ప్రాచీనకాలమున వెళ్ + అగు=వెళగు_వెలగు_వెలుఁగు;

తున్ + అగు=తునగు—తునుఁగు, అనురూపము లేర్పడియుండును. దీనిని బట్టి యీభాషలు 'కు' వర్ణాంతరూపముననె వర్తమానభవిష్యదర్థముల వాడుకొనుచున్న కాలమునను, వర్తమానార్థకరూపము లాయాభాషలలో వేఱువేఱుగా నేర్పడియుండుటచే, నవి యేర్పడకపూర్వమునను పోయినవని చెప్పవచ్చును.

అర్థభేదమును సూచించుట కొకధాతువునకు మఱియొకధాతువు చేర్పఁబడినట్లె పదముల సంబంధమును సూచించుటకుగా నొకపదమునకు మఱియొకపదము చేర్పఁబడుచుండెడిది. వీనిసంబంధము విశేషణావిశేష్యభావరూపంబై యుండి 'వెండిచెంబు' 'పొన్ముడి' 'తల్లిపాలు' ఇత్యాదిపదములలోవలె పూర్వపదము పరపదమునకు విశేషణ మగుచుండెడిది. ఈ సంబంధమును వ్యక్తము చేయుటకు తరువాతి కాలమున'అత్తు''అదు''ఇన్''ఇల్' మొదలగు పదములు చేర్పఁబడినవి. ఇట్లు మరత్తు, మరద, అనునవి ప్రత్యయములు చేర్పఁబడుటకుఁ దగిన యంగము లైనవి. 'ఇన్'కూడ చేర్పఁబడినపిదప 'మరత్తిన్' 'మరదిన్' ఊరి, కాలి, మొదలగునవి, అంగములైనవి. తరువాత వీనిపైని వేఱువేఱుపదములు చేర్పఁబడుచురాఁగా నవి కాలక్రమమున విభక్తిప్రత్యయములుగాఁ బరగణింపఁబడుట తటస్థించినది.

ఇ, టి, తి—అనునవి తెలుఁగున నొపవిభక్తికప్రత్యయములుగా నిప్పటికిని దలంపఁబడుచుండుటచేతను, ఇవి పైనిచెప్పఁబడిన 'అత్తు' 'ఇన్' అనువాని మాఱురూపములే యగుటచేతను, వీనిపైఁ జేర్పఁబడు తక్కిన విభక్తిప్రత్యయము లాయాద్రావిడభాషలలో భిన్నభిన్నములుగా నుండుటచేతను, ఈ విభక్తిప్రత్యయము లింక నేర్పడక సంబంధార్థమున 'ఇన్' 'అన్' మొదలగుపదములను వాడుకొనుచుండు కాల

మున నె తెలుఁగు తక్కిన ద్రావిడభాషలనుండి విడిపడుట తటస్థించిన దని తలంపఁదగియున్నది. అది యెప్పుడను విషయ మింకను చెప్పుట కనకాశము లేదు.

ఇట్లు ద్రావిడభాషలు విడిపోయిన తరువాత న్యాయా దేశకాల పరిస్థితులనుబట్టి కొంచెము ముందువెనుకలుగా నాయాభాషలలో వాఙ్మయ మేర్పడినది. ఆంధ్ర కన్నడభాషలకు తమిళముకంటె నార్య భాషావాఙ్మయములతోడి సంబంధ మెక్కువగుటచే వాని నెక్కువగా పోలినవైనను, భాషాసంప్రదాయ విషయమునను, ఛందస్సంప్రదాయముల విషయమునను దేశీయతను కేవలము విడనాడలేదు. ఈభాషలలో ప్రాచీన మగు దేశీయఛంద స్సంప్రదాయములు, గణాదులు సంస్కృత గణసంప్రదాయమున కనుకూలముగ నున్నంతవఱకు సరిపెట్టికొని యుపయోగపఱచుకొనఁ బడినవి. వీనితో సరిపడనిచోట్ల నయ్యవి విడనాడఁబడినవి. తమిళభాషలోఁగూడ నతిప్రాచీనకవితలో నీ సంస్కృతవృత్తము లేమియు లేవు. అది కేవల 'పాట్టు'పాటలతోఁ గూడినదై యుండెను. తరువాతి కాలమున సంస్కృతచ్ఛందస్సంపర్కము గలిగినప్పుడైనను, సంస్కృతవృత్తములలో నాయాపాటలకు పోలిక గలవానిని దేశీయ ఛందస్సంప్రదాయానుసారముగా సరిపెట్టుకొని యాయాపాట్టులకుఁ జెందిన వృత్తములుగా గ్రహించెనేగాని, కన్నడాంధ్రములవలె సంస్కృతవృత్తములను శార్దూలమత్తేభములను పేరనున్నవాని నున్నట్లుగా గ్రహింపలేదు. ఇదియే కర్ణాటాంధ్రభాషాకవితలపై సంస్కృతభాషాకవితల ప్రభావము తమిళమునంగుకంటె నెంత విశేషముగాఁ బ్రసరించినదో వ్యక్తము చేయుచున్నది.

ఇంతవఱకు నన్నయకు పూర్వమునను, సమకాలమునను గల దక్షిణదేశ భాషావాఙ్మయముల స్థితి యెట్టిదో, వానిరీతు లీతని కవితా

పద్ధతుల నెంతవఱకు నిర్ణయింపఁగలిగినవో పరిశీలించి యున్నాము. ఆంధ్రవాఙ్మయమున భారతమే మొదటిగ్రంథ మెట్లయ్యెనో, అప్పటి దేశకాలపరిస్థితులకును భారతమునకుఁ గల సంబంధ మెట్టిదో, అవి యాతని భారతావతారికలోను, గ్రంథమున నెంతవఱకు సూచింపఁబడినవో, తరువాత తిక్కనకాలమందలి పరిస్థితులకు నాతని యవతారికా గ్రంథములకుఁ గల సంబంధ మెట్టిదో ముందు పరిశీలింతము.

## తిక్కన ప్రశంస

క. అభిమానుఁడు మనుమ భూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయకవి మిత్రనామము
త్రిభువనములనెఱుఁగ మంత్రి తిక్కఁడు దాల్చెన్ — కేతన.

గీ. కవిత చెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ
బరఁగ దశకుమారచరితంబుఁ జెప్పిన
ప్రౌఢ నన్ను వేఱ పొగడ నేల? — కేతన

చ. క్షితిఁ గ్రతుకర్త నా విమలచేతనుఁ డాతఁడు వేదవేద్యుఁడైన
రతరము తెనుంగుబాస నభిరామముగా రచియించెన
స్తుతచరితుండు తిక్కకవినాయకుఁ డాదట మెచ్చు
తి యనఁ బొలుచుఁ గన్న కవిరత్నము బయ్యనమంత్రిం
— అనంతామాత్యుడు

ఉ. భాసురభారతార్థముల భంగులనిక్కముఁ దెల్పనేరని
గాసట బీసటై చదివి గాథలఁ ద్రవ్వుచునుండ వా
వ్యాసమునిప్రణీత పరమార్థము తెల్లముగాఁ జెప్పిన
బ్బాసన కట్టులందలు ... నాద్యుఁడు నన్నయ తిక్కనా
— ఎఱ్ఱాప్రెగ్గడ నృసిం

మ. తనకావించిన సృష్టి తక్కొరులచేతం గాదు నాత్మీయ భం
గునఁ గాఁ బల్కినఁ బల్కు ప్రౌఢంగవియై పొల్పొందు నా
త్రసనాతనాకరుం డెవ్వాఁడు మహాత్మ్యంగ
వినుతింతుం గవితిక్కయజ్వ విబుధోర్వీదేవతన్
— ఎఱ్ఱాప్రెగ్గడ హరి

మతస్థితి-వాఙ్మయము

భారతమే యాంధ్రభాషలో మొదటియుద్గ్రంథమగుటకుఁ గల కారణములను దెలిసికొనవలయునన్నచో నాకాలమునను, నంతకుఁ బూర్వమున నీదేశమునఁగల మతస్థితిని కొంత తెలిసికొనవలసియున్నది. ఆంధ్రదేశమున నొకకాలమున నసఁగా క్రీస్తునకుఁ బూర్వము మూఁడు నాలుగువందల యేండ్లక్రితము బౌద్ధ జైన మతములు విశేషముగ వ్యాపించియున్నట్లమరావతి, జగ్గయ్యపేట, భట్టిప్రోలు మొదలగు ప్రదేశములందు బయలుదేఱిన స్తూపములు, శాసనములు మొదలగువాని వలననే స్పష్టమగుచున్నది. పురాణములలో నాంధ్రరాజులకు పూర్వమే యిక్ష్వాకువంశపురాజు లీదేశమును పాలించినట్లు గనఁబడుచుండుట చేతను, ఈయిక్ష్వాకువంశపురాజుల శాసనము లనేకము లిటీవల గవర్నమెంటువారు త్రవ్వించిన జగ్గయ్యపేట, శ్రీశైలసమీపమునఁ గల సిద్ధనాగార్జునకొండ ప్రాంతములందలి బౌద్ధస్తూపములలోఁ గానవచ్చుటంజేసియు నాకాలమున నీయాంధ్రదేశము పాలించినది యిక్ష్వాకులే యనియు; వారు గాఢమైన జైన బౌద్ధమతాభిమానముకలవారై యుండిరనియుఁ దెలియవచ్చుచున్నది. వారికాలముననే యాంధ్రదేశమునందలి యీస్తూపములు కట్టఁబడియుండును. భట్టిప్రోలుస్తూపమున బుద్ధదేవుని యస్థికలమతోఁ గూడిన రాతిబానలు బయలువడుటగూడ నీస్తూపముల యతిప్రాచీనతను బలపఱచుచున్నది. కర్ణాటభాషలోని 'ధర్మామృత' మను కావ్యమున క్రీస్తునకుపూర్వము అయిదవశతాబ్ది ప్రాంతమువాఁడును, 12 వ జైనతీర్థంకరుఁడు నగు వాసుపూజ్యమునికాల



౬. పంచమవేదమై పరగుభారతసంహిత నాంధ్రభాషఁగా
మించెఁ బదేను పర్వములు విశ్వజనద్ధితబుద్ధి నెవ్వఁడో
కాంచన నర్హతుఁడ్వాస ఫఖండితశక్తి నేఁ స్తరింతు ని
ల్పాంచిత కీర్తి నైన నిలాజికి దిక్కన సోమయాజికిన్.
-చేమకూర వేంకటకవి

మున జరిగినదిగాఁ జెప్పఁబడిన యిక్ష్వాకువంశపురాజగు యశోధరుని దక్షిణదేశదిగ్విజయము, వెంగీదేశపాలనమును బట్టి, యిక్ష్వాకులు క్రీస్తునకుపూర్వ మైదవశతాబ్దియందే వేంగిదేశము నేలినట్లు తెలియుచున్నదని బ్ర॥ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తలఁచుచున్నారు. (ప్రభవ సం. వృషభమాస భారతి) ఈ యిక్ష్వాకులును ఆంధ్రుల తెగలలోనివారే కావచ్చును. ఇక్ష్వాకు శాతవాహనాదినామములు వంశనామములును ఆంధ్రులనునది దండకారణ్యభాగమున నివసించుటం జేసి గలిగిన సామాన్యనామమునై యుండును. కావున నాంధ్రదేశమున జైనబౌద్ధమతోచ్ఛ్రదశ యీయిక్ష్వాకుల కాలముననే అనఁగా క్రీస్తునకు పూర్వము 4, 5 శతాబ్దములకు పూర్వముననే యయియుండును.

ఇక్ష్వాకుల తరువాత నీదేశమును పాలించి పెద్దసామ్రాజ్యమును సాధించిన యాంధ్రరాజుల కాలములో బౌద్ధజైనమతములే గాక బ్రాహ్మణమతముకూడ విజృంభింపసాగినట్లున్నది. ఆకాలములో జైనులు, బౌద్ధులు నెన్నెన్నిటికిఁబోయి మతప్రచారముసలుప మొదలిడిరో ఆయాదేశములకు వారివెంటనే బ్రాహ్మణ మతప్రచారకులుకూడఁ బోయి స్వీయమతప్రచారమును సలుపుచువచ్చిన ట్లగపడుచున్నది. ఎట్లయినను ఆంధ్రరాజు లనేకములగు బౌద్ధదేవాలయములను, గుహలను నిర్మించి వానకాలమునందు భిక్షువుల యుపాధికొఱకుఁగా ననేకములగు గ్రామములను భూముల నిచ్చియుండుటేగాక, వీరిలో పలువు రశ్వమేధ, గవామయనాది యజ్ఞములను చేసి బ్రాహ్మణులకు భూరిదక్షిణ లిచ్చియుండుటనుబట్టి యాకాలమున బ్రాహ్మణమతమునకును నెట్టియాదరము వ్యాప్తి కలదో తెలియఁగలదు. శివారాధనమును, విష్ణుభక్తియుఁగూడ ప్రబలముననే యున్నవి. బ్రాహ్మణమతమునకును బౌద్ధ

మతమునకును విరోధము లేక దేనిదారి నదిదేశమునఁ ప్రబలుచున్నవి.*
కాని యాంధ్రు లుత్తరదేశమునుండి వచ్చి యిచ్చటి దేశీయులతోఁ
గలసినవా రగుటచేఁ గాఁబోలు తమభాషను వదలక ప్రాకృతభాషనే
రాజభాషగాఁ జేసికొని తమశాసనములన్నిటిని ప్రాకృతముననే రచి
యింపఁజేసినారు.

ఆంధ్రసామ్రాజ్య మంతరించిన పిదప, నా యాంధ్రరాజుల
యొద్ద సేనానులుగాను, సామంతులుగాను నుండిన నాగవంశమువారి
లోనివాఁడగు శివస్కందనాగుఁ డనువాఁడు స్వతంత్రుఁడై కృష్ణా
కావేరీ మధ్యదేశమున కధిపతియైనట్లు శాసననిదర్శనమువలనఁ దెలియు
చున్నది. దీనినిబట్టి దేశీయజాతులుగూడ కొంతప్రబలములై యే యుం
డినవనియుఁ, గావుననే యిక్ష్వాకులు మొదలగు తెగలవా రుత్తరదేశము
నుండివచ్చి వీరిలో కలసిపోయి తమభాషనే రాజభాషగాఁ జేసినను,
దేశభాషయగు తెలుఁగు బొత్తిగా నశించిపోలేదనియుఁ దలంపవచ్చును.
ఈనాగరాజుల మూలముగా నాంధ్రరాజ్యము పల్లవులకు సంక్రమించి
నది. ఈపల్లవులు భారద్వాజులు, పరమబ్రహ్మణ్యులు, నని శాసనము
లవలనఁ దెలియుచున్నది. వీరిలోఁ గొందఱు శైవమతాభిమానులును,
మఱికొందరు వైష్ణవమతాభిమానులుగను గూడ గనఁబడుచున్నారు
మహేంద్రవర్మయను నాతఁడు మొదట జైనుఁడైయుండి శైవులను
బాధించియు, తరువాత శైవమతమునం దభిమానము కలుగుటచే జైనుల
నందఱను హింసించి వారి నివాసములను నిర్మూలించినట్లు గనఁబడు
చున్నది. మొత్తముమీఁద పల్లవరాజులందఱు శైవులై 'నంది'నే వంశ
చిహ్నముగా గ్రహించి బ్రాహ్మణమతమునే విశేషముగ ప్రోత్స

* D. R. Bhandarkar: Dekkan of the Satavahana period. Ind. Ant. XLVII.(1918.)

హించిరనుటకు సందేహము లేదు. ఈకాలమున నీపల్లవులకు లోఁబడి
వేఁగిదేశభాగముల నేలిన శాలంకాయనులు మొదలగువారుకూడ
బ్రాహ్మణమతాభిమానులే యైయుండిరి. అయినను బౌద్ధమతముకూడ
వారికాలమున నుచ్చస్థితియందే యున్నది. కాని చాళుక్యుల ప్రభుత్వ
ముతోపాటు బౌద్ధమతమునకు క్షీణత్వమును, బ్రాహ్మణమతమునకు
ప్రాబల్యమును ప్రారంభించినవి. చాళుక్యులు మొదట నేలిన పశ్చిమ
దేశమం దింతపుఁబూర్వము చిరకాలమునుండియు జైనమతమునకు
ప్రాబల్య మెక్కువగానుండెను. అనఁగా చంద్రగుప్తుఁడు జైనమతమును
స్వీకరించి మైసూరులోని 'శ్రావణబెళగోళ'కు వచ్చిచేరినప్పటినుం
డియు నీకన్నడదేశము జైనమతమునకుఁ బట్టుకొమ్మయై యుండెను.
తరువాత కన్నడదేశము నేలిన ప్రభువులలో పలువురు జైన
మతావలంబకులే. గంగవంశపురాజులు, రాష్ట్రకూటులు, కాలచు
ర్యులు, హోసలరాజులును వీరందఱును జైనమతాభిమానులే యైయుం
డిరి. కావుననే కన్నడభాషలో నంత జైనవాఙ్మయము బయలుదేఱి
నది. బ్రాహ్మణమతావలంబకులగు కదంబులు, చాళుక్యులు నీజైనమత
మును సహనముతోనే చూచిరి గాని, ప్రతిఘటింపలేదు. దక్షిణ
మహారాష్ట్రదేశమునఁ గూడ జైనమతము విశేషముగ వ్యాప్తిలో
నున్నది. దక్షిణదేశమున మధుర నేలిన పాండ్యరాజులు జైనమతావ
లంబకులే. కావునసె ప్రాచీనకవులలో ననేకులు జైనులుండుట తట
స్థించినది. కాని తరువాతి కాంచీపురాధిపతులగు పల్లవులు, ఒర
యూరు తంజావూరు చోళులును వైదికమతాభిమానులగుటయేగాక
జైనమతమును బ్రతిఘటింపఁజొచ్చిరి. బ్రాహ్మణమతమునకు ప్రాబల్య
ము కలిగినకొలఁది వైదికకర్మలకు, తత్ప్రతిపాదకనిబంధనగ్రంథములకు
ప్రాధాన్యము హెచ్చి ధర్మశాస్త్రగ్రంథము లనేకములు బయలుదేఱినవి.

శివాలయములు, విష్ణ్వాలయములు ప్రతిష్ఠింపఁబడఁజొచ్చినవి. పురాణము
లయెడ నాదరము ప్రబలినది. భిన్న దేవతల ప్రాశస్త్యమును బ్రతిపాదించు
పురాణములకంటెను పంచమవేదం బనఁబరఁగిన భారతమునెడల జను
లకు గౌరవము హెచ్చినది. ఇదియొక యితిహాసంబగుటయేగాక, నన్న
పార్యుఁడు చెప్పినట్లుగా, సార్వజనీనంబై పరఁగుటం జేసి తక్కిన పురా
ణములకంటెను గూడ మొదటినుండియు సర్వజనాదరణపాత్రంబగుట
తటస్థించెను. కావుననే "పెరిందేవనార్" అను తమిళకవిచే నది
రామాయణముకంటెను ముందే దక్షిణదేశమున తమిళభాషలో గద్య
పద్యమయంబుగ రచింపఁబడినది. ఆ కాలమున తమిళభాషలో నీ
భారత భాషాంతరీకరణమే యప్పటి కా దేశమున నార్యమతమునకుఁ గలి
గిన ప్రాబల్యమును సూచించుచున్నది. ఇంతేగాక ఆకాలమున
భారతము దేవాలయంబులఁ బురాణముగాఁ జెప్పఁబడుచుండెడిదనియు,
జను లాదరముతో వచ్చి వినుచుండెడివారనియు, దక్షిణదేశమున పల్ల
వుల కాలములో నీయాచారము ప్రబలియున్నదనియుఁ జెప్పుట కేడవ
శతాబ్దియందు 'పరమేశ్వర వర్మ' యనునొక పల్లవరాజుచే నొక దేవా
లయమున భారతము పురాణముగాఁ జదివిచెప్పినవారికై యొక యూరి
లో నొక భాగము ప్రత్యేకింపఁబడినట్లుగాఁ దెలుపు తమిళభాషాశాసన
మొకటి యాధారమగుచున్నది. ఇట్లు దక్షిణదేశమునఁ గూడ నార్యమత
ము వ్యాపించినకాలఁది, తక్కిన పురాణములకంటెను భారతమునందును,
భారతపఠనమునందును నాదరము ప్రబలుచుండెను.

దక్షిణదేశమునను, కన్నడదేశమున నిట్లుండ, నాంధ్రదేశమున
ఆంధ్రులనాఁడే కొంతతలయెత్తసాగిన బ్రాహ్మణమతము తరువాత పల్ల
వులు మొదలగువారికాలమునఁ గ్రమముగ పెరుఁగఁజొచ్చి, చాళుక్యుల
పాలనమున బాగుగ విజృంభింపసాగినది. పూర్వచాళుక్యులీదేశము నాక్ర

మించిన కొద్దికాలమునకే, అనఁగా నేడవశతాబ్దముననే, వైదికమతము నందలి కర్మప్రతిపాదకంబగు భాగమును ప్రాముఖ్యములోనికిఁ దెచ్చి, యప్పటికే క్షీణింపఁదొడంగిన బౌద్ధజైనమతములను తీవ్రముగ ఖండించి తన్మతానుయాయులను హతమార్చి యాంధ్రదేశమున నామతములను నిర్మూలించుటకుఁ దోడ్పడిన కుమారిల భట్టాచార్యు లనువాఁడు వైదికమతమును, సంస్కృతభాషను తక్కినదక్షిణదేశభాగములలోకంటె దృఢముగ నెలకొనునట్లు చేయుటేగాక, వైదికమతమున కీదేశమున గట్టిపునాదులు వైచెను. దీనికి చాళుక్యరాజులు 'భగవన్నారాయణప్రసాదసమాసాదితవరాహలాంఛనులును, అశ్వమేధావభృథస్నానపవిత్రీకృతశరీరులు' నైన చాళుక్యప్రభువులు తగిన యవలంబన మొసఁగిరి. ఈ కారణముచే జైనబౌద్ధమతము లీదేశమున సంపూర్ణముగా నశించినవి. ఈ కుమారిలుని తరువాతికాలములో నద్వైతమతస్థాపనకై బయలుదేఱిన శంకరాచార్యుల పాషండమతఖండనములచే నీ మతము లీ దేశమునుండి నిశ్శేషముగా నంతరించినవి. ఇట్లు కుమారిలుఁ డాంధ్రదేశమునఁ బ్రారంభించినపని శంకరునిమూలముగాఁ దుదముట్టినది. రాజులయవలంబనంబైన లేకుండుటచే జైనమతమునం దభిమానముకలవా రీవేఁగిదేశమును విడిచి జైనమతప్రాబల్యముగల కన్నడదేశమునకుఁ బోయి యచ్చటిరాజుల యాశ్రయమును బడసిరి. పదియవశతాబ్ది మధ్యభాగమున నుండిన పంపకవికుటుంబముకు వారు వెంగిమండలమునందలి వెంగియను చక్రనిపట్టణమునకు సమీపమందలి (వేంగిపఱు పల్లపుప్రదేశమునందలి యని కొందఱి యభిప్రాయము) విక్రమపురాగ్రహారమున నివసించెడివారు. ఈతనితండ్రి యభిరామదేవరాయలు. ఈతని ముత్తాత మాధవసోమయాజి. ఈతఁడు యజ్ఞముచేసియుండునోపు. కాని అభిరామదేవరాయలు జైనమతమును స్వీకరించినవాఁడగుటచే నీ వెంగిమండలమును

బహుశః నిలువనీడలేక కన్నడదేశమునకు వలసపోయినట్లు కనఁబడు
చున్నది. కావున పంపయు తండ్రిమతమునే పరిగ్రహించినవాఁడైనను
బ్రాహ్మణమతద్వేషి కాఁడు. కావుననే వ్యాసభారతమును గ్రహించి
విక్రమార్జునవిజయ మనుపేర కన్నడమున రచించినాఁడు. ఇతర
కవు లనేకులు భారతమును గ్రహించి కొందఱు తమ వర్ణనా
చాతుర్యమును, మఱికొందరు కథాకథనచాతుర్యమును జూపుచు రచిం
చిరిగాని, మూలకథను పాడుచేయకుండ సమర్థతతో నీగ్రంథరచనా
కార్యమును నిర్వహింపఁగలవాఁ డొక్క పంపకవియే యని పండితులం
దఱు తలంచి యాతని బ్రోత్సహింపఁగా నాతఁ డీ భారతరచనకుఁ బూని
కొనిన ట్లవతారికలోఁ జెప్పికొనినాఁడు. *దీనినిబట్టి యీతనికిఁ బూర్వ
మనేకులు భారతకథను దేశభాషలో రచించినట్లును వానికంటె మూల
కథానుసారముగాఁ దాను రచింపఁదలఁచినట్లును గానవచ్చుటచే, నా
కన్నడదేశమునఁగూడ నాకాలమున భారతమున కట్టి ప్రచారము కల
దో స్పష్టమగుచున్నది. భారతము తన మతగ్రంథము కాకపోవుటచే
జైనమత ప్రతిపాదకంబగు 'ఆదిపురాణమును' గూడ మూఁడు నెలలలో
రచించినాఁడఁట. ఈపురాణరచననుబట్టి వ్యాసుని వలెనే యీతనికిని
'పురాణకవి' యను ప్రసిద్ధికలిగినది. ప్రభు వీతనికి బహుమానముగా
'ధర్మపురం' అను నగ్రహారము నిచ్చెను. ఈ 'ధర్మవరం' బళ్లారిజిల్లా
లోని 'ధర్మవరమే' కావచ్చునని రైసుదొరగా రభిప్రాయపడు

---

* కతె పిరిదాదొడం కథెయ మెయ్గిడ లీయదె ముం నిసు్తభా
రత మనపూర్వమాగె సలెపేళ్ద కవీశ్వరరెల్ల వర్ణకం
కతెయొళొడంబడం పడెయె పేళ్వొడె పంపనె పేళ్గుమెందు పం
డితరె తగుళ్ద బిచ్చళికె పేళి లొడర్చిదె నీప్రబంధమం

—విక్రమార్జునవిజయం I-11.

చున్నారు. ఇట్లీపంపకవి జైనమతాభిమానము కలవాఁడైనను, బ్రాహ్మణపక్షపాతియగు తన ప్రభువు కోరికచే నీ భారతమును రచించినవాఁ డయ్యెను.

ఈపంపకవికి సమకాలికుఁ డగు 'పొన్న' (పొన్నిమయ్య) యును వెంగిమండలమునకుఁ జెందినవాఁడే. వెంగిమండలములోని కమ్మె దేశములో(కమ్మరాష్ట్రము) పుంగనూ రనునది యీతని నివాసస్థానము. వీనిది కౌండిన్యసగోత్రము. తండ్రి నాగమయ్య. ద్విజోన్నతుఁడు. యాజ్ఞవల్క్యునితో సమానమగు వైదుష్యము ప్రజ్ఞ కలవాఁడు. కాని యీతనికి జైనమతాభిమానము కలిగినది. జైనుఁడైనాఁడు. కావుననే కన్నడదేశమునకుఁ బోయెను. ఈ పొన్నకవి కన్నడములోను, సక్కదము(సంస్కృతము)లోనుగూడ కవిత చెప్పఁగలవాఁడగుటచే "ఉభయకవి చక్రవర్తి" యను బిరుదమును రాష్ట్రకూటరాజగు 'కృష్ణు'నివలనఁ బడసెను. ఈతఁడు 'శాంతిపురాణము' రచించెను. ఈతని యన్న కుమార్తె యీగ్రంథము నశించిపోకుండుటకుఁగాను నామె తండ్రి మల్లప్ప యనువాఁడు చనిపోయిన సందర్భమున నీశాంతి పురాణమునకు వేయిప్రతులు వ్రాయించి పంచిపెట్టినదఁట. వేంగిమండలమును విడిచి కన్నడదేశమునకుఁ బోయినవారిలో నాగవర్మ మఱియొకఁడు.

ఆంధ్రవాఙ్మయమున కవిత్రయమువలెనే, కన్నడ వాఙ్మయమున రత్నత్రయమని చెప్పఁబడువారిలో మూఁడవవాఁడు 'రన్న'. ఈతఁడు 'అజితతీర్థేశ్వరచరిత్ర' మొదలగు జైన తీర్థంకర పురాణములను గొన్ని రచించినాఁడు. ప్రస్తుతము మనకు ముఖ్యమైనవిషయ మేమనఁగా, నీ రన్నకవి పంపకవి వలెనే భారతకథను గ్రహించి 'సాహసభీమవిజయ' మను పేరుతో చాళుక్యప్రభువగు సత్యాశ్రయుని (997-1008) నాయకునిగా నుద్దేశించికొని, 10 యాశ్వాసముల కావ్యముగా రచించెను.

ఇది రన్నకవి రచితమగు గదాయుద్ధమనియుఁ జెప్పఁబడుచుండును. ఈ సత్యాశ్రయుఁడు 11 వ శతాబ్ది ప్రారంభమువఱకు నున్నవాఁడగుటచే రాజరాజనరేంద్రునికి పాతికముప్పదిసంవత్సరములు పూర్వపువాఁడై యుండును. కావున రన్నకవియు నన్నయకు పూర్వము సుమారు ముప్పదిసంవత్సరముల వెనుకటివాఁ డగును. పంపకవియు తన విక్రమార్జున విజయమును 941 లో రచించినట్లు చెప్పియుండుటచే నీతఁడు నన్నయకు సుమారు నూఱుసంవత్సరముల వెనుకటివాఁడై యుండును. కావున నన్నయకు పూర్వము కన్నడమున భారతము రచించిన కవులలో నొకఁడు. దాదాపు సమకాలికుఁడే. ఒకఁడు నూఱేండ్లచే పూర్వుఁడు. జైనమత ప్రాబల్యముగల కన్నడదేశమునఁగూడ వ్యాసభారతమె ఆదికవి యని చెప్పఁదగినంతటి సుప్రసిద్ధకవిచే మొదట రచింపఁబడుటచే నీగ్రంథమున కాకాలమునఁగల ప్రాచుర్యము, చాళుక్యుల వైదిక మతాభిమానమునుకూడ వ్యక్తమగుచున్నవి.

## భారతరచన-అవతారికలు

ఇట్టిపరిస్థితులలో నిప్పటికి చిరకాలమునుండి బ్రాహ్మణ మతమునకుఁ బట్టుకొమ్మయై జైనబౌద్ధమతములను నిర్మూలనము గావించిన కుమారిలునికి జన్మభూమియై యున్న వేగిదేశములో, అనఘమై, శిష్టాగ్రహార భూయిష్ఠమై, ధరణీసురోత్తమాధ్వరవిధానపుణ్యసమృద్ధమై పొలుచు వేగీదేశములో, నాయకమణింబోలు రాజమహేంద్రవరమున నప్రతిహతుఁడై యేలుచున్న చాళుక్యకులావతంసుం డను రాజరాజనరేంద్రుఁడు, భూదేవకులాశీత్తర్పణ మహీయః ప్రీతియుక్, భారతశ్రవణాసక్తియు, శివపదాబ్జధ్యాన పూజా మహోత్సవమున్, సంతతదానశీలతయు, శశ్వత్సాధుసాంగత్యము నెల్లప్పుడు మనంబునఁబాయక మనుమార్గవర్తనుఁడై, పరమధర్మవిదుఁడై, సమస్తవర్ణాశ్రమధర్మరక్షణ

[illegible] మహా నొప్పు వంశవర్ధనుఁడగు విష్ణువర్ధనుఁడు, అవిరళ జపహోమ తత్పరుఁడు, సంహితాభ్యాసుఁడు, బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుఁడు, ఉభయభాషా కావ్యరచనాభి శోభితుఁడు [illegible] నన్నయభట్టుని [illegible]చి, పంచమవేదం బగు మహాభారతమును గాక [illegible] గ్రంథమును దనకుఁగ రచింపుమని యడుగఁగలఁడు? తక్కిన [illegible] పురాణములు గాని, అర్థ ధర్మశాస్త్రములుగాని, కావ్యనాటక ములుగాని, [illegible]ములుగాని, యాతని భావములకు, నుద్దేశములకు, నాద [illegible]గా లేవు. కావున నిన్నిగుణములను దనలో నిమిడ్చి [illegible]లకు ధర్మశాస్త్రంబని, అధ్యాత్మవిదులకు వేదాంత [illegible], [illegible] నీతిశాస్త్రంబని, కవులకు మహాకావ్య మని [illegible] సర్వలక్షణసంగ్రహమని, ఇతిహాసమని, సర్వపురాణ సముచ్చయ [illegible] మని చెప్పఁబడిన గ్రంథము మఱియొకటి [illegible], [illegible] యభిప్రాయంబు, నభిలాషయు [illegible] గలండేమ. ఇంతేగాక యీతనిది చంద్రవంశము. [illegible]లవారలో యనియు, నధికారము, [illegible] క్షత్రియజాతిలోఁ జేరి తమ వంశములను [illegible] ముడిపెట్టుకొనినారని శాసననిదర్శనములనుబట్టి [illegible] శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు చెప్పి [illegible] వి. ఏ. [illegible] మొదలగువారుకూడ మొదటి [illegible] పర్వతప్రాంతమున సపాదలక్ష దేశమునకు [illegible] క్షత్రియమని తెలుపుచున్నారు. మొత్తముమీద [illegible] నధికారమును బడసినపిదప క్షత్రియత్వ [illegible] సంభావ్యంబై యున్నది. కావుననే వీరికి [illegible] గానుండుటయు, నిచ్చట రాజరాజు తన

వంశమునుగూర్చి ప్రశంసాపూర్వకముగా భారతకథ తనవంశపురుషుల చరిత్రయె యని చెప్పుకొనుటయుఁ దటస్థించియుండును. అందులో నాతనికిఁ గావలసినది, విమలసద్గుణశోభితులగు పాండవోత్తముల చరిత్రను కృష్ణద్వైపాయనుఁడు చెప్పినట్లుగాఁ దెనుఁగునరచించుట. ఏలయనఁగా నీదినములఁ దాను విన్నకథలు బహుభాషలలో బహుభంగులై యున్నవి. కన్నడమునందలి భారతకథలలో నొకటి భారతకథ పేరనున్న యర్జునునికథ, రెండవది భీముని గదాయుద్ధకథ. కాని యివి పాండవోత్తముల చరిత్రలు కావు. తమిళభారత మెట్లున్నదో తెలియదుగాని యదియు నాతఁడు వినియుండును. రాజరాజునకుఁ గలిగిన చోళసంబంధమును బట్టియైనను తమిళభాషాగ్రంథములను, కవులను నీతఁడు చూచియుండకపోఁడు. ఈతనితరువాత కొంతకాలమునకు రెండవరాజరాజచోళుని కాలమున నారాజుతో 'కంబర్' అను సుప్రసిద్ధతమిళకవి యేకారణముననో విరోధించి యాంధ్రదేశమునందలి కాకతీయరాజ్యమునఁ జేరి తనకవితచే నందలి రాజును మెప్పించి, యాతనిని జోళరాజుపై దండెత్తునట్లు చేసెనని యొకకథ గలదు. కావుననే కొన్ని తెలుఁగుపదములు 'అక్కటా' 'తామర' మొదలగునవి యాతనిరామాయణమునఁ గానవచ్చుచున్నవని చెప్పుచున్నారు. దీనిని బట్టి పూర్వమున నాంధ్రరాజులకు తమిళకవితాపరిచయ మప్పుడప్పుడు కలుగుచుండె ననుటకు సందేహము లేదు. చోళులదండయాత్రలు, చాళుక్యులకు నందు రాజరాజునకు వారితోఁగలిగిన సంబంధమునుబట్టి యీతఁడు తమిళభారతమును వినియుండునని తలంపవలసియున్నది. ఈతనికి భారతశ్రవణాశక్తికరం బిష్టంబుగదా. ఈతనికే గాక యాకాలమునఁ బురాణశ్రవణము, పఠనము, వైదికమతవ్యాప్తి గలిగినచోట్ల నెల్ల మిగులనాదరింపఁబడుచుండిన ట్లిదివఱకే చూచియున్నాము. తన

భారతశ్రవణాసక్తికిఁ గలకారణమునుగూడ నీతఁడు వైదికమతానుగుణముగనె తెలుపుచున్నాఁడు. అమలసువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు నుత్తమబహువేదవిప్రులకు దానముచేసినఫలము భారతశ్రవణమువలన సమకూరునఁట. ఈయుద్దేశమే యాకాలమున విశేషముగాఁ బ్రబలియుండుననుటకు సందియములేదు. సామాన్యముగా భారతము సంస్కృతమునఁ జదువుట, దేశభాషలలో దానియర్థము చెప్పుటయే జరుగుచుండును. కాని తెనుఁగుననే రచింపఁబడిన జనులందఱు సులభముగఁ జదువుకొని యాఫలమును బడయుదురుగదా యని యాతఁడు తలంచియుండును. ఈయవతారికలో నెచ్చటఁ జూచినను కర్మపరమగు వైదికమతమే కనఁబడుచుండును. ఎంతవఱకును వర్ణాశ్రమధర్మతత్పరత, ఘనమార్గవర్తిత్వము, అగ్రజన్ములకు గోదానము, అగ్రహార దానము, భూదేవకులాభితర్పణము, పురాణశ్రవణము, యాగఫలసంపాదన ప్రయత్నము మొదలగునవే. నన్నయ తాను రచించిన భాగమంతయు నీదృష్టితోడనే రచించినాఁడు. ఎక్కడఁజూచినను మూలమునందున్నను, లేకున్నను, వైదికకర్మలను, వైదికాచారసంపత్తినె యెక్కుడుగాఁ బొగడుచుండును. అట్టిసందర్భములు ముందు చూపఁబడును. ప్రస్తుత మీతని కృత్యాదిశ్లోకమునే గ్రహింతము. ఇదియు నీతని వైదికతాభిమానమునే సూచించుచు త్రిమూర్తిస్తోత్రరూపమై యున్నది. గ్రంథప్రారంభము సంస్కృతభాషలోఁ జేసినచో దరువాతి తెలుఁగు రచన కపభ్రంశతాదోషము కలుగదని గాఁబోలు మొదటసంస్కృతశ్లోకమే రచించినాఁడు. అందుఁ బేర్కొనఁబడినవారు సృష్టిస్థితిలయకారకులగు త్రిమూర్తులు. వారు ప్రకృతిసహితులై శ్రీవాణీగిరిజలను వక్షోముఖాంగములందు ధరించి స్త్రీపుంసయోగోద్భవరూపమై యనాదియగు నీలోక వ్యవస్థను నడుపుచున్నవారు. వేదత్రయము వారి స్వరూపమే.

దేవత లందఱును వీరిని పూజింతురు. ఇట్లు పూజార్హులగు వై దికకర్మ మార్గము, సృష్టిస్థితిలయ కారకులగు మూ ర్తి త్రయమనే యిచ్చట ప్రాధాన్యమును వహించినవి. తరువాతను గూడ నీతఁడు హరిహరాజ గజాననార్క షడాస్యమాతృ సరస్వతీ గిరిసుతాదిక దేవతాతతికే నమస్కృతులఁ దెలిపినాఁడు. ప్రాచీనసంప్రదాయపద్ధతిని 'ఆదిత్యం మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం' అని పంచాయతమును స్మరించి చాళుక్యరాజుల కులదైవతంబులని గాంబోలు షడాస్య, మాతృకలకుఁ గూడ నమస్కరించినాఁడు. క్రీ. శ. 616 సం.పు సతారా దాన శాసనములో కుబ్జవిష్ణువర్ధనునకు నాతని పూర్వులకు 'కార్తికేయుఁడు' రణాధిదేవతయనియు, సప్తమాతృకలు కులదైవతములనియు, నీ కులమువారు వారిచే రక్షింపఁబడుచున్నారనియుఁ దెలుపఁబడియున్నది. కావున నేన్నయ వారిని గూడ స్మరించియుండును. పిమ్మట పరమవివేక సౌరభవిభాసితములును, సద్గుణపుంజవారిజోత్కర రుచిరంబులును, సకలగమ్య సుతీర్థములును, మనోహర సుచరిత్ర పావన పయఃపరిపూర్ణములునగు సత్సభాంతర సరసీననంబులను గొనియాడి, యావెంట నే సారలక్షణోదరణముయొక్క యౌపమ్యమును దెచ్చి నారాయణభట్టు సహాయముచే భారతసంహితఁ దెనుఁగున రచించుట యను మహాత్మ్యము నిర్వహింపఁబడిన దనుటచే, వివేకశూన్యులును, అసూయా పరత్వాదిదుర్గుణపుంజయుక్తులతోఁ గూడి సత్పురుషుల కగమ్యములగు మఱి కొన్ని సభాంతరములయందు భారతసంహితను దెనుఁగుచేయు విషయమగు వాదములు కలిగెననియు, నట్టి సందర్భముల నారాయణభట్టు నన్నయకుఁ దోడయినిల్చి, ప్రతిపక్షుల వాదంబున నోడించి, కన్నడ భాషా వాఙ్మయ సాదృశ్యంబును దెలిపి, దానివలెనే సంస్కృతభూయిష్ఠంబుగ, సంస్కృతఛందోవృత్తమార్గమున, భావరసాద్యలంకృతులతో నొప్పారిన సంస్కృతకావ్యంబుల సరణి ననుసరించి రచించునట్లుగాఁ

జేసి యీకార్యభారమును నిర్వహించెనని యూహింపఁదగి యున్నది. సభాంతరములందు జరిగిన వాగ్రణంబున నీతనికిఁ దోడయినిల్చి యాంధ్రీకరణ కార్యవిధానము నేర్పఱచి, యాయా సందర్భములఁ దగిన సలహా నిచ్చుచు నీగ్రంథరచనకుఁ దగిన ప్రోత్సాహమును కలుగఁ జేయుటచేతనే యీకార్యమును నారాయణభట్టు నిర్వహించి యుండును. భిన్నమతములవారిని సంతోషపెట్టవలయు ననుతలంపుతోనే, ప్రసన్నకథా కవితార్థయుక్తిలో నారసి కొందఱు, అది యక్కఱలేని కేవల మపభ్రంశవాదులగు సంస్కృతపండితులు సంస్కృతకావ్యములవలెనే యిచ్చటను గానవచ్చు దీర్ఘసమాస బాహుళ్యము, పదముల పొందిక, అక్షరరమ్యత, ధారాళ మృదుమధురశైలిని జూచి యీగ్రంథము నాదరింతురుగాక యని జగద్ధితముకొఱకు నన్నపార్యుఁడు తెనుఁగున భారతసంహితారచనబంధురుఁ డయ్యె నని తెలియుచున్నది.

ఇట్టికాలానుగుణముగా భారతకృతి భర్తయొక్కయు,కృతికర్తయొక్కయునుద్దేశము లేకమై యాంధ్రభాషలో నీతొలిరచన కొకవిధమగు వైదికతాగుణము నాపాదించినవి. తనభాగములో సమయముదొరకినపుడెల్ల నన్నపార్యుఁడు, అవిరళజపహోమతత్పరుఁడు సంహితాభ్యాసుఁడు నగు నన్నపార్యుడు, దీని విశేషలక్షణములను ప్రత్యేకశ్రద్ధతో సముకూర్పకవదలిపెట్టలేదు. ఇంతేగాక తన్మతపోషకుండైన తనప్రభుని, వర్ణాశ్రమధర్మరక్షణ మహోమహిమాఢ్య మహినొప్పు మనుమార్గుఁ డగు విష్ణువర్ధనుని—విశేషగుణములనే యాయా సందర్భముల నాయారాజులకుఁ గూడ నాపాదించి వర్ణించుచు జనమేజయునివలెనే యా భరతవంశీయుఁడే యగు నీరాజరాజును ఆతని ప్రశస్తిని వర్ణించినవాడైనాఁడు. జనమేజయుఁడు వైశంపాయను నడిగినట్లే రాజరాజును *పూరు భరతేశ కురు ప్రభు పాండు భూపతుల్ క్రమమున వంశకర్త

లనఁగా మహి నొప్పిన యస్మదీయ'వంశజులయిన పాండవుల చరిత్రఁ జెప్పుమనిగదా నన్నయ నడిగినది. ఈతనికిఁ బూర్వము 100 సంవత్స రములనాఁడు పశ్చిమచాళుక్యవంశమునఁ జెందిన 'అరికేసరి'యు పంప వి నిల్లె యడుగఁగా నాతఁడా ప్రభుని పరాక్రమాది గుణములను ప్రకటించుట కనువగునట్లుగా కథను మార్చి, పరాక్రమశాలి యగు ర్జునునికిఁ బ్రాధాన్య మొసఁగి తనప్రభువు నతనితో నైక్యముచేసి ర్ణించుచు భారతకథను నడిపినాఁడు.* మఱియొకవిశేష మేమనఁగా, ాతఁడు వ్యాసభారతమునే యనుసరించి రచించుచున్నట్లు చెప్పి ను, తన ప్రధానోద్దేశము వేఱుగా నుండుటచేతను, స్వయముగఁ ాను జైనమతాభిమానము కలవాఁడై బ్రాహ్మణమతముపై ప్రత్యే ాదరభావము లేనివాఁ డగుటచేతను నన్నపార్యుఁ డత్యుత్సాహమును ాపిన సందర్భములనన్నిటిని బొత్తుగా వదలివేసినాఁడు. కేవలము ాండవులకు సంబంధించిన కథనుమాత్రమే గ్రహించి యం దర్జును కుఁ బ్రాధాన్య మిచ్చి రచించినాఁడు. అర్జునుఁ డొక్కఁడే ద్రౌపదిని వాహమాడుట, అర్జునునకే చివరకుఁబట్టాభిషేకమగుట యిందలి ముఖ్య శేషములు. మొదటిపర్వములలో వీరికథకు సాక్షాత్సంబంధము లేని ుపాఖ్యానములు, యయాతి, దుష్యంతుఁడు మొదలగు పూర్వరాజుల రిత్రలు మున్నగునవి లేవు. పంపకవియె యీగ్రంథము చివర నొక ధ్యాయములో నొక విషయసూచికను జేర్చినాఁడు. దానినిబట్టి

---

* ఎనెసందుం వీరవైరిక్షితిపగజఘటాటోప కుంభస్థలీభే
ద నను గ్రోద్భాసిభాస్వద్భుజ పరిఘుననారూఢసర్వజ్ఞనంపై
రి నరేంద్రోద్దామదర్పోద్ధళన ఘటననం నాయకంమాడిసంద
ర్జున నొళ్పోర్వీకథాభిత్తియనను నయదిం పేళలెందెత్తి కొండెం.
—విక్రమార్జునవిజయ 1-51.

## ఆంధ్రభారత కవితా విమర్శనము

తెలుఁగుభారతములో వైదికమతపోషకంబులైయున్న యెన్నివిషయములందు లేవో విదితముకాఁగలదు. ఆసూచిక యిట్లున్నది.

ఆదివంశావతార సంభవం, రంగప్రవేశం, జతుగృహదహనం హిడింబవధ, ద్రౌపదీ స్వయంవరం, వైవాహం, యుధిష్ఠిరపట్టబంధనం, ఇంద్రప్రస్థప్రవేశం, అర్జునదిగ్విజయం, ద్వారవతీప్రవేశం, సుభద్రాహరణం, సుభద్రావివాహం, ఖాండవవనదహనం, మయదర్శనం, నారదాగమనం, జరాసంధవధ, రాజసూయం, శిశుపాలవధ, ద్యూతవ్యతికరణ, వనప్రవేశం, కిమ్మీరవధ, కామ్యకవనదర్శనం, ద్వైతవనప్రవేశం, సైంధవబంధనం, చిత్రాంగదయుద్ధం, కిరాత దూతాగమనం, ద్రౌపదీవాక్యం, పారాశరవీక్షణం, ఇంద్రకీలాభిగమనం, ఈశ్వరార్జునయుద్ధం, దివ్యాస్త్రలాభం, ఇంద్రలోకాలోకనం, నివాత కవచాసురవధ, కాలకేయ పౌలోమవధ, సౌగంధిక కమలాహరణం, జటాసురవధ, ద్రోణచాపమోక్షణం, ద్రోణవధ, అశ్వత్థామ కర్ణవివాదం, కర్ణాభిషేకం, సంశప్తకవధ, కర్ణసూర్యలోకప్రాప్తి, శల్యాభిషేకం, భీమదుర్యోధన గదాయుద్ధం, దుర్యోధనవధ, స్త్రీపర్వం, అర్జునాభిషేకం.

దీనినిబట్టి భారతకథారచనలో పంపకవిదృష్టికిని నన్నయదృష్టికిని చాలభేద మున్నట్లగపడుచున్నది. ఇట్లే నన్నయదృష్టికిని తిక్కనార్యుని దృష్టికిని భేదము కలదు. ఆయా కవుల దేశకాలపరిస్థితులను బట్టియు, వారివారి దృక్పథములను బట్టియు నొక్క భారత కథారచనయే యనేకరూపములఁ బొందుచువచ్చినది. ఒకకవి యర్జునుని పరాక్రమమందుదృష్టితో భారతకథను రచించెను. మఱియొకఁడు భీమబలమందు దృష్టితో రచించెను. మఱియొకఁడు వర్ణాశ్రమధర్మరక్షకుఁడును, ధర్మమతోద్ధారకుఁడు నగు ధర్మరాజునందు ప్రత్యేక గౌరవము కల

వాఁడై పాండవోత్తములచరిత్రను వైదికదృష్టితోఁ జూచి రచించి నాఁడు. మఱియొకకవి యద్వైతభావమునం దభిరుచిగలవాఁడై కావ్య కళాదృష్టితో నీభారతకథాభాగమును రచించెను. ఇంకను 13 వ శతాబ్దమున కన్నడకవియగు సాళ్వుఁడు 'సాళ్వభారతమును' జైనమతా నుకూలదృష్టితో రచించినాఁడు. జైనభారతమని మఱియొకటి తరువాతి కాలమున బయలు దేఱినది. ఆంధ్రమునఁగూడ అనర్వాణుఁ డేకభారత మును రచించినాఁడుగదా. ఈ కాలమున మూలానుసరణమందు ప్రత్యేకదృష్టితో శ్రీకృష్ణభారతమొకటియు రచింపఁబడుచున్నది. ఆకాలమున మనుమార్గవర్తనుఁడగు రాజు కోరికను చెల్లించుటకును, పండితుల ప్రీతికొఱకును, వైదికమతవ్యాప్తికొఱకును మహాభారతబద్ధ రూపితార్థ మేర్పడునట్లుగా రచించుటయె వైదికాధ్యయన సంపత్తి గల నన్నయపని యైనది. ఆతని వైదికదృష్టికి నిదర్శనములను గొన్నింటిని పరికింతము.

1. మొట్టమొదట వేదవ్యాసుఁ డాదిముని పరాశరాత్మజుండు విష్ణుసన్నిభుండు భారతము విశ్వజనీనమై పరఁగునట్లుగాఁ జేసె నని చెప్పుచు, నీ భారతమునకును వేదములకుఁ గల సంబంధము నిట్లు చెప్పి నాఁడు: "కృష్ణద్వైపాయనుండు తొల్లి వేదంబు లేకీభూతంబులై యేర్పడకున్న ఋగ్యజుస్సామాథర్వణంబులుగా విభాగించి వేదవ్యా సుండై, నిజతపోమహత్త్వంబునం జేసి బ్రహ్మచే ననుజ్ఞాతుండై, యష్టాదశ పురాణములును, చతుర్వేదవేదాంతాభిప్రాయంబులును, చతుర్వర్గ సాధనానుబంధురకథేతిహాసంబులును, జతుర్వర్ణాశ్రమధర్మక్రమంబు లును, శ్రీకృష్ణుని మాహాత్మ్యంబును, పాండవాది భారతవీరుల గుణంబు లును విమలజ్ఞానమయంబగు వాఙ్మర్పణంబునం దేర్పడి వెలుంగుచుండ రచించెనని చెప్పుటచే నీ నన్నయదృష్టిలోఁ బ్రాధాన్యమును వహించిన

విషయము లేవో వ్యక్తమగుచున్నవి. ఇది ముఖ్యముగా ధాత్రీసుర ప్రార్థ్యమఁట.

"అమితాఖ్యానకశాఖలం బొలిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహావర్గచతుష్కపుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణకీర్తనార్థఫలమై ద్వైపాయనోద్యానజా
త మహాభారతపారిజాత మమరున్ ధాత్రీసురప్రార్థ్యమై."

2. అగ్ని యాత్మసంహారమును గావించినపుడు.

"ద్విజానామగ్నిహోత్రేషు యజ్ఞసత్రక్రియాసు చ
నిరోంకారవషట్కారాః స్వధాస్వాహావివర్జితాః
వినాగ్నినా ప్రజాస్సర్వాస్తత ఆసన్సుదుఃఖితాః."

అను దానిని

"త్రేతాగ్ను లెల్లను దేజరిల్లమిఁ జేసి
క్రతుకృత్యములు వినిర్గతము లయ్యె
నగ్నిహోత్రములందు నౌపాసనాదిసా
యంప్రాతరాహుతు లంత నుడిగె
దేవతార్చనలందు దీపధూపాది స
ద్విధులు సత్రిల్లక విరతిఁ బొందెఁ
బితృకార్యములఁ బితృపిండయజ్ఞక్రియ
లడఁగి విచ్ఛిన్నంబులై ధరిత్రి
నంత జనులు సంభ్రమాకారులై మహా
మునుల కడకుఁ జనిరి మునులు నమర
వరులకడకుఁ జనిరి వారును వారును
బ్రహ్మకడకుఁ జనిరి భయము నొంది."

అని మూలమునలేని యజ్ఞోపాసనాదికము, దేవతార్చన దీప ధూపాదులను ప్రశంసించుచు నత్యుత్సాహముతో వర్ణించినాఁడు. ప్రమద్వర సర్పదష్టయై మృతినొందఁగా నామెకొఱకై రురుండు దుఃఖించు సందర్భమున

"యది దత్తం తపస్తప్తం గురవో వాసురయా యది
సమ్యగారాధితా స్తేన సంజీవతు మమ ప్రియా"

అను దానియర్థమును

"అలయక యేను దేవయజనాధ్యయనవ్రతపుణ్యకర్మముల్
సలుపుదునేని నేను గురుసద్ద్విజభక్తుఁడనేని నేనయ
త్యలఘుతపస్వినేని దివిజాధిపభూసురులార మన్మనో
నిలయపు నీ ప్రమద్వరవు నిర్విషయయ్యెడు నేఁడు మీదయన్"

అని పెంచి రచించుచు నందు 'దేవయజనాదులను' ప్రశంసించినాఁడు.

3. తక్షకుఁడు కశ్యపుం గ్రమ్మఱించి పరీక్షితునొద్దకు నాగకుమారులం బనుపుసందర్భమున

"తత స్తాపసరూపేణ ప్రాహిణోత్స భుజంగమాన్
ఫలపత్రోదకం గృహ్య రాజ్ఞే నాగోఽథ తక్షకః
గచ్ఛధ్వం యూయ మవ్యగ్రాః రాజానం కార్యవత్తయా
ఫలపత్రోదకం నాగాః ప్రతిగ్రాహయతుం నృపం."

ని తాపసరూపమునఁ బంపినట్లుండఁగా, తెలుఁగున "నాగకుమారులం )చి మీరలు విప్రులరయి పరీక్షితు పాలికిం జనుం"డని చెప్పిన న్నది.

ప—"తే తక్షకసమాదిష్టా తథా చక్రు ర్భుజంగమాః
ఉపనిన్యు స్తథా రాజ్ఞే దర్భానంభః ఫలానిచ"

అని యుండ, నన్నయ

> "ద్విజవరులం గుమారుల నతిప్రియదర్శను లైనవారి ఋ
> గ్యజుషపదక్రమంబులు క్రియన్ గుణియించుచు వచ్చువారి నా
> గ్గజపురవల్లభుండు గని గ్రక్కున డాయఁగఁ బిల్చి మెచ్చి భా
> వజసుభగుండు నేకొనియె వారలు దెచ్చినవాని నన్నిటిన్"

అని యా ద్విజవరులు 'ఋగ్యజుషపదక్రమంబులను గుణియించుచును వచ్చినారని' వర్ణించినాఁడు.

**4. పరీక్షిన్మరణోత్తరమున జనమేజయ రాజ్యాభిషేకము.**

"సౌతి రువాచ:

> "హతే నృపే తక్షకతేజసా హ తే
> ప్రయుజ్య సర్వాః పరలోకసత్క్రియాః
> శుచిర్ద్విజో రాజపురోహిత స్తదా
> తస్యైవ తే తస్య నృపస్య మంత్రిణః
> నృపం శిశుం తస్య సుతం ప్రచక్రిరే
> సమేత్య సర్వే పురవాసినో జనాః
> నృపం య మాహు స్త మమిత్రఘాతినం
> కురుప్రవీరం జనమేజయం జనాః
> స బాల ఏ వార్యమతి ర్నృపోత్తమః
> సహైవతై ర్మంత్రిపురోహితై స్తదా
> శశాస రాజ్యం కురుపుంగవాగ్రజో
> యథాస్య వీరః ప్రపితామహ స్తథా."

ఇట్లు మూలమున నుండఁగా తెలుఁగున జనమేజయుని గూర్చిన స్తోత్రపాఠ మొకటి యీసందర్భమునఁ గనఁబడుచున్నది.

పైశ్లోకములు సౌతి చెప్పినట్లుండ, మరల 49వ అధ్యాయములో మేజయుండడుగఁగా మంత్రులు పరీక్షిచ్చరితము నాతనికిఁదెలిపిన ర్నది. ఈరెంటిని గలిపివేసి చెప్పినకథనే మరల చెప్ప నవసరము లే మ, మంత్రులచేతనే చెప్పించినాఁడు నన్నయ. కాని యీసందర్భము నైనను మంత్రు లీక్రిందిపద్యముల యర్థమును జెప్పినట్లు లేదు.

"శ్రుత్వా తు నరశార్దూల విధత్స్వ యదనంతరం"

అని మాత్రమే చెప్పియున్నారు. కాని నన్నయ యెట్లు పెంచి వో చూడుఁడు:

"అట్లు భుజగజనకుండు పరలోకగతుండైనఁ బురోహితపురస్స కభూసురవరులు యథావిధిం బరలోకక్రియలు నిర్వర్తించి రంత

"ఆయుష్మంతుఁడవై ల
క్ష్మీమయుతబాల్యంబునంద మీయన్వయ రా
జ్యాయత్తమహీభారం
బాయతభుజ నీవు దాల్చి తభిషిక్తుఁడవై.

ంచితి ధర్మమార్గమునఁ బ్రీతియొనర్చితి ధారుణీప్రజ౯
ంచి తనేకయాగముల మానుగ దక్షిణ లిచ్చి విప్రుల౯
చితి సజ్జనస్తుతుల నిర్మల మైనయశంబు దిక్కుల౯
చితగుణ్య సర్వగుణసంపద నెవ్వరు నీ సమానులే.

దన కిట్టిపాటి యపకారము దక్షుఁడేకవిప్రసం
ధనఁ జేసి చేసె నృపపుంగవ నీవు ననేకభూసురా
శిత సర్పయాగమున భస్మము చేయుము తక్షకాదికా
రర సంహతి౯ హుత వహోగ్రసముగ్రశిఖాచయంబుల౯.
జనమేజయుండు కోపోద్దీపితచిత్తుండయి సర్పయాగంబు సేయ
రి."

మూలములో మంత్రులు 'విశత్స్వయదనంతరం' అని చెప్పిరేగాని, "వీకవిప్రసంబోధన", "అనేక భూసురాపాదితసర్వయాగము" ఇత్యాది భూసుర ప్రశంస లేనేలేదు. పై రెండుపద్యములలోని సంబోధనయు లేదు. నన్నయ యిచ్చటఁదనప్రభువగు రాజరాజుకూడజనమేజయునివలె భారతవంశీయుఁడే గావున, నాతనిని గీర్తించు నెపమున మూలమున లేకున్నను జనమేజయుని ప్రశస్తినిచ్చట సర్ణించినవాఁడువలెఁగనఁబడుచున్నాఁడు. పై యుత్పలమాలలోని ప్రశంసావైఖరి యవతారికలోని 'నిజమహీమండల ప్రజఁబ్రీతిఁబెంచుచు', 'విప్రకులము నెల్లఁబ్రోచుచుఁ', 'నగ్రజన్ములకు ననుగ్రహమునఁ జారుతర మహాగ్రహారంబు లిచ్చుచు', 'బహుయాగఫలంబు పరమార్థమిలక్ష' ఇత్యాది రాజరాజు ప్రశస్తి వాక్యములనే దలపించుచున్నది. దీనిని బట్టి పంపకవివలెఁ బ్రత్యేకముగాఁ జెప్పకున్నను, తనప్రభువునే యుత్తమనాయకునిగా మనంబున నిడికొని యాతని 'వర్ణాశ్రమ ధర్మరక్షణ మహానుహిమాది గుణముల' నే ఆయాసందర్భముల నాయారాజుల కాపాదించి కీర్తించుచుండిన ట్లగపడుచున్నది. మూలములో లేక యింతకుఁబూర్వ మీతఁడు రాజనరేంద్రునిగూర్చి చేసిన గుణప్రశంసయే యీ జనమేజయునిగూర్చి చేసిన ట్లుండుటయే దీనికి నిదర్శనము. ఇంక నిట్టివి గలవు.

5. తనను వివాహమాడమని యడిగిన దేవయానికి యయాతి యిట్లనుచున్నాఁడు:

"విద్ధ్యౌశనసి భద్రం తే న త్వా మర్హోస్మి భామిని
అవివాహ్యాహి రాజానో దేవయాని పితు స్తవ
హన్తి విప్రాః సరాష్ట్రాణి పురాణ్యపి హి కోపితాః."

కాని నన్నయ తెలుఁగులోఁ దన కాదర్శపురుషుండగు నాయకుని గుణకీర్తనంబున కీసందర్భము నెట్లుపయోగపఱచుకొనినాఁడో చూడుఁడు. తెలుఁగులో యయాతి ధర్మబద్ధుఁడు, ధర్మరక్షకుఁడు.

"క్షత్రియకన్యకల బ్రాహ్మణులు వివాహంబగుదురుగాక, యథరోక్తోత్తరంబుగా క్షత్రియులు బ్రాహ్మణకన్యకల వివాహం బగుదురే నీపలుకులు ధర్మవిరుద్ధంబులు. మఱియు సర్వవర్ణాశ్రమధర్మంబులు సంకరంబులుగాకుండ రక్షించుచున్న యేన యిట్టి యధర్మంబున కొడంబడితి నేని జగత్ప్రవృత్తి విపరీతంబగు" అని చెప్పినాఁడు. క్రింద గీటుగీచిన భాగమునందలి యర్థమునకు సరియైన భాగము మూలమున లేదు సరిగదా, అందలి యయాతి స్వధర్మరక్షణముకంటె విప్రశాపమున కెక్కుఁడు భయపడినట్లు తెలియుచున్నది. నన్నయ యాతని ధర్మపరత్వము, ధర్మరక్షకత్వమునుగూడ సాధించినాఁడు. తన వైదిక ధర్మపరత్వమును ప్రకటించినాఁడు.

6. జనమేజయుఁడు సేయు సర్పయాగమునకు, అస్తీకుఁడు "వాసుకిప్రముఖుల నెల్ల నాశ్వాసించి సకలవేదవేదాంగపారగులయిన విప్రవరులతోడం జనుదెంచి స్వస్తివచనపూర్వకంబుగా జనమేజయు నిట్లు స్తుతించెనని తెలుఁగునఁ గలదు.

"రజనీనాథకులైకభూషణుఁడవై రాజర్షివై ధారుణీ
ప్రజనెల్లన్ నయతోడ ధర్మచరితం బాలించుచుం దొంటి ధ
ర్మజు నాభాగు భగీరథున్ దశరథున్ మాంధాతృరామున్ రఘున్
విజయుం బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారిక్షితా."

సంస్కృతమున—

"తత స్స వాసుకే ర్ఘోర మపనీయ మనోజ్వరం
ఆధాయ చాత్మనోఙ్గేషు జగామ త్వరితో భృశం
జనమేజయస్య తం యజ్ఞం సర్వైస్సముదితై ర్గుణైః."

అని యాతఁడు త్వరితముగాఁ బోయిన ట్లగపడుచున్నదేగాని "సకల వేదవేదాంగపారగులయిన విప్రవరులతోడం జని"న ట్లగపడదు. ఈవిశే

షణము నన్నయ స్వయముగాఁ జేర్చినదే. తరువాతి సంబోధనపద్య మునఁ గూడ నన్నయ సొంతకల్పన కొంత కలదు.

**7.** దుష్యంతుఁడు కణ్వుని యాశ్రమమును బ్రవేశించు సందర్భమునఁ జేయఁబడిన యాశ్రమవర్ణనము మూలమునను విశేషముగాఁ జేయఁబడినను, అది ముఖ్యముగాఁ బ్రకృతి సౌందర్యమును వర్ణించు నదిగా నున్నది. కాని నన్నయ తనకభిమతములగు విషయములనే యేరి కొని యిచ్చట పొందుపఱచినాఁడు.

"ఇట్లు హృదయసుఖావహంబగుచున్న యవ్వనంబులో నరిగి యరిగి యనవరతమహాద్విజపఠ్యమాన పదక్రమవేదధ్వనులును, నవిచ్ఛిన్న హూయమానాగ్నిహోత్ర స్వాహాశబ్దంబులును, ననేకమునిగణప్రణీత వచన విషయవిభాగ వినిర్ణయ న్యాయనిపుణవిద్వత్సంభాషణ ఘోషంబులును, ప్రతిపక్షదుర్విభేద విచార్యమాణప్రమాణ వేదార్థమీమాంసకగోష్ఠీవివాదనాదంబులునుం జేసి మ్రోయుచున్న......కణ్వమహాముని యాశ్రమంబు" గని,

"శ్రవణసుఖంబుగా సామగానంబులు
 సదివెడు శుకముల చదువు దగిలి
కదలక వినుచుండు కరులయు గరికర
 శీతలచ్ఛాయఁ దచ్ఛీకరంబు
కణముల చల్లని గాడ్పాసపడి దానిఁ
 జెంది సుఖంబున్న సింహములయు
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
 పెట్టు నీవారాన్న పిండతతులు
కడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడు
చున్న యెలుకలపిల్లల యొండుసహజ

వైరిసత్త్వంబులయు సహవాస మపుడు
సూచి మునిశక్తి కెంతయుఁ జోద్య మందె."

పదక్రమములతోఁగూడిన వేదపఠనము మొదలగు విశేషణములే గాక మూలమునలేని యర్థముగల యీసీసపద్యమును బుష్యాశ్రమవర్ణనాసందర్భమున మిగుల చమత్కారముగా పొందుపఱచినాఁడునన్నయ.

8. అంగారపర్ణుఁడు పురోహితవరణావశ్యకతను గూర్చి యర్జునున కుపదేశించుటలో మూలముననే

"అనగ్న యో౽ అనాహుతయో నచ విప్రపురస్కృతాః
యూయం తతో ధర్షితాస్థ మయా వై పాండునందనాః
తస్మాత్తాపత్య యత్కించిన్నృణాం శ్రేయఇహేప్సితం
తస్మిన్ కర్మణి యోక్తవ్యా దాన్తాత్మానః పురోహితాః
వేదే షడంగే నిరతాః శుచయః సత్యవాదినః
ధర్మాత్మానః కృతాత్మానః స్యుర్నృపాణాం పురోహితాః
జయస్య నియతో రాజ్ఞః స్వర్గశ్చ తదనంతరం
యస్య స్యాద్ధర్మవిద్వాగ్మీ పురోధాః శీలవాన్ శుచిః
పురోహితం ప్రకుర్వీత రాజా గుణసమన్వితం."

అని పురోహితుని గుణములనుగూర్చి విశేషముగాఁ జెప్పఁబడి యున్నది. ఈసందర్భమును నన్నయ యుత్సాహపూరితుఁడై రచించుటలో నాశ్చర్యములేదు. తిక్కనకు యుద్ధాదివర్ణనా సందర్భమునవలె నన్నయకు వైదిక ధార్మిక విషయవర్ణనాసందర్భమున నుత్సాహము పెరుఁగునట్లుగానవచ్చెడిని.

"అనవద్యవేదవేదాంగ విశారదు
జపహోమయజ్ఞప్రశస్తు సత్య

జపము విప్రోత్తము వర్గచతుష్టయ
సాధనమ్ము సదాచార సూరి
సేవ్యుఁ బురోహితుఁ జేసినభూపతి
యేలు నుర్వీతలంబెల్ల నిండుఁ
బరలోకమునఁ బుణ్యపరుల లోకంబులు
పొందెయు జయస్వర్గఫలము సూవె
రాజ్యసుడెయు సర్వరాసురవిరహితుఁ
డయిన పతికిఁ గేవలాభిజాత్య
శౌర్యమహిమనడయ సముకూలునయ్య, తా
వత్య నిత్యసత్యభాషణుండ.

“మీరలు ధర్మవిదులరు వేదవేదాంగపారగుండయిన భారద్వాజు శిష్యుల రఖిలలోకహితులరుం గావునం బురోహితత్వ హితులై యుండఁ దగుదు. మఱియుఁ గాను ప్రప్తుండయ్యును మహీపతి మహీసుర జన పురస్సరుం డగునేని నెల్లయుద్ధంబుల శత్రులం జయించు.

“వేదము వేదియుం గలుగు విప్రవరేణ్యుఁ దగణ్యపుణ్యసం
పాది పురోహితుండయినఁ బాపము వొందునె భూపతిం బ్రతా
పోదయ కాన మీరు సుగుణోన్నతికిం దగుధర్మతత్త్వసం
వేదిఁ బురస్కరింపుఁడు పవిత్రచరిత్రు మహీసురోత్తమున్.”

అని తెలుఁగునఁ గలదు. ఇచ్చట సమయానుకూలముగా “జప హోమసమజ్ఞ ప్రశస్తసత్యవచను విప్రోత్తము” మొదలగు విశేషణము లచ్చో మూలమున పెంచినాఁడు. ఇది తననుగూర్చి మొదటఁ జెప్పఁ బడిన జపహోమపరత్వము, సంహితాధ్యాయు, నిత్యసత్యవచను, ఇత్యాది విశేషణములను దలఁపించుచున్నది.

9. వేంగీదేశ విభవమును గూర్చిన వర్ణనము మూలములో లేదు.
స్వీయ దేశాభిమానముచే నన్నయ రచించినాఁడు. మూలములో

కళింగా నతిక్రమ్య దేశా నాయతనానిచ
హేంద్రపర్వతం దృష్ట్వా తాపసై రుపశోభితం
దావర్యాం తతః స్నాత్వా తా మతీత్య మహాబలః
'వేరీం తాం సమాసాద్య సంగమే సాగరస్యచ.—"

అని గోదావరీప్రశంసమాత్రమే కలదు. "కతిపయ బ్రాహ్మణ
ండై పార్థుం డరిగి పూర్వసముద్రతీరంబున పురుషోత్తమ దేవునకు
-రించి మహేంద్రపర్వతంబు సూచుచు—"

ళింగగంగనాఁ దద్దయు నొప్పిన
గోదావరియు జగ దాదియైన
మేశ్వరంబును బెడఁ గగుచున్న శ్రీ
పర్వతంబును జూచి యుర్విలోన
ఘమై శిష్టాగ్రహారభూయిష్ఠమై
ధరణీసురోత్తమాధ్వరవిధాన
్యసమృద్ధమై పొలుచు వేఁగీదేశ
విభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి
ాంబురాశితీరంబున కరిగి దురిత
రియైన కావేరీ మహాసముద్ర
గమంబున భూసురేశ్వరుల కభిమ
ర్థదానంబుఁ జేసి కృతార్థుఁ డగుచు."

" ధరణీసురోత్తమాధ్వరవిధాన పుణ్యసమృద్ధ" మని చెప్పుటచే
లమున వైదికాచారప్రీతి యీదేశమున నెంత విశేషముగాఁ
స్పష్టమగుచున్నది.

10. "పలుదెఱంగుల పిండివంటలుఁ బప్పుకూడును నేతికుం
డలు గుడంబు-దధిప్రపూర్ణఘటంబులుం గొనివచ్చి యీ
నలఘు సత్త్వుఁడు మారుతాత్మజుఁ డన్నిటన్ గతఖేదుఁడై
బలము గల్గి కడంగె నప్పుడు బ్రాహ్మణార్థము సేయఁగాన్."

"ఇట్లు భీమసేనుం డిష్టాన్నభోజనంబునం దృప్తుండయి."

భీముఁడు చేసిన యిష్టాన్నభోజనము "బ్రాహ్మణార్థ"మనుటచే (బ్రాహ్మణుని ప్రయోజనముకొఱకు అని) అర్థమైనను ఇట్టి విశేషప్రయోగములుగూడ నీతని వైదికతాప్రవణంబగు దృష్టినే వ్యక్తము చేయుచున్నవి.

ఇట్లు నన్నయ్యకుఁ బూర్వమునను, సమకాలముననుగల పరిస్థితు లాతని యవతారికలో నెంతవఱకు సూచితములైనవో భారతరచన యం దాతని దృక్పథం బెట్టిదో పరిశీలించియున్నాము. ఇఁక నన్నయ తరువాతికాలపు పరిస్థితులు, నన్నయచే నసంపూర్తిగ విడువఁబడిన భారతరచన, మరల తిక్కనార్యునికాలమువఱకు నెవ్వరిచేతను జేపట్టఁబడకుండుటకుఁగల కారణములను, తిక్కనకాలస్థితి యాతని యవతారిక యం దెంతవఱకు సూచింపఁబడినది తెలిసికొనవలసియున్నది.

నన్నపార్యుఁడు భారతాంధ్రీకరణవిషయకమగు నభ్యంతరముల నన్నిటిని దాఁటి నారాయణభట్టు సహాయముచేతను, రాజావలంబనము చేతను భారతభారతీసముద్రముఁ దఱియంగ నీదమొదలుపెట్టెనేగాని తాను దుదిముట్ట నీది యావలిపారమును బొందలేకపోయె. సుఆత్రఁడు సూచించినట్లుగా నెట్లో "విధాతృన"కే అనఁగా తరువాత సుమారు 200 యేండ్లకువచ్చిన "కవిబ్రహ్మ"కే యెట్లో సాధ్యమైనదిగాని యితరులకు అథర్వణాదులకుఁగూడ దానిం దరింప సాధ్యము కాలేదు. ఇది

యిట్లగుటకు నాయా దేశకాలపరిస్థితులుగూడ నెంతవఱకుఁ గారణములై యుండినవో పరిశీలింతము.

## నన్నయ తరువాతి కాలస్థితి

చాళుక్యకులావతంసుఁ డగు రాజనరేంద్రుని తరువాత నాతని వలె నంత శ్రద్ధతో నీయుద్యమమును ప్రోత్సహించెడివారు లేకయుండురు. ఆకారణముచే నీయాంధ్రీకరణోద్యమమునకుఁ బ్రతిస్పర్ధులై నిలిచి యింతకుఁబూర్వమే 'ఘోరరణము' సల్పిన వారి వాదబలమే మరల ప్రబలము కాఁ జొచ్చియుండును. ఒకప్రభువు తన యనుచరులలోఁ గొందఱకిష్టములేని కార్యమును దలపెట్టి తనయధికారబలముచేఁ గొనసాగించికొనినను, ఆతఁడు గతించిన వెంటనే ప్రతికక్షులోనివారు తరువాతిప్రభువును దమపక్షమునకుఁ ద్రిప్పికొనయత్నించి వెనుకటి కార్యమునకు విఘాతము కలిగించుటకు యత్నించుచుందురు. రాజనరేంద్రుని యనంతరము నాతని యాస్థానమున నట్టి ప్రయత్నములు జరిగియుండును. ఇది యిట్లుండ రాజనరేంద్రుని పిదప నాతనికుమారుఁడగు మొదటికులోత్తుంగచోడదేవుఁడు క్రీ. శ. 1063 మొదలుకొని 1112వ సంవత్సరమువఱకుఁ బరిపాలనము చేసెను. వీనికిఁ బూర్వము రెండు తరములనాఁడే వీరికి చోళులతోడి సంబంధ మేర్పడినది. అప్పటినుండియు వీరు చోళరాజుల కూఁతుళ్లనే వివాహమాడుచు వచ్చుటంజేసి యీ చాళుక్యులకు వేఁగీదేశమునందుకంటె చోళదేశముపై నభిమానము హెచ్చుకాఁజొచ్చెను. రాజరాజు తన మేనమామయగు రాజేంద్రచోళుని కుమార్తెను అమ్మంగదేవిని వివాహమయ్యెను. ఈతని కుమారుఁడును చోళకన్యక యగు మధురాంతకదేవిని జేపట్టి చోళదేశమునీఁదనే యధికాదరముగలవాఁడై యద్దానిని జయించినపిదప రాజధాని నచ్చటికి

మార్చికొనెను. అప్పటినుండియు నీ వేఁగిదేశ మచ్చటిరాజులచే నియమింపఁబడిన పాలకుల యధికారమునకు వదలివేయఁబడెను. పూర్వచాళుక్యులకు పశ్చిమచాళుక్యులకు జరిగిన యుద్ధములలో నీవేంగిదేశము కొంతకాలమునకు పశ్చిమ చాళుక్యుల వశమైనట్లున్నది. అటు పిమ్మట కాకతీయరాజులవశ మైనది. పుత్రుమీఁద రాజనరేంద్రుని తరువాత నచిరకాలములోనే యీ వేఁగిదేశమున సారస్వతాభివృద్ధికిఁ దగిన రాజపోషణము, శాంతియు, స్థిరప్రభుత్వమును లేకుండెను. 12వ శతాబ్దమున నీదేశము భిన్నమతకల్లోలములకుఁ దావలంబైనది. ఒకవైపున రామానుజుని వైష్ణవమతము విజృంభించి వీరవైష్ణవమై తక్కిన మతముల నణఁగఁద్రొక్క యత్నించుచుండెను. మఱియొకవైపున వీరశైవమతము బయలుదేఱి జైన బౌద్ధమతములతోపాటు వైదికమతమునకుఁ గూడఁ బ్రతిస్పర్ధియై తద్వ్యాపనమును బ్రతిఘటింపఁజొచ్చెను. పండ్రెండవ శతాబ్ది మధ్యభాగమున మూఁడవతైలపుఁడను చాళుక్యరాజునకు సేనాపతియైయుండిన బిజ్జలుఁడు ఆతనిపై నెదురు దిరిగి చాళుక్యరాజ్యము నాక్రమించికొని తాను జైనమతాభిమానియైనను, వీరశైవమతమగు లింగాయతమతమును బయలుదేఱదీసిన బసవేశ్వరునికి మంత్రిపదవినిచ్చి యాతని సైన్యాధ్యక్షునిగను, ధనాగారాధ్యక్షునిగను నియమించుటయు, నీయధికారముతో నీతఁడు తన మతవ్యాప్తికై రాజ్యమందలి ధనాధికారముల నుపయోగించుటచే, బిజ్జలునికి నీతనికిఁ గలిగిన వైషమ్యము కారణముగా దేశ మొక ఘోరమగు మతయుద్ధమున మునుంగవలసివచ్చెను. ఇట్టి మతకల్లోలములతో నిండి శాంతిలేని యీ కాలమున వైదికమతమున కపలంబనము తగ్గుటచేతను, రాజరాజు తరువాతికాలమునందలి రాజమహేంద్రపాలకుల కీవాఙ్మయమున నంత యాదరము లేకుండుటచేతను, నన్నయ మొదలుపెట్టిన

వ్యాసభారతాంధ్రీకరణమును తుదముట్టించువారు లేకపోయిరి. రాజావలంబనము, మనశ్శాంతి, చిత్తస్థైర్యము, భాషాపాటవము, పాండిత్యము, మతాభిమానము, మిత్రులప్రోత్సాహము మొదలగునవెన్నియో సమకూడుటచే నన్నయ యద్దాని నిర్వహింపఁగలిగెను. చాళుక్యుల యధికారబలము, నీదేశముపై నాదరము సన్నగిలుట, అన్యమతములు దేశమునఁ బ్రబలి మతవైషమ్యములు పెరుఁగుట, సామ్రాజ్యాధికారుల దుర్బలత్వముచేఁ జిన్నచిన్న మండలాధికారులు దేశము నాక్రమించుకొనవలయునని చేసెడి ప్రయత్నములమూలమున దేశ మల్లకల్లోలముగా నుండుట, ఈ మొదలగు కారణములచే 11 వ శతాబ్దిమధ్యభాగమునుండి 12 వ శతాబ్ద్యంతిమభాగమువఱకు దేశస్థితి సారస్వతాభివృద్ధి కనువైయుండలేదు. మన మెఱింగిన యీకాలమునాఁటి కవులైనను వేఁగిదేశమునందలివారుగాక దక్షిణదేశమందలివారో లేక కాకతీయరాజ్యప్రాంతపువారో యయియున్నారు. పలువురు రాజులో, మండలాధిపతులో లేక వారి మంత్రులో యై యున్నారు. నన్నెచోడుఁడు కావేరీతీరమందలి యొరయూరు రాజధానిగాఁగల చోళమండలాధిపతియై యున్నాఁడు. ఈతఁడు శైవమతాభినివేశము కలవాఁడై మల్లికార్జునుని గురువుగాఁబడసి గురువునే సర్వేశ్వరునిగా భావించి యట్టి యభేదబుద్ధితోఁ గుమారసంభవమును రచించినవాఁడగుటచే తరువాతికాలమున పాల్కురికి సోమనాథాదులచే వృద్ధినొందింపఁబడిన యాంధ్రదేశమందలి శైవవాఙ్మయశాఖ కీతఁడు మొదటివాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. ఈతఁడు నన్నయకుఁ దరువాతివాఁడే యైనను వీరశైవుఁడగుటచే నీతనికి వైదికమతమందుఁ గాని, తద్వ్యాప్తికొఱకుఁగాఁ బ్రారంభింపఁబడిన భారతాంధ్రీకరణమునఁ గాని యాదరము లేకపోయి యుండును.

ఇఁక నన్నయతిక్కనల మధ్యకాలమున నున్న వారిలోఁ బ్రసిద్ధ పురుషుఁడని చెప్పఁదగినవాఁడు మంత్రి భాస్కరుఁడు. తిక్కనాఁడు లీతనిని బ్రసిద్ధకవిగాఁ జెప్పినను, రామాయణ కర్తయని చెప్పక పోవుటచే, రామాయణకర్తృత్వ మీతనియం దారోపించుట విషయమున భిన్నాభిప్రాయములు కలవు. అయిననట్టి ప్రసిద్ధకవియగువాఁడు నన్నయ మొదలుపెట్టి మధ్యను వదలివేసిన భారతామ్నాయమునే గైకొని తెనిఁగింపక, యద్దానిని తన మనుమునికి వదలివేయఁదలఁచినవాఁడువలెఁ దాను రామాణమును జేపట్టుటకుఁ గారణమేమై యుండును? రాజరాజు గతించిన పిదప నన్నయ భారతము రచించెనను ప్రసిద్ధియేగాని యాతని గ్రంథమునకు దేశమునఁ బ్రచారము లేకయుండవచ్చును. కావున నాంధ్రీకృత భారతము నీతఁడు చూచియుండకపోవచ్చును. ఇంతేకాక మంత్రిభాస్కరుని కుమారుఁడగు తిక్కభూపాలుఁడు వైష్ణవమతావలంబకుఁడై పాకనాఁడు, కమ్మనాఁడు మొదలగు దేశములలో వైష్ణవమతవ్యాప్తికిఁ దోడ్పడుచు, కాంచీపురమునందలి వరదరాజస్వామియం దత్యంతభక్తిగలవాఁడై యనేక విష్ణ్వాలయములను నెలకొల్పినట్లు తెలియుచుండుటచే, తండ్రియగు మంత్రి భాస్కరుఁడును గొంతవఱకు వైష్ణవమతాభిమానము కలవాఁడైయుండెనని తలంపఁదగును. ఆ కారణముచే నీతఁడు వైదికమతవ్యాప్తికిఁ దోడ్పడు భారతమును విడిచి, వైష్ణవమతోద్బోధకమగు రామాయణము నాంధ్రీకరింపఁ దొడంగియుండును. తిక్కభూపాలుఁడైనను వైష్ణవమతమునం దభిమానముకలవాఁడై యున్నను, తక్కినమతములందు ద్వేషబుద్ధిలేక పరమతసహనము కలవాఁడై యుండెను. కవితిక్కన యన్నో హరిహరులకు భేదమేలేదని తలంచుటచే నద్వైతభావమే కలవాఁడై, మరల నన్నయ భారతమును చేపట్టి తెనిఁగింప దొరఁకొనెను. దేశమున నూతనమత

## ఆంధ్రభారత కవితా విమర్శనము.

కర్తలు బయలుదేఱి నూతనమతములను వ్యాపింపఁజేయుచున్న కాలమున వారి బోధనలచే నాకర్షింపఁబడినవారిలో నొక్కకుటుంబమునసే కొందఱి కొకమతమందును, మఱికొందఱికి మఱియొక మతమునందును ప్రీతి విశేషమై యుండవచ్చును. కావునసే మంత్రిభాస్కరుఁడును, తిక్కభూపాలుఁడును వైష్ణవమతమునం దభిమానము కలవారై యుండ, తిక్కనసోమయాజి ప్రాచీనంబగు వైదికమతమందే తాత్పర్యము గలవాఁడై యున్నచో నాకాలమున నది యొకవింతకాదు. ఇట్లు భారతము పూర్తికాకుండ రామాయణాంధ్రీకరణము ప్రారంభింపఁబడుటకు దేశస్థితి, మతభేదములునే కారణములుగా గ్రహింపఁదగియున్నవి.

ఆకాలములో భారతమును వదలి రామాయణమును జేపట్టిన వారిలో కోనబుద్ధభూవిభుఁడు, ఆతనికొడుకులగు కాచవిభుడు, విట్ఠలరాజు ననువారలుగూడఁ గానవచ్చుచున్నారు. వీరు రామాయణమును గద్యపద్యాత్మకంబుగఁగాక ద్విపదకావ్యముగ రచించినారు. కోనబుద్ధరెడ్డి తండ్రి విట్ఠలధరణీశుఁడని ద్విపదరామాయణమునసే గనఁబడుచున్నది. ఈ విట్ఠలనాథుఁడు రుద్రమదేవికాలములో కాకతీయసామ్రాజ్యమునందొకభాగమున కాధిపత్యము వహించిన కోన గన్నారెడ్డికి సోదరుఁడై యాతనియొద్ద సేనాపతిగానుండెను. ఈతనియన్న శైవమతాభిమానము కలవాఁడైయుండ, నీతఁడు తన పేరునకుఁ దగినట్లుగా వైష్ణవమతాభిమానము కలవాఁడువలెఁ గనఁబడుచున్నాఁడు. ఈ కారణముచేఁగావలయు నీతనికుమారుఁడగు బుద్ధారెడ్డికూడ వైష్ణవమతాభిమానము కలవాఁడై రామాయణమును దేశీయఛందమున-ద్విపదగారచించి తనతండ్రికంకితమొనర్చుట తటస్థించినది. కాకతీయ రాజ్యము మొదట జైనమతమునకు పిదప వీరశైవమునకు నవలంబనంబై యుండెసేగాని వైష్ణవమతమున కంతగాఁ జోటిచ్చిన ట్లగపడదు కాని మొదటిప్రతాప-

ఉగ్రుని కాలమున గురుమల్లికార్జునపండితారాధ్యుల శిష్యుఁడైన సోమ
నాథుఁడు బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, మొదలగు
గ్రంథముల రచించి, వైష్ణవమునకు, వైదికమతమునకును విరుద్ధంబగు
వీరశైవమును సామాన్యజనుల కందఱకు సుబోధంబగునట్లుగాను సం
స్కృతవృత్తంబులను వదలి దేశీయంబగు ద్విపదలో జానుతెనుంగున
రచించి బోధించినవాఁడగుటం జేసి, యద్దానికి పోటీగా నించుక తరు
వాతి కాలమున కొంతవైష్ణవాభినివేశముగల బుద్ధరాజు రామాయణ
మును ద్విపదగా రచించియుండును.

బుద్ధభూవిభుఁడు రచించిన రామాయణమునకు 'రంగనాథరామా
యణ'మను పేరు వచ్చుటకు రంగనాథుఁడను నాతఁడొకఁడా గ్రంథమునకు
ప్రతి వ్రాసికొని దానిపైఁ దన పేరు వ్రాసికొనియుండుటయు, ప్రాచీనపు
తాటియాకు ప్రతులు కొన్నింటిపైఁ గనఁబడు నీతని పేరునుబట్టి యది
రంగనాథుని రామాయణమని యవిమర్శంబుగ నొక ప్రతీతి దేశమున
వ్యాపించుటయు నే కారణమైయుండునేమో యని యిటీవలఁ గనుగొనఁ
బడిన తంజావూరు సరస్వతీ మహాల్‌లోని రంగనాథ రామాయణము
యొక్క ప్రాచీనములైన తాటియాకు వ్రాతప్రతులనుబట్టి యూహిం
పఁదగియున్నది. ఇట్లు ప్రసిద్ధులై, పేరుప్రతిష్ఠలుగల కవులందఱు
మతాభినివేశమునకు లొంగినవారై యేదో యొకవిధముగ వైదికమత
మునం దాదరము లేనివారే యగుటచే నన్నయ తరువాత సుమారు రెండు
వందల యేండ్లవఱకు భారతాంధ్రీకరణము పూర్తియగుట తటస్థింప
లేదు.

ఈమధ్యకాలమున మిగిలిపోయిన ప్రసిద్ధకవులలో నథర్వణుఁ
డొకఁడున్నాఁడు. ఈతఁడు తిక్కనకుఁ గొంచెము పూర్వుఁడో సమ
కాలికుఁడో యని చెప్పఁదగియున్నాఁడు. నన్నయ తరువాత నన్నయ

యంతవాఁ డీతఁడని లోకప్రసిద్ధిగలుఁగుటచే నీతఁడు ద్వితీయాచార్యుఁ
డని చెప్పఁబడుచున్నాఁడు. ఈప్రసిద్ధికిఁ దగినకారణమును లేకపో
లేదు. ఏలయన నన్నయతరువాత నాతఁడు మొదలుపెట్టిన యుద్య
మమును లేదా గ్రంథమును కొనసాగింపవలయునని తలఁచి కృషిసల్పిన
వారిలో తిక్కనకుఁ బూర్వమీతఁడొక్కఁడే కనఁబడుచున్నాఁడు.
భారతమున నన్నయ రచించిన మొదటి మూఁడుపర్వములుగాక తరు
వాతి విరాటోద్యోగ భీష్మపర్వము లీతఁడు రచించినట్లగపడుటచే
నన్నయయుద్దేశమును గొనసాగింపఁ బూనుకొనినవాఁడువలె నున్నాఁడు.
ఈతని పుట్టుక పూర్వోత్తరములనుగూర్చి తెలిసికొనుట కాధార
మేమియు లేదుగాని యీతఁడు జైనుఁడైయుండునని మాత్రము కొం
దఱు తలంచుచున్నారు. ఈతఁడు త్రిలింగ శబ్దానుశాసనమను మఱి
యొక లక్షణగ్రంథమును రచించియుండుటచేఁ గారికావళి యిటీవలి
కాలమున మఱియొకరిచే రచింపఁబడిన గ్రంథముగాఁ దలంపఁబడు
చున్నది. వీనిలో నేదియునుగూడ, కొంచెమించుమించుగా సమకాల
మున రచింపఁబడినదగుటచేతనో, కేతన దృష్టిపథమునఁ గూడఁ బడినట్లు
కనఁబడదు. ఈతఁడు రచించిన భారతమైనను జైనమతానుకూలముగ
రచింపఁబడుటచేతనో యేమో, విశేషప్రచారములేక యుండినట్లు
న్నది. ఇంతలో నద్వైతమతానుకూలముగఁ దిక్కనసోమయాజి రచిం
చిన భారతభాగము పైకివచ్చుటచే దాని కాదరములేక కాలక్రమ
మున రూపుమాసిపోయి యుండును. మొత్తముమీఁద నన్నయ యాం
ధ్రీకరింప మొదలుపెట్టిన భారతమును బూర్తిచేయవలయునను తలం
పాతని తరువాత సుమారు రెండువందల యేండ్లవఱకు నెవ్వరికిఁ గలిగి
నట్లు కనఁబడదు. మఱియొక విశేషమేమనఁగా నీ పదుమూఁడవ
శతాబ్ది మధ్యకాలమున భారతాంధ్రీకరణవిషయమగు తలం పొక్క

## ఆంధ్రభారత కవితా విమర్శనము

తిక్కనకేగాక మఱియొక యధర్వణునికిఁగూడఁ గలుగుటచే నద్దాని కప్పు డనువగుపరిస్థితు లేర్పడియుండునని యూహింపఁ దగియున్నది. దేశములో బయలుదేఱిన భిన్నమతముల పరస్పరవైషమ్యము, స్పర్ధ, కొంతవఱకు తగ్గి యద్వైతమతమునందుఁ గొంతయభిమాన మేర్పడు కాలము వచ్చినది. మతసాంఘికస్థితి మాఱిపోవుటకుఁ బ్రారంభించినది. పౌరాణికమతము మరలఁ దలయెత్తి మొదలుపెట్టినది. న్యాయధర్మశాస్త్ర విషయకములగు నిబంధనగ్రంథము లనేకములు వ్రాయఁబడఁ జొచ్చినవి. కావుననే విజ్ఞానేశ్వరీయమను ధర్మశాస్త్ర గ్రంథమును కేతన యాంధ్రమున రచించుట తటస్థించినది. ఇట్టికాలముననే తిక్కన సోమయాజి నన్నయ వదలివేసిన వ్యాసభారతమును మరలఁ జేపట్టి యాంధ్రమున రచించుటయు సంభవించినది.

నన్నయతరువాత రెండువందల సంవత్సరములవఱకు భారతరచన నెవ్వరును జేపట్టకుండుటకు నాతనిచే రచింపఁబడినభాగమైనను ప్రచారమున లేకుండుటయు మఱియొక కారణ మగుచున్నది. కావుననే నన్నయను గూర్చిగాని యాతని భారతమునుగూర్చి గాని యాతని తరువాత తిక్కనకాలమువఱకు నెవ్వరును బ్రశంసించినవా రగపడరు. చూచినవారు, చదివినవారు లేరు. తిక్కనయైనను బ్రథమమునఁ దాను రచించిన నిర్వచనోత్తర రామాయణమున నన్నయప్రశంస యేమియుఁ జేసినవాఁడు కాఁడు. ఆంధ్రభాషకాదికవియని, ఆంధ్రభాషావాగనుశాసనుఁడని తరువాత నంత ప్రసిద్ధిగాంచిన నన్నయపేరైన నెత్తలేదు.

“ [illegible]సద్మగర్భులను నాదికవీంద్రుల నూత్నసత్కవీశ్వరులను భక్తిఁ గొల్చి” యనుచున్నాఁడు. ఆయాదికవులలో (వాల్మీకివ్యాసాదులలో?) గాని, నూత్నసత్కవీశ్వరులలో గాని నన్నయ కూడ నుండెనో లేదో చెప్పలేము. ఆకాలమున నన్నయరచించిన భారతభాగము విశేష

# ఆంధ్రభారత కవితా విమర్శనము

ముఖ ప్రచారములోనుండి, యంపఁబడే జనువఁబడుచు నాంధ్రావళికి మోదముంగూర్చుచునే యున్నచో, తిక్కన తాను స్వయముగా నద్దానిం జదువుటచేతనే కవితావిలాస విస్తరమహనీయుఁడై నెగడినచో, నాద్యాదికవియగు నన్నయ నామమునైన నొకసారి తన మొదటిగ్రంథమున స్మరింపకుండునా? ఉత్తరరామాయణరచనకుఁ బూర్వము భారతభాగమును జదివియున్నచోఁ గొఱవడియున్న యీ పంచమవేదమును ముందు పూర్తిచేయఁ గడంగక రామాయణము నేలచేపట్టును? ఇంకనాతఁడు యజ్ఞము చేయలేదనిగాని, కవితాసామర్థ్యము చిక్కలేదనిగాని చెప్పుట యుక్తిసహితముగాఁ గనఁబడదు. అట్లైయైనను, ఉత్తరరామాయణమున నాతనిఁ జేర్కొనకుండుటకుఁ గారణ మగపడదు. ఇఁకఁ దాను భారతరచనకుఁ గడంగినప్పుడైనను నన్నయ భారతమును స్వయముగాఁ జదివి యాతని కవితాపద్ధతులందును, రచనావిశేషములందును, నత్యంతాదరము కలవాఁడువలె నా భారతరచనను గూర్చి కాని, తద్రచయితయొక్క గొప్పతనమునుగూర్చి గాని యేమియుఁ జెప్పక, భారతమును మాత్రము విశేషముగాఁ బొగడుచు,

"ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణ సంభృతమై పెను పొంది"

యుండునని పద్యమున రెండుపాదములలో భారతగ్రంథ ప్రశంసయే చేసి,

"అం దాదిఁ గొండంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్."

ఆ భారతమున మూఁడుపర్వములు ఆంధ్రకవిత్వ విశారదుండగు నన్నయభట్టు ఆంధ్రభాషలో రచించెను అని మాత్రమే చెప్పినాఁడు. విద్యా

దయితుండు, 'మహితాత్ముఁడు' అనునవి నన్నయనుగూర్చిన విశేషణ
ములు గానియాతనికృతిని గూర్చినవి గావు. ఆ కృతియందు, నా కవిత
యందును విశేషాదరమును వ్యక్తపఱుచుట లేదు. ఆంధ్రమున మొదట
నుద్గ్రంథమును రచించినవానిని ఆంధ్రకవిత్వ విశారదుండనుటలో విశే
షము లేదు. తాను రచింపంబూనిన గ్రంథభాగమునుగూర్చి యెట్లు
చెప్పుకొనినాఁడో చూడుఁడు:

"హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులంగూడఁగాఁ
బదునేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునన్
దుదిముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్."

"కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁగ్రోలి యాంధ్రావళి
మోదముం బొరయునట్లుగ" రచింపఁబూనినాఁడు. నన్నయభాగము
గూడఁ జదివి యాంధ్రావళి యిట్టి యానందమును బొందుచున్నచో
దానినిగూర్చి యించుకైనఁ జెప్పఁడా? నన్నయభాగమును జదివి తా
నట్టియానందమును బొందితిననియైనఁ జెప్పఁడా. ఏమియుఁ జెప్పలేదు.
తనకు వైదికమార్గమునందుఁ గల యభిమానమునుగూర్చి, తనకుఁ బ్రత్య
క్షమైన యిష్టదేవత చెప్పినట్లుగా, నిట్లు తెల్పినాఁడు.

"వైదికమార్గనిష్ఠ మగువర్తనముం దగ నిర్వహించుచు
న్భేదము లేని భక్తి నతినిర్మలవృత్తిగఁ జేయుచుండ మ
త్పాదనిరంతర స్మరణ తత్పరభావము కల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచునుండు దెప్పుడున్."

ఇట్టి వైదికమార్గమునందలి ప్రీతియు, పంచమవేదంబగు భారతము
మూలముగా నా మతమునందలి ధర్మాద్వైతస్థితిని వ్యాపింపఁజేయు

[illegible]

నుద్దేశమును, చాళుక్యప్రభువు లొనర్చిన మహత్కార్యమునందలి గౌరవమును, వారి ప్రోత్సాహమున భారతాంధ్రీకరణకార్యమునకుఁ బూనిన నన్నయయందలి భక్తియుఁ గారణములుగాఁ దాతఁ డొనర్చిన మూఁడుకృతులను వదలి తిక్కన తక్కిన పర్వముల నాంధ్రమున రచింపఁబూనిన ట్లూహింపఁదగియున్నది. అంతేకాని నన్నయ రచించిన భాగమును సంపాదించి, చూచి చదివి యానందించి, దానిమూలముననే కవితావిలాసవిస్తర మహనీయుఁడై మిగిలిన భాగమును బూరించినట్లు తోఁచదు.

## అరణ్యపర్వశేషపూరణప్రశంస

తిక్కన నన్నయ వ్రాసిన గ్రంథభాగమును జూచినాఁడన్నచో నన్నయ మూఁడుకృతులు సంపూర్ణముగా వ్రాసియుండిన బాధలేదు గాని, యట్లుగానిచో, రాజ్యతంత్ర మవలీలగ నడపి పరదేశములకేఁగి రాజులను మెప్పించి పరమతముల ఖండించి దిగ్విజయముగాంచి యత్యంతమేధావంతుఁడును, ధైర్యస్థైర్యములు గలవాఁడు నని పేరుగాంచిన తిక్కన యరణ్యపర్వభాగమును బూర్తిచేసినచో మృత్యువువాతఁ బడుదునేమో యను భయముచేఁ బిఱికిపందవలె వెనుదీసినాఁడని చెప్పవలసివచ్చును. తిక్కన నన్నయభారతమున మూఁడుకృతులు సంపూర్ణముగా నుండుటనుజూచి నాలవకృతి ప్రారంభించినాఁడన్నచో రాజమహేంద్రవరమునఁగల మూలప్రతి నీతఁడెట్లో విశేషప్రయత్నముచేసి సంపాదించి ప్రత్యంతరము వ్రాయించకుండఁ దిరిగి పంపినాఁడనియో, లేదా, యే గణపతిదేవుని యాస్థానమునకుఁ బోవు సమయముననో రాజమహేంద్రవరమునకుఁ బోయి యాప్రతిని జూచి వచ్చినాఁడనియో చెప్పవలెను. కాని దేశమున ననేకప్రతులున్నవనియు, నాప్రతులన్ని

టిలో మూఁడుకృతులు సంపూర్ణముగా నున్నవనియుఁ జెప్పినచో తిక్కన తరువాత నేఁబది యాఱువది సంవత్సరములలో నెఱ్ఱాప్రెగ్గడ చూచుసరికే దేశమునఁగల ప్రతులన్నిటిలో నొక్కభాగము మాత్రమే మాత్రగా శిథిలమైనననుట విశ్వాసపాత్ర మెంతమాత్రముగాదు. ఎఱ్ఱా ప్రెగ్గడకు దొరకిన ప్రతిలోఁ గొంతభాగము పోయియుండెననిన, చో నన్నయ వ్రాసిన భాగము తరువాతనైన దొరకవలసినదే గదా. దీనినిబట్టి నన్నయ యరణ్యపర్వము పూర్తిగాకుండ వ్రాసి చనిపోఁగా, నాతని తరువాత నాగ్రంథము నాదరించి ప్రత్యంతరములను వ్రాయించి వ్యాప్తిలోనికిఁ దెచ్చినవారు లేకుండుటచే, తిక్కన యా భారతప్రతిని జూడనే లేదనిగాని, దేశమున దానికి ప్రచారము లేకుండుటచే, నొక్కటే ప్రతియుండఁగా నద్దాని నెట్లో తిక్కన చూచి, యందు మూఁడు కృతులు సంపూర్ణముగా నుంటచే నాలవపర్వమును మొదలుపెట్టి పూర్తిచేయఁగాఁ, గొంతకాలమున కా ప్రతియందలి చివరభాగము శిథిలమైపోఁగా నెఱ్ఱాప్రెగ్గడ దానిని బూరించెననికాని, లేదా, తిక్కన యసంపూర్ణగ్రంథమునే చూచినను మతిభ్రమణ భయముచే నా భాగమును బూర్తిచేయక వదలివేసెననికాని, మూఁడువిధములుగా మనము తలంపవలసియున్నది. ఇందు మూఁడవదానికంటె రెండవది, రెండవదానికంటె మొదటిది సంభావ్యాంశమై బలవత్తరముగా నున్నట్లు తోఁపకపోదు. ఏది యెట్లున్నను, అరణ్యపర్వమును నన్నయ సంపూర్ణముగా రచించెననియు, మూఁడుపర్వములు దేశమున బాగుగా ప్రచారములో నుండఁగా, తిక్కన యొక ప్రతిని జూచి నాలవపర్వము మొదలుపెట్టి భారతమునంతను పూర్తిచేసెననియు, నాతని తరువాత నలుబదియేండ్లకు నరణ్యపర్వమునందుది భాగము మాత్ర మున్నటువంటి క్రిమిదష్టమై శిథిలముకాఁగా నెఱ్ఱాప్రెగ్గడ నన్నయ పేరేపెట్టి యాశిథిలభాగము నచ్చటచ్చట

పోయిన వర్ణనములను, పదములను, పాదములను స్వయముగా నతికి తద్ర
చనయకా నారణ్యపర్వశేషమును పూరించెననియుఁ జెప్పుటమాత్ర
ము సమంజసముగాఁ గనఁబడదు. నన్నయభావములు, పదగుంఫన
ములు, వాక్యవైఖరి, అక్కర వృత్తప్రయోగము, మొదలగు రచనా
రీతులెన్నియేని యీభాగమునఁ గనఁబడుచున్నవి గావున నీభాగము
కూడ నన్నయ రచించినదే; వర్ణపద పాదముల పూరణము మాత్రమే
యెఱ్ఱాప్రెగ్గడచేసిన పూరణమనుటయు నెంతమాత్రము యుక్తియుక్త
ము కాదు. ఏలయన నెఱ్ఱాప్రెగ్గడయే "తద్రచనయకా" పూరించితి
నని వ్రాసికొనినాఁడు. ఒకపర్వములో చివర కొద్దిభాగము మాత్రమే
కొఱవడి యుండుటచేతను, తక్కిన పర్వములన్నియు తిక్కనార్యుఁడు
రచించియుండుటచేతను, ఆ స్వల్పభాగముకూడ నన్నయ పేరనే యుం
డుట యుక్తమని తలంచి యాతని రచననే యనుకరించి పూర్తిచేయు
టకు యత్నించి, యట్లేచేసితినని చెప్పుకొనియున్నాఁడు. ఇప్పుడు
మనము చూడవలసిన దేమనఁగా నీయనుకరణ ప్రయత్నములో "తద్ర
చనయకా"—నన్నయరచనయే యని చూపించుటలో నీతఁ డెంతవఱకు
నెగ్గినాఁడు? ఎక్కడనే భేదములేక నన్నయ యేసృష్టితో భారత
రచనను మొదలుపెట్టి రచించినాఁడో, ఆదృష్టితోడనే తానును రచిం
చుచు, నన్నయ రచనా పద్ధతినంతను దెచ్చి యీభాగమున నిలిపి
నాఁడా, లేక కాలక్రమమున భాషలోఁగలుగుచుండెడి మార్పులు,
తిక్కన రచించిన తక్కిన భారతభాగమును జదువుకొనుటవలనఁ గలిగిన
కవితాసంస్కారము నీతని యరణ్యపర్వశేషరచనలో నేమైనఁ బొడ
సూపుచున్నవా యని మనమించుక పరిశీలించినచో, నిది నన్నయరచన
యగునా, ఈతఁడు చేసినది శిథిలగ్రంథపూరణమా లేక యనుకరణ
పద్ధతిమీఁదఁ జేయఁబడిన స్వతంత్రరచనయా యను విషయము నిర్ధా

రణచేయుట కవకాశము కలుగును. అటుపైని ఈ యరణ్యపర్వభాగ
పూరణము 'తద్రచనయకాఁ' జేయుటకుఁ గారణము, నన్నయ దు
స్వభావదుర్విపాకము కారణముగా నాతనికిఁ గలిగినదని తరువాతివారు
బయలుదేఁదీసిన మతిభ్రమణరూపకథామూలకమగు భయమా? లేక
నన్నయతిక్కనలు తలపెట్టి పూర్తిగావించిన యుద్యమమందలి భక్తి
యా యను విషయముకూడ తేలఁగలదు.

ఈసందర్భమున నన్నయ భారతభాగమును (అనఁగా మొదటి
రెండుపర్వములు - మూఁడవపర్వము 4-అ. చతుకు) తరువాతి యెఱ్ఱా
ప్రెగ్గడ రచించిన యరణ్యపర్వశేషభాగముతోఁ బోల్చిచూడవలసిన
యావశ్యకత యేర్పడుచున్నది. ప్రస్తుత మరణ్యపర్వశేషభాగములోని
యక్కరపద్యములను నన్నయ భారతభాగములోని వానితోఁ బోల్చి
పరిశీలించినచో నది యేతద్విషయనిర్ణయమునఁ గొంతవఱకుఁ దోడ్పడఁ
గలదని తోఁచును. నన్నయతరువాత నక్కరగవృత్తము లాంధ్రకవితలో
నంతరించినవి. తిక్కనార్యుఁడుగాని నన్నెచోడాదులుగాని వాడి
యున్నట్లగపడదు. ఎఱ్ఱాప్రెగ్గడయైనను తన యితరగ్రంథములలో
వాడలేదు. నన్నయ రచించినట్లే తానును "తద్రచనయకా" రచింపఁ
బూనినాఁడు గనుక ఈవృత్తములను వాడినాఁడు. అక్కరపద్య
ములు కవఁబడుచున్నవి గావుననే యిదినన్నయకవితయే యనినచో
నీపద్యముల లక్షణ మొక్కతీరుననే యుండవలయునుగదా. కాని
వీనిలో లక్షణభేదము కొంత గానవచ్చుచున్నది. నన్నయ మధ్యాక్క
రలలోఁ బ్రతిపాదమునను నాల్గవగణము తరువాత యతి పాటించి
నాఁడు. కాని యెఱ్ఱాప్రెగ్గడ మూఁడవగణము తరువాతనే యతి పా
టించినాఁడు. తెలుఁగు లాక్షణికు లందఱు నీపద్యమునకు లక్షణము
చెప్పుటలో నన్నయ రచించిన పద్యముల లక్షణమును గ్రహించి

చెప్పక, యొఱ్ఱాప్రెగ్గడ రచించిన పద్యముల లక్షణమునే గ్రహించి, అనఁగా ప్రతిపాదమునను రెండింద్రగణములు నొకసూర్యగణము గలిగి మూఁడవగణము తరువాతనే యతి యని యిట్లు మధ్యాక్కరకు లక్షణము చెప్పియున్నారు:

" ఓఁజతో నిద్దరింద్రులును
నొక్కయాదిత్యుండు మఱియు
రాజితంబుగ నిద్దఱమర
రాజులు నొక్క సూర్యుండు."

—అనంతుడు.

"మునుపుగాఁ బ్రాసంబుఁగూర్చి
మూఁటిపై విరమంబు నిల్పి
చన నింద్రయుగళంబుమీఁద
జలజాప్తు నొక్కనిఁ జేర్చి
యినుమడించిన నాలుగణము
లెనసిన నొక్కపాదంబు
దనర వక్కాణించి నంతఁ
దగు నిట్లు మధ్యాక్కరంబు."

—అప్పకవి.

మొదటి రెండున్నరపర్వములలోని యక్కరపద్యముల లక్షణమును గ్రహించిచెప్పక, తుదిపర్వములలోని పద్యలక్షణమునే, యీ పద్యలక్షణముగా లాక్షణికులు గ్రహించుటచే, నప్పటికే యిప్పటివలెనే మొదటిభాగములోని నన్నయ మధ్యాక్కరలకు లక్షణము సరిగా కుదురక చిక్కుగానుండుట తటస్థించినదని చెప్పవలసియున్నది. యుద్ధమల్లుని శాసనములోని యక్కరలలో నాలవగణము తరువాతనే యతి

కనఁబడుచుండుటనుబట్టి నన్నయ యీ ప్రాచీన సంప్రదాయమునే యవలంబించియుండుననుటకు సందేహము లేదు. నన్నయభాగములోనిపద్యములలో లక్షణము సరిగాఁ గిట్టకుండుటకుఁ గారణ మీపద్యములు దేశీయములై మాత్రాగణబద్ధములై, యంతకు పూర్వము దేశీయులచేఁ బాటలలో నుపయోగించుకొనఁబడినవై యుండుటచే నా పాటల కనుకూలముగా నొకమాత్ర హెచ్చించుటయు, నొకటి తగ్గించుటయు సంభవించుచు నియతమైన లక్షణము లేకుండుటయేయై యుండును. కన్నడభాషలోని యక్కరవృత్తముల లక్షణము విషయమునఁ గూడ నీచిక్కు గలుగుచునేయున్నది. వ్రాఁతప్రతులలోని పాఠభేదములుకూడ నీచిక్కుకు మఱియొక కారణమైయుండును. ఎఱ్ఱాప్రెగ్గడయు నరణ్యపర్వశేషమున నక్కరలను రచించినను లక్షణము విషయమున మాత్రము నన్నయ ననుసరింపక, తన ప్రత్యేకతను, స్వాతంత్ర్యమును జూపియున్నాఁడు. యతిస్థానమును మార్చినాఁడు. నన్నయయె యీ భాగమునందలి పద్యములలో యతిస్థానమును మార్చి రచించినాఁడనుట పొసఁగదుగదా. అరణ్యపర్వములో నొక్క యాశ్వాసముననే— 4 వ యాశ్వాసమున—పూర్వభాగములోని పద్యము లొకరీతిని, ఉత్తరభాగములోనివి మఱొకరీతిని గనఁబడుచు నీకవిత్వము భిన్నకవికర్తృకమని వ్యక్తము చేయుచున్నవి.

4 వ ఆ. పూర్వభాగమున, రెండు మధ్యాక్కరలు గలవు.

"ఏనేఁడు లగుడెంచె నర్జునుఁ డరిగి
యింతస్త్రీకే తెంచుఁ
బూని దివ్యాస్త్రములు వడసి యమ్మహా
భుజుభూరిసత్త్వ............" —అరణ్య. 4-3.

"పదివేల గజములు బలము గలవాఁడు పౌలస్త్యుతోడఁ
గదనంబుఁ జేసి యనేకయక్ష రాక్షసుల నిర్జించి."
—అరణ్య 4-105.

ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వములో—4 వ ఆశ్వాసమునందే,

"అసదృశతేజుఁడు బ్రాహ్మణానీక సహితుఁడై కడఁగి
వసుమతియందు నధర్మవర్తులై యున్న మ్లేచ్ఛులను."
—అరణ్య. 4-312.

ఇట్లొక్క—యాశ్వాసముననే, యొక్క—పద్యమును రచించువిషయముననే యిట్టి భేదము గనఁబడుటంజేసి పూర్వభాగమును రచించి నాతఁడే యుత్తరభాగమును రచించియుండలేదనుటకుఁ బ్రబలకారణము కనఁబడుచున్నది.

ఇది ఛందోవిషయకమైన భేదము. ఇఁక భాషాభావసామగ్రీవిషయమునను, కథావస్తు ప్రదర్శనారీతులను నన్నయకవితకును, నారణ్యపర్వశేషకవితకును గలవ్యత్యాసము నారయుదముగాక. ఆరణ్యపర్వశేషమును నన్నయరచనవలెనే గనఁబడునట్టు చేయుట కనేకప్రయత్నములను చేసి—అనఁగా నాతఁడు ప్రయోగించిన యక్కరవృత్తములను బ్రయోగించియు, నాతని పద్యములఁబోలిన పద్యములను "రయవిగలత్తురంగమతరంగములన్" ఇత్యాదులను రచించియు, నన్నయకు స్వాభావికములగు పదబంధములను, దీర్ఘసమాసములను "అఖిలజలధి వేలావలయితంబు" ఇత్యాదులను వాడుకొనియు, నాతనివలెనే తిక్కనకంటె నెక్కువపాలుగా సంస్కృతపదములను గలిపి తత్సమబహుళంబగు భాషలో రచించియు—తద్రచనయని స్థూలదృష్టితోఁ జదివినవా రనుకొనునట్లు చేసినను, తిక్కనార్యుని భాష

తమను విశేషముగ శ్రద్ధతో, నత్యంతాదరముతో, విమర్శనాదృష్టి తోఁ జదివికొని యాతని కవితావిశేషలక్షణములను గుర్తించి యున్నవాఁడగుటచే, నన్నయ రచించినట్లే రచింపవలెనని మొదలు పెట్టి, యట్లే రచించితి నని తలంచి, పైకి వ్యక్తముచేసినను, తిక్కనార్యుని కవితాప్రభావ మీతనికిఁ దెలియకుండఁగనే యీతని కవితలోఁ బ్రవేశించి, యీతనికవితను నన్నయకవితనుండి వేఱుపఱుచుచునే యున్నది. ఇట్లాంధ్రవాఙ్మయమున సుప్రసిద్ధులై ప్రమాణకవులగు కవిత్రయమువారిలో మూఁడవవాఁడగు నీయెఱ్ఱాప్రెగ్గడ కవితారచనయందు మొదటి యిద్దఱుకవులయొక్క విశేషలక్షణములే యొక్కచోఁ గలిసి యతిహృద్యంబగు సమ్మేళనమును బొంది యాతని కవిత కసమానంబగు రామణీయకత్వము నాపాదించినవి. షేక్స్పియర్ మహాకవినిగూర్చి డ్రైడన్ (Dryden) చెప్పినట్లుగా* నన్నయ తిక్కనల యంశములే గలిసి యీతనియందుఁ గానవచ్చుచున్నవి.

## అరణ్య పర్వశేషమునందలి తిక్కన యనుకరణములు

నన్నపార్యుని కవితయందుకంటె నెఱ్ఱాప్రెగ్గడ కవితలో దేశీయపదప్రయోగము కొంతయొక్కువగాఁ గనఁబడుటయేగాక వర్ణనాంశములందుఁగూడ నీతఁడు తిక్కనార్యుని యనుకరింప యత్నించె ననుటకీక్రింది సముద్రవర్ణనమే నిదర్శనము:

" గరుసులు గడవంగఁ గదలి యల్లల్లన
యొత్తుచు నెడముల నుత్తరించి

---

* The force of Nature could no further go
To make a third, she joined the other two.

వేఁడుకఁ జేతులు విచ్చి యాడెడు నట్లు
ఘోలోర్మిపంక్తులఁ గ్రాలిక్రాలి
ప్రచురహాసస్ఫూర్తి ప పరించుచాడ్పున
నురుఫేనరోచులఁ దెరలు గవిసి
యుఱుపడి వర్ధిల్లు చున్న జలంబుచేఁ
బొంగారి దెస లెల్ల మ్రింగికొనుచుఁ
ప్రబలవిలయకాలపటురయబహుళ స
మీరసంఘ దుర్నివార మగుచు
నుగ్రభంగిగాఁ బయోనిధు లొక్కటఁ
బెల్లు రేఁగి జగము లెల్ల ముంచె."

ఇది విరాటపర్వమున తిక్కనార్యుని శమీవృక్ష వర్ణనపద్యమును బోలియున్నది. చూడుఁడు:

"నెగసినకొన లేచి నింగి యంతంతకు
నవులఁ ద్రోవఁగఁ దనరారుదాని
జాఁగినశాఖ లాశాచక్రముల కొలం
దులు వారవెట్టంగఁ బోలుచుదానిఁ
గవటు లొండొంటితోఁ గదియుచు నెడములు
మ్రింగి ప్రబ్బఁగ సొంపు మిగులుదాని
లోనిజొంపము పవలును బెనుజీఁకటి
నొదవించి పొదలంగ నొప్పుదానిఁ
గనియెఁ బహుమాన వివిధనర్తనకళా ని
వర్తిఁ గాక మూకారవస్ఫూర్తి జాత
భీతిపరిసరవర్తి నాఖిలభుజగ
చండమూర్తి శమీతరు చక్రవర్తి."

మొదటి నాలుగుపాదములలోఁ జిన్నచిన్న యచ్చ తెనుఁగుపదములలో దానిస్వరూపముఁ జక్కఁగా వర్ణించి, తుది గీతములో దాని భయంకరాకారమును నొక పెద్ద సంస్కృతసమాసములో భీకరముగా వర్ణించుట పై రెండుపద్యములకు సమానము. దెసలెల్ల మ్రింగుట, ఆశానక్రముల కొలందులు బొగవెట్టుట అను సమానభావములుకూడ నెట్టన తిక్కన ననుకరించుటను వ్యక్తముచేయును. ఇట్టిసందర్భముల నన్నయశైలి కేవల సంస్కృతజటిలంబై మహోదధిగాంభీర్యమునే దలపించు చుండును.

"అలఘుఫణీంద్రలోక కుహరాంతరదీప్తమణిస్ఫురత్ప్రభా
వలి గలదాని, శశ్వదుపవాసమహావ్రతశీతపీడితా
చలమునిసౌఖ్యహేతువిలసద్బడబాగ్నిశిఖాచయంబులన్
వెలిఁగెడుదానిఁ గాంచి రరవిందనిభానన లమ్మహోదధిన్."

అరణ్యపర్వశేషములోఁ గొన్నిపట్ల సంభాషణాశైలి తిక్కన సంభాషణాశైలిని బోలి సయుక్తికంబై, జాతీయయుక్తంబై, నన్నయ రచనకంటె రమ్యతరముగాఁ గనఁబడును. అరణ్యపర్వము 4-ఆశ్వాసమునందలి యత్రిగౌతమసంవాదమున తిక్కనశైలి యనుకరణము గానవగును. నామదేవుని శిష్యుఁడు శల్యుని గుఱ్ఱముల నడుగుట:

"ఇమ్ము నరేశ్వర మాతుర
గమ్ముల నీకార్య మయ్యెఁ గాదే కడు లో
భమ్మున నను నొడ్డసొమ్ములు
రమ్మన్నను నచ్చునే యొరవు సత మగునే."

" అనవుడు శల్యుఁ డిట్లనియెం
జను నిను( బుత్తెఱ నతఁడు సాలుదు పీవుం

గొనిపోవఁ దురంగంబులఁ
జను మీదుర్యోధనములు సైఁపవు మాకున్."

... ... ... ... ...

"అనిన విని యేటిమాటలు
వినువారలు నవ్వ రకట విప్రులధనముల్
గొని వేఁట యొంటి నిచ్చెద
నను టిది యేనాఁటి చంద మని ముని పలికెన్."

—ఆరణ్య. 4-352.

"వినుఁడీ సర్వజనంబులుం గడఁగి యీవిప్రుం దురాలాపు దు
ర్జనునిం దుర్మ్మద నస్మదీయకమహాచాపోగ్రనిర్ముక్త బా
ణనిపాతచ్ఛిదురాంగర క్తజలశోణక్షోణిసంసిక్తుఁగాఁ
గనుఁడీ యీదురితాత్ము నంచు నతిశీఘ్రప్రాప్తకోదండుఁడై."

ఇందలి సంబోధనములలోని స్వాభావికత్వగుణము (realistic touch) గమనింపఁదగి యున్నది.

"శర మరిఁ బోయుటయును ద
త్కరయుగ్మము బాణకార్ముకంబులతోఁ జె
చ్చెర సంస్తంభము నొందుడు
నరనాథుఁడు విస్మయావనత మానసుఁడై."

"పుల్లనడి చలము గోపము
సొల్లనడి చనంగఁ గొంతప్రొద్దు మొగమునన్
వెల్లదనము గదుర నిలిచి
యెల్ల జనులు వినఁగ మఱియు నిట్లని పలికెన్."

"ఆడితిఁ బెక్కుమాట లవియన్నియు వమ్మయిపోయె నస్త్రసం
తాడనశక్తి గీడ్పడియెఁ దథ్యము బ్రాహ్మణశక్తి యొక్కఁ డే
నోడుదు వామదేవునకు నో జనసంఘములార సజ్జనా
మ్రేడితకీర్తి నిమ్మని నమిత్రనిషూదను నాశ్రయించెదన్."

పైపద్యములలో స్తంభము నొందిన నరనాథుని విస్మయావనత మనస్కత్వము, నాసమయమునందలి యాతనిమనోవృత్తులయందలి క్రమ పరిణామము (gradual development) వానికిని బాహ్యాకారమునకును గల పొందిక యెంత చక్కగా వర్ణింపఁబడియున్నదో చూడుఁడు. ఇట్టివర్ణనలు తిక్కనసొమ్ము. నన్నయభాగమున నిట్టిమనో వృత్తులవివరణము గానరాదు. ఎఱ్ఱాప్రెగ్గడ తిక్కన ననుసరించి రచించె ననుటలో సందేహము లేదు. తుదిపద్యములోని యాతని పలుకు లెంత యు రమ్యములై సందర్భానుకూలములై నాటకగుణముకలవై యున్నవి. (Speech how dramatic!)

ఆరణ్యపర్వ మైదవయాశ్వాసమున నింద్రుఁడు కుమారస్వామి తోఁ బలికిన యీ క్రిందిపద్యమునందలి రచనావైఖరి విరాటపర్వము లోని యుత్తరునివాక్యములతోఁ బోల్పఁదగియున్నది:

"అనుసెష నింద్రుఁ డిట్లనియె నట్లయినం గడులెస్స దేవ నీ
యనిమిషనాయకత్వమున కొం దభిషిక్తుఁడ వై ముదంబుతో
[illegible] నిగొమ్ము నీదుకరుణన్ దొసఁగెల్లను దీఱియుండెదన్
ఘనతరశౌర్యసారుఁడవు గావున నర్హుఁడ వింద్రలక్ష్మికిన్."
—ఆరణ్య. 5-226.

విరాటపర్వమునందలి యుత్తరుని మాటలు:

"మనము కలంక దేఱె రిపుమర్దనవిక్రమ యొక్క తేరు నీ
ఘనభుజశక్తిప్రాపున నఖండితశౌర్యమహోన్నతుండ నై

యనిమొనసారథిత్వము మహత్త్వము వైరులు మెచ్చఁజూపెడిన్
ననుఁబనిగొమ్ము లెమ్ము కురునాథు నదల్పు మరల్పు గోవులన్."

సత్యాద్రౌపదీ సంవాదముగూడ సంభాషణాశైలిలో రచింపఁబడుటయే గాక యిందలి జాతీయము, మనోవృత్తివివరణరీతులు తిక్కనశైలినే యనుకరించిన ట్లున్నవి.

(ఆరణ్య. 5-291):

"ఏనును నీవలన నిజము
గా నిది యంతయును నెఱిఁగి కమలదళాక్షుం
బూని వశగతునిఁ జేసి య
నూనస్నేహానుభోగయుక్తిఁ దలిర్తున్."

"అని యడిగిన మది నించుక
గినుక వొడము నడఁచుకొనుచు కృష్ణ మృదులహా
సిని యగుచు కృష్ణభామినిఁ
గనుకొని యిట్లనియె నిర్వికారాకృతి యై."

మదిని బొడమిన కినుక నడఁచికొనుట (మనోవృత్తిగోపనము), మృదులహాసిని యగుట, తుదకు నిర్వికారాకృతియై పలుకుట—ఇట్లు మనోవృత్తుల గమనమై ఖరిని విశదీకరించునట్టియు (psychological descriptions or descriptions of mental attitudes and conflicts), నాటకాభినయమును సూచించునట్టియు వర్ణనల నత్యద్భుతముగాఁ జేయుటలోని ప్రాగల్భ్య మొక్క తిక్కనకే చెల్లినది. తిక్కన ననుసరించి, యాతఁ డసమానచాతుర్యముతో చిత్రించిన ద్రౌపదీ పాత్రముయొక్క తత్త్వమును బాగుగాఁ దెలిసికొనినవాఁడు గనుకనే యెఱ్ఱాప్రెగ్గడ యీ సందర్భమును తిక్కనవలె రచింపఁగలిగినాఁడు.

నన్నయయే యైనచో నిట్లు రచింపలేకపోయియుండును. అప్పుడు ద్రౌపది యేమి పలికినదో ఆ పలుకులు తిక్కన చిత్రించిన యామె స్వభావమున కెంత నగియున్నవో పరికింపుఁడు:

"నను నిట్లు దుష్టవనితా
జనము నటులుగాఁ దలంపఁజనునే నీకున్
మన సొప్పదు పురుషోత్తము
వనితవు గాఁదగవు నీవు వనరుహనయనా.

"అని మేలంపుఁజందంబున దాని వివేకవిహీనత యెఱుకపడ నాడి పాంచాలి మఱియు నిట్లనియె".

ఈ మేలంపు జందంబునఁ నతిగంభీరముగా తిట్టినట్లు గాకుండ, పొగడినట్లు గాకుండ నతిగడుసుఁదనముతోఁ బలికించుట తిక్కన వైఖరియే గాని నన్నయది కాదు. అట్లు తాను పతుల యెడలఁ బ్రవర్తించురీతి నంతను వివరముగాఁ జెప్పి తుదకు

"ఇట్టి వర్తనముల నెపుడుఁ బాండవులకుఁ
దగిలి ప్రియము సేయఁ దగితి గాని
మగువ నీవు చెప్పు మందులు మాయలు
నింద్రజాలములును నే నెఱుంగ."

అని యన్నది. ఈ వాక్యములలోని జాతీయము, భాషాశక్తి (force of language), జిగి యెట్టిదో పరికింపుఁడు.

ఈ సందర్భమున నీ ద్రౌపదీ చిత్రమును విరాటపర్వమున కీచకవధానంతరము సుధేష్ణను జూడంజను ద్రౌపదీస్వరూపచిత్రముతోఁ బోల్చి చూడఁదగియున్నది. ఆమె "అంతఃపురము సొచ్చి సహోదరమరణశోకాతుర యగు కైకేయికడకుం జనునప్పుడు—

"ముదమున నెలమి సొంపొదవి నెమ్మొగమునఁ
దోఁపంగ వచ్చినఁ ద్రోచి త్రోచి
లలి నల్లసిల్లుచు లలితలోచనదీప్తు
లధర నుంకించిన నాఁగి యాఁగి
సంతసంబున బాలికము లగుచెయ్వులఁ
దొడరవచ్చిన చేయ కుడిగి యుడిగి
చనమున నుబ్బుమై మాట నాలుకకు రాఁ
గడగిన నాడక కడపి కడపి
ధీరయై యిట్లు సమ్మదపూరమునకు
గరువతన మనుబలితంపుఁ గట్ట పెట్టి
వెలఁది యెఱుఁగనియది వోలె వికృతి లేక
యల్ల నెప్పటియట్టుల యరుగుటయును."

ఇం దామె మనమునఁ బుట్టు భావములనుఁ బైకిఁ గనఁబడనీకుం
డుటకుఁగాఁ జేసిన ప్రయత్నమును వర్ణించుచు, భావసంఘర్షణము నతి
క్రమించి భావగోపనము చేయుటలో నామె చూపిన ధీరత్వము నెంత
చక్కఁగా తిక్కన వర్ణించినాఁడో చూడుఁడు. నాటకరంగమునం దెట్లో
యట్లే యీ సందర్భమున ద్రౌపదీపాత్ర మభినయింపవలసిన విషయమం
తయు నీసీసపద్యములో వర్ణించిచెప్పి యాపాత్రమును మనమనోనేత్రము
నెదుటఁ దెచ్చి పెట్టినాఁడు. ఈపద్యమందలి భావమును రంగమున నభిన
యించి చూపుటకు నాటకాభినయమునం దారితేరిన దిట్టరులకుఁ గాని
సాధ్యమగు నని తోఁచదు. ఆధునికాంధ్రనాటకరంగమునఁ బ్రసిద్ధులగు
వా రీతిక్కన రచించిన ద్రౌపదీపాత్రమును గమనించి యాతఁడు
సూచించినరీతి భావచ్ఛాయలను గనఁబఱచుచు, నాపాత్రము నభిన
యించినచో నతిరమ్యముగ నుండఁగలదని తోఁచుచున్నది. పై సత్య

భావుతోడి సంవాదసందర్భమును రచించుటలో నెఱ్ఱాప్రెగ్గడ యీ తిక్కన ననుకరించె ననుటలో సందేహము లేదు !

తగినసందర్భము దొరకినను నన్నయపార్యుఁ డీమనోవృత్తులను వర్ణింపక కథాగమనికయందు మాత్రమే గౌరవమును జూపి విడిచివేసిన ఘట్టముల నొకటి రెండింటిని జూపెదను. మనమునఁ బొడము విరుద్ధ భావముల సంఘర్షమును జూపి తాత్కాలికమనోవృత్తులను జక్కఁగా వివరించుట కనువగు సందర్భ మొకటి యారణ్యపర్వమునఁ బ్రథమాశ్వాసమున నర్జునుఁడు పాశుపతాస్త్ర సంపాదనకై తపంబు సేయఁబోవునపు డొకటి తటస్థించినది. అర్జునుని యస్త్రసంపాదనోద్యోగమునకు సంతసము, తాత్కాలికమగు వియోగమునకు దుఃఖము నెట్లు వారివారి మనోవృత్తులను త్రిప్పినవో చూపుట కవకాశము కలదు. కాని నన్నయ యెట్లు రచించినాఁడో చూడుఁడు:

“ దివ్యాస్త్రలాభార్థంబుగా నగ్రజుచే ననుజ్ఞాతుండై, విధిహోమసంతర్పిత వీతిహోత్రుండును, బ్రాహ్మణకృత స్వస్త్యయనుండును నై, ధౌమ్యాది మహీసురవరులను, భ్రాతృవరులను వీడ్కొని తపంబున కరుగ సమకట్టిన.............., అతని గాండీవహస్తు నక్షయ బాణతూణీరయుగళు నుత్తుంగభుజునిఁ జూచి పొంగి యంతర్హితభూతములును, బ్రాహ్మణప్రవరులుఁ బార్థునిమనమునఁ దలఁచిన యర్థంబు వడయ క్లిప్తసంసిద్ధి యయ్యెడు, సర్వవిఘ్నములు శాంతిఁ బొందెడుమని సంతసంబునఁ బల్కిరి.”

అర్జునుఁ డేఁగునపుడు సోదరు లొక్కమాటయైనను పలుకలేదు. ఆతఁడు తలపెట్టిన యుద్యమమునకు సంతోషముగాని, వియోగమునకుఁ బరితాపముగాని యేమియు వెలిఁబుచ్చియుండలేదు. జాగరూకుఁడవై

తపంబు సలుపుమని హెచ్చరింపనైనలేదు. ఈతనిఁ జూచి పొంగి పలికినది అంతర్హితభూతములును, బ్రాహ్మణప్రవరులును మాత్రమే. ఇట్లు వైదికకర్మలను గూర్చియు, వైదికాచారములఁగూర్చియు వర్ణింపవలసిన పట్ల నన్నయభట్టు చూపెడు జాగరూకత, ఉత్సాహము ముఖ్యముగా గమనింపఁదగి యున్నది. ఇట్లు భూతములు, బ్రాహ్మణులు పలికిన పిదప,

"...అంతఁ దరుణి పాంచాలి బీభత్సు
కడకు నరుగుదెంచి కమలనేత్ర
అరిజయార్థ మరుగు నాతనియుత్సాహ
మెఱిఁగి యిట్టు లనియె నిందువదన."

అంతేగాని యిచ్చట ద్రౌపదీమనోవృత్తులనైనను సూచించినాఁడు కాఁడు నన్నయ.

"అవమానాసహ మగునీ
యవనుక్షత్రియకులంబు నం దిం కిటఁ బు
ట్టువు గాకుండెడు త త్త్రమ
మవు బ్రాహ్మణకులమునంద యయ్యెడు నాకున్."

"అరికృత దుష్కరాభవమహార్ణవమగ్నుల మమ్ము నందఱం
గరుణ సముద్ధరింపుము జగన్నుత యన్యులు పూనఁ గాని యీ
భరము వహింపఁ బూనిన యపారగుణాన్వితు నిన్ను దిక్కులున్
దరణియు సోముఁడున్ నభముధాత్రియు గాప్పునుగాచుచుండెడున్."

అని యొకదీవన మాత్ర మిచ్చి యాపాంచాలరాజపుత్రి దనస్నేహలాలసవిలోలాపాంగవిలోకనంబులం బార్థుఁ బరిగృహీతపాథేయుం జేసి తద్వియోగతరళంబైన హృదయం బెట్టకేనియు నొక్కింత దిట్టచేసి

కొని యుండెను. అని నన్నయ యుచితంబుగనే చెప్పినాఁడు. కాని తిక్కన గారైనచో నీసందర్భమున నామె హృదయము వియోగతరళం బైనదియు, దాని నామె యెట్టకేనియు నెట్లొక్కింత దిట్టచేసికొనియుం డినదియు విపులముగా వర్ణించి,యప్పటి యామెస్వరూపమును మాటలచే చిత్రించి మనకనులయెదుటఁ బెట్టియుండెడివాఁడు. నన్నయకు కథ జరుగుటయే గావలసినది గాని యీకావ్యకళాసౌందర్యమును బెంపొం దించు విషయమున విశేషాదరము, తత్పరతయు లేదు. ఆతని దృష్టి పథము వేఱు. తిక్కనార్యుని దృష్టిపథము వేరు. ఎఱ్ఱాప్రెగ్గడయు నీవిష యమునఁ దిక్కననే యెక్కువగా ననుసరించినాఁ డనుట స్పష్టము.

మఱియొక సందర్భమును గమనింతము: ద్రౌపది సౌగంధిక పుష్పంబులం దెచ్చి యిమ్మని భీమునడుగుట:

"గంధమాదన పుణ్యతీర్థావలోకనపరులయి పాండవులు ధౌమ్య రోమశ ప్రభృతి కతిపయ బ్రాహ్మణులతోఁ జని యష్టమదివసంబున

"విమలస్ఫాటిక హాటక
రమణీయదరీనిరంతర శ్వేతనగేం
ద్రము మాల్యవంతమును ను
త్తమచరితులు సూచు చరిగి తద్విపినమునన్."

"చలదళిశుకపుంస్కోకిల
కలరవముఖరితలతాంత క్రమఫలాళీ
లలితమహీరుహమాలా
మిళితోద్దేశముల విశ్రమించుచు లీలన్."

చక్కని మృదుమధురపద గుంభితములగు సంస్కృతసమాసములతో ధారాళములు, సరళములునగు విచిత్రంపు నడకలతోఁగూడిన వర్ణనా

నై పుణ్యమును జెప్పవలసివచ్చినప్పు డది నన్నపార్యుని సొమ్మని చెప్ప వలసిన దె. అతిమృదులంబగు పూలపాన్పుపైఁ బండుకొనఁ జెట్టి జోకొట్టి నట్లే యుండును.

"అం దొక్కనాఁ డశ్వేరథ యను పుణ్యనదివలన మారుతానీతం బులై తమయుండటం బడిన పంచవర్ణ సురభికుసుమంబులం జూచి యం దఱు విస్మయం బందిరి. అంత నేకతంబున నొక్క శశికాంతశిలాతలం బుపై నున్న భీము నేనునకు ద్రుపదరాజపుత్రి యిట్లనియె."

ఆ సురభికుసుమంబు లందఱకు విస్మయము కలుఁగఁజేసినవని చెప్పినాఁడే గాని వానిని దెచ్చి యిమ్మని యడుగఁబోవుచున్న ద్రౌపది మనము నవి యెట్లాకర్షించినవో, వానిని జూచినతోడనే యామె మనో వృత్తు లెట్లయ్యెనో యనుదానిని నన్నయ యేమియు వివరించియుండ లేదు. తన కవి కావలయునని భీమునితోఁ జెప్పునపుడైనను ఆమె వానిని గూర్చిన యాదరాశ్చర్యసంభ్రమముల నేమియు వెలిఁబుచ్చియుండ లేదు. వస్తుస్థితిని మాత్రము చెప్పుచు,

"ప్రకటముగఁ దొంటి సౌగం
ధిక కనకాబ్జములకంటె దివ్యసుగంధా
ధికకుసుమము లివి దద్దయు
సుకుమారము లిట్టివానిఁ జూచి యెఱుంగన్."

"ఇకుసుమంబులు నాకుఁ దెచ్చి మనఃప్రియంబుఁ జేయు మనిన విని భీముండు తత్క్షణంబ చనె" నని చెప్పినాఁడు. ఇదియంతయు కీలు పుపెట్టిన బొమ్మలనో, మాజిక్ లాంతెరు భూతయద్దముగుండా చూచిన యొక దృశ్యమువలెనో యున్నదే గాని సినీమాలోనో, నాటకరంగముననో భావస్ఫోరకమగు నభినయరూపచలనముతోఁ గూడిన వ్యక్తు

లను జూచినట్లు కనఁబడుటలేదు. తిక్కనరచించిన పాత్రలవలె చైతన్యము గలిగి మనకు గోచరించుచు ననుభవమునకు వచ్చుచున్నట్లు లేదు. తిక్కనపాత్రలతోఁ బోల్చిచూచినపుడే యీవ్యత్యాసము కనఁబడునని చెప్పుటయే గాని, నన్నపార్యునిపాత్రలు సహజముగ హృద్యములు కావని చెప్పుట కెవ్వఁడును సాహసింప నేరఁడు. సినీమాయొక్కయు, రంగభూమియొక్కయు సహాయ మక్కఱలేకయే, కేవల మొక్క శ్రవణేంద్రియ సాహాయ్యముననే, మన కనులయెదుట నాటకమాడించు శక్తి తిక్కనార్యునికే గలదు.

సభాపర్వమున ద్రౌపది సభకుఁ దోడ్తేఁబడినపుడైనను, ఆమె మనోవృత్తులను, నాకారేంగితములను నన్నయ యేమియు వర్ణించి చూపలేదు. కేవలము కథ చెప్పినట్లున్నదే గాని యాదృశ్యము మన మనోదృష్టి నాకర్షించుటలేదు.

"దుర్యోధనుండు దుశ్శాసనుం బిలిచి ప్రాతికామివృకోదరునకు వెఱచు, నీవు వోయి ద్రౌపదిం దోడ్కొని రమ్మని పనిచిన,

> "నిర్దయాత్ముఁ బాపనిరతు దుశ్శాసనుఁ
> బనుచు పెటిఁగి కృష్ణ పంకజాక్షి
> గడు భయంబు నొంది గాంధారియొద్దకు
> నరిగెఁ గడు వడంకి యతిరయమున."

కడుభయము నొంది, వడంకి గాంధారియొద్దకు నరిగెనని మాత్రము చెప్పినాఁడు నన్నయ. అక్కడి కది స్వాభావికంబై రమ్యంబుగనే యున్నది. కాని భారతకథ కంతకును ఆయువుపట్టువంటి యీద్రౌపదీమానభంగ కథాసందర్భరచన తిక్కన చేతులలోఁ బడియున్నచో నెంతరమ్యతరంబుగాఁ జేసి మనకనులయెదుటఁ బెట్టెడివాఁడో యని

మాత్ర మనిపించును. ద్రౌపదిం బట్టుకొనుటకుం గీచకుఁడు వెనుకఁ దగిలినప్పటి కథాసందర్భమున తిక్కన యెట్టిచాతుర్యమును జూపి నాఁడో పరికింపుఁడు. వెంటఁ దగిలినవానిని మరలిచూచుట—భయ భ్రాంతయగుట—ఇదియంతయుఁ జూచిన సభలోని భీముని కోపాటో పము—ధర్మజుఁడు వారించిన విధము—ఈయన్నదమ్ముల చేష్టితములఁ జూచుచు నల్లన లేచి యెంతయు దైన్యముతో విరటుసభ కేఁగుట— అచ్చట నెలుంగు చలింపఁ బలికినరీతి—భీమునికోపాటోపము, ద్రౌపది దైన్యస్థితి—యివి యన్నియు నా కథాసందర్భము నంతను కన్నులకుఁ గట్టినట్లు చేయును. అజ్ఞాతవాసమున నున్నపుడే వారిస్థితి యిట్లు తిక్కన వర్ణించిచూపినాఁడు. అంతకంటె భయసంభ్రమములను, రోష దైన్యములను బురికొల్పఁగలిగిన యీ సందర్భ మేదో దూరపుకథ విన్నట్లె యున్నది గాని యది ప్రత్యక్షమై యెదుటఁ గనఁబడిన ట్లుండకుండుటకు భారతరచనలో నన్నపార్యుని దృష్టిపథము వే అగు టయే కారణము గాని వేఱు కాదు.

మనోగత భావ వికారములను వెలిఁబుచ్చు సూచనలు చేయుట నన్నయ రచనాశక్తి యైనట్లు కనఁబడదు. కథాభాగమును వట్టి కథ చెప్పినట్లుగనె (narration) నడిపింపక, యందలిపాత్రల సంభా షణాదికము మూలముగను, ఆ మాటలాడు సమయముల వారివారి మనోగత భావములను వెలిఁబుచ్చుచున్నట్లు సూచించుచుండుటచేతను తిక్కనరచన నాటకలక్షణములు కలదగుచున్నది. ఇట్టి లక్షణము లర ణ్యపర్వశేషమునఁ గానవచ్చుచుండుటచే నిది తిక్కన ననుసరించి యెఱ్ఱాప్రెగ్గడ రచించినదే యని చెప్పఁదగును. నన్నయ కిట్టి పద్ధతుల యం దాదరము లేకుండె ననుట కీ క్రింది నిదర్శనమే చాలును:

పాండవుల కష్టములను గూర్చి విని ధృతరాష్ట్రుఁడు దుఃఖించుట— ఇది ఆదిపర్వము 6-వ యాశ్వాసమున వచ్చును. పాండవులు లక్క యింటఁ బడి చచ్చిరనియు, నిట్టి దారుణంబగు కృత్యంబునకుఁ గారణము దుర్యోధనుని కృత్యంబనియు నెఱింగి, వారణావతమ్మున వారెల్ల శోకించి కుంతీపాండవుల పంచత్వంబు ధృతరాష్ట్రునకుం జెప్పి పుత్తెంచిన,

"బాధిత శత్రువర్గు లగుపాండుకుమారుల దుఃఖవార్త ను
ర్వ్యాధనము లైన సౌబలదినాధిపసూనులయొద్ద నప్డు దు
ర్యోధనుఁ డాదిగాఁగ సుతు లున్న సభన్ విని దుఃఖితాత్ముఁడై
యా ధృతరాష్ట్రుఁ డావఱచిన ట్లఱచెన్ వివిధప్రలాపుఁడై."

ఇట్లు పాండవుల మరణవార్త విని దుఃఖితాత్ముఁడై యావఱచిన ట్లఱచె నని యొకయుపమానముతో నా ధృతరాష్ట్రుని దుఃఖమిట్టిదని తెలిపినాఁడు నన్నయ. ఈ యుపమానము విశేషభావగర్భితమును, నీతని దుఃఖమును చక్కఁగ వ్యక్తముచేయునది కావచ్చును. కాని తిక్కనాదులరచనలలోని నాటకకళారీతి (dramatic element), కళాసౌందర్యము (artistic beauty) ఇందు కలదని మాత్రము చెప్పుట కవకాశము లేదు.

"మఱియు గాంధారిం దొట్టిదేవీజనుల యాక్రందనధ్వను లంతఃపురంబున నెగసె. భీష్మాదికురువృద్ధులును విప్రులుం బౌరులును శోకాక్రాంతులైరి. విదురుండు పాండవుల కుశలగమనం బెఱింగియు నెఱుంగనివాఁడ పోలె నందఱం గలసి దుఃఖితుం డయినట్లుండె. అంత ధృతరాష్ట్రుండు గొడుకులుం దానును గుంతీపాండవుల కుదకదానంబు సేసి యగ్నిసంస్కారాది పరలోకక్రియలు సేయింప గంగాతీరమునకుఁ దగువారి బ్రాహ్మణుల నపారధనంబులతోడం బుచ్చిన"

అనియుం జెప్పఁబడియున్నది.

ఈ సందర్భమున సంస్కృతమూలమునకు నన్నయ తెలుఁగునకుఁ గూడ కొంత భేదము కనఁబడుచున్నది. కుంభఘోణపు సంస్కృతముద్రిత ప్రతిలో పాండవుల నాశనమును గూర్చి విన్నపిదప వీరందఱు నింతకంటె నెక్కుడుగనే ప్రలాపించినట్లున్నది. అందు ముఖ్యముగా భీష్ముని విలాపము ఇరువదిశ్లోకములలోఁ జెప్పఁబడియున్నది. ఆతఁడు పాండవుల గుణవర్ణనము చేయుచు, దైవగతికి చింతించుచు విశేషముగ వాపోవుచుండ తుదకు విదురుఁడు పాండవులఁ గూర్చిన నిజమైన వార్తను భీష్మునికిఁ దెల్పి యాతని నూరడించుటయేగాక వారి కుదకదానమును గూడఁ జేయవలదని చెప్పినట్లు కనఁబడుచున్నది. సంస్కృతమూలములో నీభాగము ప్రక్షిప్తమై యాతనికాలమున నాతఁడు గ్రహించినప్రతిలో లేకుండెనని నిశ్చయింప గలిగిన నేమోగాని, లేనిచో, నన్నయ మూలములో భీష్మాదుల విలాపమునంతను "శోకాక్రాంతులై"యనుమాటతో నెగురఁగొట్టివేయుటను జూడఁగా నాతనికి రసోచితముగా నీమానసికవృత్తివర్ణనమును జేయుటయం దంతశ్రద్ధ, యుత్సాహము లేదని తలంపవలసి వచ్చుచున్నది. మూలమున లేకున్నను సందర్భము దొరకినచోఁ దాను స్వయముగ నాయాపాత్రల మనోవృత్తులను వర్ణింపఁజూచువాఁడు తిక్కన. ఇట్టికొన్నిసందర్భములలో నెఱ్ఱాప్రెగ్గడయు తిక్కన చూపినదారినే పోయినవాఁడు గాని నన్నయమార్గమునే యవలంబించినవాఁడు కాఁడు. ఆరణ్యపర్వశేషము నన్నయకృతమే యైనచో, నిందాఱవ యాశ్వాసమున పాండవుల యరణ్యవాసకష్టములను గూర్చి వినిన ధృతరాష్ట్రుఁడు పై సందర్భమునకంటె వేఱువిధముగా వర్ణింపఁబడుటకుఁగల కారణముఁ గానము. ఆరణ్యవాసమున నున్న కౌంతేయులం జూచివచ్చిన బ్రాహ్మణుఁడొకఁడు, ఆపాం

దవు లేవురు ననవరత శీతవాతాతప కర్శితాంగులై బహు దుఃఖసాగ
రమున మునింగి యున్నవారని చెప్పినంతమాత్రముననే, దానిని విని
వైచిత్రవీర్యుండు "విషణ్ణహృదయుండై కన్నీరు దొరఁగం గొండొక
సేపు వలుకకుండి పదంపడి నిట్టూర్పు నిగిడించి గద్గదకంఠుం డగుచు
నిట్లనియె" నఁట. ఆదిపర్వమునఁ బాండవులు చనిపోవుటను విన్నపుడే
'దుఃఖితాత్ముఁడయ్యె' నని యొకవిశేషణముతో నాతనిస్థితి తెలుపఁ
బడియుండ, నిచ్చట నెట్లు సందర్భానుకూలమై యాంతరంగికభావద్యో
తకంబై స్వాభావికంబగు(realistic, graphic,)వర్ణనము చేయఁబడినదో
గమనింపుఁడు. "అ వఱచిన ట్లఱచెక్" అనునొకయుపమానమే నన్నయ
భావగంభీర్యమును సూచించునని చెప్పవచ్చునుగాని, యీసందర్భము
నందునలె ధృతరాష్ట్రుని యప్పటిస్వరూపము, నాదృశ్యమంత
యును మనకనులయెదుటఁ బెట్టఁబడినదని చెప్పుట కవకాశము లేదు.
పాండవులు చనిపోయిరని విన్నపుడే దుఃఖించెనని మాత్రము చెప్పి
యూరకున్న నన్నయ, యిచ్చట వారి వనవాసక్లేశములను విన్నంత
మాత్రమున గద్గదకంఠుండగుచు వాపోయెనని చెప్పి యతని దుఃఖమును
సూచించుటకు 15,20 పద్యములవఱకు రచించెననుటయు యుక్తియుక్త
మగాఁ గనఁబడదు. ధృతరాష్ట్రుఁ డొకవేళ నిచ్చట దొంగయేడుపేడ్చె
ననుకొన్నను, అతని పలుకులు పాండవులస్థితినిగూర్చియు, స్వభావ
గుణములను గూర్చియు నాతని కాసనుయమునఁ గలిగినభావము లెంత
సందర్భానుకూలములై యున్నవో గమనింపుఁడు.

"నాచేసినకీడునఁ గడు
నీచుండగు నాతనూజు నేరమి నిమ్మై
నోచెల్ల పార్థులకుఁ బు
ణ్యాచారుల కెందు లేని యాపద వచ్చెక్."

"అన్నయుఁదమ్ములున్ సతియు నార్తిమెయిం బహుదుఃఖమగ్నులై
యున్న తెఱంగు సూచి విజయుండు యుధిష్ఠిరవాక్యబద్ధుఁడై
సన్నుతుఁ డుగ్రపన్నగము చాడ్పున రోఁజుచుఁ గ్రోధశోకవే
గోన్నతి నాత్మ నేమనుచునుండునో నాసుతుతప్పు లెన్నుచున్."

"అనుపమ తేజుఁ డున్నతభుజాగ్రుఁ డుదగ్రుఁడు వైరినిగ్రహుం
డనఘుఁడు వాయుసూనుఁడు నిజాగ్రజు చేసినసత్యపాశబం
ధనమునఁ జిక్కి తత్సమయతత్పరుఁడై యట ఘోరదుఃఖవే
దనములు సైఁచెగాని మది దద్దయుఁ గ్రోధమయంబు వానికిన్."

"శకుని కైతవము దుశ్శాసను చేసిన
దుష్కర్మమును గర్ణు తులువతనము
దుర్యోధనుని దైనదుర్ణయంబును జిత్త
మునఁ గిరిశల్యముల్ వోలె నలఁప
దావాగ్ని తెఱఁగున దరికొని క్రోధంబు
వనవాస మనియెడి వాయుగతుల
నంతకంతకుఁ బేర్చి యవయవంబుల నెల్ల
మండంగ నెప్పుడు మధ్యముందు
మొగము జేవుఱింప ముడిచెడు బొమలతో
నవుడు గఱచుచును భయంకరముగ
నున్నరూపు వాయుతుండు నామది వాఁడ
మిత్తి నాదుపుత్రమిత్రతతికి."

"అర్జునానిలప్రేరితం బగుచుఁ బేర్చి
వాయుతనయదవాగ్ని దుర్వారభంగిఁ
గర్ణసౌబలసహితముగా మదీయ
పుత్రశతకాననము వేసఁ బొదువకున్నె."

ఇట్లు పాండవుల వనవాసక్లేశమునకై తనదుఃఖమునెగాక, వారివారి స్వభావములను, వారివలనఁ దమకుఁ గలుగు భయమును చక్కఁగా వ్యక్తము చేసినాఁడు. భీమునిస్వభావ మతిరమ్యముగా, సందర్భానుకూలముగా వర్ణింపఁజేసినాఁడు. ఎఱ్ఱాప్రెగ్గడ తిక్కనరీతుల ననుకరించిన వాఁడు గనుకనే యిచ్చట నీదుఃఖవర్ణన నింతగా పెంచినాఁడు.

వైదికోత్తముఁడగు నన్నయధోరణితో నతుకక రసోచితములై తరువాతి ప్రబంధకవుల ధోరణికి మార్గదర్శకంబులైన గడుసుపోకడలీయరణ్యపర్వశేషమున నచ్చటచ్చటఁ గలవు. పరీక్షితుఁడను నొక రాజు మృగయారతుండై పోయి వనంబున నొకపువ్వుఁబోఁడిం గనియె.

"కని యంతఁ గదిసి యాకా
మిని యొప్పులఁ జూడ్కిఁ దగుల మీఱినతమకం
బున ననిమిషలోకనుఁడై
జననాథుఁడు మదన బాణసంహతిఁదూలెన్."

"అదియును నతిసుందరంబైన తదీయ మూర్తివిభవంబునకు మెచ్చి సాభిప్రాయంబుగా నవలోకించె నంతనమ్మహీకాంతుం డక్కాంత కిట్లనియె.

"ఎవ్వరిదాన వంబుజదళేక్షణ యేకతమిట్టు లేల నీ
వివ్వనభూమియందుఁ జరియించెదు నావుడుఁ దండ్రిపంపునం
దివ్వనభూమియందుఁ జరియించెద సవ్వరుగోరుకన్య నే
నెవ్వరిదానఁ గావలయు నేర్పడఁ జెప్పుము రాజనందనా.

"అనిన దాని ప్రగల్భవచనంబులకు నధికవిలోలుండై భూపాలుండు దనయభిలాషం బెఱింగించిన."

పై ప్రగల్భవచనముల ఛాయలే ప్రబంధరాజంబగు మనుచరిత్ర లోని

"ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటి జరించె దోటలే కివ్వన భూమి"

అనుపద్యములో పెద్దనార్యునిచే ననుకరింపఁబడినవి. మార్కండేయుఁడు ధర్మజునకు బ్రాహ్మణప్రభావంబుఁ జెప్పుట యనుఘట్టము లోని పీపద్యములు. ఇది నన్నయయే వ్రాసినచో నిట్టి ప్రగల్భవచనములతోఁగాక ధర్మయుతములు, వైదికాచారబోధకములునైన వాక్యములతోఁ గూడియుండెడిదేమో యీఘట్టము. ఇదియంతయు కేవల కథాకథనపద్ధతిని (narrative style) గాక సంభాషణాశైలిలో రచింపఁబడిన దగుటచే తిక్కనార్యునిశైలి ననుసరించిన యెఱ్ఱాప్రెగ్గడ కవిత్వ మనుటకు సందేహము లేదు.

యుద్ధవర్ణనావిషయమునను నీ యారణ్యపర్వశేషము తిక్కన రచనల ననుసరించునదై యున్నది. "తండ్రిచే వీడ్కొలుపఁబడిన యింద్రజిత్తు సత్వరుండై యరదం బెక్కి పురంబు వెలువడి కరతలం బెత్తి లక్ష్మణునిం బిలుచుట" "మచ్చరము మీఱ నొండొరుఁ జిచ్చుఱ పిడుగులనుబోని శితవిశిఖములం జెచ్చెర నొంచుట," "నెఱఁకులనొంచి బాణమయ నీరధి ముంచుట, శరము లుచ్చి పోరుట, అట్లు దలపడియవ్వీరు లిరువురు నాభీలశార్దూలయుగళంబుకరణి నతిఘోరయుద్ధంబు సేయుచుండ నిశాచరవనచరబలంబులు రణం బుడిగి వెఱఁగుపడి వారిపోరు సూచుచుండుట, తిక్కనసామాన్య యుద్ధక్రమవర్ణనము, నిట్టియన్నియు తిక్కన రచనల ననుసరించి రచించినవే. నన్నయ భాగములో నీరీతివర్ణనలు గానరావు. కర్ణార్జునుల ద్వంద్వయుద్ధ మొక్కపద్యములో వర్ణించి

నాఁడు నన్నయ. ద్రౌపదీస్వయంవర సందర్భమునను, ద్రుపదు నర్జునుఁడు పట్టి తెచ్చినప్పుడును గూడ నన్నయ యుద్ధవర్ణనము విశేషముగాఁ జేయలేదు. కాని యారణ్యపర్వమున నైదవయాశ్వాసమందలి కుమారస్వామి మహిషాసురునితోఁ జేసిన యుద్ధము నెఱ్ఱాప్రెగ్గడ తిక్కనవలెనే యతివిపులముగా వర్ణించినాఁడు.

సీసపద్యరచనలోని తూఁగు (ballance), సమాంతరరచనారీతి (parallel structure) యెఱ్ఱాప్రెగ్గడ తిక్కనను జూచియే నేర్చికొనియుండును.

" ఎవ్వనివాకిట నిభమదపంకంబు
రాజభూషణరజోరాజి నడఁగు
నెవ్వనిచారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపు గఱపు
నెవ్వనికడకంట నివ్వటిల్లెడు చూడ్కి
మానితసంపద లీనుచుండు
నెవ్వనిగుణలత లేడువారాసుల
కడపటికొండపైఁ గలయఁ బ్రాఁకు
నతఁడు భూరిప్రతాప మహాప్రదీప
దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి
తలఁప కేవలమర్త్యుఁడే ధర్మసుతుఁడు."

విరాట. 2 ఆ. 181.

" కమనీయ కమలినీకల్లోలవీథులఁ
గదలు రాయంచలగతులయొప్పు
బహుపుష్పపల్లవ ప్రకరచిత్రితములై
తనరారు తరులతాతతుల సొంపు

మకరందరసపాన మదవిలోలంబులై
క్రాలెడి యెలఁదేఁటి గములయులివు
పరిపక్వమంజులఫలరసోద్ధతములై
పలుకు రాచిలుకల పటురవంబు
ప్రియుఁడు వేఱువేఱ ప్రీతిమైఁ జూపుచు
చెప్పుచును జనంగఁ జిగురుఁబోఁడి
గనుచు వినుచు నిర్వికారసల్లాపంబు
లార నతనితెలుఁగు నరయుచుండె.

ఆరణ్య. 7 ఆ. 213 ప.

ఆరణ్యపర్వశేషమునందలి కొన్ని పద్యములకును తిక్కనార్యుని పద్యములకును గలపోలికలు:—

"ఇట్లు వైశ్వానరుండు మునిపత్నులయందుఁ దగిలిన డెందంబు మగిడింపనేరక వారలం గదియ నప్పళించి గార్హపత్యకుండంబునం దావేశించి,

"అతివలు దన్నుఁ జేరుటకు నాసపడుం బొరిఁ జేరుచోట నా
యతవిలసచ్ఛిఖాగ్రముల నల్లన వారల నంటుఁ గౌతుకం
బతిశయమై తదంగలత లాదటఁ గౌఁగిటఁ జేర్పఁగోరు కం
పితధృతియై కలంగఁబడుఁ బెల్లగు రాగరసంబు ముంపఁగాన్."

విరాటపర్వమునఁ గీచకుఁడు ద్రౌపదినిఁ జూచి,

"అనియని యుగ్గడించు ధృతి యల్లలనాడినఁ దల్లడించుఁ దై
కొను తల పొరగించు మదిఁ గోర్కులు పేర్చిన నప్పళించు నె
ట్టన తెగ నగ్గలించు, నదటన్ జనులన్ బరికించు, బుద్ధిమా
లినవెస నెంతయుం గళవళించు మనోజవికారమగ్నుఁడై."

విరాట. 2-32.

" ఆయతబాహు లుగ్రబలు లార్యులు పార్థులు వారిభూరిశౌ
ర్యాయుధనైపుణక్రియలయందు పదాఱవపాలుఁ బోలఁ డీ
వాయపురజ్ఞులాఁ డధిప వారల చందమువీనిచందమున్
నీయెడ నిక్కమై తెలిసె నేఁ ఖచరేంద్రులపోరిలోపలన్."

ఆర. 6-63.

" ఒకట నైనను వారియం దొక్కఁ డైన
చిదురపాలును బోలండు సిగ్గు లేక
పాండవుల గెల్తు నేనని పలుకుచుండు
వీనిరజ్జులు దులువలు వింద్రు తగిలి."

ఉద్యో. 2-159.

సైంధవుపంపున గోటికాస్యుండు ద్రౌపదిని సంబోధించుట:

" పొలతి నీదు, జీవితేశ్వరుఁడగు సుఖజీవితాత్ముఁ
డెవ్వఁ డబల నీనామమై యింపు మిగులు
శబ్ద మెయ్యది నాకు నిజంబు చెపుమ."

ఆరణ్య. 6-151.

కీచకుఁడు ద్రౌపదినిగూర్చి—

" దీనిజన్మంబునఁ దేజంబు నొందిన
యింతియుఁ బతియును నెవ్వరొక్కొ
దీనినామాకృతి గా నోచి పడసిన
యింపగువర్ణంబు లెవ్వియొక్కొ..."

విరా. 2-30.

సీత రామునితో—

" పడఁతి మెల్లన మఱికొంతనడికిఁ దెలిసి
యలసమూర్తియై కనుదోయి నశ్రు లురులఁ

గేలు ముకుళించి వసుమతీపాలుఁ జూచి
ఎలుఁగు పుత్తుకఁ దగులంగ నిట్టు లనియె."

ఆరణ్య. 7-159.

అర్జునుఁ డభిమన్యువధానంతరము దుఃఖించుట:

" అని యలంతమైఁ బలుమాట లాడుచుండి
తలఁగని మఱియును ధర్మనందనుని యాన
నంబు వీక్షించి నిర్జరనాథతనయుఁ
డెలుఁగుపుత్తుకఁదగులంగ నిట్టులనియె."

ద్రోణ. 2-252

సావిత్ర్యుపాఖ్యానము—సావిత్రి తండ్రియొద్దకు వచ్చుట:

" నెచ్చెలులు దన్నుఁ గొలువఁగఁ
బచ్చవిలుతుకలిమి యెల్లఁ బద్మాననయై
యచ్చుపడినట్లు మెఱయుచు
నచ్చటి కేతెంచె భూవరాత్మజ నెమ్మిన్."

"ఇట్లు వచ్చి సఖీజనంబుల నంతంత నిలిపి మెలపుతో డిపాలపుననమ్రగుప లీలామధురంబుగఁ దండ్రికి దండప్రణామంబు సేసిన నాతఁ డత్తన్వి ఁగుచ్చియెత్తి నిజాంకతలంబున నునిచికొని సముచితోపలాలనకేళీపర వశుం డయ్యె."

ఆరణ్య. 7-126.

"...ఉత్తర సనుదెంచె నలరువిలుతుపువ్వుటమ్మువోలె.
వచ్చి కొలువు సొచ్చి నెచ్చెలిపిండు నం
తంత నిలువఁ బనిచి యల్లనల్లఁ
గదిసి ప్రౌఢవనితకై వడి ముద్దియ
ముద్దు పుట్టఁదనకు మ్రొక్కుటయును."

" తిగిచి కవుంగలించి జగతీవిభుఁ డక్కమలాయతాక్షి నె
మ్మొగము మొగంబునం గదియ మోపు గరాంగుళులం గపోల
మింపుగఁ బుడుకున్..."

విరాట. 1-245.

"కుండలంబు లిమ్మని యడిగిన యింద్రునకు గర్ణుఁడిట్లనియె.

" అలసవిలాసలాలసరసాన్వితలైన నితంబినీజనుల్
వలసిన భూరివిస్ఫురితవస్తుసమగ్రములైన గ్రామముల్
వలసిన నుల్లసన్మణిసువర్ణవిభూషణగోధనావళుల్
వలసిన గోరు మిచ్చెద ధ్రువంబుగ నావుడు నాతఁ డిట్లనున్."

ఆరణ్య. 7-359.

" వలను శోభిల్ల నెవ్వాఁడైన వీఁడె య
ర్జునుఁ డని నా కిష్ట సూపెనేని
పసదనం బే నిచ్చుభంగి యందఱకును
వివరించి చెప్పెద వినుఁడు మీరు
పొఁగడంగఁ దగురథ్యములతోడి సౌవర్ణ
రథములు వలసినరయము లావుఁ
బొలుపును గలుగుకాంభోజహయంబుల
వలసినఁ బేర్చుసత్త్వంబునందుఁ
బరిణతములగు సుందరకరివరముల
వలసినను చారులావణ్యవతుల వలసి
నను మహాగ్రామములు వలసినను గోర్కి
కెక్కు డమ్మేటిమగని కే నిచ్చువాఁడ."

కర్ణ. 2-30.

తిక్కనార్యుఁడు చేసిన జాతీయప్రయోగములు కొన్ని యీరణ్యపర్వశేషమునఁ గానవచ్చుచున్నవి. ఇవి నన్నయభాగమునఁ గానవచ్చుటలేదు.

" రాధేయుం డొకచీఁటికిం గొనఁడు దేవవ్రాతముం బోరులన్ ."

విరా. 4-ఆ.

" కమలవరప్రదత్తవరగర్వితుఁడై మముఁ జీఁటికిం గొనం
డమితపరాక్రముండు దనుజాధిపుఁ డీతఁడు."

అరణ్య. 5-286.

" ఆతూపు దప్పిన గాసియైతి."

శల్య.

" ఇవ్విధంబున నతం డేటు దప్పిన జోహారువెట్టుటయు."

అర. 4-362.

"ఈ దేవదేవు కరుణం
గాదే కురునాథ నిర్వికారుఁడనై నిః
ఖేదుఁడనై యుండుదు."

అరణ్య. 4-284.

"కాదేని గాండివ జ్యా
నాదము సురదుందుభిప్రణాదంబును నిః
ఖేదుఁడనై వించునధిక
మోదంబున నిత్యసౌఖ్యముం గైకొందున్."

ద్రోణ. 1-35.

"అమ్మగువపూఁతురు సుశోభన యనునది దానిచేత ననేకులు బేలుపడిరి. నీ వెంతవాఁడ వనిన" అరణ్య. 4-337.

"తానఁటె మాంసము దినదఁటె
యీ నక్కయు బేలు పెట్టె నిన్నాళులు"

శాంతి

"తొడరి చరాచర ప్రతతితోఁ జగమంతయు వార్ధి దొట్టిన
ప్పుడు" [తొట్టు=ఆక్రమించు.]

ఆరణ్య. 4_240.

"జగములెల్ల తొట్టి నిండారువెన్నెల నిట్ట వొడిచె."

నిర్వచ. రా.

ఇట్లీకవితాలక్షణములు, భాషాప్రయోగములు తిక్కనార్యుని రచనాపద్ధతి ననుసరించియుండుటచేతను, నివి నన్నయ రచనలో విశేషముగఁ గాన రాకుండుటచేతను, తిక్కన తరువాతికాలమువాఁడై యాతని కవిత్వ ననుకరించి రచింపఁదగినవాఁడగు నెఱ్ఱాప్రెగ్గడ 'తద్రచనయుకా' పూరించిన యారణ్యపర్వ శేష భాగములోఁ గనఁబడుచుండుటచేతను, నీయారణ్యపర్వ శేషము నన్నయరచనయొక్క శిథిలభాగ పూరణము గాక కేవలనూతనరచనయేయని-శిష్టభాగపూరణమే యని, స్పష్టమగుచున్నది. ఎఱ్ఱాప్రెగ్గడ ఆరణ్యపర్వము నవశిష్ట భాగమునే పూరించియుండుటచేతను, తిక్కనార్యుఁ డవతారికలో వ్యాసభారత మష్టాదశపర్వనిర్వహణసంభృతమై యుండ అందు మూఁడుకృతు లాంధ్ర కవిత్వ విశారదుండు-నన్నయ భట్టొనరింప తాను విరాటపర్వమట యుద్యోగాదులంగూడఁగా పదునేనింటిని "తుదిముట్టఁ దెనుఁగున రచియించుటొప్పు"నని తెలుఁగున భారత మీప దేనుపర్వములతోఁ దుదిముట్టునని యే స్పష్టముగాఁ జెప్పి, తన రచనతో భారతము సంపూర్ణమగు నని యెంచుటయే గాని యాంధ్రభారతరచన యింక నుకొఱవడియుండునని యాతఁడు తలంచిన ట్లగపడకపోవుటచేతను,

నాతనికాలమునకు మూఁడుపర్వములు సంపూర్ణముగా నున్నవనిగాని, లేదా నన్నయభాగము నాతఁడు చూడకయే రచించెననిగాని చెప్పక తప్పకున్నది. నన్నయభాగములోని కొన్నిపద్యములనుమాత్ర మాతఁడు వినియుండవచ్చును. మూఁడవపర్వములోని భాగము కొఱవడియున్నఁగాని, అట్లున్నదని యాతఁ డెఱింగి యున్నఁగాని, తుదిముట్టింతునని చెప్పియుఁ, దరువాతనైన నా శేషమును బూరింప దొరఁకొనకుండునా. ఈ తుదిముట్టింతు నన్నది 15 పర్వములే యని చెప్పుదురేమో, అది యు పొసఁగదు. ఈపద్యములలోని క్రియలకు ప్రధానకర్త పై పద్యము లోని "భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయము" అనునది "అది యును" అని యాభారతగ్రంథమునే యనువదించి, అందులో 18 పర్వ ములున్నవి, అందు మూఁడు కృతులు నన్నయ రచించెను–తిక్కన 15 ను రచించి తాను తుదిముట్టింతునని స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. కావున తిక్కన తరువాత నలుబది యేఁబదేండ్లలో నీభాగము శిథిలమై పోయిన దనుటకంటె తిక్కన యీ పర్వములను జూడలేదనుటయే యుక్తముగాఁ గనఁబడుచున్నది.

నన్నయ రచించిన భారతమును తిక్కనార్యుఁడు చూచినను జూడకున్నను, మొత్తముమీఁద నాతఁడు ప్రారంభించిన భారతాంధ్రీ కరణోద్యమమును కొనసాగించి తుదముట్టింపవలయునని మాత్ర మీత నికి దృఢసంకల్పము గలిగినది. మొదటి మూఁడుపర్వములు రాజమ హేంద్రవర రాజ్యాస్థానకవి యాంధ్రకవిత్వ విశారదుం డొనర్చెనని విన్నాఁడు. ఈ పర్వములు ముఖ్యముగా ఆది యారణ్యపర్వములు విశే షముగ నుపాఖ్యానములతోఁ గూడియున్నవి. పాండవులనుగూర్చిన కథ స్వల్పమే. అదియునువారిదుఃఖములను,కష్టములనుగూర్చి తెలుపునదేగాని పాండవుల యభ్యుదయమును దెలుపునది కాదు. పాండవుల యభ్యుదయ

చిహ్నములు విరాటపర్వమునుండియే గనఁబడుచున్నవి. ఈతరువాతి పర్వములలోఁ జాలవఱకు కథ యంతయు పాండవవీరులకు సంబంధించినదే; ఉపాఖ్యానములును చాలతక్కువ. పాండవులీపర్వాంతముననే వనవాసాజ్ఞాతవాసాది క్లేశములనుండి విముక్తిఁ జెంది బయలువడిరి. ఈ కారణము చేతనేగావలయు, విరాటపర్వపఠనము శ్రేయోదాయకమని తలంపఁబడుచు వచ్చినది. భారతపఠనము గూడ నీ పర్వముతోడనే ప్రారంభింపఁబడు నాచారమును బ్రబలినది. ఇంతేగాక తిక్కనకవితోద్దేశము లకు మొదటి మూఁడుపర్వములకంటెను గూడ నీతరువాతి కథ యెంత తగియున్నదో యాతఁడు గ్రహించినవాఁడు గనుకనే, దానిని

> "హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా
> భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులం గూడఁగాఁ
> బదునేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునన్
> దుదిముట్టన్ రచియించుటొప్పు బుధసంతోషంబునిండారఁగన్.

అని యింతగాఁ బ్రశంసించినాఁడు. హృదయాహ్లాదిత్వము, ఊర్జితకథోపేతత్వము, నానారసాభ్యుదయోల్లాసిత్వము అను విశేషణములే భారతరచనాసందర్భమున నీతనిదృక్పథమును మనకు సూచించుచున్నవి. ఈతనిది ముఖ్యముగాఁ గావ్యకళాదృష్టి, రసమయమగు దృష్టియేగాని, నన్నపార్యుని సంహితా రచనాదృష్టి- యాగఫలసంపాదనాదృష్టి-వైదికమతధర్మరక్షణదృష్టియు-మాత్రము గాదు. కావుననే నన్నపార్యుఁడు "జగద్ధితముగ" రచించిన మొదటి మూఁడుపర్వములజోలికిఁ బోవక, "బుధసంతోషంబు నిండార", "భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాంధ్రావళి మోదముం బొరయునట్లు"గను మిగిలిన పదునేనింటిని దెనుంగుబాసను రచించినాఁడు. ఈతఁడు తలంచిన ట్లీభారతమాంధ్రావళికి

మోదముగూర్చియుండును. ఇది విశేషముగాఁ జదువఁబడుచుండుటం
జేసియే, నన్నయ రచితంబగు మొదటి భాగమునుగూర్చి జనులలోఁ
గౌతూహలము పెరుఁగుటయు, నదియుఁ బైకి దీయఁబడి ప్రచారములో
నికి వచ్చుటయుఁ దటస్థించియుండును. తిక్కనకు సమకాలికులుఁ
గొంచెము తరువాతివారు నగు కేతన, మంచన, మారనలు నన్నయభట్టును
స్మరించియున్నారు.

అందు మారన

"సారకథాసుధారస మజస్రము నాగళపూరితంబుగా
నారఁగఁ గ్రోలుచుఁ జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా
భారతసంహిత న్మను త్రిపర్వము లెవ్వఁ డొనర్చె నట్టి వి
ద్యారమణీయు నంధ్రకవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్."

అని భారతసారకథాసుధారసము నాగళపూరితంబుగా జనులు గ్రోలు
నట్లుగా రచించెననియే వ్రాసియున్నాఁడు గాని, యీతఁడు తిక్కన
వ్రాఁతనుబట్టియే వ్రాసియుండకపోయినచో, మార్కండేయపురాణ
మును దెనిఁగింపఁజేపట్టిన యీతఁడు నన్నయయరణ్యపర్వశేషము నేల
పూరింపక విడిచియుండెనో తెలియదు. నన్నయరచిత భాగము నీతఁడు
చూచియే యుండె నన్నచో నంచలి శేషమును రచింపకుండుటకు
భయకారణముతక్క వేఱుకారణము కనఁబడదు. కేతన దశకుమార
చరితమునను నన్నయను స్మరింపనైనలేదు. ఎఱ్ఱాప్రెగ్గడకు కొంచెము
ముందుకాలమువాఁడగు విన్నకోట పెద్దనగూడఁ దెనుఁగుకవిత్వ మన్నఁ
జెవిఁబెట్టలేకుండిరని చెప్పుటనుబట్టి రాజమహేంద్రవరపండితులు
నన్నయగ్రంథమును వ్యాప్తిలోనికి రాకుండఁ జేసిరేమో యని సందేహిం
చుట కవకాశము లేకపోలేదు. ఎఱ్ఱాప్రెగ్గడకాలమున నాంధ్రదేశ

పాలకులైన కొండవీటి ప్రభువులప్రాపును బడసి రామాయణమును
రచించి, భారతమున నుత్తరభాగమగు హరివంశమును రచించుసందర్భ
మున నీనన్నయ రచితభాగమును బయటకుఁ దీయించి, యది కొంతవడి
యుండుటనుజూచి యద్దానిని బూరింపఁగడఁగెనని తోఁచుచున్నది.

## తిక్కన యద్వైతభావము:

తిక్కనార్యునకు భారతరచనాకౌతుకము, దానిని దుదిముట్టింప
వలయు ననుతలంపు కలుగుటకుఁ బూర్వ మాతఁ డెట్టి భావముతో దీనిని
గ్రహించి రచింప దొరఁకొనెనో మన మించుక విచారించినచో,
నొక్కభారతముననే నన్నయతిక్కనల రచనలలో భేదము కలుగుటకుఁ
గల కారణమును గుర్తింపఁగలుగుదుము. తిక్కన భారతము రచించు
నాఁటి కాతనికి రచనావిషయమున (నన్నయకువలె కేవల పురాణకథా
రచనదృష్టి గాక) కావ్యకళాదృష్టి యెట్లు ప్రబలినదో యట్లే భారత
గ్రంథప్రతిపాదితార్థ విషయమున నద్వైతదృష్టియుఁ బ్రబలినది.
నన్నయకువలెనే తిక్కనకు నీభారత మామ్నాయంబే. "నన్నయ
మహాభారతసంహితారచనబంధురుఁడు" కాఁగా, తిక్కనార్యుఁడు
"పూజ్యమూర్తి యగు భారతసంహితఁ జెప్పఁగనుటచేఁ" దనపుట్టువు
కృతార్థతను బొందినదని తలంచియున్నాఁడు. కాని యీ సంహితను
నన్నపార్యుఁడు కేవలము కర్మపరంబగు వైదికదృష్టితోఁ జూచి
యుండ, తిక్కనార్యుఁడు దీనిని భిన్నమత సమన్వయపరంబగు నద్వైత
దృష్టితోఁ జూచియున్నాఁడు. తిక్కనయు మొదట నన్నయవలెనే
వైదికమతమందలి కర్మమార్గముననే విశేషాభిమానము కలవాఁడై యుం
డెను. "వైదికమార్గనిష్ఠ మగువర్తనముం దగ నిర్వహించుచుండెను."
యజ్ఞయాగాదులను జేయుచుండెను. ఉత్తరరామాయణమున నాతఁడు

'హరిహరపద్మగర్భుల' నే భక్తితోఁ గొలిచియున్నాఁడు. ఆకాలపు శిష్టాచారము ననుసరించి గ్రంథాదిని సంస్కృతశ్లోకమునే రచించి సంస్కృతభాషాభిమానమునే వెల్లడించినాఁడు. కాలక్రమమున లోకానుభవము కలిగినకొలఁది, నాకాలమునఁ బ్రబలిన మతవైషమ్యములు, కొట్లాటలు చూచినకొలఁది, "భేదములేని భక్తి యాతని మదిని నిర్మలవృత్తిగఁ జేయుచుండ", నాతని కద్వైతభావమున రుచి యేర్పడినది. హరిహరనాథుఁ డిష్టదైవ మగుట తటస్థించినది. భారతరచనకుఁ బూర్వముననే యీతఁడు రచించినదిగా నీతని స్వప్నవృత్తాంతమునఁ దండ్రిచేఁ జెప్పఁబడిన

> "కిమ్మణిమాలాం కిము కౌస్తుభం వా
> పరిష్క్రియాయాం బహు మన్యసే కిం,
> కిం కాలకూటః కిమువా యశోదా
> స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే."

అను శ్లోకము నీమధ్యకాలముననే రచించియుండును. దేవకీనందనశతకము నీకాలముననే రచించియుండును. తిక్కన యద్వైతభావమున నొకవిశేషము కలదు. అది కేవలవాదముకొఱకైనదియు, మాటలతోడనే కడుపునిండించునదియుఁగాక, సత్క్రమసాధనతోఁ గూడి యాతనికి సంపూర్ణముగా ననుభవములోనికి వచ్చిన యద్వైతభావము. ఇది కర్మమార్గముతోఁ బ్రారంభించి క్రమముగా భక్తిమార్గమునుబట్టి యేకాంతభక్తి మూలముగా నేర్పడిన జ్ఞానాతిశయముచేఁ గుదిరిన యద్వైతభావము. ఇట్టికక్ష్యల నన్నిటి ననుభవించి సాధనచే దాఁటి పరమప్రాప్యమును బొందినవాఁడు గనుకనే తిక్కనార్యునియం దిన్నివిశేషగుణములు కనఁబడుచున్నవి. లౌక్యమునకుఁ బరమలౌక్యము. వైదికము

నకు వైదికము. క్రతువులఁజేసి సోమయాజి యైనాఁడు. నన్నయ జప హోమతత్పరుఁడే గాని క్రతువులవఱకు వెళ్లనేలేదు. రాజకీయముగాఁ దన ప్రభువు కోలుపోయిన రాజ్యమును దన ప్రజ్ఞచే సాధించిపెట్టిన సమర్థుఁడు. ప్రతివాదిభయంకరుఁడై గణపతిదేవుని యాస్థానమున జైన పండితుల నోడించిన ప్రతిభాశాలి. రాజ్యతంత్రజ్ఞత, నీతికుశలత, సమస్త సాంగ్రామికవిషయానుభవము, మొదలగు నానియం దాతని యాధిక్యము నకు భారతమే ప్రబలనిదర్శనము. ఇన్నిగుణము లొక్కనియందు కేంద్రీకృతములగుట మఱియొకచోటఁ గానము. ఇంతేకాదు. వీనినన్నింటిని మించిన యద్వైతభావము, బ్రహ్మజ్ఞానము, సర్వవిషయసమన్వయబుద్ధి కలిగి, యొకవైపున నద్వైతానుభవానందమును గ్రోలుచు, మఱియొకవైపున కావ్యరసముం గొనియాడుచుండెను. ఈవిషయము లన్నియు తిక్కనార్యుని గ్రంథముల యవతారికలను సవిమర్శంబుగాఁ జదువుటచేతనే మనకు స్పష్టంబగుచున్నవి. ఉత్తరరామాయణావతారికాంశములను భారతావతారికాంశముతోఁ బోల్చినప్పుఁ డాతని కళాప్రతిభలయందును, మతభావములయందును గలిగిన సక్రమపరిణామము యొక్క చిహ్నములు, కక్ష్యలు (stages in the development of his mind and art) మనము గుర్తింపఁగలుగుదుము.

## తిక్కన యవతారికలు:

సామాన్యముగా విశేషప్రఖ్యాతిగాంచిన మహాకవులయొక్క యు తొలికవిత, వారికిఁ బూర్వమునఁగల కవిశిఖామణుల కవితాసంప్రదాయమునే యనుసరించి రచింపఁబడినదై యుండినను, కాలక్రమమున వారికి లోకానుభవము కలిగినకొలఁది, వారిబుద్ధియుఁ, బరిపక్వతను బొంది, లోకతత్త్వమును, జీవితసమస్యలను నవగాహనచేసికొనుటచే

వారి ప్రతిభ వికాసమును బొందుటయు, నప్పుడు వారు ప్రాంతపుంతలను వదలి స్వీయభావములను, ఆత్మవ్యక్తిత్వమును, ప్రతిభావిశేషమును వెల్లడించుచు క్రొత్తమార్గములను రచించి తమ చాతుర్యమును వెలయింతురనుట సారస్వతచరిత్రముల నించుక పరిశీలించినవారికిఁ దెలియని విషయము కాదు. ఒకకవి తనకాలమునఁ బ్రబలిన కవితాసామగ్రిని, సంప్రదాయములను నెట్లుపయోగించుకొని, వాని నతిక్రమించి స్వీయకళాచాతుర్యము నెట్లు చూపినాఁ డనుదానిని బట్టియే యాతని మహత్త్వము ప్రకటితమగుచుండును. షేక్స్పియర్, కాళిదాసాదుల పూర్వోత్తరకాలకవితా రచనలనుబట్టి వారి కళాప్రతిభల సక్రమాభివృద్ధిని గూర్చియు, భావముల పరిణామమును గూర్చియు ననేకులు సాహిత్యవిమర్శకు లనేకవిధములఁ నిరూపించియే యున్నారుగదా. తిక్కనార్యుని కళాచాతుర్యము, ప్రతిభామహత్త్వము మొదలగువాని క్రమాభివృద్ధిని, భావముల పరిణామమును ఆతనిరచనలే వెల్లడింపఁగల వనుటలో సందేహములేదు. భారతరచనాకాలమునకు రామాయణరచనాకాలమునకంటె తిక్కన కవితాకళయం దత్యంతకౌశలము, స్వభావయం దభిమానము, మనోధైర్యము, ఆత్మస్వాతంత్ర్యము, నిర్మలభక్తి, అద్వైతభావము బాగుగఁ గుదురుపడినవని చెప్పఁదగియున్నది. స్వీయభాషాభిమానమే భారతగ్రంథాదిమంగళశ్లోకము నాంధ్రభాషలో రచింపఁజేసియుండును. ఇంతేగాక యీపద్యము తిక్కనార్యుని నిరూఢాద్వైతభావమును వేనోళ్ల నుద్ఘోషించుచున్నది. నన్నయ భారతరచనను ప్రారంభించిన కాలపుఁబరిస్థితులకును, తిక్కన దానిని మరలఁ జేపట్టి తుదముట్టింపఁగడంగినకాలపు పరిస్థితులకును భేదము కలదు. వేదబాహ్యములగు మతములు ప్రబలినకాలమున వైదికమతాధిక్యమును వ్యక్తము చేయుటయే నన్నయకుఁ బ్రధానకార్యంబైనది. కావున నీమతమునఁ

ప్రధాన దేవతలగు బ్రహ్మ విష్ణు మహేశ్వరు లనుమూర్తిత్రయమే లోకస్థితికి ముఖ్యకారణమనియు, వీరు వేదస్వరూపులే యనియుఁ జెప్పుచు వైదికమతాధిక్యము నుద్ఘోషించువాఁడువోలె 'తే వేదత్రయమూర్తయః' 'సంపూజితావస్సురైః', అని మూర్తిత్రయమును స్తోత్రము చేసినాఁడు. తిక్కనకాలమునకు స్థితిగతులు మాఱినవి. త్రిమూర్తులలో నొకరిని కొందఱును, మఱియొకరిని కొందఱు పట్టుకొని 'మా దేవుఁడు గొప్ప, మా దేవుఁడు గొప్ప' యని కొట్టుకొనుచు రాజుల నాశ్రయించి తమతమ మతములలోనికి వారిని ద్రిప్పికొని, వారి యధికార బలము మూలముగాఁ దమమతమునఁ జేరనివారిని హింసింప మొదలు పెట్టిరి. తిక్కన యీమూర్తిత్రయ భేదకల్పనము, తత్పూజావిధానము మూలముగా దేశమునఁ గలిగిన యల్లకల్లోలమును జూచి, శైవులు, వైష్ణవులును గూడ నా శ్రుతిస్మృతులనే యాధారముగాఁ జేసికొని, వాని కర్థభేదమును గల్పించి, స్వస్వమతానుకూలములగు వాక్యములను గనఁబఱుచుచు వాదించుచుండుటను గ్రహించి, యిట్టి విభేదములను బోఁ గొట్టి సర్వమతములకు సమన్వయమును గల్పించున దొక్క-యద్వైత భావమే యని నిశ్చయించి, పంచమవేదం బనఁబరఁగు భారతమును దత్ప్రతిపాదకం బే యని యెంచి, నన్నయ విడిచిన భాగమును దెనిఁగింప మొదలిడి, ఆదినే

> 'శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
> ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముఁ దాల్చి 'విష్ణురూ
> పాయ నమశ్శివాయ' యని పల్కెడుభక్తజనంబు వైదిక
> ధ్యాయిత కిచ్చు మెచ్చుపరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.'

అను మంగళపద్యముననే "హరిహరులకు భేదములేదు, వీరి నట్టిభేద దృష్టితోఁ జూచి కొలుచుచు జనులు పరస్పర ద్వేషమును బెంచుకొనుట

ముక్తిసాధనము గానేరదు. విష్ణురూపుండే శివుఁడని తలంచి యద్వైత
బుద్ధితో నాపరతత్త్వమును ధ్యానించు భక్తజనులే యాపరమేశ్వరుని
మెప్పు వడయుదురు—అను నీగంభీరార్థమును సూచించువాఁడువోలె నీ
పద్యముమూలముగా పరతత్త్వప్రశంస చేసియున్నాఁడు. ఆతత్వము
హరిహరరూపమన్నాఁడు. అది భద్రాయితమూర్తి. శ్రీయన గౌరినాఁ
బరఁగు చెల్వకు చిత్తము పల్లవింపఁజేయునది. పుష్కరపలాశవన్నిర్లి
ప్తుఁడగు పురుషుఁడు ప్రకృతిచిత్తమును పల్లవింపఁజేసినపుడే శ్రీయని,
గౌరియని,హరియని,హరుఁడని భేదము బయలుదేఱి సృష్టిక్రమము నడచు
చుండును. మూలపురుషుం డొక్కఁడే గావున నాతని భిన్నస్వరూప
ములనె పట్టుకొని మతభేదములను గల్పించుకొని దేశమును క్షోభపెట్ట
వలసిన యవసరములేదు. "విష్ణురూపాయ నమశ్శివాయ" యని యిద్ద
ఱికి నభేదమును గుర్తించి, యాపరతత్త్వమును గొల్చిన ముక్తిని బొందు
దురని ఘోషించినాఁడు. ఆపరతత్త్వమునె తానును గొలిచినాఁడు. తా
నిప్పుడు కావ్యసృష్టి చేయఁదలఁచినవాఁ డగుటచే "సకలబ్రహ్మ"ప్రార్థన
మునేచేసినాఁడు, దానిఫలముగా నాతఁడు కవిత్వతత్త్వనిరతిశయానుభా
వానందభరితాంతఃకరణుఁ డైనాఁడు. అనఁగా నద్వైతభావనిరూఢితో
పాటు ఆతనికిఁ గవిత్వతత్త్వనిరతిశయానుభావానందము కాలక్రమమునఁ
గలిగినది. నిర్వచనోత్తరరామాయణము రచించిన కాలమున కాతనికి
"కవితావిలాసములే" కనఁబడినవి గాని కవితాతత్త్వము బోధపడినట్లు
లేదు. ఆదికవులను, నూత్నసత్కవీశ్వరులను గొల్చునాచారము నతిక్ర
మింపలేదు. వారికృపచేతనే తాను 'కవితావిలాసవిస్తరమహనీయుఁడ'
నైతినని చెప్పినాఁడు. కాని భారతరచనాకాలమున కీతనికిఁ గవితావిలా
సములేగాక, కవితాతత్వమే బోధపడినది. దానివలనఁ గలుగు నానం
దమునకుఁ బరవశుఁడై భారతరచనకుం గడంగెను. కావున నాతనికి

గోచరించిన కవితాతత్త్వస్వరూప మాతనిభారతమునఁ బొడకట్టకమా నదు. బాగుగ పరిశీలించినచో నుత్తమ కవితా ప్రధానలక్షణంబులగు రసావిష్కరణము, తత్తద్రసాభ్యుచితరచనాకౌశలము, ప్రౌఢత్వము, స్వభావోన్మీలనాశక్తి, ఉచితానుచిత పరిజ్ఞానము, నీమొదలగు నుత్తమ గుణంబుల నసమానచాతుర్యముతో వెలయించుటంజేసి భారతరచనా కాలమున కాతనియంతఃకరణ మెట్టిమహత్పరిపాకమును బొందినదో తెలియఁగలదు.

ఈతని భారతమున కళాసౌందర్యము, నద్వైతభావమును చక్కని సమ్మేళనమును బొందినవి. నన్నపార్యుఁడు కేవల కర్మ పరమగు వైదికమతదృష్టితోఁ గొంతభాగమును రచించినను, ఈభారత మును కృష్ణద్వైపాయనుఁడు అద్వైతార్థబోధకం బగునటులనే రచి యించియున్నాఁడు గాని మతవైషమ్యములను బెంచుటకుఁ గాదు. వేదములలోను, స్మృతులలోను వివాదాస్పదము లగు తావులయం దీ పంచమవేదము సమన్వయమార్గమును దెలుపును. ధర్మార్థకామమోక్షము లకు సూటిమార్గమును జూపును.

" వేదములకు నఖిలస్మృతి

వాదములకు బహుపురాణ వర్గంబులకున్

వాదైన చోటులను దా

మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్."

అని తిక్కనార్యుఁ డీభారతముయొక్క 'ధర్మాద్వైతస్థితి'ని వ్యక్తము చేసినాఁడు. ఇట్టి భారతమును భవ్యకవితావేశుండు, విజ్ఞానసంపద్విఖ్యా తుఁడు నగు కృష్ణద్వైపాయనుం డీ యద్వైతభావముతోనే రచించి నాఁడు. దాని నీతఁడు ప్రబంధమండలిగాఁ దెనుఁగున రచింపఁబూని

నాఁడు. ఆవేశమే (inspiration) కవితకుఁ గారణ మని సూచించుచుఁ, దానట్టి కవితావేశముచేతనే యీ గ్రంథరచనకుఁ బూనితి నని చెప్పు వాఁడువలె నాయావేశఫలమును దన గ్రంథమునందే వ్యక్తపఱిచినాఁడు.

## తిక్కనకవితావేశము:

అట్టి కవితావేశసమయముననే యీతనికి స్వప్నముకూడఁ గలిగినది. కవితావేశమునకు భక్త్యావేశముకూడ తోడుపడి యుండును. తాను చేయఁదలఁచిన మహాత్కార్యమునకుఁ దగిన పూర్వరంగమును గల్పించికొనినాఁడు తిక్కన. ఇష్టదేవతను సాక్షాత్కరింపఁజేసికొనినాఁడు. మనల నీలోకమునుండి మఱియొక స్వప్నలోకమునకుహఠాత్తుగా నెత్తుకొనిపోయినాఁడు. నన్నయ వైదికమార్గమునకు భక్తిమార్గమును గూడఁగలిపి రెంటికి సమ్మేళనము చేసి, యద్వైతానందాంబుధిలోను, దానితోపాటు కావ్యరసాంబుధిలోను మనలను ముంచియెత్తినాఁడు. ఈ స్వప్నవృత్తాంతమునునది తాను కవితావేశముచే భారతరచనాకౌతుకమున మన మలరియుండు సమయమున సంభవించిన యనన్యసామాన్యకారణంబగు పరమధర్మప్రకారంబఁట. ఈ రెంటికి సమ్మేళనముచేసి యొక యద్భుత సన్నివేశమును (romantic situation) కల్పించినాఁడు తిక్కన. దీనిమూలమున స్వీయచరిత్రయం దనేకవిషయములను వ్యక్తము చేసినాఁడు. మొదటి దత్యంతపితృభక్తి. తరువాత నాతని వినయసౌశీల్యములు. జ్ఞానవైరాగ్యములు, వివేకము ఆదృశ్యము నెంత వ్యక్తమగునట్లుగా మనకనులయెదుటఁ బెట్టినాఁడో చూడుఁడు.

ఆ సర్వేశ్వరుండు సన్నిధిచేయుటయు, "ఏనును భక్తిమయంబగు సాష్టాంగ దండప్రణామం బాచరించి కొండొకదొలంగి వినయావనతుండనై లలాటోపరిభాగంబున నంజలిపుటంబు ఘటించి

నయనంబులు న వయవంబులును ప్రమదబాష్పసలిల విలులితంబులును బులకపటలపరికలితంబులుంగా నంతంత నిలిచిన" నద్దేవుం డను కంపాతిశయంబునఁ దన దక్షిణనేత్రంబున సుధారోచియకా నాతనివింత లేక చూచెనఁట. పరమేశ్వరుం డాశ్రితసులభుండు గావు నను, నీతఁడు పరమభక్తుం డగుటవలనను, కిమస్థిమాలా మిత్యాదిశ్లోకములచే నిదివఱకు స్తుతింపఁబడి వానిని గాఢాదరంబున నాదరించియున్న వాఁ డగుటచేతను, తనకీ దేవుఁడు చిరపరిచితుఁడే యని సూచించుచున్నట్లున్నాఁడు. పిదప నాహరిహరనాథుఁడే యీతనివైదికమార్గనిష్ఠనగు వర్తనమును, భేదములేని భక్తిని, నిర్మలమైన జ్ఞానమును బ్రశంసించి, యీతనియందు కర్మయోగభక్తియోగజ్ఞానయోగముల కెట్లు చక్కని పొందిక కుదిరియున్నదో తెలిపియున్నాఁడు. దీనివలన తిక్కనార్యుని మతి మెట్టిక్రమపరిణామము నొందినదో తెలియవచ్చుచున్నది. (His religion a thing of gradual growth). పంచమవేదంబగు భారతము జనుల కారాధ్యంబగుటచే దానిని దెనిఁగించుట భవ్యపురుషార్థతరుపక్వఫల మగునని హెచ్చరించినాఁడు. అట్టి దానికిఁ దానె కృతిపతిత్వ మర్థించి వచ్చినట్లు చెప్పినాఁడు. వేదములనువలెనే యీ పంచమవేదమును గూడ నపభ్రంశభాష యగు తెనుఁగున రచించుట కూడదను ఛాందసుల వాదబలముచే, నన్నయ రాజాదరణముచేఁ బ్రారంభించి కొంత రచించి విడువఁగా, నా మిగిలినభాగమును మఱెవ్వరు చేపట్టక భారతాంధ్రీకరణకార్యము నిలిచిపోఁగా, నీ కాలమున తిక్కన మరల దానిని చేపట్టి సర్వమతసమన్వయమును, చతుర్వర్గసమన్వయమును గూడ దీనిచే సాధింప నెంచి, హరిహరనాథుఁడే దీనికృతిపతిత్వ మర్థించి వచ్చినాఁ డనుటచేఁ దన కాపరతత్త్వమునఁగల భక్త్యావేశమును వెల్లడించుటే గాక, తనకాలమున నీ యుద్యమమును ప్రతి

ఘటింప యత్నించు ఛాందసుల నోళ్లు కట్టివేయుటకు యత్నించిన వాఁడువలె గనఁబడుచున్నాఁడు. పరమేశ్వరుని యంగీకారమే దీనికిఁ గలదని ఘోషించినవాఁడువలె నున్నాఁడు. ఆ దేవుఁడు ప్రత్యక్షమైనపు డీతఁడు చూపిన భయభక్తులు, వినయవివేకము లీతనియేకాంతభక్తిని, ఆత్మజ్ఞానసంపన్నత్వమును జాటుచున్నవి. ఆశ్రితులకుఁ బరమేశ్వరుం డత్యంతసులభుం డని బుధులవలన వినియుండుటం జేసి తాను బాలస్వభావుఁ డైయైనను నట్టిమహనీయమహిమ దొరకొనుటయుఁ గలుగును కాకయని తలంచినాఁడు. తాను జేయంబోవు విన్నపమునకు ముందుగా కొమ్మనామాత్యు నాననం బాలోకించి యాతనియనుమతిని బడసి పితృభక్తి వెల్లడించినాఁడు. బాలస్వభావుఁడనే యని చెప్పుకొనుచున్నను ఎట్టిమహత్తరంబైన విన్నపము చేసినాఁడో చూడుఁడు:

"భూరి భవత్కారుణ్య
క్షీరాంబుధి నాదు తుచ్ఛచిత్తంబును వి
స్తారమహితముగ నుఱిచితి
వారయ నచ్చెరువు గాదె యఖిలాండపతీ.

"ఇంతకు నేర్చు నీకు నొకయింతటిలోన మదీయవాణి న
త్యంతవిభూతిఁ బెం పెసఁగునట్టి నినుం గొనియాడుచేత దా
నెంతయుఁ బెద్ద నీకరుణ నిట్లు పదస్థుఁడ నైతి నింక జ
న్మాంతరదుఃఖముల్ దొలఁగునట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే."

ఇట్లా యఖిలాండపతి యెదుట సాక్షాత్కరించిన సందర్భమునఁ దన యకించనత్వమును జక్కఁగా వెల్లడిచేసినవాఁ డైనను అప్పుడు కోరినవర మీతఁడు మహాజ్ఞాని యనియే తెలుపుచున్నది. ఇట్టి యకించనునకు, తుచ్ఛచిత్తునకు, బాలస్వభావున కట్టిమహనీయమగు కోరిక

కోరుట తగునా? ఆతఁడు కోరఁగలఁడా-యను ప్రశ్న కాతఁడే సమాధానము చెప్పుచున్నాఁడు. ఉపలాలితుండగు డింభుండు దనకొలంది యెఱుంగక మహాపదార్థంబు వేఁడువిధంబున తాను బ్రహ్మానందస్థితినే గోరినాఁడఁట. దీనివలననే యీతనికొలంది మన కెఱుకపడుచున్నది. ఎట్టి యెఱుకగలవాఁడో వ్యక్తమగుచున్నది. తిక్కనార్యుఁడు మహాజ్ఞాని, ముముక్షువు. ఇట్లు జననమరణాదులైన సంసారదుఃఖములకు నగపడకుండునట్టి జ్ఞానతేజములు గాంచి—అట్టి జ్ఞానసూర్యోదయంబగుటతోడనే—మేల్కొనినాఁడఁట. ఆజ్ఞానసూర్యుని వెలుఁగులో నట్టిపదమును గాంచి, పుణ్యచరిత్రుఁడై, తన భారతసంహితారూపం బగు, కావ్యకవిత్వమహావిభూతికి నా పరమేశ్వరుని బట్టముగట్ట సిద్ధపడినాఁడు. తానొక మహాభక్తుఁడు గావున నీమహాత్కార్యముచే భక్తకోటికిశరణీయుండయ్యెను. ఈతని వినయసంపద, భక్త్యావేశము ఆత్మస్వరూపజ్ఞానముచేఁ గలిగినవేగాని తెచ్చిపెట్టుకొనినవిగాఁ గనఁబడవు.

"ఏపట్టునఁ బూజ్యమూర్తియగు భారతసంహిత," "జనాభ్యర్చితమై" యున్నది గావున నా, భారతామృతము కర్ణపుటంబుల నారఁగ్రోలి యాంధ్రావళి మోదముం బొరయునట్లుగ మహాకవిత్వదీక్షావిధినిఁ బొంది పద్యములను గద్యములను కృతులు రచింతునని ప్రతిజ్ఞ చేసినాఁడు. ఈతఁడిచ్చటఁ జేయఁబూనినది కేవలము భారతాంధ్రీకరణము మాత్రముకాదు. ఒక్కకృతియుఁ గాదు. కృతులు. భారతసంహితను కృతులుగా రచింపఁదొడంగెను. ఈ విషయ మింతకుఁబూర్వమే చెప్పియున్నాఁడు. "ఈ ప్రబంధమండలి కధినాథునిగా నేపురుషునిఁ బేర్కొనువాఁడను" అని మొదట నాలోచించినాఁడు. కావున భారతరూపమున నీతఁడు రచింపఁదలఁచికొనినది ప్రబంధమండలిగాని యొక్కకృతిమాత్రము కాదనుట స్పష్టమగుచున్నది. మొత్తముమీఁద.

సాత్యవతేయ సంస్మృతికిఁ శ్రీవిభవాస్పదంబయిన చిత్రముతోడ ధర్మా
ద్వైతస్థితిని భారతసంహితను దెనుంగుబాస రచించు చున్నను,
అందలి యేఘట్టమున కాసట్టము నొకప్రబంధముగాఁ జేయఁదలంచి
నట్లు కనఁబడుచున్నది. విరాటపర్వ మొకప్రత్యేకప్రబంధమే యని
యు, నిందలిలక్షణములే తరువాతి ప్రబంధకవులకు మార్గదర్శకములైన
వనియు మన మించుక పరిశీలనాదృష్టితోఁ జూచిన గోచర మగును.
"హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసాభ్యుదయో
ల్లాసి" యని ప్రశంసించియే యున్నాఁడుగదా. ఏకథయట్లు కాకథలో
నొకవిధమగు వస్త్వైక్యము (unity of plot), పూర్వోత్తరసందర్భము,
నాయాపాత్రల స్వభావసంభావనాదికమం దౌచిత్యము, నీ మొదలగు
గుణములను పాటించుచు రచించెనేగాని మూలగ్రంథమునందలి యసం
దర్భములను దొలఁగింపక, భాషాంతరీకరణమును నుద్దేశముతో మూలాను
సారముగ మాత్రమే యాతఁడు రచించియుండలేదు. కర్ణపర్వము
చివరకూడ నీ ప్రబంధపదమునే యాతఁడు వాడియున్నాఁడు. కీచక
వధ మొదలుగాఁగల రసవంతములైన యాయాఘట్టములకు రచనాకౌశల
మునుబట్టిప్రబంధములనియే పేరుపెట్టఁదలఁచినట్లు కనఁబడుచున్నది.
ఇట్టి ప్రబంధమండలి నపారకృపాపరతంత్రవృత్తిమైఁ జేర్చిన దేవదేవు
నకుఁ బ్రీతిగ నిచ్చుటంజేసి యవి పుణ్యప్రబంధంబు లైనవి. ఇది
యంతయు ననన్యసామాన్య కారణంబగు పరమధర్మప్రకారం బైనది.
ఈభారతరచనావిషయము నెట్టి పూజ్యభావముల, నెట్టి భక్త్యావేశ
మును, ఎట్టి కవితావేశమును, ఎట్టి జ్ఞానసంపత్తిని, ఎట్టి ధర్మపరత్వ
మును, ఎట్టి యద్వైతభావనిరూఢత్వమును, ఎట్టి ముముక్షుత్వమును,
ఎట్టి వైదికమార్గనిష్ఠమగు వర్తనమును, ఎట్టి మాతృభాషాభిమానమును,
ఈ యవతారికామూలమున వ్యక్తముచేసినాఁడో పరికింపుఁడు. ఇట్టి

మహాపురుషుఁ డాంధ్రదేశమున మఱియొకఁడు బయలుదేఱ లేదనుట యతి
శయోక్తి కానేరదు. ఆంధ్రవాఙ్మయమున నిట్టి మహనీయగుణ సంప
న్నుఁడగు కవి మఱియొక్కఁడు లేఁడనుట సాహసముకాదు. ఆంధ్ర
భాషాసతిని స్వస్వరూపమున నిలిపి యుద్ధరించిన వారిలో నీతఁ డగ్ర
గణ్యుఁ డని చెప్పవలసియున్నది. ఈతనిమూలమున నాంధ్రవాఙ్మ
యము, ఆంధ్రభాష, ఆంధ్రదేశము, ఆంధ్రజనము—వేయేల, ఆంధ్ర
త్వమనునదే ధన్యత్వమును బొందుచున్నది. ఆంధ్రజాతీయ లక్షణముల
నతిరమ్యముగా సందర్భానుకూలముగాఁ బొందుపఱుచుచు నీభారత సం
హితను ప్రబంధమండలిగా మార్చివేసినాఁడు. ఇట్టి యీ పుణ్యప్రబం
ధములను, "అప్రతిమకావ్యకవిత్వ మహావిభూతికిఁ" బట్టముకట్టి, కృతి
నాథునిగాఁ జేసిన యాదేవునిసన్నిధిని బ్రశంసించుటం జేసి యది తిక్కన
కొక్క యారాధనవిశేషం బైనది. కావుననే నామాగ్భన చెప్పినట్లుగా
షష్ఠ్యంతపదములతో నా హరిహరనాథునిఁ బూజించినాఁడు. అనఁగా
దీని నొక యారాధనవిశేషంబుగా తిక్కనార్యుఁడు తలంచుటచే
షష్ఠ్యంతపదము లావశ్యకములైనవనుట. ఈయాచారమే గతానుగతికం
బుగ నవలంబింపఁబడి యాంధ్రప్రబంధలక్షణమున కొకవిశేష లక్షణ
ముగాఁ బరిణమించినది. తిక్కనకుఁ బూర్వమున షష్ఠ్యంతములను
వాడినవాఁడగు నన్నెచోడుఁడును కృతిపతియగు తన గురువునకును, పర
మేశ్వరుఁడగు మల్లికార్జునునకు నభేదవృత్తి గల్పించుకొని, యా పర
మేశ్వరుని కథలనే యాతని యెదుట విన్నవించుచు నాతని నారా
ధింపఁ దలంచినవాఁడగుటచేతనే, యాతనికిని షష్ఠ్యంతములును, సంబు
ద్ధ్యంతములు నావశ్యకములైనవి. కాని యాతఁ డావిషయమును బాగు
గా వ్యక్తపఱుపలేదు. తిక్కనార్యుఁ డాయా కథాసందర్భముల నాయా
పాత్రల మనోవృత్తులను, ఇంగితాకారములను, గూఢోద్దేశములను నెట్లు

సువ్యక్తముగఁ జేయుచు రచించుచుండునో యట్లే యిచ్చట తనభావము లను, ఉద్దేశములను గూడ సువ్యక్తముచేయక విడువలేదు. ఆరాధన విశేషము గావున షష్ఠ్యంతము లావశ్యకములైనచో, సంబుద్ధ్యంతము లెందుకో చెప్పుచున్నాఁడు. తాను విన్నపంబు సేయుటు తెలుంగుగా నాదేవు నంతస్సన్నిధిం గలిగించుకొని 'యమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు సేయు'నఁట. ఈ మహాకావ్యరచనా సందర్భమున హరిహర నాథుఁ డీతని కెప్పుడు ప్రత్యక్షుండై యుండుననియే తలంపఁదగియున్న ది. ఈతఁ డీరచనాసందర్భముననే కాదు, కేతన చెప్పినట్లుగా, 'చిత్తని త్యస్థితశివుఁ డెవ్వఁడనిన వీఁడను నాలుకకుఁ దొడవైనవాఁడు' గదా. ఆదేవుని సంబోధించి "యిమ్మహాకావ్యం"బు నర్థంబు సంగతంబుచేసె దనని చెప్పినాఁడు. 'భారతసంహిత' తాను రచింపఁబూను సందర్భ మునకు 'మహాకావ్య' మైనది! సంహితార్థము వేదప్రతిపాదితాంశము_ దీనియందు సంగతంబై యుండినను, తిక్కనార్యుఁడు దీనిని మహాకా వ్యముగనే యెంచియున్నాఁడు. కావుననే మొట్టమొదట "భవ్యకవితా వేశుండు కృష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితనిష్ఠంబూని ధర్మాద్వైత స్థితి లేఖ్యంబైన యామ్నాయమును రచించె"నని చెప్పినాఁడు. వేద ములు అలేఖ్యములు, శ్రుతులు. కాని యిది లేఖ్యంబైన యామ్నా యము. భవ్యకవితావేశముచే రచింపఁబడిన మహాకావ్యము. ఆ కావ్యము నాతఁడు యథామాతృకముగఁ దెనుఁగున రచింపఁదలఁచు కొనెనా? లేదు. అందలి యర్థమును మాత్రము సంగతంబు చేసెద నన్నాఁడు. కావున నిది భాషాంతరీకరణమును తలంపుతో విమర్శింపఁ బూనుట యుక్తముకాదు. ఈ మహాకావ్యమునందలి యర్థమును సంగ తముచేయు సందర్భములోనే యీతని ప్రతిభావిశేషముచే నది ప్రబంధమండలిగా మారినది. వ్యాసభారతము నీతఁడు ముక్కుసు

ముక్కఁగాఁ దెచ్చి తెనుఁగునఁ బెట్ట దలంచుకొనలేదు. దాని యర్థము మాత్రము సంగతంబుఁ జేయుచుఁ దన కవితాచాతుర్యమును జూపఁదలంచినాఁడు. కావుననే మూలముననుసరించి రచింపఁబడినదేయైనను ఈ భారత మొకవిధముగ స్వతంత్రగ్రంథమువంటిదేయై, యాంధ్రవాఙ్మయ లక్ష్మి కమూల్యాలంకారంబై, తరువాతివాఙ్మయమున కంతకు మార్గదర్శకంబై వెలుఁగొందుచున్నది.

తిక్కనార్యుఁడు మహాకవిత్వదీక్షావిధి నొంది యీభారతకృతులను గద్యములను, పద్యములనే రచింతునన్నాఁడు గాని యాతని తొలి రచనయగు నుత్తరరామాయణమువలె నిర్వచనముగా రచింపదొరఁకొనలేదు. అచ్చట నిర్వచనముగా రచించుట యొకగొప్ప విషయముగాఁ జెప్పుకొనెను గాని కాలక్రమమున నాతనిబుద్ధి, కళాప్రతిభలును వికాసమును బొందినపిదప నిట్టిస్వల్పనియమములను పాటించుట యొకగొప్పతనముగాఁ దలంచినట్లు కనఁబడదు. ఉత్తరరామాయణ రచనాకాలమున నీతఁడింకను కవితావిలాసములలోనే చిక్కుకొనియుండి యానందించుచు ప్రగల్భములఁ గొట్టుకొనుచుండెనేగాని, ఆతఁడు భారతరచనాకాలమునందువలె కవిత్వతత్త్వ నిరతిశయానుభవానందభరితాంతఃకరణుఁడు కాలేదని యింతకుపూర్వమే గమనించి యున్నాము. ఈ కవిత్వతత్త్వస్వరూపముబోధపడినంతనే బాహ్యాడంబరములు, బాహ్యనియమములును నీతనికి వెగటైతోఁచినవి. రామాయణమందలి యవతారికా విషయముల నీభారతావతారికావిషయములతోఁ బోల్చిచూచినచో తిక్కనార్యుని యనుభవపరిపాకము, బుద్ధిపరిణతి, కళాప్రతిభలకుఁగలిగిన నూతనవికాసము నెట్టివో మనకు స్పష్టమగును. అచ్చట నాతఁడింకను బాహ్యాచారములకే చిక్కియుండెను. కవిత్వరచనలో చూపవలసిన చాతుర్యమును దానిలక్షణమునుగూర్చి చెప్పుటలోఁ గనఁబఱచినాఁడు. చూడుఁడు:

"భూరి వివేకచిత్తులకుఁ బోలు వనం దలఁపన్, దళంబులన్
సౌరభ మిచ్చు గంధవహుచందమునం బ్రకటంబు చేసి యిం
పారెడు పల్కులం బదయు నప్పలుకు ల్సరిగ్రుచ్చునట్లుగాఁ
జేరుప నేరఁగావలయుఁ జెప్పెద నేఁ గృతి యన్నవారికిన్."

అని సుకవిలక్షణమును జెప్పి "కుకవుల్ ధర దుర్విటులట్ల చూడఁగన్" అని కుకవినింద చేసినాఁడు. పిదప,

"తెలుఁగు కవిత్వము చెప్పం
దలఁచిన కవి యర్థమునకుఁ దగియుండెడు మా
టలు గొని వళులుం బ్రాసం
బులు నిలుపక యొగిని బులిమి పుచ్చుట చదురే.

"అలవడ సంస్కృత శబ్దము
తెలుఁగు బడి విశేషణంబు తేటపడంగాఁ
బలుకునెడ లింగ వచనం
బులు భేదింపమికి మెచ్చుబుధజనము కృతిన్."

అని తెలుఁగుకవిత్వ మెట్లుండవలయునో సూచించినాఁడు. ఎట్టిపదము లెట్లుపయోగింపవలయునో తెలిపినాఁడు. పిదప తనకావ్యము సరస కవులను మెప్పింపవలయునఁట:

"ఎట్టికవికైనఁ దనకృతి యింపుఁ బెంపఁ
జాలుఁ గావునఁ గావ్యంబు సరసులైన
కవులచెవులకు నెక్కినఁగాని నమ్మఁ
డెందుఁ బరిణతి గలుగు కవీశ్వరుండు."

అని యిట్లు సత్కవీంద్రమార్గమును దెలుపుటచేఁ దానాయాదోషము లను బరిహరించి గుణముల నాదరించియే కవితచెప్పుచున్నానని సూచించినవాఁడైనను, తనకావ్య మితరుల మెప్పును బడయునా లేదా, యను సందేహము మాత్రము

"ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానం,
బలవదపి శిక్షితానా మాత్మ న్యప్రత్యయం చేతః."

అని చెప్పిన కాళిదాసునికి వలెనే యీతనికిని కలుగకపోలేదు. తిక్కన భారతము రచించు నాఁటి కీకృతిమనిబంధనలన్నిటిని బాటింపవలయు ననెడిభావము నతిక్రమించినాఁడు. ఇతరులు తనకవిత్వమును జూచి యేమందురో యను సందేహావస్థను దాఁటిపోయినాఁడు. ఆత్మవిశ్వాసము బలిసినది. "అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢి పాటించుశిల్పమునం బారగుడన్ గళావిదుఁడ" అను నాత్మశ్లాఘాపరంబులగు వాక్యంబులను మాని,

"భారతసంహితఁ జెప్పఁగంటి నా పుట్టుకృతార్థతం బొదవె"
"నా నేర్చినభంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్;"
"బాలస్వభావుఁడ"; "నాదు తుచ్ఛచిత్తమున" అని యిట్లతివినయాననతుండై పలికినాఁడు. కాని "రచించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్"; "ఆంధ్రావళి మోదముం బొరయ" అనియు మహాకవిత్వదీక్షను బొంది కృతులఁ జెప్పెదననియుఁ జెప్పుటచే నాడంబరములేని యాత్మవిశ్వాసమును గూడ వెంటనే వ్యక్తముచేయుచున్నాఁడు. ఇక్కడ 'మహాకవిత్వదీక్షావిధిఁ బొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్" అనుదానికిని, తొలిగ్రంథమునఁ జెప్పిన యీ పద్యములందలి భావమునకు నెంత వ్యత్యాస మున్నదో పరికింపుఁడు:

"జాత్యము గామి నొప్పయినసంస్కృత మెయ్యెడఁ జొన్ప; వాక్యసాం
గత్యము సేయుచో నయిన గద్యము తోడుగఁ జెప్పి పెట్ట దౌ
ర్గత్యము దోఁపఁ బ్రాసము ప్రకారము వేఱగునక్షరంబులక్
శ్రుత్యనురూప మంచు నిడ సూరుల కివ్విధ మింపు సొంపదే.

" వచనము లేకయు వర్ణన
రచియింపఁగఁ గొంత వచ్చుఁ బ్రౌఢులకుఁ గథా
ప్రచయముఁ బద్యము లన పాం
డుచితంబుగఁ జెప్పు టార్యు లొప్పిద మనరే."

ఈ రామాయణమున నీతఁడు సుకవిస్తుతి, కుకవినింద మొద లగువానిమూలముగా వ్యక్తముచేసిన కవితాలక్షణమును బరిశీలించి చూచినచో నీతనిదృష్టి యప్పటి కింకను కవితాసతియొక్క బాహ్య స్వరూపముచేతను, బాహ్యవిలాసములచేతనే యాకృష్టంబయియుండిన దని స్పష్టమగును. కవితనుగూర్చి చెప్పుచు, నెంత చెప్పినను పలుకులను సరిగ్గుచ్చునట్లుగాఁ జేర్చుట, ప్రాతవడ్డమాటలను బ్రయోగింపకుండుట, అర్థమునకుఁ దగియెడు మాటలను గ్రహించుట, వళులను బ్రాసములను నిలుపక ఫులిమిపుచ్చుట, గద్యముఁ ను రచింపకుండుట, జాత్యముగాని సంస్కృతము నెచ్చటఁ జొనుపకుండుట, ఈరీతిగా కవితకు బాహ్యశరీరంబగు శబ్దములలక్షణమునుగూర్చియె ప్రసంగించెను గాని, కావ్యాత్మగుణములనుగూర్చి యేమియు చెప్పినవాఁడు కాఁడు. భారతమున నీబాహ్యాచారములన్నిటిని, అనఁగా కుకవినింద, సుకవిస్తుతి, కవితాలక్షణప్రతిపాదనము మొదలగువానిని వదలివేసి, స్వప్నవృత్తాంతకథనము మూలముగ మహోద్భుతము, నత్యంతపావనంబునగు నొకవిచిత్రసన్నివేశమును గల్పించి, కాళిదాసు శాకుంతలమున వాయుపథమున మారీచాశ్రమ

మునకుఁ గొంపోయినట్లే, ఊర్ధ్వలోకమునకుఁ గొనిపోయినాఁడు. అక్కడ హరిహరనాథునియం దద్వైతస్వరూపమును గోచరింపఁ జేసినట్లే యీ యవతారికయందే, కవిత్వలక్షణ మిట్టిది యని చెప్పక, కవితాతత్త్వస్వరూపమునే చూపినాఁడు. ఈ యవతారిక యందలి స్వప్నవృత్తాంతమును మన కన్నులముందర జరుగుచున్నట్లుగా నెంత రమ్యముగా వర్ణించిచూపినాఁడో అట్లే యీ గ్రంథమునందుఁ గూడ నెచ్చటనో జరుగు ప్రతివిషయమును గూడ నప్రతిమానంబగు తనప్రతిభాశక్తిచే మన కన్నులముందర జరుగుచున్నదానివలెనే చేయును. అతి స్వాభావికముగ వర్ణించుచుండును. ఈ స్వాభావికత, లేదా ప్రత్యక్షత (realism), అనునదే తిక్కనార్యుని కవితామహత్త్వమునకు మూల కారణ మని చెప్పవలసియున్నది. అనన్యసామాన్య మగు నీ విశేషగుణమే తిక్కనార్యుని విచిత్రవర్ణనానైపుణ్యము, మనోవృత్తివివరణశక్తి, సయుక్తికపాత్రోచిత సంభాషణాయోజనచతురత, కథావస్తుసంఘటనానైపుణ్యము, అప్రతిమానంబగు రసపోషణశక్తి, ఆంధ్రభాషాజాతీయప్రయోగనైపుణి, యీ మొదలగు విశేషగుణముల కన్నిటికిని మూలాధారంబై యున్నది. తరువాతి ప్రబంధకవులకు మార్గదర్శకుఁడే యైనను, వారివలె నత్యంతాతిశయోక్తులకును, కృత్రిమ భావములకును, సాంకేతిక (conventional) నియమములకును లోఁబడక, తనకవితయం దంతటను స్వాభావికత్వగుణమునే వెలయించినాఁడు. ఆభావములన్నియు నీయవతారికాపఠనమువలననే మనకు గోచరించుచున్నవి. ఇఁక తరువాతి భారతకథారచనయం దెట్లుగా విస్తరింపఁబడియున్నవో పరిశీలించి తెలిసికొందము గాక.

---

# 3

## భారతాంధ్రీకరణము—తిక్కన

ఒకభాషలోనుండి మఱియొక భాషలోనికిఁ బరివర్తింపఁబడిన గ్రంథములను గూర్చి మనము విమర్శింపఁ బూనుకొనినపుడు మూలగ్రంథముయొక్క స్థితిగతులను గూర్చికూడ కొంత తెలిసికొనవలసిన యావశ్యకత కలుగుచుండును. ఏలయనఁగా నా మూలగ్రంథముతో నీ భాషాంతరీకృత గ్రంథమును సరిపోల్చి చూచినఁగాని, యది మూలమునకు సరియగు భాషాంతరీకరణ మగునో, కాదో, అందలి కవి యభిప్రాయములు, రసభావములు నీ భాషలోని కెట్లెంతవఱకుఁ దేఁబడినవో, ఇందు మార్పులేమైనఁ జేయఁబడినవో, అట్లయిన నద్దానికిఁ గలకారణం బెద్దియో, మూలమును మక్కికిమక్కిగా భాషాంతరీకరించెనా, లేక యందలి కథామాత్రమును గ్రహించి స్వతంత్ర గ్రంథముగా రచింపఁగడంగెనా, మూలముకంటె పెంచుటయుఁ గుదించుటయుఁ గలిగెనేని దానివలన గ్రంథప్రాశస్త్యము తఱిఁగెనా, లేక పెరిఁగెనా, కవిచేసిన మార్పులవలనఁగాని, యాతని భాషాంతరీకరణపద్ధతివలనఁగాని, యాకవియొక్క ప్రతిభ, స్వాతంత్ర్యము, శక్తి యెచ్చట నేవిధముగా నెంతవఱకుఁ గనఁబడుచున్నది అను నీమొదలగు విషయములను కనుఁగొనుట కవకాశ ముండదు. అడుగడుగునకు నిది మూలగ్రంథమునందలి భావమేనా, లేక భాషాంతరకర్త తెచ్చిపెట్టినదా యను సందేహము కలుగుచునే యుండును. కావున తిక్కనాదుల ప్రతిభావిశేషము,

# ఆంధ్రభారత కవితా విమర్శనము

కవితాకళాచాతుర్యమును దెలిసికొనవలె నన్నచో మూలగ్రంథముతో సన్నిహితముగఁ బోల్చి చూడవలసిన యావశ్యకత కలుగుచున్నది.

ఆంధ్రవాఙ్మయమందు, అందు ముఖ్యముగా మొదటి యుగము నందు, బయలుదేఱిన గ్రంథములన్నియు భాషాంతరీకృతములే. ఈ వాఙ్మయమునందు సుప్రసిద్ధులగు కవు లీభాషాంతరీకరణముమూల ముగాఁ బ్రసిద్ధులైనవారే. ఆంధ్రభాషా వాగనుశాసనులు, ఆంధ్ర కవి బ్రహ్మలే సంస్కృతభాషనుండి యెరవుతెచ్చిన యర్థముతో స్వీయ భాషాకన్య నలంకరింపఁజొచ్చిరి. అట్లైనను వీరు కవిబ్రహ్మలనియు, నబ్జాసనకల్పులనియునే నుతింపఁబడుచువచ్చిరి. వీరాడినమాట, పాడిన పాట, వ్రాసినవ్రాఁతను మీఱి వేఱొక్కటి చెప్పరాదను నియమము గూడ బయలుదేఱినది. ఆంధ్రభాషాసతికి భారతకవులు పెట్టిన యట్టి యలంకారము మఱి యెవ్వరును బెట్టలేకపోయి రనునది యెల్లయెడల నంగీకరింపఁబడిన విషయమే. ఇది యిట్లగుటకుఁ గారణమేమి యని విచారించుచో, నాదికవులు, ముఖ్యముగా తిక్కనాదులు, మూలమగు సంస్కృతగ్రంథమందలి కథను ముక్కకుముక్కగా నెరవుతెచ్చి తెలుఁ గులోఁ బెట్టి యాంధ్రభాషాకన్య కెరువుసొమ్ములు గూర్చినవారు గాక, యా సంస్కృత మూలఖనినుండి త్రవ్వి యెత్తిన బంగారమును దెచ్చికొని, యాత్మీయప్రతిభా మహాసముద్రమున నుద్భవిల్లిన యమూల్య భావరత్నములతోఁ బొదిగి యప్రతిమాన శోభావిరాజ మానంబులును, ననిదంపూర్వములు నగు దివ్యాభరణముల నొనర్చి యామె కలంకరించినవారని తెలియఁగలదు. కావున నీ భాషకుఁ బ్రథమాలం కారమగు భారతమునందలి రచనారామణీయకత్వమును పరిశీలించు నపుడు, దీనికి మూలములోని బంగారమువలనఁ గలిగినశోభ యెట్టిదో,

అందుఁ బొదిగిన రత్నరాజముల యొక్కయు, నా కుందనపు పనిచేసిన భాషారచనాకారుని నిర్మాణనైపుణ్యము యొక్కయు దివ్యకాంతు లెట్టివో తెలిసికొనఁగలిగినచో, వీని సమ్మేళనమువలనఁ గలిగిన మహా వైభవముగదా యిది యని మనము మహానందమును బొందుదుము. కుంద నపు పనివాని పనివానితనమును బయలుపడును. ఆంధ్రభారతరచనా కారుల నిర్మాణనైపుణ్యమును దెలుసుకొనవలెనన్నచో, నేదోయొకటి రెండుఘట్టములలోని రెండుమూడు మూలశ్లోకములను గ్రహించి వానిని వీ రెట్లు భాషాంతరీకరించి రని పరిశీలించుచు, నక్కడ నొక పదమున్న నీతఁ డొకపెద్దసమాసమును వేసి పెంచినాఁడు; లేదా మఱియొకచోట గుదించినాఁడని చెప్పి, మొత్తముమీఁద నిది మూలమునకు సరిగాఁ జేయఁబడినదికాదు — అని తేల్చినంతమాత్రమున నుపయోగ ముండదు. ఈ కవులకు మూలమునకు సరిగా భాషాంతరీకరించు నుద్దే శమే లేనపుడు, మూలమునందలి వ్యాసునిభావమును సరిగఁ జెప్పిన వాఁడుకాఁ డీకవి యని నిందించుటలో నర్థ మేమున్నది? విమర్శకుని దృక్పథము మాఱినఁ గాని యీ కవితయందలి విశేషగుణములు బయలుపడవు. ఒకఘట్టమునైనను సంపూర్ణముగా మూలముతోఁ గ్రమముగా సరిపోల్చిచూచినఁగాని, కవిచాతుర్యమును గనిపెట్టలేము. ఒకచో నీ భాషాంతరీకర్త మూలములోని కథాంశములను వెనుకనున్న దానిని ముందు, ముందు దానిని వెనుకగా గ్రహించి కథావస్తువు నం దైక్య గుణమును (unity) సంపాదించుటకై యత్నింపవచ్చును. మూలమున నీరసఘట్టముల నతిరమ్యముగాఁ బ్రదర్శింపవచ్చును. మధ్య మధ్య నతికిన భావగర్భితములగు పదములచేతను, ఆకార వర్ణనలచేతను ఒకదృశ్యమును మనకండ్లయెదుట నడచుచున్నదానినిగాఁ జేయ వచ్చును. ఆయా కథాపురుషుల మనోవృత్తులను, భావవైఖరులను వర్ణిం

చుచు పాత్రౌచిత్యమును బాటించి సంభాషణాశైలులను మార్చుచు, భావోద్బోధకంబులగు విశేషణములను జేర్చుచు, ఆకారేంగితాదులను సూచించుచు, మూలమునందలి పాత్రలను నూతనజీవముతోఁ బ్రకాశించునట్లు ప్రదర్శించి, స్వభావోన్మీలనము విచిత్రముగా మూలమునకంటె గుణవత్తరముగా (effectively) నొనర్పవచ్చును. అక్కడక్కడ సందర్భానుసారముగా నూతనములగు ప్రకృతివర్ణనలను, భావచ్ఛాయవర్ణనలను, శీలపోషకవర్ణనలను, అవస్థాబోధకములగు వర్ణనలను, మనోవృత్తిప్రకాశకంబులగు వర్ణనలను (that reveal mental attitudes) జేర్చి కావ్యమునకు నూతనశోభ నాపాదింప వచ్చును. ఇట్టి సూక్ష్మవిషయములను గనిపెట్టి యీ కవుల ప్రతిభావిశేషమును, ప్రత్యేకవ్యక్తిత్వమును భాషాంతరీకృత గ్రంథములనుండి విడఁదీసి చూపవలెనన్నచో, మూలముతోఁ బోల్చి చూచినఁగాని సాధ్యము కాదనుట స్పష్టము.

ఇట్లు మూలముతోఁ బోల్చిచూచుట యావశ్యకమైనపు డీ మూలగ్రంథప్రతు లనేకరీతుల భిన్నపాఠములు కలవై యుండుటచే నేప్రతి నన్నయాదులు గ్రహించిరో తెలిసికొనుటయు నావశ్యకంబే యగుచున్నది. ప్రాచీనప్రతులను సరిపోల్చిచూచి యందు బహుసంఖ్యాకములగు వానిలోఁ గనఁబడినపాఠము ప్రాచీనపాఠముగను, ప్రమాణముగను గ్రహింపఁదగియున్నది. బహుసంఖ్యాకములగు ప్రాచీనప్రతులలోని పాఠమునకును వీరిభాషాంతరీకరణమునకును భేదము కనఁబడినపుడు కూడ నది వీరుచేసినమార్పో, కాక వీరికాలమున వీరికిదొరకిన మూలప్రతిలో వీరి భాషాంతరీకరణమున కాధారములగు శ్లోకము లేవైన నున్నవేమో యను సందేహమును గలుగక మానదు. కావున భారతము యొక్క పరిశుద్ధమగు మూలగ్రంథపాఠ మేదై యుండును అను సమస్య

యొకటి నిర్ధారణచేయఁబడవలసి యుండఁగా, నన్నయతిక్కనాదు లేమూలప్రతి ననుసరించి రచించినారు అను మఱియొక విషయ మాంధ్రభారత విమర్శకులు విచారింపవలసి వచ్చుచున్నది. అనఁగా నిప్పుడు మనకు లభించుచున్న సంస్కృత భారతప్రతులలో నేది నన్నయతిక్కనాదులు వారికాలమున గ్రహించినదానికి దగ్గఱగా నుండును అని ప్రశ్న. ఏలయన, నన్నయతిక్క నలనాఁటి వ్రాతప్రతి యేదియును మనకాలమున దొరకునని తలంచుట కవకాశము లేదు. ఇప్పుడు లభ్యమగుచున్న లిఖితప్రతులలో ప్రాచీనతమం బగునవి 500 సంవత్సరములక్రిందట నాగరాక్షరములలో వ్రాయఁబడిన వొకటి రెండు మాత్రము కలవు. తెలుఁగులిపిలో వ్రాయఁబడిన ప్రతులలో నంత ప్రాచీనములగునవి యున్నట్లు కనఁబడదు. ఈ మధ్య పూనాలోని 'భండార్కర్ పరిశోధనాలయము' వారు దేశమున లభ్యములగు ప్రాచీన భారతప్రతుల నన్నిటిని సరిపోల్చిచూచి, భారతముయొక్క మూల పాఠం బేదియో నిర్ణయించి ప్రకటింపవలయునని యఖండప్రయత్నము సలుపుచున్నారు. వీరు ప్రకటించిన విరాటపర్వమునుబట్టి చూడఁగా నీభారతప్రతులలోను త్తరదేశమునందలి ప్రతులకును,దక్షిణదేశమునందలి ప్రతులకును పాఠములలో విశేషవ్యత్యాసము కనఁబడుచుండుటచే, నీ భారతమున నుత్తరదేశపాఠము, దక్షిణదేశపాఠమునని యీనాఁడు రెండు పాఠము లేర్పడుచున్నట్లగపడుచున్నది. ఒక్క విరాటపర్వవిషయమునఁ జూడగా నుత్తరదేశప్రతులలో 72 అధ్యాయములు, 2,272 శ్లోకములునుండ, దక్షిణదేశప్రతులలో 78 అధ్యాయములు, 3,494 శ్లోకములును గలవు. ఇం దేది ప్రాచీనమూలగ్రంథమునకు దగ్గఱగా నుండునో, ఏది తిక్కనార్యునిచే గ్రహింపఁబడినదో నిశ్చయించుటకూడ చిక్కైన విషయమే. చిరకాలమునుండి పవిత్రగ్రంథముగాఁ దలంపఁబడుచుండిన

యీ భారతమువంటి గ్రంథములో, నాయాకాలములందు, దేశమున మతవిప్లవములు సంభవించినపుడు, కొందఱు తమతమ మతాభిప్రాయములకు భారతసంహితయం దున్న వన్నచో గౌరవము కలుగు ననునుద్దేశముతో స్వీయమతానుకూలమగు గ్రంథమును కొంత చేర్చినఁ జేర్చియుందురు గాని, సామాన్యముగా నున్నదానిని దీసివేయుట సంభవించునని తోఁచదు. కావుననే భారతము కాలక్రమమునఁ బెరుఁగుచు బెరుఁగుచువచ్చి మహాభారతమగుట తటస్థించినదని పలువురు విమర్శకుల మతమైయున్నది. ఇట్లు వెనుకటికాలమునకుఁ బోయినకొలఁది భారతముయొక్క మూలస్వరూపము మనకు దగ్గఱగుచుండును. ఇందుకు నిదర్శనముగా 500 సంవత్సరములనాఁటివని చెప్పఁబడిన ఉత్తరహిందూదేశమునందలి వ్రాఁతప్రతులలోని యధ్యాయసంఖ్య, శ్లోకసంఖ్య దక్షిణదేశప్రతులలోనివానికంటె తక్కువగాఁ గనఁబడుచున్నది. తక్కువ సంఖ్య గల యధ్యాయములు కల ప్రతులే ప్రాచీనములనుటకు మఱియొక నిదర్శన మేమనఁగా, నాదిపర్వమునందలి పర్వసంగ్రహపర్వమునందుఁ దెలుపఁబడిన సంఖ్యల కీసంఖ్యలే చేరువగా నుండుట. చూడుఁడు. ఆదిపర్వమున పర్వసంగ్రహ పర్వమునందు ప్రతిపర్వమునందలి యధ్యాయసంఖ్య, శ్లోకసంఖ్య తెలుపఁబడియున్నవి. అందు విరాటపర్వమున 67 అధ్యాయములును, 2,050 శ్లోకములును మాత్రమే యున్నట్లు తెలుపఁబడినది. విరాటపర్వమునుగూర్చి పర్వసంగ్రహపర్వమున నిట్లు గలదు:—

" తతః పరం నిబోధేదం వైరాటం పర్వవిస్తరం
విరాటనగరే గత్వా శ్మశానే విపులాం శమీం
దృష్ట్వా సన్నిదధు స్తత్ర పాండవా హ్యాయుధా న్యుత
యత్ర ప్రవిశ్య నగరం ఛద్మనా న్యవసంస్తుతే

పాంచాలీం ప్రార్థయానస్య కామోపహతచేతసః
దుష్టాత్మనో వధో యత్ర కీచకస్య వృకోదరాత్.

... ... ... ... ...
... ... ... ... ...

చతుర్థ మేత ద్విపులం వైరాటం పర్వవర్ణితం
అత్రాపి పరిసంఖ్యాతా అధ్యాయాః పరమర్షిణా
సప్తషష్టి రథో పూర్ణా శ్లోకానా మపి మే శ్రుణు
శ్లోకానాం ద్వే సహస్రేతు శ్లోకాః పంచాశ దేవతు."

ఈ యధ్యాయ శ్లోకసంఖ్య యుత్తరదేశ దక్షిణదేశ ప్రతులన్నిటిలోనుగూడ నాదిపర్వమున నొక్కరీతినే యుండెనుగాని, యాయాప్రతులయందు ప్రక్షిప్తములుగాఁ జేర్పఁబడిన యధ్యాయముల సంఖ్యను జేర్చి యీ యాదిపర్వములోని సంఖ్యలను తదనుసారముగా నెవరు దిద్దియుండలేదు. ప్రక్షిప్తభాగములను జేర్చినవా రేకారణముచేతనో పర్వసంగ్రహపర్వమునందలి యధ్యాయసంఖ్యజోలికి పోలేదు. వాని నున్నట్లే యుంచిరి. ఈపర్వసంగ్రహపర్వము కుమారిలభట్టు కాలమునాఁటికి, అనఁగా నేడవశతాబ్దమున కిట్లే మార్పులులేక యున్నదని నమ్ముట కాధారము కలదని బ్యూహులర్ పండితుఁడును, క్రీస్తుశకము 500 సంవత్సరముల కింకను పూర్వపుదే యైయుండునని హాప్‌కిన్స్ పండితుఁడు నాంతరంగిక నిదర్శనములనుబట్టి తేల్చియుండుటచే, భారతమునందలి యధ్యాయ శ్లోకసంఖ్య లాకాలమున నిట్లే యున్నవని నమ్మఁదగియున్నది. * దీనినిబట్టి 5 అధ్యాయములు మాత్రమే ఎక్కువగాఁగల ఉత్తరదేశపు నాగరీగ్రంథపాఠమే పదునొకం డధ్యాయములు, **1,444** శ్లోకములు హెచ్చుగాఁ గనఁబడుచున్న దక్షిణదేశప్రతుల పాఠ

---

* Hopkin's Great Epic: p. 398.

ముకంటె పర్వసంగ్రహపర్వమున సూచింపఁబడిన ప్రాచీనపాఠమునకు దగ్గఱగా నుండునని తలంపవచ్చును. మఱియు నుత్తరదేశపు నాగరీ ప్రతులలోని యధ్యాయములలో ననవసర విభాగము కనఁబడుచున్నది. సుశర్మ భీమునిచేఁ బట్టుపడి యుధిష్ఠిరునియాజ్ఞచే విడువఁబడెనను సందర్భమున, పట్టుపడుటతో నొకయధ్యాయము ముగిసి, ధర్మజుని యాజ్ఞచే విడువఁబడి ఖిన్నుఁడై వెడలిపోయె ననునది మఱియొక యధ్యాయమునఁ జెప్పఁబడినది. ఈ విషయమంతయు నొక్క యధ్యాయమం దుండుటయే సమంజసము గదా. ఇట్లే ఉత్తరార్జునుల సంభాషణము, అర్జునుఁ డుత్తరునికి ధైర్యముచెప్పి సారథిగాఁ జేసికొనుట యను విషయముకూడ నొక్కయధ్యాయమునఁ జెప్పఁదగినది, రెండధ్యాయములఁ జెప్పఁబడినది. ఇట్లే మఱికొన్ని సందర్భములలోను నీయధ్యాయములు విభాగముచేయఁబడక, యొకే అధ్యాయముగానే కొన్ని వ్రాఁత ప్రతులలోఁగూడ కనఁబడుటయేగాక, ప్రాచీనతమంబు లనుకొనుచున్న వ్రాఁతప్రతు లొకటి రెండిటిలో నీ పర్వసంగ్రహపర్వములోఁ జెప్పబడినరీతిని 67 అధ్యాయములే యుండుటచే నీప్రతులే మూలభారత గ్రంథమునకు దగ్గఱగా నున్నవని నిర్ధారణచేయుట కవకాశము కలుగుచున్నది. విశేష మేమనఁగా, నుత్తరదేశపాఠములోఁ బ్రక్షిప్తశ్లోకములు సుమారు 220 మాత్రమే చేరఁగా, దక్షిణదేశపాఠములో ప్రక్షిప్తభాగములు విశేషముగా ననఁగా సుమారు 1,400 శ్లోకములవఱకుఁ జేరిన ట్లగపడుచున్నది. కావున దక్షిణదేశపాఠములో నుత్తరదేశపాఠములో కంటె ప్రక్షిప్తభాగము విశేషంబై యున్నట్లు తేలినది. ఇఁక దక్షిణదేశపాఠముననే ప్రక్షిప్తభాగములు విశేషం బగుటకుఁ గారణం బేమో, యివి యేకాలమునఁ జేరియుండునో యను విషయము విచారణీయ మగుచున్నది. తిక్కన విరాటపర్వము ఉత్తరదక్షిణ

పాఠములకు భేదము గలిగినచోట్ల చాలవఱకు దక్షిణదేశపాఠముతోడనే పొందికగలదిగాఁ గనఁబడుచున్నది. మఱియు నీతఁడు దక్షిణదేశమునందలివాఁడే గావున నీప్రాంతములందలి ప్రతులనే యనుసరించి రచించి యుండుననియు దలంపవచ్చును. కాని కావ్యకళాదృష్టితో నీతఁడనేక సందర్భముల మూలకథను, అందలి పాత్రలస్వభావమును సందర్భానుకూలముగ మార్చి మూలమునందుకంటె రమ్యతరంబుగా రచించుటచేతను, నితఁడిట్లు కావ్యకళాదృష్టితోఁ జేసినమార్పు లాయాసందర్భముల నతిరమ్యములై యుండుటచేతను, నతని మార్పుల ననుసరించి ప్రాచీన పాఠమునఁ గొన్ని ప్రక్షిప్తభాగము లిటీవలికాలమున దక్షిణదేశప్రతులలోఁ జేర్పఁబడినవా యను సందేహము కలుగకపోదు. తిక్కనరచన యిప్పటి దక్షిణదేశపాఠము ననుసరించినట్లే యుండినను, కొన్ని సందర్భములలో మాత్రము త్తరదేశపాఠమునకు దగ్గఱగా నున్నట్లు కనఁబడుచున్నది. ఉత్తరదేశప్రతులలోని పాఠముతో భేదించిన కొన్ని సందర్భములలో దక్షిణదేశపాఠమునకును, తిక్కనరచనకును దగ్గఱసంబంధమే కనఁబడుచున్నను, ఇప్పటి మూలగ్రంథము పూర్వోత్తరసంబంధము లేక చిక్కులుగా నుండును. ప్రాచీనపాఠముతో నతుకని నూతన శ్లోకములు కొన్ని మధ్య చేర్పఁబడినట్లు గానవచ్చెడిని. ఈ కారణములచే, తిక్కనకు లభించిన మూలప్రతి కేవల మిప్పుడు మనకు లభించుచున్న దక్షిణదేశపాఠముతోఁ గూడినదే కాదనియు, నది యిప్పటి యుత్తరదేశపాఠమునకు కొంత దగ్గఱగా నుండెననియు, తిక్కన తరువాతికాలమునఁగూడ మూలగ్రంథములోఁ గొన్ని ప్రక్షిప్తభాగములు చేరెననియు, నందులోఁ గొన్నియైనను తిక్కనార్యుని రచన ననుసరించి చేర్పఁబడినవై యుండుననియు నూహించుటకు నవకాశము కలుగుచున్నది.

తిక్కనార్యునకు లభించిన మూలగ్రంథప్రతి యిప్పుడు దక్షిణ దేశపాఠముగా గ్రహింపఁబడుచుండిన పాఠముగలది మాత్రమే కాదనుటకు నొకటిరెండు నిదర్శనముల నీ విరాటపర్వమునుండి చూపవచ్చును. అందు పాండవులు విరటుని కొల్వు ప్రవేశించుటకు పూర్వము వేషయోజనసందర్భమునఁ జేసినట్లుగాఁ గనఁబడుచున్న దుర్గాస్తుతి యొకటి:

"విరాటనగరం రమ్యం గచ్ఛ మానో యుధిష్ఠిరః,
అస్తువన్ మనసా దేవీం దుర్గాం త్రిభువనేశ్వరీం."

ఇత్యాది దుర్గాస్తోత్ర రూపం బగు 35 శ్లోకములు గల యధ్యాయ మొకటి కొద్ది యుత్తర దేశ ప్రతులందును, దక్షిణదేశ ప్రతులలో పెక్కింటి యందును, కుంభఘోణాది ముద్రితప్రతులందును గానవచ్చుచున్నది. కాని యిది యాంధ్రభారతమునందుఁ లేకపోవుట తటస్థించుటచే నిది భాషాంతరీకరణకారుఁడు స్వతంత్రించి తెనిఁగించుట మానెనా, లేక యిది యాతఁడు గ్రహించిన మూలగ్రంథమున లేకుండెనా యను సందేహము కలుగకపోదు. కాని యీ దుర్గాస్తోత్రాధ్యాయము దక్షిణదేశప్రతులు కొన్నింటిలోను, ఉత్తరదేశ ప్రతులలో ముఖ్యముగా నతిప్రాచీనములని తలంపఁబడిన వానిలోను లేకుండుటచేతను, క్షేమేంద్రుని 'భారతమంజరి' యందుఁ గాని (IV-26-31), అమరచంద్రుని బాలభారతమందుఁగాని (IV-1-17) దీని ప్రశంస యేమియు లేకుండుటచేతను, ఆకాలమున కిది యింకను మూల గ్రంథమునఁ జేర లేదని తలంపవలసియున్నది. జావాద్వీపమున నాద్వీప భాషలో రచింపఁబడిన భారతకథలోఁ గూడ నీ దుర్గాస్తోత్ర ప్రశంస యేమియు లేదు. ఇది పదియవ శతాబ్దమునాఁటిదిగా నిర్ణయింపఁబడుటం జేసి, సుమారు పదియవ శతాబ్దమువఱకు భారతములో నీ దుర్గాస్తో

త్రాధ్యాయము చేర లేదని నిశ్చయింపవచ్చును. తిక్కనకాలమునకుఁగూడ నిది మూలప్రతులలోఁ జేరకపోవుటచేతనే యాతఁడు దానివిషయ మాంధ్రభారతమున స్మరింపకయుండును. కాని యిప్పుడు మనకు లభ్యమగుచున్న వ్రాఁతప్రతులను బట్టిగాని, దక్షిణదేశప్రతుల పాఠము ననుసరించి ముద్రించినట్లుగాఁ దెలుపఁబడిన కుంభఘోణపు ముద్రిత ప్రతిని బట్టిగాని తిక్కనభారతమును సరిపోల్చిచూచినచో, నాంధ్రమున దుర్గాస్తవము లేకుండుటకు తిక్కనార్యుని యుచితజ్ఞతయో, లేక యాతనికి దుర్గాపూజావిషయమునఁ గల యనాదరమో కారణమని చెప్పవలసియుండెడిది. దీనినిబట్టి యాంధ్రభారతమును సంస్కృతమూలముతోఁ బోల్చిచూచి యాంధ్రభారతకవుల చాతుర్యమును, వారి ప్రత్యేకవ్యక్తిత్వమును బయటికిఁ దీసి చూపవలెనన్నచో, కేవలము కుంభఘోణప్రతివంటి ముద్రితప్రతులపై నాధారపడుట యుక్తము గానట్లు వ్యక్తమగుచున్నది. అయితే ఈ ముద్రితగ్రంథము దుర్గాస్తవము మొదలగు నొకటి రెండు సందర్భములలో మాత్రమే యుత్తరదేశ ప్రతుల ననుసరించినను విశేషముగా దక్షిణదేశప్రతుల పాఠమునే గ్రహించినట్లు చెప్పఁబడి యుండుటచే నించుక జాగరూకతతో మాత్రము పరిశీలింపవలసియున్నది. ఇట్లు తిక్కన దుర్గాస్తవరూపమగు ప్రక్షిప్తపాఠము లేని భారతమూలగ్రంథమునే గ్రహించి యాంధ్రమున రచించెనని చెప్పుట కవకాశము లేకపోలేదు. ఈ యధ్యాయము 14 వ శతాబ్దపుదైన యుత్తరదేశపు వ్రాఁతప్రతిలోఁగూడ లేకపోవుటచే, నంతకంటె నర్వాచీనకాలమునఁ జేర్పఁబడియుండునని తలంపవలసి యున్నది.

భారతవ్యాఖ్యానములు కూడ నీ మూలగ్రంథనిర్ణయము విషయమునఁ గొంత తోడ్పడుచున్నవి. భారతవ్యాఖ్యానకర్తలు గ్రహించిన

మూలగ్రంథమును బట్టియు, వారిపౌర్వాపర్యమునుబట్టియుఁ జూచి నచో, అర్వాచీన వ్యాఖ్యానకారునికిఁ దెలిసిన కొన్ని యధికపాఠములు ప్రాచీన వ్యాఖ్యాతలకుఁ దెలిసిన ట్లగపడుటలేదు. ఈ వ్యాఖ్యానములలో నీలకంఠీయము విశేషప్రాచుర్యము కలదై యుండుటే గాక తక్కినవానికంటె నర్వాచీనమగుటచే దుర్గాస్తవాధ్యాయము దీనియందు వ్యాఖ్యాతంబై యుండ, తక్కిన వ్యాఖ్యానకర్తల కీయధ్యాయము విషయమే తెలియకుండిన ట్లగపడుటచేతను, ఇది యిటీవలికాలమునఁ జేరుపఁబడినదే యనియు, నర్జునమిశ్రుని కాలమున కింకను మూలమునఁ జేరలేదనియు నూహింపఁదగియున్నది.

కీచకుఁడు సుధేష్ణామందిరమున ద్రౌపదిని జూచి యామె యెవరని సుదేష్ణ నడిగి తెలుసుకొనుటకు యత్నింపక పూర్వమే ద్రౌపదితోఁ గొంత దీర్ఘసంభాషణము జరిపినట్లుగా సుమారిరువదిశ్లోకములు గల యధికపాఠము కొన్ని యుత్తరదేశప్రతులలోను, చాలవఱకు దక్షిణదేశప్రతులలోను గూడఁ గనఁబడుచున్నది. కాని యుత్తరపాఠశ్లోకములకును, దక్షిణపాఠశ్లోకములకును మాత్రము కొంతభేదము కలదు. అట్లే యుత్తరగోగ్రహణ సందర్భమున నర్జునుని పరాక్రమమును వర్ణించుచు నింతకంటె నధికశ్లోకములతోఁగూడిన యధికపాఠము మఱియొకటి కూడఁ గానవచ్చుచున్నది. ఈ రెంటికినిగూడ నీలకంఠీయ వ్యాఖ్యానము కలదు. అర్జునమిశ్రుని వ్యాఖ్యానములో మొదటిదాని ప్రశంసయే కలదు గాని రెండవదానినిగూర్చి లేదు. విషమపదవివరణ మను మఱియొక ప్రాచీనవ్యాఖ్యానములో నీ రెంటినిగూర్చియును గూడ నేమియు ప్రశంసింపఁబడలేదు. అర్జునమిశ్రుఁడు విషమపదవివరణము నచ్చటచ్చట ననువదించియుండుటచే (quote) నీతఁ డావ్యాఖ్యానముకంటె నర్వాచీనుఁడనియు, నీలకంఠుఁ డర్జునమిశ్రు ననువదించుటచే

నీతనికంటె నాతఁ డర్వాచీను డనియు తేలుచున్నది. ఇట్లతిప్రాచీన వ్యాఖ్యానమున నీయధికపాఠముల ప్రశంసయే లేకుండుటచే నివి తరువాతికాలపు ప్రక్షిప్తభాగములే యని నిశ్చయింపఁదగియున్నది.

ఇఁక నీ ప్రక్షిప్తభాగములకును తిక్కనార్యుని తెనిఁగింపునకును గల సంబంధమును విచారింతము. కీచకసుధేష్ణాసంవాదాధ్యాయమున కథాసన్నివేశముననే దక్షిణపాఠమునకు నుత్తరపాఠమునకు భేద మగపడుచున్నది. ఈ భేదసందర్భమున తిక్కన తెలుఁగు రచన ఉత్తరదేశమునందలి ప్రతులలో ప్రాచీనప్రతులని చెప్పఁబడిన వానియందలి పాఠమునకు, అనఁగా బండార్కరు పరిశోధనాలయమువారు ప్రాచీన మూలపాఠముగా గ్రహించిన పాఠమునకే, సరిపోవుచున్నట్లున్నది. అం దిట్లు గలదు:—

"తథా చరన్తీం పాంచాలీం సుధేష్ణాయా నివేశనే,
సేనాపతి ర్విరాటస్య దదర్శ జలజాననాం.

తాం దృష్ట్వా దేవగర్భాభాం చరన్తీం దేవతా మివ,
కీచకః కామయామాస కామబాణప్రపీడితః.

స తు కామాగ్నిసంతప్తః సుదేష్ణా మభితో౽గతః,
ప్రహస న్నివ సేనానీ రిదం వచన మబ్రవీత్.

నేయం పురా జాతు మయేహ దృష్టా,
కా దేవరూపా హృదయంగమా శుభా."

సుదేష్ణయింటిలో ద్రౌపదిని జూచి కామమోహితుఁడై కీచకుఁ డిట్లా సుధేష్ణ నడిగి, యామె యేమియు నుత్తరము చెప్పకుండుటచేఁ గాఁబోలు,

# ఆంధ్రభారత కవితా విమర్శనము

"గతః సుదేష్ణా మభిమన్త్ర్య కీచకః
తత స్సమభ్యేత్య నరాధిపాత్మజాం,
ఉవాచ కృష్ణా మభిసాంత్వయం స్తదా-"

సుదేష్ణయొద్దనుండి ద్రౌపదియొద్దకుఁ బోయి యామెతో సాంత్వనవచనములు పలుకఁదొడంగెను. ఇట్లు కీచకుఁడు ద్రౌపదితో మాట్లాడిన సందర్భముననే, 'కాత్వం కస్యాసి కల్యాణి కుతోవా త్వం వరాననే' అనునది మొదలుగాఁగల 21 శ్లోకముల యధికపాఠము కనఁబడుచున్నది. ద్రౌపదీకీచకుల సంవాదరూపమగు నీశ్లోకము లీ సందర్భమును బట్టి ప్రక్షిప్తములుగా నెన్నవలసిన పనియే లేదు గాని, ప్రాచీనములగు నుత్తరదేశప్రతులలోను, దక్షిణదేశప్రతులలోనుగూడ నివి బొత్తుగాఁ గానరాకుండుటయు, నీ సందర్భమున వేఱుశ్లోకములు మఱికొన్ని దక్షిణదేశప్రతులలోఁ గానవచ్చుటయును దటస్థించుటచే నవియు నివియుఁగూడ సందర్భానుసారముగాఁ దరువాతఁ జేర్పఁబడినవే యని తలంపవలసివచ్చుచున్నది. ఉత్తరదేశపాఠమున నిట్లుండఁగా, దక్షిణదేశప్రతులలోను, అందు నొక మద్రాసు తెలుఁగుప్రతిలోను గూడ కీచకుఁడు ముందు సుధేష్ణయొద్దకుఁ బోయి యామెను ద్రౌపదిని గూర్చి యడుగకయే, సరాసరి ద్రౌపదియొద్దకే పోయి యామెనే నీ వెవరని యడిగి యామెతో దీర్ఘభాషణము సలిపినట్లున్నది. అంతేగాక, కీచకుఁడు ప్రవాసమునుండి యప్పుడె తిరిగివచ్చినట్లుకూడ చెప్పఁబడినది. ఇది యుత్తరదేశ ప్రతులలో లేదు.

" తస్మిన్ వర్షే గతప్రాయే ప్రవాసా దాగత స్తదా
కీచకో నామ మాత్స్యస్య శ్యాలో నిత్యం భృశం ప్రియః.

*        *        *        *        *        *

తథా చరంతీం పాంచాలీం సుధేష్ణాయా నివేశనే

*       *       *       *       *       *

కీచకః కామయామాస కామబాణ ప్రపీడితః
స తాం సైరంధ్రివేషేణ వసన్తీం రాజవేశ్మని
ఉపగమ్యానవద్యాంగీం పాంచాలీ మిద మబ్రవీత్
కాసి త్వం చారుసర్వాంగి శ్యామా దేవి కృశోదరి
మన్యే త్వాం దేవలోకాచ్చ చ్యుతాంతారాం యదృచ్ఛయా.

*       *       *       *       *       *

దాస స్త వాహం పృథుతామ్రలోచనే
వశానుగో వారణఖేలగామిని,
కన్దర్పబాణాభిహతో స్మ్యనిందితే
ఖగో వసన్తే ష్వివ పుష్పమూర్ఛితః."

*       *       *       *       *       *
*       *       *       *       *       *

అహం హి కాన్తే త్వదధీనజీవితః
త్వయాఽవియుక్తో న చిరం జిజీవిషే"

ట్లు 15 శ్లోకములు గల యధికపాఠ మున్నది. ఇందు కీచకుఁడు ఎదట సుదేష్ణయొద్దకుఁ బోవుట, ఆమె నడుగుట, ఆమె నభిమంత్రించి ద్రౌపదియొద్దకు పోవుట—ఈ విషయ మేమియు నిందు గానరాదు. కాని తిక్కన తెలుఁగురచన యెట్లున్నదో, ఎంతరమ్యతరంబుగనున్నదో, సందర్భమున నాయాపాత్రల స్వభావపోషణ మెంతచక్కఁగాఁ జేసినాఁడో, ఆగ్రంథము నామూలాగ్రముగఁ జదివి యానందింపవలసినదే. ఇక్కడ ముఖ్యవిషయ మేమనఁగా, తిక్కనరచన యుత్తరదేశ

ప్రతులచే సూచింపఁబడిన ప్రాచీనమూలగ్రంథమునకే చేరువగా నుండినది గాని దక్షిణదేశప్రతులపాఠమున కేమియు సంబంధింపకున్నది. ఏలయనఁగా, కీచకుఁడు "తనయప్ప సుదేష్ణకు మ్రొక్కఁ జనుఁ వాఁడద్దేవికనతి దూరంబున నున్న ద్రుపదరాజనందనం గనుంగొని" అని సుదేష్ణకు మ్రొక్కుటకుఁగా నామె మందిరమునకుఁ బోయెననియు, నాసందర్భమున నామెయొద్దనున్న ద్రౌపదిని జూచెననియు తిక్కన చెప్పినాఁడు. కీచకుఁడు సుదేష్ణను మ్రొక్కుటకుఁగా నామెయొద్దకుఁ బోయెనని చెప్పుటలోఁ గల యుద్దేశకల్పనము (motive) తిక్కన తెచ్చిపెట్టినది గాని యుత్తరదేశపాఠములోఁగాని, దక్షిణపాఠమునఁగాని లేనేలేదు. "తథా చరన్తీం పాంచాలీం సుదేష్ణాయా నివేశనే" అనిమాత్రమె ప్రాచీనప్రతులలో నున్నది. తిక్కన మూలములలో లేని యీయుద్దేశకల్పన మెందులకుఁ జేసినాఁడని విచారించినచో, నింతకాలమునుండి—అనఁగా సుమారు 10,11 నెలలనుండి ద్రౌపది సుదేష్ణయింట నుండఁగా నీతఁ డింతకాలమునుండి చూడక, యిఁక పాండవులయజ్ఞాతవాసకాల మొకపక్షము దినములుమాత్రమే కొఱవడియుండు సమయముననే యీతఁడెట్లు చూచుట తటస్థించినది. అను సందేహమును బాపుటకే యై యుండునని మన మూహింపవచ్చును. ఏలయనఁగా, తఱచుగా నీమెను చూచుటకు వచ్చుచున్నవాఁ డైనచో ద్రౌపది నిదివఱకే చూచియుండును. అట్లుగాక యీమెను చూచి చిరకాలమై యుండును కనుకనే ఇంతకాలమునుండియు నీతఁడు బహుశః ఊరలేక యుండును, యప్పం జూచి యామెకు మ్రొక్కఁబోవఁగా వచ్చినాఁడు—అనఁగా నీతఁ డింతకాలమునుండి ప్రవాసమునం దుండెను—అని తిక్కన సూచనమాత్రము చేసినాడు. అట్లు గానిచో, నీతఁ డీదినమున ప్రత్యేకముగా మ్రొక్కఁజనుటలో విశేషము కనఁబడదు. దీనిని

జూచియే గావలయు, దక్షిణదేశప్రతులు కొన్నింటిలో "తస్మిన్ వర్షే గతప్రాయే ప్రవాసా దాగత స్తదా" అని యాతఁడు ప్రవాసమునుండి వచ్చినాఁడని స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది కాని, తిక్కన కల్పించిన "ప్రమొక్కుంజను" నుద్దేశమును గూర్చి చెప్పఁబడలేదు. ఉత్తరదేశప్రతులలో లేనేలేని యీప్రవాసవిషయము తిక్కనచేసిన సూచనను బట్టియే దక్షిణదేశప్రతులలోఁ జేర్పఁబడియుండును. తిక్కన యీ సూచనను చేయుటకు వేరు కారణముకూడ కలదు. ఉత్తరదేశప్రతులతో విరటుఁడు జీమూతుఁడను మల్లునితో మొదట కీచకుని పోరించినట్లును, కీచకుఁ డోడిపోఁగా తరువాత భీముఁడు వానితో పోరి చంపివేసినట్లును జెప్పఁబడినది. తిక్కన మల్లునితోఁ గీచకుని పోరించుట యుక్తము కాదని తలంచి, విరటుని యాస్థానములోని మల్లు లెవ్వరు నాతనితోఁ బోర నొల్లకుండుటచే విరటుని యుత్సాహము సన్నగిలుచుండుటనుజూచి ధర్మజుఁడు భీమునిగూర్చి తెలుపఁగా, విరటుఁడాతనిఁ బిలిపించి మల్లునితోఁ బోరించినట్లు చెప్పినాఁడు. మూలములో నున్న రీతిగా కీచకుఁడు పోరకుండుటకుఁ గారణముగా నాతఁ డాసమయమున నూర లేఁడనియు, కావుననే యింతకాలము నుండియు సుదేష్ణమందిరమున కాతఁడు రా లేదనియు, నిష్కుటారినుండివచ్చినాఁడు గనుకనే సుదేష్ణకు ప్రమొక్కుంజనువాఁడై యామెమందిరమునకుఁ బోవుటతటస్థించినదనియు తెలియఁజేయుచున్నాఁడు. ఇట్లీయుద్దేశకల్పనముచే తిక్కనార్యుఁడు రెండర్థములను సాధించినవాఁ డైనాఁడు.

పిదప కందర్పదర్పగోచరుండగు కీచకుండు............దాని దెసం దగిలినదృష్టి యెట్టకేనిం దిగిచికొని వచ్చి యద్దేవిం బ్రణమిల్లెను. అప్పుడామె చిరకాలమ్మై తనను జూడవచ్చినవా డగుటచే నాతమ్మ నాదరించి కాంచనపీఠంబు వెట్టించి ప్రేమతో సంభావించుచుండ,

నీతఁడు పాంచాలిం జూపి యీమె యెవరని యడుగఁగా, నాసుదేష్ణయు నీతని వైఖరి గనిపెట్టి కీచకుని మాటలు గీటునం బుచ్చి యొండుపలుకులు జరిపినట్లుగా తిక్కన వర్ణించినాఁడు. ఇది యెంత సందర్భానుసారముగను, స్వభావపోషకంబుగ నున్నదో గమనింపుఁడు. ఉత్తర దేశప్రతులలోనైనను,

"గత స్సుదేష్ణా మభిమన్త్ర్య కీచకః"

అనియె గలదు గాని యామె యొండుపలుకుల జరపుట యనునది లేదు. దక్షిణదేశప్రతులలో నీతఁడు సుదేష్ణయొద్దకుఁ బోయి నట్లే లేదు.

"స తాం సైరంధ్రివేషేణవసన్తీం రాజవేశ్మని,
ఉపగమ్యానవద్యాంగీం పాంచాలీ మిద మబ్రవీత్."

అనియె కలదు. దీనినిబట్టి తిక్కన ఉత్తరదేశప్రతుల పాఠమునే యనుసరించి, యాసందర్భమును మూలమునకంటె రమ్యతరంబుగా రచించినట్లు స్పష్టమగుచున్నది. అనఁగా నీతనికాలమున నీతఁడు గ్రహించినప్రతి యిప్పుడు మన ముత్తరదేశపాఠ మనుకొనుచున్న దానికే దగ్గఱగా నుండియుండునని తోఁచుచున్నదనుట. ఇంకను దక్షిణదేశప్రతులలోఁ గనఁబడుచు నుత్తరదేశప్రతులలోఁ గానరాని కీచకోత్పత్తిప్రకరణ మొకటి తిక్కన బొత్తిగా వదలివేసినాఁడు. ఇదియు బహుశః తిక్కనకాలమునకు మూలగ్రంథములోఁ జేరియుండ లేదేమో. ధర్మరాజాదులు వ్యూహము పన్నుకొని విరటునికి సహాయులై సుశర్మతోఁ బోరినట్లుగా దక్షిణోత్తరదేశప్రతులలోఁ గొన్నిటిలో నుండ, తిక్కన దాని ననుసరింపక, ధర్మరాజాదులు మఱియొకచోట యుద్ధము చేయుచున్నట్లును, విరటుఁడు సుశర్మచే పట్టుపడిః

పిమ్మట ధర్మజుఁడు భీముని కద్దానిఁ జూపి విరటుని విడిపింపుమని చెప్పి పంపినట్లును రచించినాఁడు. ఇది ప్రాచీన మూలపాఠము ననుసరించి యుండుటచే తిక్కన దానినే యనుసరించినట్లు కనఁబడుచున్నది.

వీనినిబట్టి చూడఁగా తిక్కననాఁటి మూలగ్రంథప్రతి యుత్తర దేశ ప్రతులలో ప్రాచీనములగు వానికిఁ జేరువగా నుండుననియు, తిక్కనకాలమునకు పిదపనుగూడ ననేకవిధములగు ప్రక్షిప్తభాగములు చేరియుండుననియు నూహింపఁదగియున్నది. ఉత్తరదేశపు ప్రతులలో కంటె దక్షిణదేశప్రతులలో, ముఖ్యముగా తెలుఁగుప్రతులలోఁగూడ ప్రక్షిప్తభాగములు విశేషముగాఁ జేరియుండుటకు కావ్యకళాదృష్టితో (from artistic point of view)తిక్కనార్యుఁ డచ్చటచ్చట చేసిన మార్పులు కూడ కొంతకారణమై యుండుననియు నూహింపఁదగి యున్నది. మూలగ్రంథమునకును తిక్కన తెలుఁగు రచనకును గల సామ్యమును, భేదమును గూర్చి మఱికొంత విచారించుటకు పూర్వము విరాటపర్వమును మొత్తముగా గ్రహించి యందలి కథాసంవిధాన విషయమున తిక్కనార్యుఁడు మూలమున కెట్లు మెఱుఁగువెట్టెనో యించుక పరిశీలింతము.

## విరాటపర్వ కథ - అందలివస్త్వైక్యము

విరాటపర్వము తెనుఁగున నైదాశ్వాసముల గ్రంథముగా తిక్కన రచించినాఁడు. పర్వసంగ్రహపర్వమునఁగూడ నైదుపర్వములే చెప్పఁబడియున్నవి. కాని కథాసంవిధానములోని యేర్పాటులో కొంతభేదమున్నది. ఆదిపర్వమున నీ పర్వములను గూర్చి యిట్లు చెప్పఁబడియున్నది.

"ఆరణేయం తతః పర్వ వైరాటం తదనంతరం,
పాండవానాం ప్రవేశశ్చ సమయస్య చ పాలనం.
కీచకానాం వధః పర్వ పర్వగో గ్రహణం తతః,
అభిమన్యోశ్చ వైరాట్యాః పర్వ వైవాహికం స్మృతం."

ఇది యిట్లుండ వనపర్వములోని తుది యధ్యాయము కొన్ని దక్షిణదేశపు వ్రాఁతప్రతులలోను, కొన్ని ముద్రితప్రతులలోను గూడ విరాటపర్వమునకు ముందు, అనఁగా నీ పర్వములో మొదటి యధ్యాయముగాఁ జేర్పఁబడియున్నది. పర్వసంగ్రహపర్వము దీనిని వనపర్వభాగముగనే చెప్పియుండుటచే (I-2-202) వనపర్వము చివరనే యుండవలసినదిగాన లూడర్స్ (Luders) పండితుఁడు మొదలగు కొందఱిది ప్రక్షిప్తమై యుండునని తలంచియున్నారు. కాని యిందలి విషయములు ధర్మదేవతాసమాగమము, వరదానము మొదలగునవి తరువాతికథ కత్యంతావశ్యకము లగుటచే నిది తరువాతి కాలమునఁ జేర్పఁబడియుండక వనపర్వాంతర్భాగంబై యుండు ననుటకు సందేహము లేదు. ఇది దక్షిణదేశప్రతులలో విరాటపర్వాదిని జేర్పఁబడుటకుఁ దగిన కారణము కనఁబడుట లేదు. కాని తిక్కన తనరచన నీ పర్వముతోడనే ప్రారంభించినాఁడు గావున నరణ్యపర్వవిషయ మించుక యిందు తడవియుండును. క్రొత్తగా నొక గ్రంథమధ్యమునఁ బ్రారంభించి రచింప మొదలిడినవానికిఁ బూర్వవిషయమునుగూర్చి కొంత చెప్పుట స్వాభావికము. ఇట్లు పూర్వోత్తర సందర్భములను గలుపుటకుఁగా తిక్కన యరణ్యపర్వవిషయమును గొంత యిచ్చటఁ దలపెట్టియుండ, దీనిని జూచి దక్షిణదేశప్రతులలో నాయారణేయపర్వభాగమును విరాటపర్వాదిని తరువాత నెవరైనఁ జేర్చియుందురాయని సందేహము. ఇంక పూర్వపర్వ

మూలమందలి కథకును దన గ్రంథమునకు నెక్కుడైన భేదము కలిగిన కలుగ వచ్చుననియు, భారతకథ జగత్ప్రసిద్ధమైనది గావున నింతకంటె పూర్వ పర్వార్థయుక్తి సేయునెడలఁ దానేమియు యత్నము చేయఁదలంచు కొనలేదనియు, నాయాకథాసందర్భమును బట్టియు, ఔచిత్యమును బట్టియు, కావ్యకళాదృష్టితోఁ జూచినపుడావశ్యకములని తనకుఁ దోఁచిన మార్పుల నొనర్చి యాయా సందర్భములకు "వలసినట్లు చెప్ప వలసియుండు"ననియు ముందే తనరచనావిధానక్రమమును మన కెఱుక పఱచియున్నాఁడు.

> "కథ జగత్ప్రసిద్ధిగావున పూర్వప
> ర్వార్థయుక్తి సేయునట్టి యెడల
> యత్న మించుకంత యైనను వలవదు
> వలసినట్లు చెప్ప వచ్చియుండు."

దీనికిఁ దగినట్లుగనే హృదయాహ్లాది, యూర్జితకథోపేతంబు నగు నీ నాలవపర్వము నొకప్రబంధముగాఁ జేయుటకై యిందలి యైదాశ్వాసములకథలో వస్త్వైక్యము నెట్లు సాధించినాఁడో చూడుఁడు. మూలములో మొదటిది పాండవప్రవేశపర్వము. రెండవది సమయపాలనపర్వము, మూఁడవది కీచకవధ పర్వముగాఁ జెప్పబడినది. కాని తిక్కన కీచకునివధను రెండవయాశ్వాసముననే చేర్చి ముందు మల్లునితోడి యుద్ధము మూలముగా భీముని మల్లయుద్ధచాతుర్యమును మనకు వర్ణించి రుచిమాపి, రాఁబోవు కీచకసంహార మంత రహస్యప్రకారముగ జరుపుట యాతనికి సుసాధ్యమేయని మన మనుకొనునట్లు చేసినాఁడు. మొత్తముమీఁద నీరెండవ యాశ్వాసము భీముని పరాక్రమమును వర్ణించు నాశ్వాసము. ఇందు భీముఁడే నాయకుఁడు. ఈ విషయ

మును మనకుఁ దెలుప నెంచినవాఁడువలెనే తిక్కన యీ యాశ్వాసాంత మున కీచకవధానంతరము ద్రౌపదిచే నాతని నిట్లు స్తుతింపఁజేసినాఁడు : తిలకింపుఁడు—

" చూడఁ దలఁపోయ మెచ్చ సంస్తుతియొనర్ప
నాతరంబె నీయుత్తమనాయకత్వ
మెఱిఁగి నినుఁగొనియాడ నే నెంతదాన
మహితవిస్మయానందనిర్మగ్న నైతి."

ఇట్లీకీచకవధ ఘట్టమునకు భీముని నాయకునిఁగాఁ జేసి శృంగార వీరరసముల కంగాంగిభావము కల్పించి యనేకవిధములగు నూతన వర్ణనలఁజేర్చి యీ కథ నొకచక్కని ప్రబంధముగా రచించినాఁడు. మూలమున నుపకీచకులవధ కూడ కీచకవధపర్వముననె చేరియుండ తిక్కన యద్దానిని మూఁడవయాశ్వాసమునఁ జేర్చుట యీ రెండవయాశ్వాసమున వస్త్వైక్యమును గూర్చుటకే యైయుండును. మూఁడవ యాశ్వాసము కీచకునివధ కారణముగాఁ గలిగిన సన్నిహితఫలములను, నసన్నిహితఫలములను గూర్చి తెలుపుచున్నది. ఆ విషయమునే, సూచ్యార్థసూచనగా,—నుత్తరాంకార్థమును పూర్వాంకముననే సూచించురీతిని—సూచించుచు జనమేజయునిచే నిట్లడిగించినాఁడు:—

" అనిన విని కీచకుఁడు చ
చ్చిన పిమ్మటఁ బుట్టునట్టి శేషము లెల్లన్
వినువేడ్కకు మన మలరెడు
ననఘా యేర్పడఁగఁ జెప్పుమనుటయుఁ బ్రీతిన్."

దీనినిబట్టి మూఁడవ యాశ్వాసమున కీచకవధ కారణముగాఁ బుట్టిన విశేషము లేవో వర్ణింపఁబడినవని తెలియుచున్నది. మొదట

యుపకీచకులవధ కీచకవధమూలమునఁ గలిగినదేగదా. ఇక్కడ మతి యొక విశేష మేమనఁగా, కీచకుఁ డర్ధరాత్రమునఁ జంపఁబడఁగా నుపకీచకులు మొదలగువా రందఱు తెల్లవారినపిదప వచ్చిచూచి యాతనికి దహన సంస్కారము చేయఁదలంచి, ద్రౌపదినిగూడ నాతనితోఁ దుదముట్టింప నీడ్చికొనిపోయి రనియు, నా ప్రాతఃకాలసమయముననే భీముఁ డుపకీచకుల వధ గావించె ననియు నుండఁగా, తిక్కనార్యుఁ డద్దాని మార్చి యుపకీచకుల వధయుఁ దెల్లవారక పూర్వమే,చీకటిలోనే జరిగినట్లుగా వర్ణించినవాఁ డైనను, ఈ యుపకీచకవధవృత్తాంతమును తరువాతి యాశ్వాసమునకుఁ ద్రోసివేయుట కీచకుని వధ కారణముగాఁ బుట్టిన విషయముల నన్నిటి నొక్కయాశ్వాసముననే చెప్పి కథాగమనమున నొకవిధమగు క్రమమును సూచించుటకే యని తలంపవలయును. మూఁడవ యాశ్వాసమున నీకీచకవధ వృత్తాంతభాగమునకును గోగ్రహణవృత్తాంతభాగమునకు నెట్లు సంధి, పొందికఁ గూర్చినాఁడో పరికింపుఁడు. సంస్కృతమూలమునను ప్రాచీనమని తలంపఁబడుచున్న యుత్తరదేశప్రతుల పాఠమున నీ పొందిక కనఁబడదు. కీచకవధ వృత్తాంతము దేశముల వ్యాపింపఁగా దుర్యోధనునిచారు లావార్త నాతనికిఁ దెలిపిరనిమాత్రమే ప్రాచీనమూలపాఠమునఁ గలదు. దానిపై కీచకుని మరణమునవలన విరటునికిఁ గలిగిన నిస్సహాయత్వమును దెలిసికొని సుశర్మ యాతనివలన నింతకుఁ బూర్వము తాను బొందిన పరాభవములకుఁగాను పగఁ దీర్చుకొనఁదలంచినవాఁడై, తాను విరటుని పై నెత్తిపోవుదునని చెప్పఁగాఁ దుర్యోధనుఁ డంగీకరించిన ట్లున్నది. ఇట్లుత్తరదేశప్రతులలో గోగ్రహణప్రయత్నమునకు సుశర్మయే కారకుఁ డగుచున్నాఁడు. కాని, దీనియూలమున దుర్యోధనుఁడు పాండవుల నన్వేషించి బయలుపఱుప నుద్దేశించిన ట్లెంతమాత్రమును గనఁబడదు.

పాండవులకథకును గోగ్రహణకథకును సన్నిహిత సంబంధ మెక్కడ కల్పింపఁబడలేదు. కాని తిక్కన యీ సందర్భము నెంత చక్కగాఁ జేయవచ్చునో గుర్తించినాఁడు. దుర్యోధనుఁడు కీచకవధ వృత్తాంతమును విని యందొక గూఢార్థమును గ్రహించినట్లుగాఁ దెలిపినాఁడు.

గీ. "ఇవ్విధంబునఁ దనుతమనోజ్ఞుఁగు తెఱఁగు
లందఱును జెప్ప విని కురునందనుండు
దగ విచారించి కార్యంబు తెగువఁ గాంచి
యెలమి వారలఁ గనుఁగొని యిట్టు లనియె.

గీ. "సింహబలుఁడు భీమసేనుండు శల్యుండు
హలధరుఁడు సమానబలము వార
లొండొరులను గెలుచు నుత్సాహమును గల
రుద్ధతులును బాహుయుద్ధపరులు.

క. "ఈ నలువుర భుజశక్తుల
తో నెనయఁగఁ జాలునట్టి దోర్బల మెందుం
గానము గావున వీరల
లోనన యొండొరుల కని గెలుపు సమకూరున్.

ఉ. "తక్కినవార లాతనికి దవ్వే చోటులవారు వాయుజుం
డొక్కఁడ యింక సింహబలు నుద్ధతి మాన్చిన మాన్పువాఁ డతం
డక్కడ నిల్చెఁ గావలయు నాసతి ద్రౌపది గాఁగ నోపు వే
ఱొక్కరుఁ డాజిఁ గీచకుల నోర్వఁగఁజాలమి మీ రెఱుంగరే.

క. "గంధర్వులను నెపంబున
నంధతమస గూఢవృత్తి ననిలసుతుఁడు గ

ర్వాంధ మతి యైన సూతుస
బాంధవముగఁ జంపెఁ గాక పరులకు వశమే.

'పితామహుఁ డుపదేశించిన లక్షణంబు లద్దేశంబునం గలిగి
యుండు నని విందు. పాండవులు ప్రచ్ఛన్నవేషులై విరటుప్రోల
సిియించినవారు గావలయు."

యిట్లు పాండవులు విరటుప్రోల నుండుటను దుర్యోధనుఁడే
యుంచి, విరటుం డెప్పుడు ప్రతిభటుండయి భంగించు మండుఁ గావున
పయి నెత్తిపోయిన ధర్మతనయుండును, దమ్ములు నడ్డపడం బజ
సరనియు, నయ్యవసరంబున సమయభంగంబు సెప్పి వారలం
మఱం బండ్రెండు సంవత్సరంబులు వనవాసంబు సలుపఁ బుచ్చ
ననియు, మత్స్య పతి సమస్తవస్తువులును జూఱకొనవచ్చుననియు,
ంగుల నప్పటి కదియే కార్యంబని దుర్యోధనుఁడే కార్యనిశ్చయము
ట్లు చెప్పఁబడియున్నది. ఈ యూహ, కార్యనిశ్చయము దుర్యో
డు చేసినట్లు ప్రాచీనమూలప్రతులలో గాని, యుత్తరదేశప్రతు
ఁగాని లేదు. దక్షిణదేశ ప్రతులలో మాత్రమే కలదు. ఈ దక్షిణ
పతులలోనైనను, "పితామహుం డుపదేశించినలక్షణము" ఇత్యాది
న వచనములోని యర్థము, అనఁగా దుర్యోధనుని యూహను
ించు భాగ మొక్క-తెలుఁగుప్రతులలోనే గానవచ్చుచున్నది.
న దక్షిణదేశప్రతులలోఁ గూడ లేదు. దీనినిబట్టి యీ ప్రక్షిప్త
ములు క్రమక్రమముగాఁ జేర్పఁబడుచువచ్చిన ట్లూహింపఁదగి
ది. తిక్కన రచన ననుసరించియే దక్షిణదేశప్రతులలో దుర్యో
డీయూహ చేసినట్లుగా నున్న భాగ మొకకాలమునఁ జేర్పఁబడఁగా,
ంతకాలమునకు తిక్కనభాగములో మఱియొకవిషయము విడిచి
బడియుండుటను జూచి తెలుఁగుప్రతిలో

" పితామహేన యే చోక్తాః దేశస్యచ జనస్యచ,
గుణా స్తే మత్స్యరాష్ట్రేషు బహుశోపి మయా శ్రుతాః.

విరాటనగరే రమ్యే పాండవా శ్ఛన్నచారిణః,
నివసన్తి పురే రమ్యే తత్ర యాత్రా విధీయతాం."

అను శ్లోకములు కూడ నెవరిచేతనో చేర్పఁబడినవి. అట్లు గానిచో నొక్క తెలుఁగుప్రతిలో మాత్రమే యీ శ్లోకములు కనఁబడుచు తక్కిన దక్షిణదేశప్రతులలోఁ గానరాకుండుటకుఁ గారణ మగపడదు. తెలుఁగుమూలప్రతిలో నున్నదానికే తిక్కన భాషాంతరీకరణము చేసినాఁ డన్నచో, తిక్కనకాలమునకే మూలప్రతిలో నీ భాగ మిట్లే యుండియుండవలసినదిగదా. అట్లే యైనచో నుత్తరదేశప్రతులలో నొక్కదానిలోనైన వీనినిపోలిన శ్లోకములు గానరాకుండుటే గాక, దక్షిణదేశప్రతులలోఁ గూడ నిన్ని భిన్నపాఠము లేర్పడుటకుఁ గారణ మగపడదు.

ఇట్లుపకీచకుల వధయు, పాండవుల యునికినిగూర్చి దుర్యోధనునియూహయు, విరటునిపై నెత్తిపోవువిషయమున నిశ్చయమును, దానిమూలముగా జరిగినదక్షిణగోగ్రహణము, నివియన్నియు రెండవ యాశ్వాసమున "కీచకుఁడు చచ్చిన పిమ్మటఁ బుట్టిన విశేషములే" యగుచున్నవి. మూఁడవ యాశ్వాసమునఁగూడ మొదట నుపకీచకులఁ జంపినవాఁడును తుదకు దక్షిణగోగ్రహణ సందర్భమున శత్రువుచేఁ జిక్కిన విరటుని విడిపించి సుశర్మను ప్రాణావశిష్టునిగఁ జేసినవాఁడు నగు భీముఁడే ప్రధాననాయకుఁ డగుచున్నాఁడు. భీమునిచేఁ జిక్కిన సుశర్మను సపరివారంబుగా విడిపించి యుధిష్ఠిరుఁడు విరటాదులతోఁగూడి యాయుద్ధరంగమును జూచుచు చంద్రికాసుందరంబగు నొక్క సైకత

స్థలమున నారాత్రి పుచ్చెనని చెప్పుచు నాదినచర్యతో నాయాశ్వాస మును తిక్కన ముగించినాఁడు. మూఁడవయాశ్వాస మిట్లు భీముఁడు నాయకుఁడుగాఁ గలదై దక్షిణగోగ్రహణముతో ముగియుచున్నది. మఱియు నజ్ఞాతవాసమున జరిగిన భీముని కీచకవధనుబట్టి దుర్యోధ నుఁడు చేసిన యూహామూలముగా, నైదాశ్వాసములుగల యీపర్వ మునందలి మొదటి రెండాశ్వాసములకును, అర్జునుఁడు నాయకుఁడుగాఁ గలిగిన తుదిరెండాశ్వాములకును నీమూఁడవయాశ్వాస మొకవిధమగు సంధిని గూర్చు కొలికి (link) వలె నున్నది. అంత జనమేజయుఁడు మఱునాఁటి వృత్తాంతమును జెప్పుమనుటయు, నామఱునాఁటి సూర్యోద యకాలముననే జరిగిన వృత్తాంతముతో నాల్గవయాశ్వాసము ప్రారంభిం పఁబడినది. ఇందుత్తరగోగ్రహణమే ముఖ్యాంశము. అర్జునుఁడు నాయ కుఁడు. ఉత్తరగోగ్రహణము, అర్జునునిచే హానిమోక్షణమును మాత్ర మే వర్ణించి గోగ్రహణకథాకథన మాత్రముచే నీయాశ్వాసమున వస్త్వైక్య మును సాధించినాఁడు. యుద్ధప్రారంభము మాత్రము సూచింపఁబడినది. దేవతలు, పాండురాజు అర్జునుని యుద్ధమును జూచు వేడుకతో వచ్చి యాకసమున నిలిచియున్నట్లు వర్ణింపఁబడినది. ఇట్లు సన్నాహమం తయు నిందుఁ జేయఁబడినను యుద్ధముమాత్ర మైదవయాశ్వాసమున వర్ణింపఁబడినది. ఈ దేవతల యాగమన ముత్తరదేశీయప్రతుల పాఠ ములోఁగాని,దక్షిణదేశపాఠములోఁగాని యిచ్చట లేదు. కొంతయుద్ధము జరిగినపిదప, అనఁగా నర్జునుఁడు కర్ణ, ద్రోణ, ద్రోణపుత్ర, కృపాదు లతోఁ జేసినయుద్ధ మైనపిదప, భీష్మునితో యుద్ధము చేయఁబోవు సంద ర్భమున జరిగినట్లుగా నొకప్రత్యేకాధ్యాయములో వర్ణింపఁబడినది. అచ్చట భీష్మునితో నర్జునుఁడుచేయు యుద్ధమును జూచుటకే దేవతలం దఱు వచ్చినట్లు చెప్పఁబడినది. కాని తిక్కనార్యుఁడు యుద్ధప్రారం భమునకుఁ బూర్వముననే

" అరుదుగ నిట్టు లొక్కనికి నంతబలంబునకుం మహోగ్రసం
గర మగుడుం మనం బతులకౌతుక మొంది కనుంగొనం సురే
శ్వరుఁడు సుదర్శనం బనఁ బ్రశంసకు నెక్కువిమాన మెక్కి యం
బరగతి వచ్చె దేవమునిపంక్తులు సిద్ధగణంబుఁ గొల్వఁగాఁ."

అని దేవతలయాగమనమును గూర్చి చెప్పుటయే గాక, స్వర్గమున మన్న రాజులును, జక్రవర్తులునుగూడ వచ్చిరనియు, నందు

" పాండుమహీపాలుం డా
ఖండలు చేరువున పెద్దగద్దియ నమరీ
మండలి వీఁపు లిడఁగ
నుండి కనుంగొనుచునుండె నుజ్జ్వలభంగిన్."

అని పాండురాజుకూడ వచ్చి కనుంగొను చున్నట్లుగాఁ దెలిపి యున్నాఁడు. ఈ పాండురాజాగమన ముత్తరదేశప్రతులపాఠమున నే గాక దక్షిణదేశప్రతులలోఁగూడ కానరాదు. కాని ప్రాచ్యలిఖితపుస్త కాలయమున బ్రౌన్ దొరగారిచే సంపాదితమగు తెలుఁగు లిపిలోనున్న సంస్కృత భారతప్రతిలో మాత్రము కనఁబడుచున్నది. ఇది తిక్కనా ర్యుని రచననుబట్టి చేర్పఁబడియుండు ననుటకు సందేహము కనఁబడదు. పసులు పట్టుపడుటచే నర్జుననకు కౌరవసేనతోఁ గలిగిన యుద్ధము, దానిఫలితముగా నర్జుననివిజయము, పాండవులు బయలువడుట, దానిఫలి తముగా నుత్తరావివాహము, నివి యన్నియు నైదవయాశ్వాసమున వర్ణింపఁబడినవి. ఇట్లీపర్వమును వివాహముతో మంగళాంతముగఁ జేయుచు, తిక్కనామాత్యుఁ డీపర్వమునందలి పాండవుల యజ్ఞాత వాసకథ నైదాశ్వాసములుగ విభాగించి మూలమునకంటె రమ్యతరం బగునటుల పూర్వోత్తరసందర్భానుకూలముగ సమకూర్చి రచించుటలోఁ దనయసమానకళాచాతుర్యమును జూపియున్నాఁడు.

విదాశ్వాసముల యీ ప్రబంధమునందలి కథకంతకును (సామాన్యముగా భారతకథకంతకునువలె) ద్రౌపదియే — ఆమె కజ్ఞాతవాస సమయమునఁ గలిగిన పరాభవం బె_మూలకారణం బగుటచే, నావిషయమును మొట్టమొదటనే సూచ్యార్థసూచనగా సూచించువాఁడు వోలె,

"మహిత సముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యు లంగనా
సహితముగాఁగ నేమిగతి సమ్యగుపాయ నిగూఢవృత్తిమై
యహితుల కప్రభేద్యమగు నాపదుమూఁడగు నేఁడు మత్పితా
మహులు చరించి రంతయుఁ గ్రమంబున నాకెఱుఁగంగఁ జెప్పుమా.

అని జనమేజయుఁ డడిగినట్లు చెప్పినాఁడు.

ఇంతే గాక యీ పద్యమునం దీ విరాటపర్వ గ్రంథముచే సాధింపవలసియున్న "పాండవు లజ్ఞాతవాసదీక్ష నెట్లు గడపి, తమ మాటను నెగ్గించుకొనియుందురు" అను సమస్యగూడ సూచింపఁబడి యున్నది. పాండవు లొకరు నిద్దరు కారు, ఐదుగురు. వీరు సామాన్యులు కారు, మహితసముజ్జ్వలాకృతులు. వీరి యాకారము, తేజస్సును బట్టియె చూచినవా రెవరైన వారిని గుర్తింపవచ్చును. మఱియు నెట్లో రహస్యముగ నెవ్వరియొద్దనో చేరి కాలము గడపుకొందు రనుట కైనను వీరు మానధనులు, జనమాన్యులు. మఱియు వీ రంగనాసహితులు గూడనై యుండిరి. ఐదుగురు పురుషులు, నొకస్త్రీయుఁ గలసియుండి నచో వీ రెట్టిమాఱువేషముల నున్నను, ఇట్టి విపరీతసంబంధము పాండవులకుఁ దక్క నితరులకు లేదు గావున, వీరి రహస్యము బయలుపడకుండ నుండుట సాధ్యము కాదు. కావున నహితుల కప్రభేద్యమగు నాపదుమూఁడగు నేఁడు గడపుట యెంతెంతదుష్కరము. ఇట్లిన్ని చిక్కులతోఁ గూడుటచే దుష్కరమైన యీ యజ్ఞాతవాసము నెట్లు గడిపి బయలు

వడిరి యనునదే యీ పర్వమునందలి ముఖ్యవిషయము. ఆ సమస్యనే యీపద్యమున తిక్కనార్యుఁడు సూచించినాఁడు. ఇందలి చిక్కులకు ద్రౌపదియే ముఖ్యకారణంబనియు సూచించినాఁడు. పాండవులను గూర్చిన యీ విశేషణములు గానిఁ వారంగనాసహితులగుట గాని యుత్తర దేశప్రతులలో లేవు. అందు

" కథం విరాటనగరే మమ పూర్వపితామహాః,
అజ్ఞాతవాస ముషితాః దుర్యోధనభయార్దితాః."

అని మాత్రమే కలదు. అక్కడ దుర్యోధనునివలనైన భయమే జనమేజయుని బాధించినట్లు కనఁబడుచున్నది గాని, "మహితసముజ్జ్వలాకృతులు మానధనులు, జనమాన్యులు" నగు పాండవులు బయలుపడకుండఁగా నజ్ఞాతవాసకాలము నెట్లు గడపియుందురా యను సందేహము కలిగినట్లు లేదు. కొన్ని దక్షిణదేశప్రతులలో ద్రౌపదీప్రశంసమాత్రము కలదు. దుష్టులవలన నీమె కెట్టి బాధయు లేకుండ, వీరల నీ యజ్ఞాతవాసకాలమున బయలుపెట్టి మరల నరణ్యవాసమునకుఁ బంపునుద్దేశముతో దుర్యోధనుఁడు చేయుప్రయత్నములచే నెట్టిబాధయుఁ బొరయకుండ, నెట్లహితుల కప్రభేద్యమగు నీ పదుమూఁడగు నేఁడు చరించిరి అని ప్రశ్న. దానికి వెంటనే ప్రత్యుత్తరముగాఁ బంగ్రెండవయేఁటి కడపటఁ "దమకు ధర్మదేవతా సమాగమం బయినఁ దత్ప్రసాదంబున నజ్ఞాతవాసంబునకు భంగంబు గాకుండ వరంబు వడసి" అని తెలుపుచు తిక్కన యరణ్యవాసాంతమున జరిగిన కథ నించుక తడవినాఁడు. ఇట్లీ ప్రశ్న మూలముగా ముందుకథను సూచించుచు, వెనుకటికథనుగూర్చి యించుక జ్ఞాపకముచేయుట కవకాశము కల్పించుకొనినాఁడు. ఈ తిక్కన రచనమునుబట్టియే దక్షిణదేశప్రతులలో నంగనాసహితేత్యాది విశేషణము లెక్కియుండవచ్చును.

ఈ విరాటపర్వమున ద్రౌపదీపరాభవమునకు తిక్కన ప్రాధాన్యము నిచ్చినాఁడనుట నిశ్చయము. కన్నడభాషారచితంబగు పంపకవి కన్నడ భారతమునఁ గీచకునిగూర్చిన వృత్తాంతమే లేదు. భీముఁడు మల్లయుద్ధములో దుర్యోధనుని మల్లుఁడగు విమఖర్పరుఁ డనువానిని జంపుటచే దుర్యోధనునికి పాండవావాసమును గూర్చి యనుమానము కలిగినట్లుగాఁ జెప్పఁబడియున్నది. కాని యీ కీచకవధ ఘట్టమును సందర్భానుసారములగు మార్పులతో నత్యంతరమ్యముగాఁ జేసి యొక ప్రబంధముగా రచించినాఁడు తిక్కన. కావున దక్షిణదేశప్రతులలోఁ జేరిన ప్రక్షిప్తభాగములకు తిక్కన రచనలే మూలములై యుండవచ్చునని తోఁచుచున్నది. తిక్కన యేమి చెప్పినను, దేనిని వర్ణించినను, పూర్వోత్తర సందర్భము, పొందిక, ఔచిత్యమును పాటింపక చేయఁడు. ఉత్తరదక్షిణదేశప్రతుల పాఠములు భేదించినచోట దక్షిణదేశప్రతులలో తిక్కనరచనలను బోలిన భాగములు కనుపట్టు స్థలములం దిట్టిపొందిక, పూర్వోత్తర సందర్భము లేక మూలము తికమకగా నున్నట్లగపడుచున్నది. ఇందుకుఁ గథానుసారముగాఁ గొన్ని సందర్భములను పరిశీలింతము.

## పాండవ ప్రవేశము

యుధిష్ఠిరుఁడు విరాటనగరమున, దాను ప్రవర్తించు రీతిని గూర్చి తెలుపుచు

"కంకో నామ ద్విజో భూత్వా
మతాక్షః ప్రియదేవినః"

అని ద్విజుఁడనై ప్రవేశింతు నన్నట్లు బండార్కరు పరిశోధనాలయమువా రాదరించిన పాఠమునఁ గలదు. ఇం దెచ్చటనుగూడ

నీతఁడు యతిగాఁ గాని, పరివ్రాజకుఁడుగాఁ గాని కనఁబడఁడు. కాని దక్షిణదేశప్రతులలో

" సభాస్తారో భవిష్యామి విరాటస్యేతి మే మతిః
(తస్య రాజ్ఞో మహాత్మనః-పాఠాంతరము)
కంకో నామ బ్రువాణోహం మతాక్షః సాధుదేవితా
వైడూర్యాన్ కాంచనాన్ దాన్తాన్ స్ఫాటికాన్ రాజతానపి"

* * * * * *

* * * * * *

దేవిష్యామి యథాకామం సపహారో భవిష్యతి."

అని యుత్తరదేశప్రతులతో పోలికగల నాలుగైదు శ్లోకముల తరువాత మరల

"కంకో నామ్నా పరివ్రాట్ చ విరాటస్య సభాసదః
జ్యోతిషే శకునజ్ఞానే నిమిత్తే చాక్షకౌశలే
బ్రాహ్మే వేదే మయాధీతే వేదాఙ్గేషు చ సర్వశః
ధర్మకామార్థమోక్షేషు నీతిశాస్త్రేషు పారగః
పృష్టోహం కథయిష్యామి రాజ్ఞః ప్రియతమం వచః
విరాటనగరే ఛన్న ఏవం యుక్తః సదా వసే."

అని మఱి నాలుగు శ్లోకములు కలవు. ఇవి యుత్తరదేశప్రతులలోఁ గాని, బండార్కరు పరిశోధనాలయపు పాఠమునఁగాని లేవు. మొదట నొకసారి 'కంకోనామ, ద్విజోభూత్వా" అని ఉత్తరదేశప్రతులలోనున్న ప్రాచీనతరంబగు పాఠమునకు మరల 'కంకోనామ పరివ్రాట్ చ' ఇత్యాదిశ్లోకములను జేర్చినవారు పైదానిని 'కంకోనామ బ్రువాణోహం' అని దిద్దినట్లు కనఁబడుచున్నది. ఈ రెండవసారి చేర్పఁ

బడినట్లుగాఁ గనఁబడుచున్న శ్లోకార్థము తిక్కనార్యుఁడు "సన్న్యాసి
వేషమున రాజన్యునిగని" అని రచించిన భాగముతో సరిపోవుచున్నది.
వ్యాజుఁడుగానైన ధర్మజుని తిక్కనయే సన్న్యాసిగా ముందు చేసినాఁడో,
లేక అంతకు పూర్వమే యాతఁడు పరివ్రాట్టైనాఁడో నిశ్చయించుట
కష్టమే యైనను, సంస్కృతమూలము కొన్నిచోట్ల పూర్వోత్తరసంద
ర్భము లేక చెప్పినదే మరల చెప్పినట్లుండుటచే, ధర్మజుఁడు మొదటనే
యనఁగా తెలుఁగుభారతమున సన్న్యాసియై, పిదపనే కొన్ని సంస్కృత
ప్రతులలోఁ బరివ్రాట్టుగ నయ్యెనేమో యని సందేహము కలుగు
చున్నది. పిదప వేషయోజన విషయ ముత్తరదేశపాఠములో నేమియు
లేదు. అస్త్రములను శమీవృక్షమునఁ బెట్టిన పిదప,

"ఆ జగ్ముర్నగరాభ్యాశం పార్థాః శత్రునిబర్హణాః,
జయో జయన్తో విజయో జయత్సేనో జయద్బలః,
ఇతి గుహ్యాని నామాని తేషాం చక్రే యుధిష్ఠిరః."

అనిమాత్రమే కలదు. దక్షిణదేశప్రతులలో కృతాంజలియై ధర్మ
దేవతను స్తుతించినపిదప,

"స వై ద్విజాతి స్తరుణః త్రిదండభృత్
కమండలూష్ణీష ధరో వ్యజాయత,
సురక్తమాంజిష్ఠవరాంబరః శిఖీ
పవిత్రపాణి ర్దదృశే త దాద్భుతం".

"తతో విరాటం ప్రథమం యుధిష్ఠిరో
దదర్శ దూరా త్తుసమృద్ధతేజసం."

అని యిట్లు ధర్మజునకు పరివ్రాజకరూపం బలవడినట్టును, విరా
టుని దూరముననుండి సభలో నున్నవానిగా నాతఁడు చూచెననియు

చెప్పఁబడినపిగప సభావర్ణనము రెండు మూఁడు శ్లోకములలోఁ జేయఁబడినది. కాని తిక్కన సులభముగా తేల్చివేసినాఁడు. పాండవాగ్రజునకు నున్నయునికిన సన్న్యాసిరూపం బలవడి ధాతుపటదండకమండలుకలితమూర్తి యయ్యె నని చెప్పినాఁడు. ఇంతే కాక, "వారివారి కర్హ్యవేషంబుల కనుగుణంబులగు నాభరణాదులు సన్నిహితంబు లగుటకు సంతసిల్లి యెల్లవారిం గలయం గనుంగొని క్రమంబున నొంటిమైఁ జనుదెండని నియోగించి, దైవయోగంబున విరాటుండు వెడలివచ్చి బయలికొలు విచ్చుటంజేసి తదాస్థానంబు చేరంబోయె" ననియు రచించుటచే తక్కినవారి విషయము మూలములో లేనిదానిని సందర్భోచితముగా గ్రహించి విరటుని దర్శన మంత సులభముగా నగుటకుఁ గారణముం బేర్కొనినవాఁడైనాఁడు. ఇట్టి స్వల్పవిషయములను సందర్భానుకూలముగ నా యా పాత్రల యల్పకృత్యములను (minute actions), హావభావాదులనుగూడ వర్ణించుచుండుటచేతనే తిక్కన కవితకు స్వాభావికతాగుణము విశేషముగా నబ్బినది. తక్కిన పాండవులకు వారివారివేషములకుఁ దగిన యాభరణాదులు సన్నిహితము లగుటను గూర్చి మూలములో నేమియు లేదు. కావుననే స్వభావసందర్భానుకూలముగ తిక్కనచేసినమార్పులను జూచి, ప్రాచీనప్రతుల పాఠమునకు విశేషభేద మగపడకుండునట్లుగా నచ్చటచ్చట కొన్నికొన్ని శ్లోకములనుమాత్రమే తరువాతివా రెవరో చేర్చియుందురని తలంపవలసి వచ్చుచున్నది. విరటుని సభను ప్రవేశించినపు డాతఁడు

"న చ ద్విజోయం భవితా నరోత్తమః
పతిః పృథివ్యా ఇతి మే మనోగతం."

అని యన్నట్లు ప్రాచీనపాఠము. దక్షిణదేశప్రతులపాఠములో

"స తేన పూర్వం జయతాం భవా నిహ
ద్విజాతి నోక్తో ఽభిముఖః కృతాంజలిః."

అని ద్విజాతి యనికలదు. పిదప ధర్మజుఁడు తననుగూర్చి చెప్పు నప్పుడుకూడ

"ద్విజో వ్రతేనాస్మి నచ స్వభావతః ప్రభో
కంకోహి నామ్నా విషయం తవాగతః
వ్రతీ ద్విజాతిః స్వకృతేన కర్మణా."

అనిద్విజాతిః యని మాత్రమే చెప్పుకొనిన ట్లున్నది. తిక్కన

"ద్విజుఁడఁ గురువిషయజాతుఁడ
సుజనప్రియుఁడైన ధర్మసుతుసఖుఁడఁ బరి
వ్రజనాశ్రమకలితుండ మ
నుజవల్లభయోగ్య బహువినోదకరుండన్."

అని మొదట తానువర్ణించినదాని కనుకూలముగా నాతని సన్యాసి రూపమును గూర్చి నొక్కి చెప్పుచున్నవాఁడువలె నున్నాఁడు. సంస్కృతము దక్షిణపాఠములో మొదట కంకోనామ 'పరివ్రాట్' అని యున్నను, తరువాత దానినిగూర్చి చెప్పఁబడలేదు.

సత్యమును పలుకుట విషయములో

"శ్రుతంచ శీలంచ కులంచ శంసమే,
సత్యప్రతిజ్ఞా హి భవంతి సాధవః."

అని దక్షిణదేశప్రతులలోఁ గలదు. బం. పరి. వారిప్రతిలో సత్యము పలుకుటనుగూర్చి యేమియు లేదు. తిక్కన యెంత గడుసుదనముగా పలికించినాఁడో చూడుఁడు : అన్నరవవరాగ్రణి కయ్యతిముఖ్యుఁ డి ట్లనియెనట :

"ఉన్నరూపు పలుకు నన్నరు లెక్కడఁ
గలరు తోఁచినట్లు పలుకి పలుక
నైనచంద మయ్యె నంతియ కా కంత
పట్టి చూడఁగలరె యెట్టివారు."

అని మందహాసంబు చేయుచు, మఱియు

" నానావిధ భూతమయము
మే నతిసంచలము మనము మెయికొని నిక్కం
బేనరునకు చెల్లింపం
గా నగు సత్యంబు నడపు క్రమ మ ట్లుండెన్."

కొన్ని దక్షిణదేశప్రతులలో గానవచ్చు

ఏవం బ్రువాణం తమువాచ పార్థివం
యుధిష్ఠిరో ధర్మ మవేక్ష్య చాసకృత్,
సత్యం వచః కో న్విహ వక్తు ముత్సహేత్ —"

ఇత్యాదివాక్యములు తిక్కన యనుసరించినప్రతిలో నున్నవేమో యని యనుకున్నను, తిక్కనరచన గుణవత్తరముగా నున్న దనుటకు సందేహము లేదు. "అని మందహాసంబు సేయుచు"; "అనుచు మత్స్యమహీవల్లభు నవలోకించి" ఇత్యాద్యభినయసూచనలచే సంభాషణకు స్వాభావికత్వగుణము (realistic nature) నాపాదించినాఁడు. భీమ నకుల సహదేవులు తాము ప్రవర్తించు రీతిని దెలుపు సందర్భమున నుత్తరదేశపాఠమునసే గాక దక్షిణదేశపాఠమునఁగూడ కనఁబడని, వా రవలంబింపఁదలఁచిన వృత్తులకు సంబంధించిన కృత్యములను గూర్చి తిక్కన విశేషముగా వర్ణించి యావృత్తులఁగూర్చి తనకుఁ గల విశేషజ్ఞానమును బ్రకటించినాఁడు.

ఇఁక ద్రౌపదివిషయమున ప్రత్యేకశ్రద్ధను వహించినవాఁడన వచ్చును. ధర్మజునిచే "నిడిగడు ముద్దరాలు" అను పద్యమున నెంతయు మృదువుగఁ బలికించినాఁడు. అప్పుడా తని చిత్తమున వెనుబాటంత యును బాయు వెరవుకలిమి యెల్లను దెలియునట్లుగా "సుచిత్రమగు భంగిని" పలికినదఁట ద్రౌపది:

"సైరంధ్రీవేషంబున
జేరుదు నంతఃపురంబు చెంతకు న న్నా
భూరమణు దేవి యెంతయు
గారవమునఁ బిలువ నంపఁగాఁ గందుఁ దగన్.

"కని కొలువు చేసికొని మా
లినినాఁ జని సాధ్వి యిది మలీమసవృత్తం
బునఁ బొంతఁ బోవ దెన్నఁడు
నను ప్రేకఁ దనంబు దోఁచునట్లు చరింతున్.

"గరువపుఁ బనులు నేర్చి చేయుదు నందున్."

అని యిట్టి "ప్రేకదనము - గరువపుఁబనులు" అను మాటలచేతనే ద్రౌపదీశీలమున కొకవిధమగు క్రొత్తగౌరవమును తెచ్చిపెట్టినాఁడు తిక్కన. భూరమణుదేవి తనను గారవమునఁ బిలువనంపినఁ గాని యామె యొద్దకుఁ దాను బోవఁడఁట. ఈవిషయము లేమియు నిచ్చటఁ గాని, యామె సుదేష్ణ యిలు చేరినపుడు గాని బం. పరి. వా రాదరించిన పాఠము లో చెప్పఁబడలేదు. యుధిష్ఠిరుఁ డచ్చట భార్యనుగూర్చి ప్రశంసించుట లో నెట్లు చెప్పెనో చూడుఁడు:

"ఇయం తు నః ప్రియా భార్యా ప్రాణేభ్యోఽపి గరీయసీ,
మాతేవ పరిపాల్యాచ పూజ్యా జ్యేష్ఠేవ చ స్వసా.

నహి కించి ద్విజానాతి కర్మ కర్తుం యథాస్త్రియః,
సుకుమారా సుబాలాచ రాజపుత్రీ యశస్వినీ."

"మాల్యాన్ గంధా నలంకారాన్ వస్త్రాణి వివిధానిచ,
ఏతా న్యేవహి జానాతి యతో జాతాహి భామినీ."

మూలమున ధర్మజుఁడు భార్యను గూర్చి పల్కుచు తల్లితో సామ్యమును దెచ్చుటయందలి యౌచిత్యము విచారణీయము. ఈసందర్భమున మాల్యగంధాదులను తిక్కన తలపెట్టలేదు. కాని యామె చెప్పు నుత్తరములో నింటలిసూచనను గ్రహించి కాఁబోలు, "కలశంబు లభినవగంధంబులుఁగఁ గూర్చి" యను నొక సీసపద్యమున నతిరమ్యముగా నామెచేఁ బలికించినాఁడు పిదప ధర్మజుఁడు

"యథా న దుర్హృదః పాపా భవంతి సుఖినః పునః,
కుర్యా స్తథా త్వం కల్యాణి లభుయేయు ర్న తే యథా."

అని చెప్పఁగా ద్రౌపది బదులు పలికినట్లే లేదు బం. పరి. వారి పాఠములో. కాని తిక్కన " యాజ్ఞసేని యనాగత మందస్మిత సుందర వదనారవింద యయి,

"ఆరయ నెందును గౌరవ
భారం బెడలంగనీక పాతివ్రత్యా
చారము మై వర్తింతురు
సైరంధ్రీజాతివారు సౌజన్యమునన్"

అని తన గరువతనమునకుఁ దగినట్లుగా,—— నీతఁడు తనవిషయమై పాపభయమును శంకించి యిట్లు పలుక నవసరమే లేదన్నట్లుగా బదులు చెప్పినది. ఈ గరువతనమునకుఁ దగినట్లుగాఁ దనంతటఁ దానే పోయి సుదే

ష్ణను గొలుచుటకు బదులు “భూరమణీదేవి యెంతయుఁ గౌరవమునఁ బిలువ నంపఁగాఁ” బోవుదునని యిచ్చట పలికించిన దానికి సరిగా నుండు న ట్లామె ద్రుపదపురము సొచ్చి పౌరజనంబులు దన్ను ముసురుకొని వచ్చుచుండ రాజమందిరము చక్కటి కరుగుసమయంబున సుదేష్ణ తజ్జాలకములనుండి చూచి కుతూహలంబున

“ఎక్కడనుండి యెక్కడకు నేఁగెడినో యిది యొక్కకాంత రూ
పెక్కుడు పెంపు సొంపు మన కేర్పడుచున్నది దా వినీతయై
స్రుక్కుచు నీచభామినులచొప్పున బల్కెడుఁ బౌరులం గడున్
వెక్కస మంది చూచెదరు వేగమ తోడ్కొని రండు నెమ్మితోన్.

“అని పలికి పనుపఁ బ్రౌఢాం
గన లిరువురు పోయి ద్రుపదకన్యకతో ని
ట్లనిరి విరటమహిషి నినుం
దనపాలికిఁ బిలువఁ బంపె దయ పెంపెసఁగన్.

“అనవుడు

“తనతలసీర యరసి య
వ్వనితారత్నంబు వినయవైభవము సతీ
తను వొందిన చందంబునఁ
జనియెం గేకయసుతానుచారికలఁబడిన్.”

అని వెనుక తాను చెప్పినరీతినే సుదేష్ణచే పిలిపించుకొనియే యచ్చటకుఁ జనినట్లుగా తిక్కన చూపినాఁడు. ఇంతే గాక, “తాను జొచ్చినకతన మత్స్యక్షితీశునింట నిమ్మెయిఁ గ్రొత్తయొప్పెసక మెసఁగ నట్లుగా నీసుదేష్ణయొద్దకుఁ జేరఁగా నామె

"కనుఁగొని గారవంబును మొగంబున కేలఁ బురః ప్రసారమున్
దనువున నమ్రభావమును దంతమరీచుల సామినిగ్గమున్
బును దమలోఁ గడల్కొనఁగ భూరితరాదరశేఖ నిందు ర
మ్మనవుడు నంతనంత ద్రుపదాత్మజ నేరి వినీతి నిల్చె"నఁట.

ఈమె ద్రౌపదీ వదనముదోఁచు తన బాహ్యప్రవర్తనము (deportment) చేతనే యెట్టిగౌరవము, నాదరము సుదేష్ణవలననుండి తాను పడయుదునని చెప్పినదో, అట్టి గౌరవాదరములను పొందుటయే గాక, సుదేష్ణయాసమయమున 'నాపాదమస్తకము తద్రూపము వీక్షించుచు' నెట్టి నివ్వెఱపాటుఁ జెందినదో చక్కఁగ వర్ణించినాఁడు. ఈ భాగము చదివినంతనే యాద్రౌపది గంభీరప్రవర్తనము, సుదేష్ణ నివ్వెఱపాటు గల యాచిత్ర మంతయుఁ గన్నులకుఁ గట్టినట్లుగా నుండును. మూలములో బం. పరిశోధనాలయమువారి పాఠములో

" సైరంధ్ర్యో రక్షితా లోకే భుజిష్యాః సన్తి భారత్,
నైవ మన్యాః స్త్రియః సన్తి ఇతి లోకస్య నిశ్చయః,
యుధిష్ఠిరస్య గేహేఽస్మి ద్రౌపద్యాః పరిచారికా,
సుదేష్ణాం ప్రత్యుపస్థాస్యే రాజభార్యాం యశస్వినీమ్
సా రక్షిష్యతి మాం ప్రాప్తాం మా తేఽభూ ద్దుఃఖ మీదృశమ్."

అని మొదట ద్రౌపది చెప్పినట్లును, తరువాత సుదేష్ణ

" సా సమీక్ష్య తథారూపా మనాథా మేకవాససామ్,
సమాహూయా బ్రవీ ద్భద్రే కా త్వం కిం చ చికీర్షసి."

అనాథయగు నామెను జూచి సుదేష్ణ తానే పిలిచిన దనియు మాత్రమే కలదు. తిక్కన ద్రౌపదియొక్క గురుపతనమునకు – నీమూలమునందలి 'యనాథ' యగుద్రౌపదికి—నాదృశ్యమునకు నీకథనమునకు

సంప్రవ్యత్యాస మున్నదో పరికింపుఁడు. ప్రాచీనప్రతులలో నంతమాత్ర మే యుండఁగా, మొదట ద్రౌపది తనను పిలిపించునట్లుగాఁ జేసికొని పోయెదనని చెప్పినదానికి సమానార్థము గలభాగము దక్షిణదేశప్రతుల పాఠములోఁగూడ లేక యే యుండ, ఇక్కడమాత్రము ప్రాచీనప్రతులలో లేనట్టియు, తిక్కనభాగమునకు సరిపోవునట్టియు శ్లోకములు రెండు చేర్పఁబడినవి.

విరాటభార్యా తాం దేవీం కారుణ్యా జ్జాతసంభ్రమా,
సంప్రేషయ త్సమీపస్థా స్స్త్రియో వృద్ధాశ్చ తత్పరాః;
అపనీయ తత స్సర్వా ఆనయస్వ మిహైవ తాం."

ప్రాచీన ప్రతులలో నీవిషయము లేకుండుటచే నిది ప్రక్షిప్త మనక తప్పదు. తిక్కనను జూచి రచింపఁబడిన దైనను గావలయుఁ లేదా యిచ్చట యిట్లుండుటఁ జూచి తిక్కన ద్రౌపదిశీలమును గుణవ త్తరముగాఁ జేయఁదలఁచినవాఁడు గావున దీనికిఁ దగినట్లుగా మొదట కూడ ధర్మజునితోఁ బలికించినాఁడని యైనను జెప్పనలసి యుండును. తిక్కన తెలుఁగు రచనలోవలె పూర్వోత్తరసందర్భములకు సంస్కృత మూలములో పొందికమాత్రము లేదనుట స్పష్టము. తిక్కన ద్రౌపదీ సుదేష్ణల శీలములను పనిపట్టి యాయాసందర్భముల కనుకూలమగు నట్లుగా పోషించుచు వచ్చి, మూలమునందుకంటె నతిరమ్యముగాఁ జిత్రించినాఁడు. మూలమునందలి ద్రౌపదికి తిక్కన ద్రౌపదియొక్క గరువతనంబుగాని, యందలి సుదేష్ణకు తిక్కనసుదేష్ణకుఁ గలశాఠ్యము, గడుసుదనము గాని లేవు. నీవెవ్వరవని సుదేష్ణ యడిగినపుడు ద్రౌపది బదులుచెప్పినరీతి గమనింపుఁడు. వెనుక ధర్మజుఁడు 'ఉన్నరూపు పలుకు నన్నరు లెవ్వరు-అంత-పట్టి చూడఁ గలరె యెట్టివారు' అని చమత్కారముగాఁ బలుకుచు,

"ద్యూతక్రీడకుఁ గొండొక
చేతం గపటమున నొవ్వ నిజనంబులు నా
చేతిధన మెల్లఁగొని పరి
భూతి యొనర్చిన విరక్తి పొడమి వెడలితిన్."

అని వాస్తవార్థమే యెట్లు బయటపెట్టెనో, అట్లే ద్రౌపదియు నిచటఁ దనచమత్కార గూఢభాషణముచేఁ దనయున్నరీతి నంతయు బయలు వెట్టినది.

"నేను సైరంధ్రీజాతి సంభూత నభిధానంబున మాలిని. పురుషపంచకసనాథనై యుండుదు. నొక్క కారణంబున నుద్ధతులగు విరోధులచేతం బతులసన్నిధిం బలపట్టి యీడ్వంబడి వనంబున కరిగి వ్రతంబుమై వల్లభసహితంబుగా వన్యాహారంబులం గాలంబు గడపుచు బ్రహ్మచర్యంబు నడిపితి. నిటమీఁద నియమాచరణంబునకు నొక్క సంవత్సరంబు గొలంతి గలదు. నీవు ధర్మవర్తినివని వినుటంజేసి నా నేర్చుపనులవెంట నీకడ నిలువందలంచి యిందు వచ్చితి" నని పలికినది. ఏది కుల మేది నామము—అని సుదేష్ణ యడిగినదానికి సమాధాన మిది. అప్పుడు సుదేష్ణ నీవు సురగరుడఖచరవిద్యాధరతరుణలలో నొక్కతెవై యుండుదువు, బొంకక చెప్పు మనుటయు, దరహసితముతో పాంచాలి "నాకుఁ బ్రాణంబు ప్రాణమై నన్నుఁ దన్నుఁ గాఁగఁ భావించి యా దేవి గారవించు"నని చెప్పినది. ఉత్తరదేశప్రతులలో నీసంభాషణక్రమ మిట్లు లేదు. మొదటనే

"కా త్వం బ్రూహి యథా భద్రే నాసి దాసీ కథంచన,
యక్షీవా యదివా దేవీ గంధర్వీ యది వాప్సరాః,"

అని యడుగఁగా,

"నాస్మి దేవీ న గన్ధర్వీ నాసురీ నచ రాక్షసీ,
సైరంధ్రీతు భుజిష్యామి సత్య మేత ద్బ్రవీమి తే.

అరాధయన్ సత్యభామాం కృష్ణస్య మహిషీం ప్రియామ్,
కృష్ణాంచ భార్యాం పాండూనాం కురూణా మేకసుందరీమ్.

సూలినీత్యేవ మేనామ స్వయం దేవీ చకార సా,
నాసా మభ్యాగతా దేవి సుదేష్ణే త్వన్నివేశనమ్."

అనిమాత్రమే చెప్పినట్లున్నది. దక్షిణ దేశప్రతులలోఁ గూడ నీపంభాషణక్రమ మేమియు మారకయున్నదిగాని, "నాస్మి దేవీ న గన్ధర్వీ" యనుపద్యము తరువాతనే,

"సైరంధ్రీనామ మేజాతి ర్వన్యమూలఫలాశనా,
పతీనాం ప్రేక్షమాణానాం కస్మింశ్చి త్కారణాంతరే
కేశపాశే పరామృష్టా సాహం త్రస్తా వనం గతా"

అని పైన తిక్కనార్యుని తనునలోని భాగమందలి యర్థమంతయుఁ జెప్పఁబడినది. పిదప

"మాలినీత్యేవ మే నామ స్వయం దేవీ చకార సా"

అనుపాదము తరువాత నాకుఁ బ్రాణంబు ప్రాణమె. యన్నదానికి సమముగా

"కృష్ణా కమలపత్రాక్షీ సా మే ప్రాణసమా సఖీ"

అను పాదమున్ను, తరువాత

న చాహం చిర మిచ్ఛామి క్వచి ద్వస్తుం శుభాననే,
వ్రతిం కిచ్చైత దస్మాకం కులధర్మోయ మీదృశః.

... ... ... ... ...

... ... ... ... ...

శ్రుణోమి తవ సౌశీల్యం భర్తు ర్మధురభాషిణి

> మాహాత్మ్యంచ తతః శ్రుత్వా బ్రాహ్మణానాం సమీపతః
> త్వా ముపస్థాతు మిచ్ఛామి తత శ్చాహ మిహాగతా"

అను నైదారుశ్లోకములు కలవు. దీనినిబట్టి మూలపాఠములోని శ్లోకములమధ్య నచ్చటచ్చట సందర్భానుకూలముగా తిక్కనార్యుని రచనలోని యర్థముకూడ గ్రహించి పొదుగఁబడినట్లు కనఁబడుచున్నది. తెలుఁగురచనలోని సంభాషణక్రమమునకును మూలమునందలి దానికిని విశేష భేదము కలదు. తిక్కన రచించిన సంభాషణములలో నొకవిధమగు సక్రమత, పూర్వోత్తరసందర్భము, శీలానుగుణంబు లగు హావభావాదుల సూచనలు, ఉద్దేశానుక్రమంబగు రచనావిధానము (systematic arrangement of ideas with a motive behind it) మొదలగు విశేషగుణంబులు మూలములో లేనివి గాన వచ్చుచుండును. ఈ ద్రౌపదీసుదేష్ణల సంభాషణమే యిందుకు నిదర్శనముగా గ్రహింపవచ్చును. ద్రౌపదిని చూచినతోడనే సుదేష్ణకుఁ దెలియకుండఁగనే మొగంబున గౌరవంబును, గేల పురఃప్రసారముం, దనువున నమ్రభావమును, దంతమరీచులసామి నిర్గమంబును దమలోఁ గడలుకొనినవి. అప్పు డత్యంత కుతూహల మడరఁగా నీ కుల మేది, నామ మెయ్యది యని యామె ద్రౌపదిని ప్రశ్నించినది. ద్రౌపదియుఁ దాను సైరంధ్రీజాతిసంభూతనని చెప్పి, తనవృత్తాంతమంతయుఁ దానేకారణములచే నచ్చటికి వచ్చినదియు తెలిపినది. ఆవిషయము సుదేష్ణ నమ్మలేక సురకన్యవో, గంధర్వవిద్యాధర కన్యలలో నొక్కతెవో బొంకక చెప్పుమన్నది. ద్రౌపది "దరహసితము మోమునకు దొడవుగాఁగ" తాను సత్యభామాపాంచాలులయొద్ద పరిచారికగా నుండునని చెప్పి, 'యిట్లు దైవజాతియను సందియము వాయంగఁ బలికిన'దఁట. తిక్కన ఎక్కడికక్కడ సంభాషణక్రమమందలి యుద్దేశముల నెట్లు సూచించుచుండునో గమనిం

పుఁడు. తాను పరిచారికనని చెప్పినంతమాత్రముచే దన్ను సామాన్యపరి
చారికగాఁ దలంపవలదనియు, పరిచారికాధర్మములకెల్లఁ జాలి వర్తించి
నను, పాంచాలి తొల్లి "నన్నుఁ దన్నుగా భావించి గారవించినదే" గాని
నీచపుపనులకుఁ జొనుప లేదనియు, నట్లే

"నీవును

"నీచము లయ్యెడు పనులకు
నాచాలమి యెఱిఁగి మన్ననఁ బాత్రముగా
నీచిత్తంబునఁ గైకొని
యాచారము దప్పకుండ నరయుము నన్నున్."

అని తాను పరిచారిక గదా యని సుదేష్ణ యొకవేళ నీచపుఁ బను
లకుఁ బంపునేమోయని ముందుగనే సందేహించిన దానిఁబోలెఁ దానెట్టి
నీచపుఁబనులను జేయుదానను కానని స్పష్టముగాఁ జెప్పినది. ఈవిష
యము సంస్కృతములో నెచ్చటను గానరాదు. నీచపుఁబనులుగాక
యిఁకనెట్టిపనులను చేయఁదలంచినదో "మఱియును" నిట్లు చెప్పినది:—

"కలపములు గూర్ప బహువిధ
తిలకంబులు వెట్ట నింత తెఱవునఁ బలుపు
వ్వులు గట్టఁ గట్టి యొప్పుగఁ
దల ముడువఁగ సరులు గ్రువ్వఁ దద్దయు నేర్తున్."

ఇట్లిచ్చట తిక్కన పొడిమాటలతోడనే పలికించినాఁడు గాని
వెనుక ధర్మజునితోఁ బలికినట్లుగా పెద్ద సీసపద్యములోఁ బలికింప
లేదు. అచ్చట "తను దా నపరించు చొప్పెఱుంగదు, తగ నొడ్లనుం
గొలువఁగా వెర వెమ్మెయిఁ గల్గు నక్కటా" యని చింతించిన ధర్మ
జుని చిత్తంబున వెనుబాటంతయుఁ బాపుటకుఁగా నంతగాఁ ద నకా

పనులఁగల ప్రావీణ్యమును వర్ణించి "మత్స్యరాజమహిషి మనమున మక్కువ నెలకొనంగ నిట్లు మెలఁగనేర్తు" నని పలికినది. ఇచ్చట నీచములగు పనులను దాఁజేయనని చెప్పిన పిదపఁ దా నెట్టిపనులఁ జేయునో తెలుపుటయే ముఖ్యవిషయము. అంత కేకయరాజనందన ప్రభూతాశ్చర్యయై "నే నెమ్మెయినయినం బనిగొందుఁ గాని నీరూపము చూచి మా నృపతి యువ్విళ్లూరుఁ గావున

"దుర్భర యగునినుఁ గర్కటి
గర్భము ధరియించునట్లు గైకొని నాకై
నిర్భర విధ్వంస దశా
విర్భావముఁ దెచ్చికొనుట వెరవై యున్నే."

అని తనకుఁగల భయమును వెలిపుచ్చినది. అప్పుడు ద్రౌపది "నీవు తలఁచినట్లు కా దేర్పడ వినుము." అని తనపతుల వెరవు లావును గుఱించి చెప్పుచు,

"నీచమతి నన్ను నెవ్వఁడు
చూచిన నారాత్రిలోనఁ జూతురు దెగఁ దా
రాచపలు హరిహరాదులు
గాచిన బలవిక్రమము లఖర్వములై నన్."

అని ముందు రెండవయాశ్వాసమున జరుగఁబోవు కీచకవధను సూచించునదివోలె, హరిహరాదు లడ్డంబైనను ఆరాత్రిలోనఁ దెగఁ జూతురని వ్యక్తముచేసినది. ఈ సంభాషణలోను, అందు ద్రౌపదిచేఁ బలికించిన మాటలలోను తిక్కన రెండవయాశ్వాసమున జరుగనున్న కథాంశములను నాటకమునందంకాస్యముచేవలె మొదటి యాశ్వాసాంతముననే సూచింపఁదలఁచినవాఁ డనుటకు సందేహము లేదు. మొదట ధర్మ

తో "సద్గుణసంపన్నబనులను నేర్చి చేయుదు నందున్" అని చెప్పిన
కిం దగినట్లుగా 'నీచములగుపనులను నే చేయనని' యిచ్చట సుదే
ేం బలికించి యుండామె ద్రౌపదిని కల్లుదేరంబంపు సందర్భ
ం సూచించుచు, నపుడు నీమాటలనే ముదలకించుచు

"...నీకడను పంతతియుక్ బహుమానపాత్రమై
తప్పగతిక్ జరింప యనుచితంపుంబనుల్ సగంజేయం గాక గు
వ్యత్పరిచారయోగ్య పరిచారము మైం జనునట్టి దాననే."

ఎవ్వరేని యింటి కెద్దియే నొకటికి
నన్నుం బంపం దగునె నాండ నిన్నుం
గొలువనేని నపుష్ణ గొనని నీచములగు
పనుల కేను జాల ననికి చెప్పి."

పలికించినాండు. మూలమునం 'దాను దుర్వ్యత్పరివార యోగ్య'మగు
యనుచితకృత్యమునం బ్రవర్తింప నొల్లకుండుట కంటె కీచకుని
వం గనుబం గలిగెడి యవమానమును గూర్చి విశేషముగ భయ
నట్లుగాం గానవచ్చుచున్నది.

త్వమేవ దేవి జానాసి యథా స నిరపత్రపః,
కీచకస్స సుకేశాంతే మూఢో మదనదర్పితః,
సో ఽవమంస్యతి మాం దృష్ట్వా నయాస్యే తత్ర శోభనే."

. పరి. నారి పానమున నింతమాత్రమే యుండంగా సంస్కృతభాష
ముున

కథం ను సైర్తం త్రత్ర గత్వాం మర్షయే న్నామ మహాంశ్వరాన్,
కీచక స్యాలయం దేవి న యామి భయకంపితా,
యస్య పర్యస్య మే కర్మ కరోమి చ సుదుష్కరమ్."

అని మఱికొన్ని శ్లోకము లామె భయమునే సూచించుచుఁ బలికినట్లుగాఁ దెలుపునవి కలవు. తిక్కనరచనలో కీచకునిగూర్చిన ప్రశంస వ్యక్తముగాఁ జేయఁబడనే లేదు. తనగౌరవమునకుఁ దగనియట్టి పని యందు తన్ను నియోగించుట కూడదను విషయమును నొక్కిచెప్పుచు నట్టికార్యములను జేయు సందర్భమున నేదైన నొక యాపద కలుగ వచ్చుననియు, దాన నిందపుట్టుననియు, నట్టియాపద పుట్టకయుండఁ గాచు టొప్పనియు కీచకుని పేరెత్తకయే మిగుల గడుసుదనముతో వాదించి, తుదకు సుదేష్ణకూడ నీమె వాదమును "ఏని యనుచితమున కనయము శంకించు"నట్లుగాఁ జేసినది. ఇట్లే సుదేష్ణ యనుచితకృత్యమునఁ—లేదా, నీచపుఁబనులఁ-బంపుట విషయమే కాక, కీచకవధను గూడ హరిహరాదు లడ్డంబైన నా చపలుని నారాత్రిలోనఁ దెగఁ జూతురనియు

"బంధుశతంబులు శౌర్యమ
దాంధములై శక్తిసంపదాభీలతమై
సింధుర సదృశత నున్నను
సంధులు సంధు లెడలించి చంపుదు రతనిన్."

అను వానిచే సూచించినది. ప్రాచీన ప్రతులలోను, బం. పరి. వా రాదరించిన పాఠమునను

"యో హి మాం పురుషో గృధ్యే ద్యథాన్యాః ప్రాకృతాః స్త్రియః;
తామేవ స తతో రాత్రిం ప్రవిశే దపరాం తనుమ్."

అని మాత్రమే యున్నది. కాని దక్షిణదేశ ప్రతులలో తిక్కన రచన కనుగుణంబుగా పై శ్లోకము తరువాత

"యస్యాపి హి శతం పూర్ణం బాంధవానాం భవేదపి,
సహస్రం వా విశాలాక్షి కోటిర్వాపి సహస్రికా.

దుష్టచిత్తశ్చ మాం బ్రూయాన్న స జీవే త్తవాగ్రతః
యో హి మాం పురుషో గృధ్యే ద్యథాన్యాః ప్రాకృతా స్త్రియః.

తామేవ స తతో రాత్రిం ప్రవిశే దపరాం తనుమ్,
న చాప్యహం చాలయితుం శక్యా కేనచి దఙ్గనే."

అని యుండుటయే గాక యింతకుపూర్వమే
"యశ్చ దుశ్శీలవా న్మర్త్యో మాం స్పృశే ద్దుష్టచేతసా,
స తామేవ నిశాం శీఘ్రం శయీత ముసలై ర్హతః."
అను మఱికొన్ని శ్లోకములును గలవు.

ఇట్లు చెప్పినదే మరల చెప్పుచు సంభాషణ క్రమమంతయును, భావములందు నొకచారితెన్ను లేక యుండుటచే ప్రాచీనమూలప్రతినే యనుసరించి తిక్కన తనకుఁ దోఁచినరీతిని పూర్వోత్తరసందర్భములకు పొందికగూర్చుకొనుచు రచింపఁగా దీనినిబట్టి మధ్యమధ్య క్రొత్తశ్లోకములు గొన్ని మూలపాఠమునఁ జేర్పఁబడినవా యని సందేహము.

ఈ ద్రౌపదీవాక్యములు ప్రథమాశ్వాసముతుదిని వచ్చుటచే, వెంటనే రెండవయాశ్వాసమున జరుగఁబోవు కథకు సూచకములై యుండునట్లుగా తిక్కన రచించినాఁడని గదా తలంచియున్నాము. ఇది యిట్లే యైనచో తిక్కనయే కావ్యకళాదృష్టితో నీ ద్రౌపదీప్రవేశమునుగూడ నంతమునఁ బెట్టినాఁడని తలంపవలసియున్నది. ఏల యనఁగా పాండవప్రవేశక్రమమున నుత్తరదేశపాఠమునకును, దక్షిణదేశపాఠమునకును గొంత భేద మగపడుచున్నది. ఉత్తరదేశప్రతులలో

ధర్మరాజుఁడు, భీముఁడు, ద్రౌపది, సహదేవుఁడు, అర్జునుఁడు, నకులుఁడు అను నీక్రమమున—అనఁగా ద్రౌపది నకులార్జున సహదేవులకు పూర్వమునసే విరటునికొల్వునఁ బ్రవేశించినట్లున్నది. మొదట యుధిష్ఠిరుఁడు ఎవరెవ రెట్లు మెలంగుదురని యడుగుటలోనిక్రమము మాత్రము భీముఁడు అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడు, ద్రౌపది అను నీరీతినే యున్నది. కాని విరటుని యాస్థానమునఁ బ్రవేశించిన క్రమము క్షేమేంద్రుని భారతమంజరిలోఁ గూడ నీ యుత్తరదేశప్రతుల పాఠములో నున్నట్టే యున్నది. జావాద్వీపమునందలి విరాటపర్వములోని క్రమ మించుక భేదించినను, ద్రౌపదిమాత్రము చిట్టచివర ప్రవేశించినట్లు లేదు. అనఁగా యుధిష్ఠిర భీమార్జునుల ప్రవేశము తరువాత ద్రౌపదీ ప్రవేశము కలదు. అటుపైన సహదేవుఁడు, నకులుఁడు ప్రవేశించినట్లున్నది. ఉత్తరదేశప్రతులలో నకుల సహదేవులకు మధ్యగా నర్జునుఁడు ప్రవేశించినట్లుండ, దీనిలో యుధిష్ఠిర భీములకుఁ దరువాతనే ప్రవేశించినట్లున్నది మొత్తముమీఁద నీ గ్రంథములన్నిటిలోను ద్రౌపదిమాత్రము చివర ప్రవేశించినట్లు లేదు. ఒక దక్షిణదేశ ప్రతులపాఠముననే పాండవులు జ్యేష్ఠానుక్రమముగాఁ బ్రవేశించినట్లును, చివరను ద్రౌపది ప్రవేశించినట్లును కనఁబడుచున్నది. ఉత్తరదేశప్రతులపాఠములో పురుషులందఱు నైదుగురు నొకరివెంబడి నొకరు ప్రవేశించిరని చెప్పుటలోఁ గల వినుగుదలను (monotony) పోఁగొట్టుటకు ద్రౌపది మధ్య పెట్టఁబడినదనియు, నకుల సహదేవు లిద్దఱి యాకారములలోను, మాటలలోను గల సాదృశ్యము కనఁబడకుండఁ జేయుటకుఁగా నర్జునుఁడు వారిద్దఱికి మధ్యప్రవేశించినట్లుగాఁ జెప్పఁబడినదనియుఁ గొందఱువిమర్శకులు తలంచియున్నారు. వరుస నైదుగురు పాండవులు జ్యేష్ఠానుక్రమముగను, చివరకు ద్రౌపదియుఁ బ్రవేశించిరని చెప్పినచో, వీరు పంచపాండవులు,

రెండవ యాశ్వాసమందలికథ యంతయుఁ జాలవఱకు ద్రౌపదికి సంబంధించినదే కావున నచ్చటి కథాప్రవృత్తికి వలయుమార్గముల నన్నిటి నీప్రథమాశ్వాసాంతముననే సూచింపఁదలఁచియు, ద్రౌపదీస్వభావతత్త్వమును ముందుగనే మనకు బాగుగ నెఱుకపఱుపఁదలంచియు, మూలములో (నుత్తరదేశపాఠములో) నున్నదానికంటె నెక్కువగా విశేషాంశములను జేర్చి యాఱుపద్యములలో తిక్కన ద్రౌపదిచే పలికించినాఁడు. ఎన్నిపర్యాయములైనను సుదేష్ణ తనను గౌరవముగ చూడవలయుననియు, పరపురుషులు దనకడం దేఱిచూడ వెఱతురనియు, తాను మిగుల మహిమకలదాననని యుఁ దెలియఁజెప్పుటకై యత్నించినట్లు కనఁబడుచున్నది. సుదేష్ణ తనభర్త యీమెకొఱకై యువ్విళ్లూరునని చెప్పినదానికి సమాధానముగా "కావున పురుషులు నాకడం దేఱిచూడ వెఱతురదియునుం గాక" యని తననుగూర్చి యింక నిట్లు చెప్పుకొనం దొడఁగినది:—

"నాచిత్తము దాదృశులకు
గోచరమే యస్మదీయ కులజనసంగ
తాచారమహిమ యట్టిది
యే చెప్పను తద్విధాతిహీనవచనముల్."

"మనమున నూఱడిల్లు మనుమానము మానుము నన్ను నేలు మే
పనులు నుదాత్తనాగరికభంగుల నీమది కెక్కునట్లు నే
ర్పును భయభక్తులున్ మెఱయ రూపుగఁజేసెదఁ దక్షులైన స
జ్జనులు నుతింప వర్తనము సాధులు వృద్ధులు మెచ్చ సల్పెదన్."

"ననుఁగుచ్చితంపుఁ బనులకుఁ
బనుపక యెంగిలికి లోనుపఱుపక తగుము

న్ననతోడ వరయువారల
కనురాగము నెఱపి కొలుతు రస్మత్ప్రభులున్."

ఈ మెను గుప్తతంపుఁబనుల సుదేష్ణపంపుటయే రెండవయాశ్వాస కథకును, తరువాతికథకును గూడ కారణమైనదనుట వ్యక్తమే. కావున తిక్కనయే కావ్యకళాదృష్టితో నీమార్పుచేసి ద్రౌపదిశీలము నద్భుతముగా పోషించి కథాప్రవృత్తిమార్గమును సూచించి పురాణకథా కథనమున నాటకరీతులను జూపినవాఁడని తలంపఁదగియున్నది.

ప్రథమాశ్వాసమున నుత్తరదక్షిణ దేశపాఠములు భేదించిన సందర్భములను మఱికొన్నిటిని గ్రహించి యచ్చట తిక్కనార్యుని తెలుఁగు రచనరీతిని పరిశీలింతము. విరాటనగరమున కనతిదూరంబగు కాంతారమున పథిశ్రమంబుచే నడువలేని ద్రౌపది యారాత్రి యచటనే నివసింతమని చెప్పుచు,

"వ్యక్తం పురో విరాటస్య రాజధానీ భవిష్యతి,
వసామే హాపరాం రాత్రిం బలవాన్ మే పరిశ్రమః."

అని యన్నట్లుత్తరదేశ పాఠమునఁ గలదు. దక్షిణదేశ పాఠమునను గూడ నీశ్లోకముమాత్రమే కలదు. కాని తిక్కనార్యుఁడు "బలవాన్ మే పరిశ్రమః" యనుదాని నాధారముగాఁ జేసికొని ద్రౌపది సౌకుమార్యాదిగుణముల నెంతచక్కగా వ్యక్తము చేసినాఁడో చూడుఁడు:

"పథిశ్రమంబు నూని యాజ్ఞసేని యిట్లనియె:—

"దప్పి జనించె వ్రేళులపుటంబులు పొక్కెడొడంగె గోళ్లలోఁ
జిప్పిలఁజొచ్చె నెత్తురులు చిత్తము నాకుఁ గడున్ వశంబు గా
దప్పుర మిచ్చటచ్చటను నాసల వచ్చితి నెంతదవ్వొకో
యిప్పటిభంగి నొక్కఁడుగు నేఁగెడిదానికి నోర్వ నెమ్మెయిన్."

"అనవుడు తనమదిఁ గరుణయుఁ ఖేదంబును బిరిగొనుచుండ ధర్మ పుత్త్రుఁడు నకులుని జూచి ద్రుపదాధిపనందన దెస నాతనికిఁ జూపి కడు దవ్వు నేఁ డప్పురము సొత్తమని తలఁచి తఱిమి నడచితిమి. ఇది వడ గొనియె. మోచి తెమ్ము కొంతద"వ్వని పలికినాఁడు. ఇచ్చట ద్రౌపది స్థితినే గాక యామె యవస్థను జూచిన ధర్మజుని మనోవృత్తి యెట్టిదో వర్ణించుచు, "ద్రౌపది దెస నాతనిం జూపుచు" నని యాయాపాత్రల యభినయమును గూడ సూచించుచుండుటచే, నాటకమునవలె నాదృశ్యమునంతను మనకండ్ల యెదుటఁ బెట్టినాఁడు. మూలమున నీవర్ణన మేమియు లేదు. మఱియొక విశేష మేమనఁగా నుత్తర దేశప్రతులపాఠ ములో ధర్మజుఁడు మొట్టమొదటనే యర్జునునితోఁ జెప్పినట్లు, నాతఁ డామె నెత్తుకొని వచ్చినట్లుగా నున్నది.

"యుధిష్ఠిర ఉవాచ:

"ధనంజయ సముద్యమ్య ద్రౌపదీం వహ భారత,
రాజధాన్యాం నివత్స్యామో విముక్తాశ్చ వనా దితః."

"వైశంపాయన ఉవాచ:

"తా మాదా యార్జున స్తూర్ణం ద్రౌపదీం గజరా డివ..."

... ... ... ... ... ...

కాని దక్షిణదేశప్రతులలో నీతఁడు మొదట చిన్నవాఁడని కాఁబోలును, నకులునితోఁ జెప్పినట్లును, నకులుఁడు

- "పూర్వాహ్ణే మృగయాం కృత్వా మయా విద్ధా మృగా వనే
... ... ... ... ... ...
సోహం ఘర్మాభితప్తో వై నైనా మాదాతు ముత్సహే."

అని పలుకఁగా,

"సహదేవ త్వ మాదాయ ముహూర్తం ద్రౌపదీం నయ"

యని చెప్పుటయు నాతఁడును

"అహ మప్యస్మి తృషితః క్షుధయా పరిపీడితః"

యని చెప్పినపిదప,

"ఏహి వీర విశాలాక్ష వీరసింహ ఇ వార్జున
ఇమాం కమలపత్రాక్షీం ద్రౌపదీం ద్రుపదాత్మజాం
పరిగృహ్య ముహూర్తం త్వాం బాహుభ్యాం కుశలం వ్రజ"

యని చెప్పఁగా,

"గురో ర్వచన మాజ్ఞాయ సంప్రహృష్టో జితేంద్రియః."

అర్జునుఁడు గురువచనమును దెలిసికొని, ద్రౌపదిని బాహువులతోఁ బట్టుకొని—"బాహుభ్యాం పరిగృహ్యైథ"—నగరసమీపమునకుఁ దీసికొని వచ్చినట్లుగాఁ జెప్పఁబడియున్నది.

ఇక్కడ తిక్కన మిగుల చమత్కారముగా రచించి ధర్మజుని యింగితజ్ఞతను వ్యక్తపఱచినాఁడు. తాను ద్రౌపదిని మోచితెమ్మని చెప్పినవెంటనే నకులసహదేవులు గ్రక్కునఁ జనుదేరమిం జూచి వీరు డస్సిరని గ్రహించి వెంటనే యర్జునుం జూచి, "యిమ్మదిరాక్షి డస్సె, నిక్కముగ నేమును డస్సితిమి. కావున నీ వెమ్మెయినైన దీని భరియించి పురంబుసమీపభూమికిం దెమ్మని" చెప్పఁగా నాతండు నామెను మోచికొనివచ్చి యామె నొక్క శీతలసికతాతలంబున డించెనని చెప్పినాఁడు. మూలములోవలె నకులసహదేవులును దాము నలయుటకుఁ గారణము మృగయ గాక పురము ప్రవేశించుటకుఁగాఁ దఱిమినడచుటయే యనుకారణమును వ్యక్తముచేసినాఁడు. ధర్మజుఁడు వారు (మూలములోవలె

తమ యశక్తతను దెలుపక పూర్వమే) వెంటనే పనిపూనకుండుటనుబ
ట్టియే తనవలెనే వారు నలసియుందురని గ్రహించి, "నిక్కముగ నేమును
డస్సితిమి" యని చెప్పుటచే వారందఱు నొక్కస్థితిలోనే యున్నట్లు
సూచించుచు, తిక్కన యీసందర్భమున కాంతిస్వాభావికత్వము నాపా
దించినాఁడో గమనింపుఁడు. మూలము చదివినచో నాసమయమున వారి
వారియనుభవము, స్థితి యెట్టిదో మనకు గోచరమే కాదు. మార్గాయాస
మున (మృగయచేఁగాదు) వీరే యింత డస్సియుండఁగా ద్రౌపది పైని
చెప్పినరీతిగా నొక్కయడుగు నేఁగెడుదానికి నోర్వకుండుటలో నాశ్చ
ర్యము లేదు.

## శమీవృక్షముపై నాయుధ నిక్షేపణము

ఇఁక నూరిబయటఁ జేరి యచ్చట శమీతరువుపై వీరి యాయు
ధములను బెట్టు సందర్భమునఁగూడ తిక్కనార్యుని రచనానైపుణ్యము
గాననగును. ఉత్తరదక్షిణ పాఠములకుఁ గలభేదమును గమనింపఁ
దగియున్నది. ఉత్తరదేశప్రతుల పాఠములో ధర్మజుఁడు తమ్ముల
యాయుధముల ప్రభావమును, వారి కృత్యములను బ్రశంసించి యా
యాయుధముల నొకచోఁ బెట్టించి తానును బెట్టినపిమ్మట

"తా ముపారుహ్య నకులో ధనూంష్యవ్యాదధ త్స్వయం
యాని తస్యావకాశాని దృశ్యరూపా ణ్యమన్యత
తత్ర తాని దృఢైః పాశైః సుగాఢం పర్యబన్ధత
శరీరం మృతక సైక్యకం సమాదాయ వ్యబన్ధత."

అని యాయుధముల నా శమీతరువుపైఁబెట్టి భద్రముగా వానిని
కట్టు పనియంతయు నకులుఁడే చేసినట్లున్నది. పిదప శవ మిచ్చట కట్టఁ

బడియున్న దని తలంచి జనులు దూరమునుండియే మరలిపోవుదురని తలంచుచు,

"అశీతిశతవ ర్షేయం మాతా న ఇతి వాదినః
కులధర్మో్ఽయ మస్మాకం పూర్వై రాచరితోఽపిచ
సమాసజానా వృక్షేస్మి న్నితి వై వ్యాహరంతి తే
ఆ గోపాలా విపాలేభ్యః ఆచక్షేయుః పరంతపాః."

అని యది నూటయెనుబది యేండ్లుగల తమ జనని కళేబరమని యచ్చటి గోపాలావిపాలురతోఁ జెప్పుచు పోయిరని యున్నది. దక్షిణ దేశ ప్రతులు కొన్నిటిలో

"తతో యుధిష్ఠిరో రాజా సహదేవ మువాచహ
ఆరు హ్యేమాం శమీం వీర నిన త్స్వ హాయుధాని నః
ఇదం గోమృగ మధ్యాశే గతసత్త్వ మచేతనమ్
ఏత దుత్కృత్య వై వీర ధనూంషి పరివేష్టయ.

..........................

శమీ మారుహ్య త్వరితో ధనూంషి పరివేష్టయత్
తతః పరమదూరస్థ ముంచన్నృత్తి కళేబరమ్
తచ్చానీయ ధనుర్మధ్యే నిబబంధుశ్చ పాండవాః.

అథాబ్రవీ న్మహారాజో ధర్మాత్మా స యుధిష్ఠిరః,
యాని తత్ర విశాలాని రూఢమూలాని మన్యసే
తేషా ముపరి బధ్నీహి ఇదం విప్రకళేబరమ్
త చ్ఛ్రుత్వా సహదేవస్తు పర్యబధ్నత తచ్ఛవమ్."

అని యిట్లు యుధిష్ఠిరాజ్ఞచే సహదేవుఁడే మొదట నొకమాఱాయుధములను జెట్టి గోచర్మముతోఁ జుట్టి మనుష్యకళేబరముతోఁ

గట్టెననియు, మఱియొకమాఱు వేఱొక విప్రకళేబరము దొరకగా దానినికూడ నాయాయుధములపైఁ జేర్చి కట్టెననియు, నీరెండుపనులును సహదేవుఁడే చేసినట్లును చెప్పఁబడినది. పిదప ధర్మజుఁడు శుచియై దేవత లందఱకు నమస్కరించి, వారినిగూర్చి

"నేయం భీమే ప్రదాతవ్య మయం క్రుద్ధో వృకోదరః
అపూర్ణకాలే ప్రహరే త్క్రోధసంజాత మత్సరః
పునః ప్రవేశో న స్యాత్తు వనవాసాయ సర్వదా
సమయే పరిపూర్ణేతు ధార్తరాష్ట్రా న్నిహ న్మహే."

ఇట్లు ప్రార్థించిన ట్లున్నది. తిక్కన తెలుఁగురచనలో నెట్లున్నదో చూడుఁడు. ఇక్కడ శమీవృక్షము నెక్కి దానిపై నాయుధములను బెట్టినది నకులుఁడును కాదు, సహదేవుఁడును కాదు; ధర్మజుఁడే. ఆతఁడే పెట్టుటకుఁ గారణమునుగూడఁ దెలిపియున్నాఁడు తిక్కన. ఆ యాయుధములను మహోరగంబులఁ బెట్టి కట్టుచందంబున బంధించి వానిం గొనుచు నయ్యజాతశత్రుండు ధర్మదేవతా దత్తవరుం డగుటంజేసి నిశ్శంకంబైన యంతఃకరణంబుతోడ శమీవృక్ష సమారోహణం బాచరించి, దేవతాపితృస్తుతు లొనరించి దివియు భువియుఁ జూచి ప్రార్థించి యొక్కవిపులశాఖ వాని వ్రేలఁగట్టెను. అట్లు గట్టి—యా చెట్టుపైననుండియే—తదీయాధిదైవతంబుల నుద్దేశించి నమస్కరించి,

"నరునకు నాకును దక్కఁగ
నొరులకు మీ రూపు చూప కున్నతవిషవి
స్ఫురిత భుజంగాఘభయం
కరమూర్తులు దాల్చియుండఁగా నలయుఁజుఁడీ.

"భీముఁడు ధార్తరాష్ట్రకులభీషణరోషుఁడు చిత్త మెప్పుడే
ట్లై మదమెత్తునో యతని యాగ్రహవృత్తికి లోను గాక మీ
రేమెయినైన పంచన వహించి తొలంగుట మత్సమీహితం
బేమఱకుండఁగావలయు నివ్విషమాబ్దములోన నాతనిన్."

అని వేఁడికొని వృక్షంబు డిగ్గి దానికిఁ బ్రదక్షిణంబుగా వచ్చి ప్రణమిల్లి భీమసేనుని దెస మరలి చూచి పైనఁ దాఁ జెప్పిన మాటల కాతఁ డేమనుకొనునో యని గాఁబోలును, సాంత్వవచనసమేతంబుగా నతనిం గౌగిటం జేర్చికొని యనునయించెనఁట.

ఉత్తర దేశపాఠములోను, కుంభఘోణప్రతి మొదలగు కొన్ని దక్షిణదేశప్రతులలోను నకులుఁడు, సహదేవుఁడు వరుసగా శమీవృక్షము నెక్కి యాయుధముల నచ్చట పెట్టినట్లుగాఁ గనఁబడున్న ట్లింతకుముం దే చూచియున్నాము. కాని తెలుఁగులో మాత్రము ధర్మజుఁడే చెట్టెక్కి యాయుధముల నచ్చటఁ బెట్టిన ట్లున్నది. తనకు, నర్జునునకే గాని భీమునికిఁ గనఁబడకుండుఁ డని ప్రార్థించి తరువాత భీము ననునయిం పఁబూనెనని, ధర్మజుఁడే ధర్మదేవతవలని వరమును బడసినవాఁ డగుటచే నాతఁడే యీ యాయుధముల నాచెట్టుపైని బెట్టినాఁడని దీని కొక కారణమునుగూడ చూపినాఁడు తిక్కన. దీనిని చూచియే గావలయు, దక్షిణదేశప్రతులు పెక్కింటిలో పూర్వోత్తర సందర్భము సరిగా కుదురని క్రొత్త శ్లోకములు కొన్ని తిక్కనరచనతో సమానార్థము గలవి మధ్య చేర్పఁబడిన ట్లగపడుచున్నది.

"విపాఠాన్ క్షురధారాంశ్చ ధనుర్భి ర్నిదధుస్సహ."

ఈ పాదము తరువాత కుంభఘోణ ప్రతిలో

" అథాబ్రవీ ద్ధర్మరాజః సహదేవం పరన్తపః,
ఆరుహ్యేమాం శమీం వీర నిధత్స్వేహాయుధాని నః."

అని ధర్మజుఁడు సహదేవునితోఁ జెప్పిన ట్లుండఁగా, మఱికొన్ని తెలుఁగు ప్రతులలో ధర్మజుఁడే చెట్టెక్కిన ట్లగపడుచున్నది. కీనిలో నీ మొదటి పాదమునకు బదులుగా

" తాని సర్వాణి సన్నహ్య వాసోభిః పరివేష్ట్యచ,
ఆరుహ్య యావ దేతాని నిధాతుం విహగై ర్వృతామ్."

అను రెండు పాదములును, వానితరువాత

" శమీం ఆరుహ్య మహతీం నిక్షేప స్వాయుధాని నః."

అని పైశ్లోకమున రెండవ పాదముతోఁ బోల్పఁదగిన పద్యపాదమును గలవు. " నిక్షేప స్వాయుధాని నః " అను వాక్యము వేఱు వేఱు ప్రతులలో వేఱు వేఱుగా నున్నది. " నిక్షిపాద్యా యుధానినః", " నిక్షేపా న్యాయుధాని నః " అను పాఠాంతరములు కలవు. ఎట్లైనను. " ఆరుహ్య నిక్షిప " అని చెప్పిన దెవరో వ్యక్తము గాలేదు. ఉత్తరదేశ పాఠమునను, కుంభఘోణ ప్రతియందును ధర్మజుఁడు నకులునితోనో, సహదేవునితోనో చెప్పిన ట్లున్నది గనుక అందలి శ్లోక పాదములే యిందు చేరియుండును. తరువాత

"వైశంపాయన ఉవాచ

"తాన్యాయుధా న్యపాదాయ కుంతీపుత్రో యుధిష్ఠిరః
స వచః పురుష వ్యాఘ్రః ప్రోవాచ మధురాక్షరమ్."

ఈ చెప్పుట చెట్టెక్కియో, క్రింద నుండియో చెప్పఁబడియుండ లేదు.

యుధిష్ఠిరః:

"బ్రహ్మాణ మింద్రం వరదం కుబేరం వరుణానిలౌ,

... ... ... ... ...

"సర్వాయుధానీహ మహానుజానాం
న్యస్యా మ్యహం దేవసమీపతో వై.

"ఏవ న్యా సోమయాన్యస్త స్సూర్యసోమానిలాంతికే,
మహ్యం పార్థాయ వా దేయం పూర్ణే వర్షే త్రయోదశే;
నైవ భీమాయ దాతవ్యం అయం క్రుద్ధో వృకోదరః.

... ... ... ... ...

అమర్షా న్నిత్య సంక్రుద్ధః ధృతరాష్ట్రి సుతాన్ ప్రతి
అపూర్ణకాలే ప్రహరేత్ క్రోధసంరక్తలోచనః
సమయే పరిపూర్ణేతు ధార్తరాష్ట్రాన్ నిహన్మహే.

"వైశంపాయన ఉవాచ:

"సోఽవతీర్య మహాప్రాజ్ఞః పాండవ స్సత్యవిక్రమః,
భీమం కంఠే పరిష్వజ్య చానునీయ నరాధిపః;
దైవతేభ్యో నమస్కృత్య శమీం కృత్వా ప్రదక్షిణమ్."

ఇట్లు ధర్మజుఁడే చెట్టునుండి దిగినట్లు చెప్పఁబడినది గాని ధర్మజుఁడు "ఆరుహ్య నిక్షిప స్వాయుధాని నః" అని ఎవరినో గూర్చి చెప్పినట్లున్నదే గాని యాతఁడు స్వయముగాఁ జెట్టెక్కినట్లు పైశ్లోకములలోఁ జెప్పఁబడియుండలేదు. ఇది యంతయు రెండు పాఠములలోని శ్లోకములను గుచ్చెత్తుటవలనఁ గలిగినచిక్కుగాఁ గనఁబడు చున్నది. ఇంతే గాక ప్రాచ్యలిఖిత పుస్తకాలయమునందు

బ్రౌన్‌దొరగారిచే సంపాదించి పెట్టఁబడిన తెలుంగక్షరముల ప్రతిలో మఱియొక విశేషము కలదు. కుంభఘోణప్రతిలో పాండవులు పట్టణము వైపునకుఁ బోవుచు నచ్చటి గోపాలావిపాలురతో నది నూటయెనుబది సంవత్సరముల తమతల్లి కళేబరమని చెప్పుచు నగరమును బ్రవేశించిరని మాత్రమే చెప్పఁబడియుండఁగా, బ్రౌన్‌దొరగారి ప్రతిలో

"త మేవ మాచు ర్ధర్మజ్ఞా కులధర్మో న ఈదృశః"

అన్నదాని తరువాతనే (తిక్కన రచన కనుకూలముగా)

"అథాబ్రవీ ద్ధర్మరాజా......పరంతప,
ఇదం నో మృగ మభ్యాశే గతసత్వ మచేతనమ్;
ఏత దుత్కృత్య వై వీర ధనూంషి పరివేష్టయ.

"వైశంపాయనః

"ఏవ ముక్తో మహాబాహుః సహదేవో యథోక్తవత్,
శమీ మారుహ్య త్వరితో ధనూంషి పరివేష్టయత్;
పునఃపునశ్చ సంవేష్ట్య కృత్వా సుకృతకారిణః,
అథాపర మదూరస్థం ఉంఛవృత్తి కళేబరమ్;
తచ్చానీయ ధనుర్మధ్యే వినిబధ్యంత పాండవాః,
అథాబ్రవీ న్మహారాజో ధర్మాత్మా స యుధిష్ఠిరః;
రజ్జుభి స్సంవృతం ప్రాజ్ఞ వినిబధ్నీహి పాండవ."

అని యీ పని యంతయు ధర్మజుఁడు సహదేవునిచే జేయించి నట్లు చెప్పు శ్లోకములు కలవు. ఈ శ్లోకములు కుంభఘోణప్రతిలో సహదేవుఁడు తానాయుధములను వృక్షముపైఁ బెట్టుటకు పూర్వమే చేసినట్లుగాఁ జెప్పుచు నింతకుపూర్వమే చేర్పఁబడినవి. అనఁగాఁ దెలుఁ

సంప్రతులలో ధర్మజుఁడే చెట్టెక్కి యాయుధములను దానిపైఁ బెట్టి దేవతలను ప్రార్థించినట్లును, ఆపైని శవాదులను సహదేవుఁడు వానిపైఁ గట్టినట్లు నున్నను, తిక్కనరచనయందువలె నానుపూర్వీగనఁబడక యుండ, కుంభఘోణప్రతి ధర్మజుఁడు చెట్టెక్కి పెట్టినట్లు చెప్పక క్రింద నుండియే దేవతలను స్తోత్రముమాత్రము చేసెనని తెలుపుచున్నది. తక్కిన శ్లోకము లాయా సందర్భములలో నద్దివేయఁబడినవై యున్నవి. తిక్కన యానుపూర్వి బ్రౌన్‌దొరగారి తెలుఁగుప్రతిలో మాత్రమే కనఁబడు చున్నది.

దీనిని బట్టి తిక్కన రచన దక్షిణదేశప్రతులపాఠములో నెట్టి చిక్కుల కల్పించినదో స్పష్టమగుచున్నది. ఉత్తరపాఠములో లేని విషయములలోఁ గొన్నియైనను తిక్కన ననుసరించి రచింపఁబడిన ట్లూహింపఁదగియున్నది.

## బృహన్నల సారథిగాఁ గుదురుకొనుట

బృహన్నల యుత్తరునిసారథిగాఁ గుదురుకొను మఱియొక సందర్భము పరిశీలింతము.

ఉత్తరుఁడు సారథికొఱకై వెదకుకొనుచు,

"పశ్యధ్వం సారథిం క్షిప్రం మమ యుక్తం ప్రయాస్యతః.

... ... ... ... ... ...

సంలభేయం యది త్వన్యం హయయానవిదం నరమ్.

... ... ... ... ... ...

పశ్యేయు రద్య మే వీర్యం కురవ స్తే సమాగతాః
కింను పార్థోఽర్జునః సాక్షా దయ మస్మాన్ ప్రబాధతే."

అని యుత్తరుఁడు ప్రగల్భములు పలుకుచు నర్జునుని పేరెత్తుట ద్రౌపది విని, సహింపక,

> "తస్య తద్వచనం శ్రుత్వా భీష్మతః స్మ పునః పునః;
> నామర్ష యత పాంచాలీ బీభత్సోః పరికీర్తనమ్;
> అథైన ముపసంగమ్య స్త్రీమధ్యా త్సా యశస్వినీ,
> వ్రీడమానేవ శనకై రిదం వచన మబ్రవీత్;
> యో౽సౌ బృహద్వారణాభో యువా సు ప్రియదర్శనః,
> బృహన్నల ఇతి ఖ్యాతః పార్థ స్యాసీ త్స సారథిః."

అని బృహన్నల వెనుక పార్థునకు సారథిగా నుండెను గావున నాతని సారథిగాఁ బడసినచో కౌరవులను సులభముగా జయింపఁగల వని ద్రౌపదియే చెప్పిన ట్లుత్తర దేశపాఠమునఁ గలదు. మఱికొన్ని యుత్తర దేశ ముద్రితప్రతులలోను, దక్షిణదేశప్రతులలోను గూడ నుత్తరుని మాటల నర్జునుఁడే విని యుత్తర చేఁ జెప్పించి తనను సారథిగా నుత్తరుఁడు గ్రహించునట్లు చేయుమని ద్రౌపదిని ప్రేరేపించిన ట్లున్నది.

> "శ్రుత్వా త దరునో వాక్యం రాజ్ఞః పుత్రస్య భాషతః,
> అతీతసమయే కాలే ప్రియాం భార్యా మనిందితామ్;
> ... ... ... ... ...
> ఉవాచ రహసి ప్రీతః కృష్ణాం సర్వార్థకోవిదః,
> ఉత్తరాం బ్రూహి కల్యాణి క్షిప్రం మద్వచనా దిమమ్;
> అయం వై పాండవ స్యాసీత్ సారథిః సంగతో దృఢః."

కుంభఘోణప్రతిలో నుత్తర దేశపాఠశ్లోకములతో నీ పైఁ జెప్పఁబడిన శ్లోకములు గుచ్ఛియెత్తఁబడినవి.

"తస్య తద్వచనం శ్రుత్వా స్త్రీషు చాత్మప్రశంసనమ్,
నామర్షం యత పాంచాలీ బీభత్సోః పరికీర్తనమ్."

అను శ్లోకము తరువాత మరల అర్జునుఁ డాయుత్తరుని మాటలు విని ద్రౌపదితోఁ బలికె ననికూడఁ జెప్పఁబడినది.

"శ్రుత్వా తదర్జునో వాక్య ముత్తరేణ ప్రభాషితమ్."

ఇఁక తెలుఁగుప్రతిలోను, మఱికొన్ని దక్షిణదేశప్రతులలోను

"అథైన ముపసంగమ్య పార్థం పార్థప్రియా సతీ;
ఉత్తరస్య నచ స్సర్వం యథా తథ్య మథాబ్రవీత్;
తచ్ఛ్రుత్వా చార్జునో వాక్యం ద్రౌపద్యాః పరికీర్తితమ్."
... ... ... ... ...

ఇట్లు ద్రౌపది యుత్తరుఁడు పలికిన పలుకులు చెప్పఁగా విని యర్జునుఁడు వనవాసకాలనుగుటను నిరూపించి తనసుగూర్చి యుత్తరచే నుత్తరునితోఁ జెప్పింపుమని పలికినాఁడు. ఇదియంతయు తిక్కనరచనకు సరిపోవుచున్నది చూడుఁడు:

"అనునప్పుడు తత్ప్రదేశంబున నునికిం జేసి,

"విని ద్రుపదధరణిపతినం
దన సామర్షాపహాసతరళహృదయ యై
చని తద్వృత్తాంతము నా
తనిపలుకులు చెప్పె నింద్రతనయునితోడన్.

"అతం డజ్ఞాతవాసవత్సరం బతీతం బగుట నిరూపించి పాంచాలి కిట్లనియె. నీవు పోయి వారలతో నిట్లనుము..."

ద్రౌపది తనంతట తానే యర్జునునితో సంప్రతింపకయే బృహన్నల సారథ్యము చేయఁగలఁడని చెప్పుట యంతయుచితముగ లేదని

తలంచి తిక్కన యిచ్చట మార్చియుండును. అజ్ఞాతవాసకాలము పూర్తి యైనదని యీమెకును దెలిసియే యుండుటచే నీయవకాశమును బోనీయక బృహన్నలకు వెంటనే తెలియఁజేసినది. అతఁడు నజ్ఞాతవాసవత్సరం బతీతంబగుట నిరూపించి యామెను వారలతోఁ దనను గూర్చి చెప్పుమన్నాఁడు. కాని ద్రౌపది సరాసరి యుత్తరునియొద్దకే పోయి చెప్పక యుత్తరయొద్దకుఁ బోయి యామెచేఁ జెప్పింపఁదలఁచుటలోఁ దన తెలివితేటలను గనుపఱిచినది. ఆమె యుత్తరతోఁ జెప్పుట నెంతస్వాభావికముగా రమణీయముగా సుచితభంగి రచియించినాఁడో తిక్కన చూడుఁడు:

"జనపతినందనుండు దగు సారథి నారయుచున్నవాఁ డెఱిం
గిన పని సెప్పఁగావలయుఁ గ్రీడి మనంబున మెచ్చునట్టి నే
ర్పును భుజశక్తియుం గలిగి రూఢికి నెక్కిన సూతవృత్తిమై
నని నడిసిన్న యేడ్తెఱ బృహన్నలకుం గల దంబుజాననా.

"అర్జునునకు ఖాండవ దహనాదులైన
విక్రమములు నా బృహన్నల వెరవులావు
గాదె జయ మొనరించె లోకంబు లెఱుఁగ
నువిద దీని నెఱింగింత ముత్తరునకు."

అని మన మిద్దఱము పోయి యెఱిఁగింతము రమ్మని తీసికొని పోయినది. "ఎఱింగినపని చెప్పఁగావలయు" ననుటలో ద్రౌపది యొక్క గడుసుఁదనము వెల్లడియైనది. "నాకు తెలిసిన పనిగదా చెప్పకుండిన బాగుండదేమో యని చెప్పుచున్నానే గాని మఱియొకటి కాదు" అని అర్జునునికి తనకుఁ గల సంబంధ మేమాత్రము స్ఫురింపకుండునట్లు చూచుకొన్నది. అత్తెఱంగు సముచితంబుగ నెఱింగించుటయు నుత్త

రుండు "అకట సైరంధ్రి నన్ను నిట్లాలిగొనంగ నేల...బృహన్నలసార థియైన దీని నవ్వరే" యని పలుకఁగా నాతనికిఁ దగినసమాధానముగా

"కారవసేన గాదు త్రిజగంబుల నొక్కటఁ నెత్తి వచ్చినం
దేరు బృహన్నలావళీగతిం జరియించిన గెల్వవచ్చుఁ ద
ద్వీరగుణంబుసొంపు పృథివీవరనందన మున్నె యుంగుడున్
గారణజన్మమై తనువికారము వచ్చినఁ బెంపు దప్పునే."

అని పలికి యాతని నెట్లో యొడఁబఱిచినది.

ఉత్తర పోయి బృహన్నల నన్న సారథ్యమునకై వేఁడుటలో

"సైరంధ్రి రాఖ్యాతి బృహన్నలే త్వాం
సుశిక్షితా సంగ్రహణే రథాశ్వయోః,
అహం మరిష్యామి న మేత్ర సంశయో
మయాావృతా తత్ర నచే ద్గమిష్యసి."

నీవు వెళ్లకపోయినచో నేను చచ్చిపోవుదునని, సంస్కృత మూలమున కుంభఘోణ ప్రతిలో కలదు. కాని తిక్కన యెంత ముద్దుగాఁ బలికించినాఁడో చూడుఁడు:

"నీ వొడంబడక తక్కుట నావలని వాత్సల్యంబుఁ గొఱంత పఱుచుట. యెల్లవిధంబులం దెత్తునని పూనివచ్చితి నీవును నాపలుకులు కుఱుచసేయక నీపెంపునుం బ్రకటంబుగా రథంబు గడప నియ్యకొనుము." అనిన నమ్మదితపలుకులు ముద్దుచేసి,

"భవదీయ ప్రార్థనచేఁ
దివిరి పరమదుష్కరములఁ దీర్చియయిన ను
త్సవ మొనరించెద సార
థ్యవిధం బొక డనఁగ నేల యంబుజవదనా."

యని తన ప్రభావమును బ్రకటించి ముందు తాను సాధింపఁబోవు పరమ దుష్కరకార్యమును సూచించినవాఁడుకూడ నైనాఁడు. ఇట్లే తిక్కన యెచ్చటి కచ్చట నాయాపాత్రల సంభాషణలు వారి వారి గుణశీలములకుఁ దగియుండి ధ్వనితోఁగూడినవై ఉత్తరకథార్థమును సూచించునవిగాఁ జేయుచుండును.

## విరటునికొల్వు-భీముఁడు

ఈ పై పద్యముచే నాలుగైదాశ్వాసములందలి కథయు, సందర్భునుఁడు నాయకుఁ డగుటయు సూచింపఁబడినట్లే, మొదటి యాశ్వాసమునంతమున ద్రౌపది పలుకులమూలముగాఁ దరువాతి యాశ్వాసమున జరుగఁబోవు కీచకవధ వృత్తాంతము, భీముని నాయకత్వము గూడ సూచింపఁబడినవి. ఇంతకు పూర్వమే విరటుని కొల్వు ప్రవేశించిన సందర్భమున భీముఁడు పల్కిన

> "తలమును లావు విద్య మెయి దర్పముఁ బేర్చి పెనంగు జెట్టి మ
> ల్లుల విఱుతున్ పడిన్ గడియలోనన చూడ్కికి వేడ్కసేయుదున్."

అను పల్కుల మూలముగా నా కీచకవధకు ముందు జరుగఁబోవు మల్ల యుద్ధప్రదర్శనముగూడ సూచితమైనది. ఇట్లీయాశ్వాసముననే గాక కీచకవధను తరువాత ఫలితముగా సంభవించిన దక్షిణగోగ్రహణకథకుఁ గూడ భీముఁడే నాయకుఁ డగుటచే రెండుమూఁడాశ్వాసములకు నీతఁడే నాయకుఁడు. ఈతనిని కేవలము నాయకునిగఁ జేయుటయే గాక, ద్రౌపది చెప్పినట్లుగా నుత్తమ నాయకత్వ గుణము లాతనియం దాపాదించినాఁడు తిక్కన. కావుననే మూలమునందలి పాత్రలకును, తిక్కన పాత్రలకును గొంత భేద మగపడుచుండును. తత్తత్పాత్రో

నీమ్రిలనమునకుఁ దగినట్లుగా మూలమున లేనివిషయములను. గొన్ని యాతఁడు చేర్పవలసి వచ్చుచుండును. "జెట్టి మల్లులను విఱుచు" విషయము మూలమునఁ గానరాదు.

" నిరుద్ధ శీలోస్మి సదాహి పార్థివ
గజాంశ్చ సింహాంశ్చ సమేయివా నహమ్."

అని మాత్రమే కలదు. అతని యుత్తమనాయకత్వమునుగూర్చియు నేమి లేదు. విరటుని కొల్వులోఁ బ్రవేశించుసందర్భమున నీతని యాకారము నెట్లు వర్ణించి యాతనిచే తిక్కన యెట్లు పలికించినాఁడో చూతుఁడు:

" మాప జెల్లను దన రూపంబు చూచ్చికి
ప్రేఁగైన నత్యంత విస్మయంబుఁ
బొందుచుండ సమీరణపుత్రుఁ డగ్ర
జుండు పోయిన దెసఁ దప్ప నొండువలన
సమదవారణపతి గమనమున మత్స్య
ధరణిపల్లభుసభ చేర నరుగుటయును."

తిక్కన భీముని గమనమును వర్ణించినప్పు డెల్లను దానిని సమదవారణపతి గమనముతోడనే పోల్చుచుండును. తరువాత మల్లుని తోడి యుద్ధమునకుఁగా భీముఁడు మల్లరంగమునఁ బ్రవేశించునపుడు కూడ నాతఁడు "మెత్తన యియ్యకొని గర్జించి గజాలస్యంబున నంగణంబు చొచ్చి" నట్లుగా వర్ణించినాఁడు. అక్కడ మూలములో "శార్దూల శిథిలం చరణ్" అని యున్నది. మల్లయుద్ధరంగములోనికి మల్లులు వచ్చుటను గజాలస్యగమనముతోడను పోల్చుటయే యుక్తతరంబను విషయ మాంధ్రదేశమున కుస్తీ పందెములకు వస్తాదులు నడచు

రీతిని చూచినవారికిఁ దోఁచకపోదు. తిక్కన తనకాలమున నాంధ్ర దేశమున విశేషముగాఁ బ్రబలియున్న యీ కుస్తీ పందెములను మనమున నిడికొనియే భీముని మల్లయుద్ధవర్ణనను రచించినాఁ డనుటలో సందేహము లేదు. భీము నొక పెద్దవస్తాదుగా నుద్దేశించియే యాతని నాయాసందర్భముల తిక్కన వర్ణించినట్లు కనఁబడుచున్నది. అయితే యిక్కడ బం. పరి. వారి పాఠములో, ననఁగా నుత్తరదేశప్రతుల పాఠములో

"ఉపాయయౌ సింహ విలాసవిక్రమః"

యనియు, పిదప విరటుఁ డీతనిఁ జూచి,

"సింహోన్నతాం సోఽయ మతీవ రూపవాన్,
ప్రదృశ్యతే కోను నరర్షభో యువా"

అని పలికినట్లుండఁగా, దక్షిణదేశప్రతులలో మొదట

"వృకోదరో దృశ్యత సింహవిక్రమః"

అనియే యున్నను, తరువాత నుత్తరదేశపాఠములలో లేని ప్రక్షిప్త శ్లోకములలో నొకదానియందు

"సభాగతో వారణయూథపోపమః"

అను విశేషణ ముండుటచే నిది తిక్కనరచనను జూచి రచించినదేమో యను సందేహము కలుగుచున్నది.

భీముఁడు ధరణివల్లభుని సభను బ్రవేశించినరీతియే గాక యాసమయమునందలి యాతని రూపు రేఖలు, గమనవైఖరి చూచినవారి కట్టిభావములు కలుగునో వర్ణించి చూపినాఁడు.

"ఉలుకును వెక్కసపాటును
దలకొను నెమ్మనముతోడ ధాత్రీరమణుం

డలఘుభుజ విపుల వక్ష
స్థల రేఖాకాంతిఁ బరవశత్వముఁ బొందెన్."

ఆతని వైవేషంబు చూచిన ఉలుకు, వెక్కసపాటును, విపులవక్షస్థల రేఖఁ జూచిన పరవశత్వము గలిగె ననుటలో తిక్కన ఎంత తూఁచినట్లు వర్ణించినాఁడో చూడుఁడు. అట్లు భీముఁడు మనుజేంద్రుకడకుఁ బోయి జయశబ్దపూర్వకంబుగ, వినయంబున మ్రొక్కి నిభృతుఁడై విన్నవించె నఁట. భీముని రూక్షత్వ దర్పములతోపాటాతని వినయసంపదను వ్యక్తీకరించుటకు తిక్కన ప్రత్యేకశ్రద్ధ వహించినట్లు కనఁబడు చున్నది. వెనుక భీముఁడు ధర్మజునితోఁ దాను మెలంగురీతిని జెప్పు నపుడుకూడ "గర గరగా గూఁడు గూర నరేంద్రుని చిత్తమునకు వచ్చిన యాచందమున నొనర్చి నేర్చి మెలఁగుదుఁ గరము వినీతి మెఱయ" యని పలికినాఁడు. 'నిభృతుఁడై' యను విశేషణమే యాతని వినీతత్వమును బహిర్గతము చేసి కార్యరూపమునఁ గనఁబఱుచుచున్నది. ఇఁక నాతఁడు విన్నవించినరీతిలో వినయము లేకపోలేదు గాని దర్పము, ననాగరకుని సరళత్వముతో (simplicity) గూడిన రూక్షత్వము (rudeness) వంటి రూక్షత్వము నెంత చక్కగాఁ గనఁబఱిచి నాఁడో చూడుఁడు. ఇచ్చట భీముని నోట శార్దూలవృత్తమును బెట్టిన తిక్కనార్యుని యౌచిత్యగ్రహణము నేమని కొనియాడవలసినది!

"దేవా, నాలవజాతివాఁడ నిను నర్థిం గొల్వఁగా వచ్చితిన్
సేవాదక్షత యొండు మై నెఱుఁగ నీ చిత్తంబునన్ మెచ్చున
ట్లే వండం గడు నేర్తు బానసమునం దిచ్చోటనే గాదు న
న్నే వీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁ డెబ్బంగులం జూచినన్."

ఆభావములు, వానిని నిర్భయముగా తిక్కనయె చెప్పినట్లు "నిరర్గళాలాపముల" నున్న దున్నట్లు చెప్పినరీతి, వానిని శార్దూల

వృత్తమునఁ జదువుటచేఁ గలిగిన యొకవిధమగు గాంభీర్యము, అన్నియుఁ భీముని స్వభావమునకుఁ దగినట్లే యున్నవి. ఇంకను నాతని వైఖరి అభినయమును జూడుఁడు. మత్స్యభూరమణుం డెట్లు నిను శూద్రుఁగాఁ దలఁపఁగవచ్చు ధరణీభరణక్షమమూర్తి వీవు నీకుఁ దగిన యానము నాస నాదుల నిచ్చెద గజప్రజముం బరికింపుమని పలికినమీఁదట

"...మొఱకుచందం
బున మోమడ్డము గదల్చి భూవిభుఁడు సభా
జనులు విన నవిలసుతుఁ డి
ట్లనియెన్ బ్రస్ఫుట నిరర్గళాలాపములన్."

మొఱకుచందమున మోమడ్డముగఁ గదల్చుట యెంత స్వాభావిక వర్ణనమై యున్నది. ఆతని పలుకు లెంత నిరర్గళములై యున్నవో చూడుఁడు:

"నా కవియెల్ల నేల నరనాథులకుం బ్రియమొందునట్లుగాఁ
బాకము సేయ నేర్తు జనపాలక, ధర్మసుతుండు పెద్దయుం
జేకొని యుండు ... ... ... ... ... ...

"వలసిన నేలు మేను బలవంతుఁడ గాఁ బెనుపోతు దంతి బె
బ్బులి మృగనాథునిం దొడరి పోరుదు శూరత యుల్లసిల్లఁగాఁ
దలమును లావు విద్యమెయి దర్పముఁ బేర్చి పెనంగు జెట్టిమ
ల్లుల విఱుతున్ వడిన్ గడియలోనన చూడ్కికి వేడ్క సేయుదున్."

"కొలువుగొను మొల్ల కుండుట
గలిగినఁ బొమ్మనుట యంతకంటెను మే లే
వలసినకడ కేఁగెద నీ
తల పెయ్యది యానతిమ్ము ధరణీనాథా"

ఈ భావములుగాని, యీరీతిని పలుకుటగాని ప్రాచీనోత్తర దేశపాఠమున లేదు. దక్షిణదేశపుప్రతులలో మాత్రమే గానవచ్చు చున్నది. పిదప నతని యీ నిరర్గళాలాపములఁ జూచి విరటుఁడు వెను కతగ్గి "మూర్ఖం ఛందానురోధేన" యనుసామెత ననుసరించి కాఁబోలు,

"ఇమ్మహనీయ రూపమున నేడ్తెఱ గన్గొని నీకు వేడ్క యో
గ్య మ్మగుభంగిఁ జెప్పితిమి గాని నరోత్తము, యొండుగాదు నీ
వెమ్మెయినైన నిల్చుటయె యిష్టము"

అని "సానునయంబుగాఁ బలి కె"నఁట. భీముఁడును మనమున నూరడిల్లి యుండెను.

అట్లు భీమునివలెనే తక్కిన వారందఱును "దమతమవర్తిల్లు నెడల సకలజనములకు హృదయానురంజన మొనర్చి తొల్లిమపుయి లోటు, యడఁకువ, తగవు, మెలపు నెఱిదెలంగను బాటింప నేర్పు గలిగి" యుండిరఁట. పాండవుల యజ్ఞాత వాసకాల ప్రవర్తనమును గూర్చి యెట్టి సముచితంబులగు విశేషణములతో వర్ణించినాఁడో చూడుఁడు:

"ఉన్నతులై వివిధదేశో
త్పన్నులు నద్భుత విధాయి బలవిక్రమసం
పన్నులు నగు మల్లులు విభ
వోన్నతుఁ డగు విరటుపాల నుద్భటవృత్తిన్."

"తమలోన మాటలాడెడు
సమయంబున నొక్కరుఁడు విశాలోరస్కుం
డమితబలుఁడు పంచానన
సమభీషణ మూర్తి యధిక సంరంభమునన్."

అని మల్లుని రాకను గూర్చి చెప్పుట కుపక్రమించినాఁడు తిక్కన.
కాని మూలమున

"అథ మాసే చతుర్థేతు బ్రహ్మణః సుమహోత్సవః,
ఆసీత్సమృద్ధో మత్స్యేషు పురుషాణాం సమంతతః;
తత్ర మల్లాః సమాపేతు ర్నానా దిగ్భ్యస్సమాగతాః.
... ... ... ... ... ...
అసకృల్లబ్ధలక్షా స్తే రంగే పార్థివసన్నిధౌ
తేషా మేకో మహా నాసీ త్సర్వమల్లాన్ సమాహ్వాయన్."

అని పాండవులు విరటుని కొలువు ప్రవేశించిన నాల్గవ మాసమున నొక బ్రహోత్సవమునకు మల్లులందఱు విరటుని పట్టణమును జేరిరని యున్నది. దక్షిణదేశపాఠములలో నిది "శంకరస్య మహోత్సవః" శంకర మహోత్సవమని యున్నది. తిక్కనార్యుఁ డీమహోత్సవ విషయమే తలపెట్టలేదు. ఈ శంకరోత్సవము గాని బ్రహోత్సవము గాని తెలుఁగుదేశములో జరుపునాచారము లేకుండుటచేఁ గాఁబోలు తిక్కన దీనిని వదలివేసినాఁడు. ఇంతేగాక యేదోయొక యుత్సవ సందర్భమున నూరిలో మల్లులు చేరిరనియు, వారిలో నొకరితో విరటుఁడు భీమునిఁ బోరించెననియుఁ జెప్పుట విరటుని "వైభవౌన్నత్య ములకుఁ" దగినది కాదని తలంచియుఁగూడ నాయుత్సవ విషయమున జాఱవిడిచి మహావైభవోన్నతుం డగు విరటుఁడు వివిధ దేశములందలి మల్లులను రప్పించి వారికి మడిమాన్యములనిచ్చి వారొనర్చు మల్ల విద్యా ప్రదర్శనములను జూచు వేడుకగలవాఁడై యుండెనని సూచించినాఁడు గొప్పసంస్థానములయందు రాజులు మల్లుల నాదరించుట సుప్రసిద్ధమే మనుమభూపాలుఁడు గూడ నట్లు చేసియుండు నని తలంపవచ్చును కావుననే తిక్కనార్యునకు మల్లయుద్ధ వినోదములం దాదరము

దానికి సంబంధించిన పేచీలను గూర్చిన సన్నిహితజ్ఞానము కలిగి యుండును.

అట్లామహోత్సవసందర్భమున వచ్చిన మల్లులలో నొకఁడు ప్రగల్భములు పలుకుచున్నఁ జూచి భయకంపితులై యచ్చట మల్లులం దెవ్వ నోరు మెదపకయుండ, విరటుఁడు కోపముతో మీ మాన్యములను, వేతనములను తీసివేయుదునని బెదరించి నట్లును, ధర్మజుఁ డది చూచి భీముని గూర్చి తెలిపినట్లును దక్షిణదేశ ప్రతులలోఁ గలదు.

"విరాటో వీక్ష్య తాన్ మల్లాన్ త్రస్తాన్ వాక్య మువాచహ
అనేన సహ మల్లేన కో యోద్ధుం శక్తిమా న్నరః,
ఇత్యుక్తా స్తే విరాటేన సర్వే మల్లా విశాంపతే;
తూష్ణీ మాసన్ తతో రాజా క్రోధా విష్ట ఉవాచహ.
గ్రామాశ్చ వేతనా న్యేషాం మల్లానాం హారయా మ్యహమ్;
తతో యుధిష్ఠిరోఽవాదీత్ శ్రుత్వా మత్స్యపతే ర్వచః"

తిక్కన యీ విషయమంతయు వదలి వైభవోన్నతుఁడను టచే విరటుని గొప్పతనము సూచించినాఁడు. మాన్యములిచ్చి మరల తీసికొందునని బెదరించునట్టి సులభకోపుఁడును, లఘుహృదయుఁడును కాఁడని సూచించుటకే యీవిషయమును వదలి వేఱు విశేషణములను వేసినాఁడు. విరటునకీ మల్లయుద్ధముల నేర్పాటుచేసి వేడుకచూచు నలవాటు కలదనియు, నిత్తెఱంగున భీముఁ డితనికి వేడ్కసలుపుచుండుటే గాక చక్కని మల్లులు లేనితఱి నంతిపురంబులలోఁ గూడ నింతులు చూచుటకుఁగా న య్యవనీకాంతుండు శార్దూల శుండాలాదులతోఁ బోరించుచుండెడి వాఁడనియుఁ దెలిపి యున్నాఁడు. విరటుని కిదియంతయు వేడుకయే. భీముఁడును దాను వేడుకకే పెనఁగుచున్నట్లు స్పష్టముగాఁ జెప్పినాఁడు.

" అధిప ధర్మజుపాల నున్నప్పు డతని
వేడుకకుఁ దగఁ బెనఁగెదు వింతలైన
జెట్టిమల్లులతో నిప్పు డట్టివోలె
నీదు వేడ్కకుఁ బెనఁగుదు నేర్చినట్లు "

అని ధర్మతనయు కనుసన్నగనుంగొని, మెత్తన యియ్యకొనియెనఁట. మూలములో భీముఁ డీసందర్భమున నెట్లు ప్రవర్తించినాఁడో చూడుఁడు:

" నరేన్ద్ర తే ప్రభావేన శ్రియా శక్త్యాచ శాసనాత్,
అనేన సహ మల్లేన యోద్ధుం రాజేన్ద్ర శక్నుయామ్,
మహాదేవస్య భక్త్యాచ తం మల్లం పాతయా మ్యహమ్. "

"ఓ రాజా, నీ ప్రభావముచేతను, శక్తి శాసనములచేతను ఈ మల్లునితోఁ బోరుటకు శక్తిగలవాఁడ నగుచున్నాను. మహాదేవుని యందలి భక్తిచేత నీతనిని పడఁగొట్టఁగలను" అని యీ మూలమునఁ గలదు. రాజు శాసనమువలననే యీతఁడు పెనఁగుచున్నట్లున్నది. భీమునిగూర్చి రాజునకుఁ జెప్పటలోఁ గూడ నెంతచమత్కారముగ రచించినాఁడో చూడుఁడు. విరటునియొద్దనుండు మల్లులు తమలో మాటలాడుకొనుచుండెడుసమయమున "నొక్కరుఁడు విశాలోర స్కుం డమితబలుఁడు పంచానన సమ భీషణమూర్తి యధికసంరంభ మున" నానరపతి యెదుట నిల్చి మ్రొక్కి భుజాస్ఫాలనంబుచేసి,

" నేల నాలుగు చెఱఁగుల నృపులకొలువు
లందు నేను వర్తించితి నవనినాథ
యగ్గలించి నాయెదుర బాహాస్ఫాలించి
కడఁగఁజాలెదు మల్లుఁ డెవ్వఁడు నెందు"

అని చెప్పినాఁడఁట. ఈ విషయము మూలమున లేదు.

"ఆగతం మల్ల రాజం మాం కృత్స్నే పృథివీమండలే;
సింహవ్యాఘ్ర గజైస్సార్థం క్రీడంతం విద్ధి భూపతే"

అనిమాత్రమే యన్నట్లున్నది. "నేల నాలుగు చెఱగుల నృపుల కొలువులందు నేను వర్తించితి" నని యీమల్లునిచే పలికించుటలో తిక్కన యాసందర్భమున నెన్ని విశేషగుణములను సాధించినాడో చూడుఁడు. ఆ జాతీయ ప్రయోగమువలన నామల్లుని దర్పము నౌద్ధత్యము నెంత సులభముగానో మన మనముల కెక్కునట్లు చేసి నాఁడు. ఈతఁ డాగంతుకముగ నేయుత్సవసమయమునకో విరటుని పట్టణము చేరినవాఁడు కాక, ప్రసిద్ధులగు రాజుల కొలువులన్నిటిని జూచుకొనుచు, నచ్చటి ప్రసిద్ధమల్లుల నోడించుచు దిగ్విజయమునకై బయలు దేఱినవాఁడు. అట్టివాఁడు గనుకనే విరటునియొద్దనున్న మల్లు లందఱు జంకినారు.

"...వాని సముదాకృతియుం బటువాక్యప్రౌఢియుం
గని విని మల్లు లెల్ల భయకంపితమూర్తులు దాల్చి మాఱుప
ల్కను గనువిచ్చి చూడను మొగం బెగయింపను జాలకున్నవారు."

అప్పు డా జనపతి వేడ్క ప్రమోదపడుచందముగాంచి యుధిష్ఠిరుండు భీముని విషయమును రాజున కెఱింగించెనని చెప్పుచు ధర్మజుఁ డీ విషయమున తాను కలుగఁజేసికొనుటకుఁ గారణమును దెలిపినాఁడు. ఇక్కడఁకూడఁ జనపతివేడ్క ప్రమోదపడుట యని చెప్పుచు నిదియంతయు వేడుకకొఱకు జరిగినదనియే సూచించుచున్నాఁడు. మల్లుల యశక్తస్థితి మనకన్నులయెదుట రూపొందునట్లుగా (picturesque) వర్ణించినాఁడు. పల్కను, జూడను, మొగమెత్తుటకైనఁ జాలకుండిరట. జనపతివేడ్క ప్రమోదపడుచందముఁ జూచియే యుధిష్ఠిరుఁ డావ్యవ

హారమునఁ బ్రసక్తి కల్పించుకొనె ననునుద్దేశము (motive) మూలమున లేదు. మూలపాఠముకూడ నిచ్చట రెండు విధములుగా నున్నది. ఉత్తరదేశప్రతుల పాఠములో ధర్మజుఁడు సలహా చెప్పుట యను విషయమే లేదు సరిగదా, మల్లులందఱు ముఖములు తేలవేయఁగా విరటుఁ డప్పుడు సూతుని వానితోఁ బోరించెననియు, సూతుఁ డశక్తుఁడగుటను జూచి సూదునిచే పిదప పోరించెనని మాత్రమే కలదు.

"యదా సర్వే విమనస స్తే మల్లా హతచేతసః,
అథ సూతేన తం మల్లం యోధయామాస మత్స్యరాట్;
కీచకో ఽపి యదా మల్లం న విశేషయతే బలాత్,
తదా సూదేన తం మల్లం యోధయామాస మత్స్యరాట్;
నోద్యమాన స్తథా భీమో దుఃఖేనై వాకరో న్మతిమ్,
నహి శక్త స్స దాక్షిణ్యాత్ ప్రత్యాఖ్యాతుం నరాధిపమ్."

ఇచ్చట నీపాత్రలఁ గూర్చిగాని, వారిచర్యలనుగూర్చిగాని మన కెట్టి యుత్సాహమును కలుగుటలేదు. అవి కొయ్య బొమ్మలవలె నుండెనేకాని వానియందు జీవకళ, చైతన్యమున గపడదు. ఇఁక దక్షిణదేశ పాఠమునందలి కథ యింతకంటె తిక్కన కథకు దగ్గఱగా నున్నది. ఇందు మల్లయుద్ధరంగమునకు కీచకుఁడు రానేరాఁడు, వాని ప్రశంసయే లేదు. రాజునెదుటకు వచ్చిన భీముని యాకారము మనకు మూలములో నేమియుఁ గనఁబడదు. తిక్కన మనకు చక్కగాఁ జూపినాఁడు.

"...అతఁడు భయభక్తులతోఁ
జనుదెంచి మల్లవర్గముఁ
గని పైై వెలుగంగ నిలిచె కౌతూహలియై."

రాజునొద్దకు వచ్చినపుడు భయభక్తులతో వచ్చినిలిచినను మల్లులను జూచినతోడనే వారితోఁ బెనఁగవలయు ననెడికౌతూహలముతో పాటతని మెయిపొంగుఁ బెటిగినదఁట. భీముని శీలముపట్ల నీ యభినయసూచన యెంత సముచితంబైనదో గమనింపుఁడు. కాని రాజామల్లముఖ్యుం జూపి యితనితోడి కయ్యంబునకు సన్నద్ధుండవు కమ్మని చెప్పినను ధర్మతనయుని కనుసన్న గనుంగొననిదె మాఱువలుక లేదు. పలికినపుడైనను సంస్కృతమునందువలె "తంమల్లం పాతయా మ్యహం" "మల్లేన యోద్ధుం శక్నుయాం" అని చెప్పక "ధర్మజునిపాలను వింతలైన జెట్టి మల్లులతోఁ బెనఁగుచుందును. ఇప్పుడట్టివోలె నీదువేడ్కకుఁ బెనఁగెద నేర్చినట్లు" అని వినయము దోఁపఁ బలికినాఁడు. "అని మెత్తన యియ్యకొనినాఁడు." సామాన్యముగా భీముఁ డెవ్వరిమాటలను లక్ష్యపెట్టక సమయము సందర్భమును లేక ప్రతిపనికిని తనశరీరబలంబుపైననే యాధారపడు మోటమొద్దువంటివాఁడను సామాన్యాభిప్రాయముఁ బోఁగొట్టి, యాతని శరీరబలమును, పట్టుదలను యుక్తాయుక్తవిచక్షణ లేక ప్రయోగించువాఁడు కాఁడని చూపుటకే తిక్కన యత్నించుచున్నట్లున్నవాఁడు. వాని సహజగుణములను జూపుచునే వినయాదిగుణములను మఱికొన్నిటి నాపాదించి భీముని శీలము నించుక సంస్కరింపఁదలచి (tone down) నట్లు కనఁబడుచున్నాఁడు. కావుననే భీముఁ డన్నగారి కనుసంజ్ఞ గైకొననిది మాటలాడనైన లేదు. "భవదాజ్ఞా దృఢబంధ సంయమిత శుంభద్వేగమై" యున్న దొక యర్జునద్విపమే కాదు, ఈ భీమశార్దూలముకూడ నట్టిదే యని సూచింపఁదలఁచిన ట్లున్నాఁడు. అట్లు 'మెత్తన' యియ్యకొనినను, వెంటనే గర్జించి, గజాలస్యంబున నంగణంబు సొచ్చి, భూపాలునిముందట భుజాస్ఫాలనంబు చేసి,

మ్రొక్కి, మరలినాఁడఁట. ఈ కృత్యములన్నియు మనకు నిత్యపరిచితములగు మల్లయుద్ధ సంప్రదాయముల కెట్లు తగినట్లున్నవో చూడుఁడు. ఈ మల్లయుద్ధమునంత నొక నాటకరంగమునందువలె మనకన్నుల యెదుటఁ బెట్టుచున్నాఁడు తిక్కన. మల్లురు కుస్తీకిఁ బోవునప్పటి యాటోపంబుతోఁగూడిన వికారపు నడకను "గజాలస్యంబున" అను పద మెంత చక్కఁగా వ్యక్తము చేయుచున్నది. ఈతఁడు రాజునకు మ్రొక్కి మరలునప్పటి కా రెండవ మల్లుఁ డంతకుమున్నె కృత పరికర బంధుండై యచ్చట నుండుటచే నాతని కెదురుపడినాఁడు. అప్పుడు వారిద్దఱు పరస్పరమూర్తుల నవలోకించుకొనుట, యుద్ధరంగంబుమన్ను ఫాలప్రదేశంబున ధరియించి శరీరంబులపైఁ జల్లుకొనుట,-(ఈ సందర్భమున

"యోద్ధుం వ్యవస్థితౌ వీరౌ రేణుం సంస్పృశ్య హస్తయోః"

అని యొకపద్యపాదము మాత్రము దక్షిణదేశప్రతుల పాఠములోఁ కలదు), రెండుచేతుల మునివ్రేళ్లను గొండొక పుచ్చికొని యొండొరులదెసకు వైచికొనుట, యున్నతంబులగు నపసవ్యకరంబుల నాకుంచిత సవ్య బాహుతలంబు లప్పళించు చప్పుళ్లు గలసి యొక్కరుండె మల్లసఱచిన చందంబున వీతెంచుట, పిదప వింతతానకంబుల నిలిచి కదియుట, యీమొదలగు కృత్యంబులవర్ణన నొక్కమాఱు చదివినంతనే భీమ మల్లులయుద్ధసన్నాహం బంతయు నాట్యరంగంబునవలె నెదుట కనఁబడుచునే యుండును. మూలమున చేతులకు మట్టి రాచుకొనుట తప్ప మఱేమియు లేదు. ఆంధ్రదేశాచారములనే తిక్కన యిచ్చట వర్ణించినాఁడని చెప్పవచ్చును. ఈ మల్లయుద్ధాచారములనే కాదు, వారు పట్టినపట్లనుగూడ వర్ణించినాఁడు; గాని యవి యీ కాలమున విశేషము ప్రచారములో లేకుండుటచే నాయాపదము

లెట్టి పేచీలను దెలుపునో తెలుసుకొనుటకు వీలులేకపోవుటచే నన్నిటికిఁగూడ "మల్లబంధ విశేషములె" యని యర్థము చెప్పుకొనవలసి వచ్చినది. మొన్న మొన్నటి వఱకు మన దేశపు స్త్రీలు ధరించు నగల పేర్లు, పిల్లల యాటలపేర్లు ఇప్పటి నాగరక స్త్రీపురుషులకుఁ దెలియుట కవకాశము లేనంతటి స్థితి యేర్పడుచుండఁగా, నవనాగరకతా ప్రవాహ మంతవేగముగ మనలను ముంచివేయుచుండఁగా, తిక్కననాఁటి వస్తాదులు చూపిన మల్లబంధవిశేషములు సాండోడంబెల్సు మొదలగునవి ప్రబలిన మనకాలమున సులభముగ నర్థమగుట యెట్లు తటస్థింపను? కావున తిక్కన రచించిన "ఉపతాయిలోఁ దన కొదవినతోరహత్తముఁ జూపి ప్రేయక సమదవృత్తి" అనుసీసపద్యములోని మల్లయుద్ధ వర్ణనను, నందలి యుపతాయి, తోరహత్తము, సీసానఁబట్టుట మొదలగు బంధ విశేషములను చదువుకొని సంతోషింపవలసిన స్థితి కలుగుచున్నది, ఇట్టి మల్లబంధములఁ జూపి యనేకగతుల యోజలు మెఱయుచు విరాటునకు వినోదంబు సలిపి —(ఈతని వినోదముకొఱకే భీముఁ డీమల్లబంధములను—పేచీలను— చూపినది అని తిక్కన మరల జ్ఞాపకము చేయుచున్నాఁడు)—తుద కాతని కచ్చఁబట్టి కాళ్లుచేతులు వ్రేలాడుచుండఁ బైకెత్తి ముక్కున నోటను నెత్తురు గ్రక్కుకొనునట్లు విసరి నేలఁబడవైచి వీపునమండి వెట్టి గూరుచుండెను. అప్పుడామల్లుఁడు పెలుకుటి—విహ్వలతఁ జెంది—తాళంబీయ మదిఁదలఁచియు వీలులేకపోవుటచే నేలను చేతులతోఁ గొట్టసాగెనఁట. "ధరణి తలంబు గరతలంబులప్పళించె." తాళంబిచ్చుట యనునది 'మల్లబంధ విశేషం" బనియే శబ్దరత్నాకరమునఁ జెప్పఁబడినను, ప్రస్తుత సందర్భమునుబట్టి, బోర్లఁబడవేసి వీఁపున మండివెట్టి పైని గూరుచున్న వానిని క్రిందఁబడి యున్నవాఁడు ముం

దరిభాగమునఁ గొంత పైకిలేచి తనచేతులు రెంటితోఁ బైన కూరు
చున్నవానిని తాళమువేసినట్లు పట్టుకొన యత్నించుటయే తాళం
బిచ్చుట యను దానియర్థము గానోపునని తలంపవచ్చును. వాఁడట్లు
చేయ— తాళంబీయ— చేతఁగాక ధరణీతలముఁ గరతలంబుల నప్ప
ళించుటయే తానాయుద్ధమున నోడితినని యంగీకారమును దెలుపు
చిహ్నముకాఁబోలును. తిక్కనకాలమున ఈ కాలమున "షీటీమన్న"
చేయుటయే, అనఁగా వెలకిలఁబడునట్లు చేయుటయే దానికి చిహ్న
ముగా గ్రహింపఁబడుచువచ్చిన ట్లున్నది. అట్లు వాఁడు నేల నప్పళిం
చుటతోడనే వాఁడోడెననియు, భీముఁడు గెలిచెననియుఁ దెలిసికొనిన
యాకొలువులోనివా రార్చుటయు నా భీముఁడు వానిని విడిచివేసె
నఁట. ఆకొలువులోనివా రీకుస్తీపందెమును జూచుచు గెలుపోటములను
నిశ్చయించుటలో నెంత కౌతూహలాయత్తచిత్తులై యుండినట్లు
తిక్కన చూపినాఁడో చూడుఁడు. ఇదియంతయు తిక్కనార్యుఁడు
స్వయముగాఁ దెచ్చిపెట్టినదే. మూలములో వీరి యుద్ధము గుద్దు
కొనుట, తన్నుకొనుట, మొదలగువానితోఁ గూడియున్న దేగాని,
వేడుకగాఁ జూచుటకుఁ దగిన పేచీలతోఁ గూడి యుండలేదు.
ఇంతేగాక యామల్లుఁడు భీమునిచేతులో హతుఁడై గతజీవుం డగుటచే
తిక్కనార్యుఁ డుద్దేశించిన వేడుకకే యవకాశము లేకపోయినది. కాని
దీనిని చూచియే విరటుఁడు సంతోషించినట్లు మూలములోఁ గలదు.

"ఉత్ క్షేపణే క్షేపణే చ పార్శ్వ పేషణమేవచ,
కిలై ర్వ్రజనిపాతైశ్చ రాగోద్యోతైశ్చ కర్కశైః;
బాహుబంధై స్తథా క్షేపైః పాదబంధై స్తథైవచ,
ప్రకర్షణా పకర్షాభ్యాం అభ్యాకర్ష వికర్షణైః;
ఆకర్షతా మథాన్యోన్యం జానుభి శ్చాభి జఘ్నతుః."

"భ్రామయిత్వా శతగుణం గతసత్వ మచేతనమ్
ప్రత్యపింషన్ మహాబాహుః మల్లం భువి వృకోదరః
తస్మిన్ వినిహతేమల్లే జీమూతే లోకవిశ్రుతే
విరాటః పరమం హర్షమగచ్ఛ ద్బాంధవైస్సహ"

రాజు దీనిని జూచి సంతసించి బహువిత్తమునుగూడ నిచ్చి నాఁడట. ఈసందర్భమున నుత్తరాది పాఠములో లేని విశేషమొకటి దక్షిణపాఠములోఁ గలదు. అది యేమనఁగా నచ్చటి జనులు (తిక్కన రచనలోవలె నక్కొలు వార్చుటకు బదులుగా) పలువురి ట్లీహింస యొనర్చుట మల్లధర్మము కాదని పలికిరనియు, వారట్లు పలుకఁగా భీముఁడు "నేను వల్లవుఁడను గాని మల్లుఁడనుకాను. మల్లధర్మమేమో నాకుఁ దెలియ"దని బయలు చెప్పిపోయిన ట్లున్నది.

"న హ్యాత ద్యుద్ధ ధర్మోఽయం ఇతి సర్వే బ్రువంతి తే,
మల్లానామితి తచ్ఛ్రుత్వా భీమ స్తం వల్లవో ప్యబ్రవీత్;
న మల్లో మల్లధర్మజ్ఞో రాజ్ఞః ప్రీతికరో బ్రవీత్,
తచ్ఛ్రుత్వా వచనం తథ్య మితి సర్వే బ్రువంతి తే."

తిక్కనలో వలెనే మల్లసంప్రదాయ కృత్యముల నీ మల్ల వీరు లిద్దఱు చేసినట్లుగా వర్ణించి నేను మల్లుఁడను కానని పలికించుటచే నెట్టి పూర్వోత్తర విరోధ మేర్పడుచున్నదో గమనింపుఁడు. మూల శ్లోకము లట్లె యుండఁగా, మధ్య మధ్య తిక్కనరచనను జూచియో, వర్ణనను గుణవత్తరముగఁ జేయవలెననియో, తమ తమ యిష్టము వచ్చి నట్లు పలువురు పలు శ్లోకములను మధ్య మధ్య చేర్చుచు వచ్చిరను టకు సందేహము లేదు. ఈ పైశ్లోకములు దక్షిణదేశప్రతు లన్నిటిలోఁ గూడఁ గానరావు. కొన్ని తెలుఁగు ప్రతులలోనే కలవు. కావ్యకళా

దృష్టితో రచింపఁదొడఁగిన తిక్కన కీహింసాకృత్య మసహ్యముగాఁ
దోఁచుటచే దీని నంతయు నొక వినోదార్థమైన మల్లయుద్ధప్రదర్శనముగా
మార్చివేసి, భీముని వినయసంపన్నునిగను, తన బలసామర్థ్యములచే
నితరుల కానందమును, వినోదమును గూర్పఁగలిగిన వానిగాను జేసిచూపి
నాఁడు. విరటుని శీలముకూడ కళంకరహితమై, యాతని యౌదార్య
గౌరవాతిరేకముతోఁ గూడిన విభవోన్నతి ప్రకటితమైనది. ఈ
మూలమున తిక్కన కాంధ్రదేశమందలి మల్లయుద్ధవినోదములను గూ
ర్చిన సంప్రదాయములను, విశేషములను శాశ్వతంబగు వాఙ్మయరూప
మునఁ జిత్రించి పెట్టుటకు మంచియవకాశము దొరకినది. ఇట్టి జగద్వి
ఖ్యాతుఁడగు మల్లు నవలీలగ నెత్తివైచి ప్రాణావశిష్టుఁగఁ జేసి విడిచిన
భీమునికి కీచకునివధ దుస్సాధ్య మెంతమాత్రము కాదను భావము చదు
వరులకుఁ గలుగఁజేయుచు నిచ్చట తిక్కన భీముని మల్లయుద్ధ నైపు
ణ్యమును రుచిచూపినాఁడు.

ఇట్లీ యసాధారణ కృత్యములను జూచి యెవరైన వీరినిగూర్చి
సందేహింపలేదా యను ప్రశ్నను వారించుచు, తిక్కన ముందే జాగ్ర
త్తపడి,

"పెఱవారలు దమమెలఁగెడు
తెఱఁగుల దొరఁకొన్న వింత తెఱవుల నేర్పుల్
మెఱయుచు బతిచిత్తముఁ గొన
నొఱపు గలిగి మాన్యవృత్తి నుండుదురు దగన్."

అనిచెప్పి మూలములో లేకున్నను తా నొకసమాధానము కల్పించి పెట్టి
నాఁడు. దీని మూలమున ముందు జరుగనున్న కథార్థమునుఁ గూడ
సూచించినాఁడు.

పెఱవారలు దము మెలఁగెడు తెఱఁగుల దొరకొన్నచో వింత తెర వుల నవలంబించి, యత్యంతశ్రద్ధతో బయలుపడకుండ రాజు చిత్తమున కనుకూలముగా నీపాండవులు దముగౌరవమునకుఁ దగినట్లు ప్రవర్తించుటలో మిగుల జాగరూకులై యుండిరఁట. దీనివలన కీచకుని వలనఁ గలిగిన యవరోధమునుండి తాము బయలుపడకుండఁ దప్పించు కొనుటకై యవలంబించిన వింత తెరవును, నేర్పును, దుర్యోధనుఁడు తమసంగతినిఁ దెలిసికొనుటకుఁగాఁ జేసిన ప్రయత్నమునఁ దాము బయ లుపడకుండ రాజునకు సహాయముచేసి యాతని చిత్తమును గొన్నరీతి యు, తుదకు విరటుఁడు పాచికతోఁ గొట్టినపుడు గూడ తాము బయలుపడక యాతని కపకారము గాని తెరవున వింత నేర్పుల మెఱసి తుద కాతనిచిత్తము గొన్నరీతియు నీ మొదలగు వాని నీ పద్యముచే తిక్కన సూచించువాఁడువలె నున్నాఁడు.

కీచకవధఘట్టమునందు తిక్కనార్యుఁడు చూపినరచనా కౌశల మును, మూలమునుండి యీతనిరచన భేదించిన సందర్భములను పరిశీ లింతము.

## కీచకవధ ఘట్టము

తిక్కనార్యుఁడు కీచకవధఘట్టమును గేవల మొకప్రబంధముగా రచింపఁదలఁచినవాఁడై, "ఇట్లు పాండవులు పాంచాలీసహితంబుగా విరాటనగరంబున వర్తించుచు" అని చెప్పి తిక్కన పాంచాలీసహితు లైన పాండవుల వర్తనమును గూర్చియే మరల నిచ్చట నెత్తినాఁడు. పాండవులు పాంచాలీసహితులై యుండుటచే వారికిఁగలిగిన చిక్కుల నైపుణము మనమునముల నాకర్షించుటకును, ఆచిక్కులను వారెట్టి వింత తెఱవుల మెఱసి దాఁటినది సూచింపఁదలఁచినవాఁడువలె నీవిశేషణమును.

వేసినట్లున్నాఁడు. ఇట్లు జాగరూకులై వర్తించుచుఁ గతిపయదివసంబులు గొంతగా నేఁడుకాలంబు గడపిన సమయంబున నొక్కనాఁడు సింహబలుండు తనయప్ప సుదేష్ణకు మ్రొక్కంజనువాఁ డద్దేవి కనతి దూరంబుననున్న ద్రౌపదిని గాంచుట తటస్థించినదని చెప్పినాఁడు. ఇందలి కాలవిషయమున ప్రాచీనప్రతులలో బం. పరి. వా రాదరించిన పాఠములో పదినెలలుమాత్రమే గడచినవని యున్నది.

> "ఏవం వసత్సు పార్థేషు మత్స్యస్య నగరే తదా,
> మహారథేషు ఛన్నేషు మాసా దశ సమభ్యయుః;
> యాజ్ఞసేనీ సుదేష్ణాంతు శుశ్రూషన్తీ విశాంపతే,
> అవస త్పరిచారార్హా సుదుఃఖం జనమేజయ."

దక్షిణదేశపు ప్రతులలోను, కొన్ని యుత్తరదేశప్రతులలోను

> "తస్మిన్ వర్షే గతప్రాయే కీచకస్తు మహాబలః"

అనియు, తెలుఁగుప్రతిలో

> "మాసాశ్చైకాదశాత్యయుః"

అనియు, బ్రౌన్‌దొరగారి తెలుఁగుప్రతిలో మాత్రము

> "పశ్చాత్తు ద్వాదశేమాసే వీరోత్సన్నత్తో మహాబలః,
> తస్మిన్ వర్షే గతప్రాయే ప్రవాసా దాగత స్తదా;
> కీచకో నామ మాత్స్యస్య శ్యాలో నిత్యం భృశం ప్రియం."

అనియుఁ గానవచ్చుచున్నది. ఈతెలుఁగుప్రతిలో మొదట 'పశ్చాత్తు ద్వాదశేమాసే' అని చెప్పి మరల 'తస్మిన్ వర్షే గతప్రాయే' అని చెప్పుటచే నీరెండుపాదములు నొక్కసారి రచింపఁబడలేదేమో యనుసందేహమున కవకాశమున్నను, మొత్తముమీఁద నిదియే తిక్కనరచనకు దగ్గఱగా నున్నట్లు కనఁబడుచున్నది. ఉత్తరదేశ పాఠములోని "మాసా దశ

సమభ్యయుః" అను కాలసూచనకు ముందరి గ్రంథముతో పొందిక కనం
బడుట లేదు. ఏలయనంగా, కీచకవధయైన మఱునాండే ద్రౌపది సుదేష్ణ
యొద్దకుం బోయినపుడు "రాజు గంధర్వులవలని పరాభవముచలన భయప
డుచున్నాండు. కావున నీ వెచటికేనిం బోవున"దని పలుకంగా, ద్రౌపది

"త్రయోదశాహ మాత్రంతు రాజా రక్షతు భామిని,
కృతకృత్యా భవిష్యంతి గన్ధర్వా స్తే న సంశయః;
తతో మా ముప నేష్యంతి కరిష్యంతి తవ ప్రియమ్,
ధ్రువంహి శ్రేయసా రాజా యోక్ష్యతే సహ బాన్ధవైః"

అని ఇంక పదుమూండుదినములు గడువు పెట్టినట్లు కనంబడుచున్నది. అనం
గా కీచకవధ జరిగిన నాంటికి పాండవుల యజ్ఞాతవాసకాల మింక పదు
నాలుగు దినములు మాత్రము శేషించియున్నట్లు తెలియుచున్నది.
వధకుం బూర్వదినముననే కీచకుండు సుదేష్ణయింట ద్రౌపదిని జూచి
మోహించుట, యాదినముననే సుదేష్ణ ద్రౌపదిని కల్లుదేరం గీచకునింటికిం
బంపుట, ద్రౌపదీపరాభవము మొదలగునవి జరిగినవి. ఆరాత్రియే ద్రౌపది
భీమునొద్దకుం బోయి తన పరాభవమును గూర్చి తెలిపి మఱునాండు కీచ
కుని సంకేతస్థలమునకు రమ్మని చెప్పంగా నారాత్రి వాండచ్చటికి వచ్చు
టయు, వధింపంబడుటయు జరిగినవి.

ఉపకీచకులు కీచకున కగ్ని యిచ్చుట, యుపకీచకులవధ, ద్రౌప
దీమోక్షణమే కాక విరటుండు దీనినంతను విని భార్యతో ద్రౌపదిని
పొమ్మని చెప్పుమనుటయుం గూడ నారాత్రియె జరిగినట్లు తిక్కన
తెలిపియున్నాండు. పిదపనే ప్రభాతం బయినది.

మఱునాండు ప్రాతఃకాలమున ద్రౌపది సుదేష్ణను జూడంబోయి
నప్పుడే యామె "మాపురము రాష్ట్రంబు వెడలిపొమ్మందైనక"
అని చెప్పుటయు, ద్రౌపది

"ముందటియట్ల యింక పదుమూఁడుదినంబుల మాత్రకుం భవ
న్మందిరవాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ"

యని బదులుచెప్పినట్లును తిక్కన రచించినాఁడు. దీనికి వెనుకటి దినముఁగాక నా ముందు దినముననే కీచకుఁడు ద్రౌపదినిజూచుట తటస్థించినది గావున నజ్ఞాతవాసము 15 దినముల కంతమగు ననఁగా ద్రౌపది కీచకునికంటఁ బడిన ట్లగుచున్నది. దీనినిబట్టి చూడఁగా బండార్కరు పరిశోధనాలయమువా రాదరించిన పాఠములోనే "మాసా దశ సమభ్యయుః" అని అజ్ఞాతవాసకాల మింకను రెండు నెల లున్నట్లు సూచించియు, "త్రయోదశాహమాత్రంతు రాజారక్షతు భామిని" యని ద్రౌపది పలికినట్లుగాఁ జెప్పఁబడుటచే పూర్వోత్తర సందర్భ మేమియు కుదురుట లేదు. తెలుఁగులో కతిపయదివసంబులు కొలంతగా నొకయేఁడు గడచినట్లు చెప్పుటయేకాక, ద్రౌపదిని కీచకుఁడు చూచునప్పటికి మిగిలియున్న యా కతిపయదినములు పదునేనే యైనట్లు సూచించుచు, దానికిఁ దగినట్లుగా నప్పటప్పటి కాలస్థితిని సందర్భానుకూలముగా తిక్కనార్యుఁడు వర్ణించుటంజేసి, యీమార్పు తిక్కనార్యుఁడే చేసియుండెనని నమ్మఁదగియున్నది. 'వర్షే గతప్రాయే' యన్న పాఠము తిక్కన తెలుఁగును జూచి రచింపఁబడి యుండవచ్చును.

ఇట్లు కీచకుఁడు ద్రౌపదిని జూచిననాఁటికి వీరి యజ్ఞాతవాసము 15 దినము లుండెనని ద్రౌపది పెట్టిన గడువునుబట్టి నిశ్చయించినాముగదా. అనఁగా కీచకుఁడు ద్రౌపదిని చూచిననాఁటినుండి యుత్తరగోగ్రహణసందర్భమున నర్జునుఁ డజ్ఞాతవాసదీక్ష వదలి బయలం పడిన నాఁటికి 15 దినము లైననుట. ఉత్తరగోగ్రహణము, అర్జునుఁడు బయలుపడుట, దుర్యోధనాదుల సందేహమును దీర్చుటకుఁగా ద్రోణుని ప్రార్థనపైని భీష్ముఁ డజ్ఞాతవాసవత్సర వ్యాప్తిని నిష్కర్ష చేసి "పచ

మూఁడు హాయనములు దప్పక నిన్నటితోఁ దవ నిండె"నని చెప్పుట,
యివి యన్నియు తెలుఁగు భారతము ప్రకారము నొక బహుళ నవమి
నాఁడు జరిగినట్లు కనఁబడుచున్నవి. ఏల యనఁగా, దుర్యోధనుఁడే

"బహుళాష్టమి యీతఁడు స
న్నహనముతో బసులఁ బట్ట నవమిని మన గో
గ్రహణ మని నిశ్చయించి"

యున్నట్లు చెప్పఁబడినది. మూలములోను త్తరదేశ పాఠమున

"ఆవర్తగాః సుశర్మా వై ఘర్మపక్షస్య సప్తమీమ్,
అపరం దివసం సర్వే రాజన్ సంభూయ కౌరవాః;
అష్టమ్యాం త్వనుగృహ్ణాంత గోకులాని సహస్రశః"

అని సుశర్మ దక్షిణగోగ్రహణము ఘర్మపక్షమున సప్తమి దినమునను,
కౌరవుల యుత్తరగోగ్రహణ మష్టమినాఁడును జరిగినట్లున్నది. ఈ
శ్లోకములు దక్షిణదేశ పాఠములో

"ఆవర్తగాః సుశర్మాథ కృష్ణపక్షస్య చాష్టమీమ్,
అపరే దివసే సర్వే రాజన్సంభూయ కౌరవాః;
నవమ్యాం తే న్యగృహ్ణంత గోకులాని సహస్రశః."

అని మార్పఁబడి యున్నవి. అక్కడ "ఘర్మపక్షస్య సప్తమీం" అని
యుండఁగా నిచ్చట "కృష్ణపక్షస్య చాష్టమీం" అని యున్నది. ఘర్మ
పక్ష మనఁగా నిదాఘము: ఆషాఢమని యర్జునమిశ్రుని వ్యాఖ్యానము
వలనఁ దెలియుచున్నది. కాని గ్రీష్మఋతువునందలి సప్తమి దినమై
నచో ఏపక్షమందో వ్యక్తము గాలేదు. అక్కడ సప్తమి, అష్టమి అని
యుండఁగా, దక్షిణదేశపాఠములో కృష్ణపక్షమందలి అష్టమి, నవమి
యని కనఁబడుటకుఁ గారణము కూడ తెలియవచ్చుట లేదు. కాని

తిక్కనార్యుఁడు మాత్రము కృష్ణపక్షమునందలి అష్టమి నవములనే గ్రహించి తదనుగుణంబుగా కాలసూచనలను జేసి యున్నాఁడు. అర్జునుని విజయము, ఆతఁడు తక్కిన పాండవులతోడి బయలు వడుటయు దశమిదినమున జరుగుట సంభవించినట్లుగా సూచించుటకొఱకే తిక్కన యుత్తరదేశ పాఠము నందలి సప్తమ్యష్టములను, అష్టమినవములుగా మార్చి యుండును. విజయునకు విజయము సమకూర్చిన దశమి గనుకనే,—లేదా విజయుఁడు విజయముతో శోభిల్లి బయలువడిన దశమి గనుకనే, విజయదశమి యనునది జాతీయోత్సవ దినము (national festival) గాఁ బరిగణింపఁబడుచువచ్చినది. నవమి నాఁడు శమీపూజచేసి ఆయుధములచేకొని విజయమును బడసి, దశమి నాఁడు మత్స్యరాజ సింహాసనము నాక్రమించి అర్జునుఁడు, పాండవులును కొలువు దీర్చియుండుటచే నదియొక సంప్రదాయముగ గ్రహింపఁబడి యీనాఁటికిని ఆయుధపూజ, శమీపూజ, సింహాసనారోహణము (దర్బారు) మొదలగు లాంఛనములు విజయ దశమి దినమున దేశీయప్రభువులచే జరుపఁబడుచున్నట్లగపడుచున్నది. విజయునకు విజయము నిచ్చిన శమీవృక్షమే (విజయం దదాతీతి-విజయదా-శమీ) విజయదశమి నాఁడు రాజులకుఁ బూజార్హంబై యున్నది. ఈజాతీయ సంప్రదాయమును సూచించుటకొఱకే తిక్కన దినములను ముందుకు జరిపియుండును. అయితే ఈమార్పు దక్షిణదేశప్రతులలో తిక్కనకు పూర్వమే చేయఁబడియుండ నాతఁ డనుసరించె నన రాదా? అంటే, దక్షిణదేశ ప్రతులలోని పాఠ మొక్కరీతి నుండి, పూర్వోత్తర సందర్భము క్రమముగా నుండినచో నట్లే యనవచ్చును. కాని యట్లు కనఁబడదు. ఈప్రతులలో నుత్తరదేశప్రతులలో వలె "ఆపత్తగాః సుశర్మా వై"—సుశర్మ గోవులను గ్రహించెను—అని వైశంపాయనుఁడు చెప్పి

నట్లుగా భూతక్రియయే యున్నను, తరువాత శ్లోకములలో "నవమ్యాం త్వనుగృహ్ణాంతు," "నవమ్యాం తత్ర గృహ్ణాంతు," "నవమ్యాం త్వనుగృహ్ణీష" అని భిన్నపాఠములు కలవు. "అనుగృహ్ణాంతు" అనునది విధ్యర్థమగు (లోట్) క్రియారూపముగా నుండుటచేతను, పైని 'ఆదత్త' అని భూతార్థక్రియ యుండుట చేతను, ఇవి యెవరు చెప్పిన మాటలో వ్యక్తమగుట లేదు. పైశ్లోకములకు క్రిందిశ్లోకములకు పొందిక కనఁబడదు. కావుననే యొకవేళ తెలుఁగు భారతములో దుర్యోధనుఁడే కార్యనిశ్చయమునుచేసి 'నవమిని మనగోగ్రహణ'మని చెప్పినట్లుగా నున్న దానిని జూచి, పై 'ఆదత్త' అనుక్రియను పాటింపక, తెలుఁగునకు సరియగు గ్రంథమును, విధ్యర్థక్రియతోఁగూడినదాని నెవరైనఁ జేర్చి యుందురేమో యని తలంపవలసి వచ్చుచున్నది.

ఇట్లు 15 దినములుమాత్రమే యవశిష్టంబై యున్న కాలమున రాజునకు శ్యాలుఁడు, ప్రియుఁడు, సేనాపతియునగు కీచకుఁడు జలజేక్షణను జూచెనని యున్నది, మూలమున. ఈవిశేషణములు కీచకునకు విరటునితోఁగల సంబంధమును మాత్రము సూచించుచున్నవిగాని కీచకుని స్వభావము నేమియు విశదీకరించునవిగా లేవు. కాని తిక్కనార్యుఁడు ప్రప్రథమముననే "మత్స్యపతిమఱందియు దండనాథుండును" అను మూలములోని విశేషణములను గ్రహించియు, నింక "రూపాభిమానియు, నానాభరణ ధరణ శీలుండును, దుర్విదగ్ధుండును, బలగర్వితుండును నగు సింహబలుండు" అని క్రొత్తవిశేషణములచే నాతనిస్వభావమంతయు ముందే పూసగ్రుచ్చినట్లు మనకు వివరించి తెల్పినాఁడు.

ఈ విశేషణములచేతనే యీతనిఁగూర్చినకథ యెట్లుండునో సూచించుచు, ముందాతనికృత్యము లీవిశేషణముల నెట్లు సార్థకపఱచునో

వ్యక్తీకరించును. అప్పుడు మ్రొక్కఁజనిన కీచకుఁడామె కనతిదూరమున నున్న ద్రౌపదిని జూచినాఁడు. మూలములో ద్రౌపదిని సుదేష్ణయింటిలో నెచ్చటనో తిరుగుచుండఁగాఁ జూచినట్లు చెప్పఁబడియున్నది: "తథా చరంతీం పాంచాలీం సుదేష్ణాయా నివేశనే". చూచి యామెతో వెంటనే సంభాషించినట్లున్నది. తిక్కన దానినిమార్చి సుదేష్ణయొద్దనుండఁగానే చూచినాఁడని చెప్పి యాసందర్భమున కొకవిధమగు రూపకత్వయోగ్యత (dramatic turn) ను కల్పించినాఁ డనవచ్చును. ఇట్లామెకు మ్రొక్కఁబోవు సందర్భమున నామె కనతిదూరమున నున్న ద్రౌపదిని జూచిన కీచకుని యాంతరంగిక భావములను, మానసికవృత్తులను, హృదయావేగమును నత్యద్భుతముగాఁ బదిపండ్రెండు పద్యములలో వర్ణించినాఁడు తిక్కన. కీచకుఁడు పైకొక్కమాటయైన నన లేదు. ద్రౌపదీకీచకులచే పైకొక్క పలుకైనఁ బలికింపక వారి యింగితాకారచేష్టాదులను మాత్రము వర్ణించుచు నవి యొండొరులపై నెట్లు తమతమ ప్రభావముల నెఱపి వారివారి మనోవృత్తులను మార్చుచు వచ్చినవో వ్యక్తముచేయుచు నొక కొంతసేపు మాటలులేని యతిరమ్యంబగు సినీమాచిత్రమును మనకంట్ల యెదుటఁ బెట్టి కేవలహావభావాదివర్ణనముచేతనే కథ నడిపించినాఁడు. ఇట్టి యత్యద్భుతంబగు మానసికవృత్తి వివరణము, చిత్రకల్పనము నాంధ్రవాఙ్మయమున మఱియెచ్చటను గానము. ఈ విషయమున నీతఁడొక్కొకపుడు షేక్స్పియర్ కాళిదాసాదిమహాకవులఁగూడఁ బలదన్నుచున్నాఁడా యనిపించును. తిక్కనార్యునికవితలోని ముఖ్యమైన విశేషగుణ మీ మానసికవృత్తి వివరణమనునదే. ఆంధ్రకవులలో నెవ్వరు నీతనితో నీ గుణమునఁ బోల్పఁదగినవారు కనఁబడరు. తిక్కనలోని యీ విశేషలక్షణము నాంధ్రకవితావిమర్శకు లవశ్యము గమనింపఁదగియున్నది.

ప్రబంధకవులవలె తిక్కన 'నన్నుఁ జూడుఁడు, నాకవితను జూడుఁడు' అని పైకి రాఁడు. ఏదో భారతకథను జెప్పుకొని వెళ్లిపోవుచున్నాఁ డనిపించునే గాని, సందర్భముతోను, ఔచిత్యముతోను అవసర ముండినను లేకున్నను, ఆహా! ఈ పద్య మెంత బాగుగా రచించినాఁడు అని యనిపించునట్లు చేయఁడు. అతని కవితాచాతుర్య మంతయు కళాగోపనమందే యున్నదని చెప్పవలసి యున్నది (His art lies in concealing art).

"గగనకల్లోలినీ కల్లోలమాలికాహల్లీసకంబుల నవఘళించి-"

"తపనీయదండైకధవళాతపత్రితోద్దండతేజఃకీర్తిమండలుండు-"

ఇత్యాది శ్రీనాథాదుల పద్యములవలెనే సందర్భ మక్కఱలేకయ పద్య మెంత బాగుగా నున్నదని సంతోషించు నట్లాతఁడు చేయఁడు. తిక్కనార్యుని కవితాకళ భావము క్రింద మఱుఁగువడియే యుండును గాని నన్ను చూడుమని పైకి రాదు. పై సందర్భమున తిక్కన చేసిన మానసికవృత్తుల వర్ణనయంతయు మూలనులో నేమియు లేదు. అంతయు స్వకల్పితమే.

ద్రౌపదిని జూచినతోడనే కలిగిన యాతనిస్థితి నెంతస్వాభావికముగా వర్ణించినాఁడో చూడుఁడు:

"అక్కజమైన చెల్వమున నాత్మకుఁ బ్రేఁగయి పొల్చుపొల్తిపై
నెక్కుచుమాటికిఁ గ్రమ్ముచుఁ బనేరక యూరక నిల్చెఁ గాముచేఁ
జిక్కినసెమ్మనంబు గడుఁ జేష్టుడుమానము చేష్టితంబులన్
దక్కిన యంగముం దలఁకుధైర్యము నైయతఁ డప్పు డయ్యెడన్."

కీచకుఁడు సహజముగా రూపాభిమాని. రూపవతులగు స్త్రీల నసేకుల నీతఁ డేలుచుండును. తలఁపనితలంపుగా నిట్టియపూర్వసౌందర్య భాజనంబగు నీమెను జూచుట యాతనియాత్మకు వేఁగయినది. అట్టి యాశ్చర్యకారణమునఁ దగులుకొనినచూపును మరల్ప లేక యట్లే నిశ్చేష్టుఁడై నిలిచిపోయినాఁడు. మనస్సు మన్మథాధీనమైనది. అట్లగుటచే చిత్తౌన్నత్యము చెడినది. కావున ధైర్యము చలించినది. ఫలితము నిశ్చేష్టతయే. అత్యాశ్చర్యకరమైన స్త్రీసౌందర్యమును హఠాత్తుగాఁ జూచిన వానిస్థితి వానిచిత్తవికారమునందలి యంతరువులు (stages) కీచకునికిఁ దగినట్లుగా నింతచక్కఁగా వర్ణించుట సామాన్యకవులకు సులభసాధ్యముకాదు. ఇదియంతయు నామెను జూచినతోడనే గలిగినస్థితి. పిదప నానిశ్చేష్టత కొంత వదలునప్పటి కాసింహబలుఁడు తనహృదయము ద్రౌపదీరూపమును నురిఁదగిలి మిగుల పరితాపపడుచుఁ గాముఁడను బల్లిదపువేఁటకాని బారిఁబడినట్లుగాఁ దెలిసికొనెను. ఇది రెండవస్థితి (stage). అప్పు డాసింహబలుఁడు తలరి-సంభ్రమించి నిజాంతర్గతంబున నిట్లు చింతింప మొదలుపెట్టినాఁడు. ఆతని మనోవృత్తులయొక్క క్రమాంతరములను (stages) ఎట్లు తిక్కన వర్ణించుచున్నాఁడో గమనింపుఁడు: ఈతఁడు రూపాభిమాని యనిగదా చెప్పఁబడియె. తాను రూపవంతుఁడనని—తనరూపమందే వి శేషాభిమానముకలవాఁడగుటయే కాక, ఇతరులరూపసంపదయందు నీతని కభిమానదృష్టి కలదు. కావున ద్రౌపది రూపమే కీచకుని నింతగా మొదటనే యాకర్షించినది. ఆరూపమునుగూర్చియే యింకను దలంచుచున్నాఁడు.

"ఎందును నిట్టిరూపు నరు లెవ్వరుఁ గాంచిరె యేన కాదు సం
క్రందననూతికిన్ దగిలి కన్గొనఁజాలదె."

వెయ్యికళ్లుకలవాఁడైనను తగిలి కన్గొనవలసినదే. తనలెక్కయేమి యని యాతని భావము.

"... ... ... ... ... ... ఇందిరా
నందను నాజ్ఞ యేచి భువనంబులఁ బ్రబ్బదె, యుత్తలోదరిం
జెందఁగఁ గాన్పు గాదె ఫలసిద్ధి పురాతనపుణ్యవృద్ధికిన్".

ఇట్లామె రూపాతిశయము నొకసారి వర్ణించికొనినాఁడు. ఇంకను దనివితీరలేదు. ఆశ్చర్యాతిరేకము చల్లారలేదు. దేవతలందఱును గూడ నీతనివలెనే యీ మెముందు లొంగిపోవలసినవారే.

"ఇయ్యింతిప్రాపున నయ్యనంగుఁడు పార్వ
 తీశునైనను దక్క నేలకున్నె
యిన్నాతిచెలువంబు గన్న శచీప్రియుం
 డైనను గనుకని నలయకున్నె
యిత్తన్వి కెనలేమి కెదిరిపన్నిదము భా
 షావిభుతోనైనఁ జఱవరాదె
యిత్తలోదరి జీవితేశున కిందిరా
 పతినైన మెచ్చక పలుకఁజనదె
కుసుమబాణుని బాణముల్ గూడ నైదు
కరఁగి నేరిమి వాటించి కరువుగట్టి
పోసి చేసి చైతన్యసంపుటముఁ దగ ఘ
టించిరో కాక యిట్టిచేడియలు గలరె."

ఇట్లు దేవతలను, ప్రాచీనైతిహాసికపురుషులను సాటికిఁ దెచ్చుచు, నీమెను జూచినచో వారును దనవలెనే ప్రవర్తింపకుందురా యని తన ప్రవర్తనను సమర్థించుకొనువాఁడువలె పలికినాఁడు. ఇట్లే యింకను

నతిశయోక్తులతోఁ గూడిన భావములను, ఉత్ప్రేక్షోపమాద్యలంకారా
దులతోఁ గూర్చి సమాంతరములగు (periodic structure) వాక్యర
చనగల పద్యములలో వర్ణించి మూలమున లేని యీ యాంతరంగిక
శృంగార భావాతిశయమును వెలిపుచ్చినాఁడు తిక్కన. ఇట్టి వర్ణనల
యందే యాంధ్రప్రబంధ మహావృక్షము' లబీజం బగపడుచున్నదని
చెప్పవచ్చును. పై పద్యము నెత్తుగీతిలోని భావముయొక్కయు, వాక్య
రచనయొక్కయు ఛాయయే పెద్దనార్యుని

"నేత్రపేటియసల్ దెచ్చి నీరజాప్తు
సానఁబెట్టినరాపొడి చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు
వీనిఁ గాకున్నఁ గలదె యీ మేనికాంతి."

అనుపద్యమునఁ గనఁబడుచున్నది గదా! ఇంద్రాదిదేవతలమాట య
టుండ నీమెరూపము చూచిన మన్మథునికే విరహతాపము కలుగక
మానదఁట.

"ఈ నెలఁతఁ గన్న మన్మథుఁ
డైనఁ జిగురు గొడుగు పువ్వుటమ్ములు పొదలుఁ
లోనుగ సెజ్జలు సేయం
దా నియమింపండె విరహతాపము పేర్మిన్"

ఇంతవఱకు కామెరూపాతిశయమును గూర్చి మనంబునఁ దలపోసి
నాఁడు. అక్కడికి కావిషయ మైనది. కావుననే తిక్కన 'అని వెండి
యు' ననుదానితో విషయభేదమును, లేదా భావభేదమును సూచించు
చున్నాఁడు. ఇప్పటికి సంభ్రమాశ్చర్యములు కొంత యుపశమించినవి.
ఇఁక నామెస్థితిగతులను గూర్చినవిచారణ. ఆమెను తాను పొందఁగాంచు

తెలుంగు, అందులఁ దనకు సాయపడువారు, వీనినిగూర్చి భావింపఁ
నొడంగెను.

"దీనిజన్మంబునఁ దేజంబు నొందిన
యింతియుఁ బతియును నెవ్వరొక్కొ." మొ.

ఇట్లొక్కొ, ఒక్కొ యని వితర్కసూచనాపద్ధతిని జేసిన పద్య
రచనయు ప్రబంధరీతికి దారిచూపినది. తరువాతి ప్రబంధకవులు దీనిని
విశేషముగా ననుసరించిరి. ఇదియదియననేల? ఈ శృంగారఘట్టము
లోని రచనాచ్ఛాయ లన్నియు తరువాతిప్రబంధములఁ గనఁబడుచునే
యుండును. కాని కొన్నిచోట్ల వీనియందలి యౌచిత్యసంగ్రహణము
మాత్రము కానరాకుండును. పిదప మనోజవికారమగ్నుఁడైయున్న
యాతని యాంతరంగికచేష్టలను, హృదయావేగమును, మనమునందలి
త్రొక్కుడుపాటును, ఎట్లు వ్యక్తముచేసినాఁడో చూడుఁడు:

"అని యని యుగ్గడించు ధృతి యల్లలనాడిన తల్లడింపుఁ బై
కొను తలఁ పొదవించు మటిఁ గోర్కులు పేర్చిన నప్పళించు నె
ట్టన తెగ నగ్గలించు నచటన్ జనులం బరికించు బుద్ధిమా
లిన వెస నెంతయుం గళవళించు మనోజవికారమగ్నుఁడై."

"అనియని యేమేమో చెప్పుచు నుగ్గడించు"—'అనియని' యనుటచే
నాతని కెంతచెప్పినను ఇంకను జెప్పవలె ననియె యున్నట్లు కవి
సూచించుచున్నాఁడు. ధైర్యము చలించుటచే మనమును చలించును.
పైకి పొంగివచ్చు భావమును—ఆమెను చేపట్టవలెననెడి భావమును—
తొలఁగించి వేయుచున్నాఁడు. కాని మనమున నామెవిషయమగు
కోర్కెలు పెచ్చుపెరుఁగఁగా నూటలూరుచున్నాఁడు. కోర్కె పెచ్చుపె
రుఁగుటచే నిలకనాఁగలేక చివరకు సాహసించి తనకోర్కెను కార్యరూప

మును బొందించుటకు సిద్ధపడి యుత్సహించును. కాని యాంతరంగిక
ముగు కోర్కెను బాహ్యంబగు కార్యరూపమును బొందించెడి సమయ
మున నచ్చట నితరజనులుండుటను బరికించినాఁడు. ఇదియెంత స్వాభా
వికమైనదో పరికింపుఁడు. ఎట్టి దుర్మార్గుఁడైనను తాను జేయుదుష్కా
ర్యమున కేదో యొకమఱుఁగును జూచుకొనునేగాని యితరులు చూచు
చుండ బహిరంగముగాఁ జేయనొల్లఁడు గదా. ఆంతరంగికములగు
కోర్కెలను బాహ్యవిషయము లేమియు నడ్డుపెట్టఁజాలవు. కాని
యవి క్రియారూపమును దాల్చినపుడు మాత్రము బాహ్యప్రపంచ పరి
స్థితులతో వానికి సంబంధము కలుగకమానదు. కావున నవి తదనుగుణ
ముగ మార్పుచెందవలసి వచ్చుచుండును. కీచకుని ద్రౌపదివిషయముగు
కోర్కెలు బలవంతపఱుపఁగా సాహసించి వానిని క్రియారూపమును
బొందింపఁదలఁచెను గాని అవి క్రియారూపమును బొందు సమయము
నకు బాహ్యప్రపంచమర్యాదతో వానికి సంఘర్షణము ప్రాప్తించినది.
ఆంతరంగిక భావప్రపంచ మర్యాదకును, బాహ్యప్రపంచమర్యాదకును
పొందిక లేకుండుట తటస్థించినది. ఆ విషయ మాతనికిఁ దెలియవచ్చి
నంతనే—అనఁగాఁ "దెగనగ్గలించియు", సాహసింప యత్నించియు
నచటిజనులం బరికించినంతనే, బాహ్యప్రపంచమర్యాదకు విరుద్ధంబుగఁ
బ్రవర్తించుచుంటిమను భావము పొడముటతోడనే—ఈసంఘర్షణము
మూలమునఁ దానుతలఁచిన కార్యముకాకపోవుటచే బుద్ధిమాలినది; నశించి
నది; చెడిపోయినది. ఇంతకాలమునుండియుఁ బనిచేయుచున్నది యాతని
మనస్సు; ఆమనోరథముపై నెక్కి యింద్రియము లనుహయంబులు తీసి
కొనిపోయినట్లెల్ల పోయినాఁడు. వెళ్లి వెళ్లి యది బాహ్యప్రపంచమను
పెద్దరాతికి టక్కునకొట్టుకొన్నది. ఆకారణముచే రథము బోర్లఁబడి బుద్ధి
క్రిందపడి చెడిపోయినది. ఇంక నీరథికుఁడు మనోజవికారమగ్నుఁడై

యేమిచేయుటకును దోఁచక 'కళవళించె'నఁట. ఈపద మాతనిస్థితి నెంత చక్కఁగా స్ఫురింపఁజేయుచున్నది. ఈపద్యమున తిక్కన మానవమనో వ్యాపారలక్షణములను గూర్చి (workings of the human mind) చూపిన జ్ఞాన మప్రతిమానమ్ము,నతిగంభీరమునై యున్నది. ద్రౌపదీరూప మోహితుండగు కీచకుని మనోవ్యాపారములందలి భిన్నకక్ష్యలను (stages of his mental attitude), వాని క్రమపరిణామమును (progression of those stages), దానివలన సహజముగఁ గలుగు ఫలితమును సువ్యక్తముచేసినాఁడు. కేవలబాహ్యచేష్టలను గూర్చిన వర్ణనలు, లేక కృత్రిమభావములతోఁగూడిన వర్ణనలనే గాని,యిట్టి యాంతరంగికభావచేష్టలను వివరించి మనోవృత్తుల నిట్లు విప్పి చూపఁగలవర్ణనల నాంధ్రకవితలో విశేషముగాఁ గానము. ఈ పద్యమునందలి ప్రతిపదము నర్థగాంభీర్యము కలదై తూఁచిన ట్లర్హస్థానమున నమర్చఁబడియున్నది. ఆయా భావభేదములను సూచించుట కెట్టి సముచితపదపరికరమును సమకూర్చినాఁడో చూడుఁడు. "ఉగ్గడించు, తల్లడించు, ఓరగించు, అప్పళించు, తెగనగ్గలించు, పరికించు, కళవళించు." 'తెగనగ్గలించు' అన్నప్పుడు 'తెగ'అనునది తెగత్రావు, తెగ వేయు, తెగఁబడు, మొదలగుపదబంధములలోఁ గానవచ్చుచున్నను, ఇందలి మూలార్థ మిప్పుడు గమనింపఁబడుటలేదు. ఇట్లే యింక ననేకప్రదేశముల నీమహాకవి సూక్ష్మతరంబులగు భావభేదములను, భావచ్ఛాయలను సూచించుటకుఁగాఁ బ్రయోగించు దేశీయపదజాలమును బరికించినచో నీభావయాం దెట్టి పదపరికర మాకాలమున వెలసియుండెడిదో తెలియఁగలదు.

అట్లు కీచకుఁడు నిజాంతర్గతంబున ద్రౌపది రూపమునుగూర్చి తలపోయఁగా తలపోయఁగా నాతనిబుద్ధి చెడినదని గదా చెప్పినాఁడు. ఈసూచన భావగర్భితముగాని కేవల తాత్కాలికావస్థను సూచించు

నది మాత్రము కాదు. దీనిఫలితమును ముందు రెండుపద్యములలో సూచించుచున్నాఁడు:

"మాసినచందముఁ దనుఁ గని
రోసిన డెందంబుఁగల తరుణి నెఱుఁగఁడ బి
ట్టేసిన మదనునిచే ధృతి
వాసిన బెగడొందు సింహబలుఁ డట్టియెడన్."

బుద్ధి మాలినవాఁ డగుటచేతనే యా ద్రౌపదియొక్క మాసిన చందమునుగాని, ఆతని వికారచేష్టల నపుడే గ్రహించి తనయేవగింపు సూచించుచు నాతనిఁ జూచి రోసిన డెందముగలదై యున్న యాతరుణి వైఖరిని (ముఖవికారాదులను, చేష్టలను) బట్టి యామె యభిప్రాయమునుగాని, తెలిసికొన లేకపోయినాఁడఁట. ఇక్కడ తిక్కన యాంతరంగిక భావములకు బాహ్యాకారమునకును గల సంబంధమునే గాక, యొకరి యింగితాకారములు మఱియొకరిపై నెట్లు పనిచేయుచున్నవో (reflective action) చూపుచున్నాఁడు. కీచకుని మనోవికారములు ద్రౌపదిమనమునఁ బ్రతిఫలించి యామెను రోసిన డెందముకల దానినిగాఁ జేసినట్లు వర్ణించుచున్నాఁడు. నాటకరంగమున మనకనుల యెదుట నభినయించు పాత్రలలో నొకపాత్రయొక్క యాకారేంగిత చేష్టాదు లితరపాత్రల మనోవృత్తులపై నెట్లు పనిచేయుచున్నవో వారి వారిముఖలక్షణాదులనుబట్టి మన మెట్లు గ్రహింపఁగలుగుదుమో, అట్లే తన వర్ణనా నైపుణ్యముచేతను, భావద్యోతకములగు విశేషణ పదసంయోజనముచేతను మాత్రమే, తిక్కనార్యుఁడు నాటకరంగమునందువలె నాయాపాత్రలను వారివారి మనోవృత్తులతో, ముఖలక్షణములతో, ఆకారచేష్టాదులతో మన కనులయెదుటఁ బెట్టి గ్రహింపఁజేయుచున్నాఁడు.

"తనుఁగనిరోసిన డెంద" మనుటచే ద్రౌపది యాతని వికారముల నన్నిటిని గనిపెట్టుచున్నదనియు, వానిని జూడ నామె కేవగింపు పుట్టినదనియు, ఆహృద్గతమగు భావమును ముఖవైఖరిచే వెల్లడిచేయుచునే యున్నదనియు తిక్కన తెలుపుచున్నాఁడు. కాని కీచకుఁ డిప్పుడద్దానిఁ దెలిసికొనుస్థితిలో లేఁడు. బుద్ధి మాలినవాఁడు, వివేకవిదూరుఁడు నైనాఁడు. కావున నామె చూపిన యేవగింపుభావమునే

"మదనవికృతియాగాఁ దనమదిఁ దలంచి
రాగసాగరపూరనిర్మగ్నుఁ డయ్యె"ను.

ఇంతకు పూర్వము నిజాంతర్గతంబున నామెనుగూర్చి తలపోసినంతవఱకు మనోజవికారమగ్నుఁడు మాత్ర మయ్యెను. కాని 'బుద్ధిమాలిన' పిదప మఱియొక్క మెట్టెక్కినాఁడు (లేదా దిగినాఁడని యనుటయే సమంజసము). రాగసాగరపూర నిర్మగ్నుఁడైనాఁడఁట. ఇది యాతని మానసికావస్థయందు రెండవయంతరము (2nd stage of his mental state). ఇప్పుడాతని నెట్లు వర్ణించినాఁడో చూడుఁడు. నరాధముఁడఁట. వివేకవిదూరుఁడు నరాధముఁడే యగుఁ గదా! రోసినడెందముగల ద్రౌపదియొక్క హృదయాంతరాళంబున మెలఁగు భావములు ఎట్లు బహిర్గతములైనవో, బాహ్యాకారచేష్టాదులం దెట్లు ప్రతిఫలించినవో, యీ క్రిందిపద్యమున వర్ణించినాఁడు:—

"వెఱవక నను జూచె వీఁడని యెదఁ గలు
షించిన నొండొండ చెమట వొడమ—"

"పాల్తిపై నెక్కొనుచూడ్కి గ్రమ్మఱుప నేరక యూరకనిల్చె" నని వర్ణించినదానికిఁ దగినట్లుగా నిచ్చట దాని ప్రతిఫలక్రియ (reflective action) వర్ణింపఁబడినది.

> "ననుచితకృత్యంబు లాచరించు విధాతృ
> బలిమికి నిర్వోఅపాటు దోఁప
> నిచ్చట దిక్కులే రెవ్వరు నా కను
> భయమున మేనఁ గంపంబు పుట్టఁ
> జేయంగ నేమి యుపాయంబు లేమి నా
> ననమున వెల్లఁదనంబు గదుర
> నున్న పాంచాలిఁ గనుఁగొని యన్న రాధ
> ముఁడు వివేకవిదూరుఁడై ముదితుఁడగుచు
> మదనవికృతియగాఁ దనమదిఁ దలంచి
> రాగసాగరపూరనిర్మగ్నుఁడయ్యె."

ఇచ్చట హృదయము నందలి కలఁతకు—శరీరమున చెమట, విధికృతంబును, తన యశక్తతను దలఁచినపుడు నిర్వోఅపాటు, దిక్కు లేరను భయముచేఁ గంపము, ఏమిచేయుటకుఁ దోఁచనియప్పుడు తెల్లఁబోవుట, అను నీయాభ్యంతర బాహ్యావృత్తులకుఁగల పొందిక వెలిపుచ్చుచు నెంతయు రమ్యముగా వర్ణించినాఁడు. మనోజవికారమగ్నుఁ డగు కీచకుని యొక్కయు, భయకంపిత యగు ద్రౌపదియొక్కయు రసానుగుణంబగు మానసికవృత్తి వివరణ మనన్యసామాన్యంబని చెప్పవలసినదే. ద్రౌపదికి భయకారణమున బయలువెడలిన స్వేదప్రళయవైవర్ణ్యవేపథులను సాత్త్వికభావములను శృంగారరసప్రేరితములగు మదనవికారములని తలంచుట కీచకుని కిపుడు ప్రాప్తించిన వివేకవిదూరత్వముయొక్క ఫలమే. అట్లు తలఁచి యాతఁడు రాగసాగరపూరనిర్మగ్నుఁడైనాఁడు. వెంటనే యించుకసేపు తన్మయత్వమును బొందినాఁడు. కావుననే అయ్యవసరమున

"పాలఁతుకకాంతి యింత పొలివోవఁగనీక కొసలారఁ దార ని
శ్చలతఁ గడంగి క్రోలికొనఁజాలుట, కీచకముఖ్యలోచనం
బులు నయనంప్రధానమను పూర్వవచఃస్థితి దప్పకుండఁగా
నెలమి వహించెఁ దక్కఁగల యింద్రియవర్గము ధిక్కరించుచున్."

ఇది యించుక తరువాతి ప్రబంధకవుల వర్ణనరీతినే యున్నట్లగపడినను, వాని యందువలెఁ గృత్రిమ భావముల నతిశయోక్తిచే వర్ణించునది గాక, ఎంతసముచితమై సందర్భానుకూలమై వస్తుస్థితినె వర్ణించునదై యున్నదో గమనింపుఁడు. ఆతని తన్మయత్వ మెంతచక్కఁగా వర్ణింపఁబడినది! కీచకునిలోచనంబు లామె తనుకాంతిని నిశ్శేషముగాఁ గ్రోలఁదలంచి తత్కార్యమునందు గాఢముగ నిమగ్నములగుటచే నిశ్చలత్వమును బొందినవి. ప్రస్తుతస్థితిలో నితరావయవము లేవియు నా రాగరసమును గ్రోలు వ్యాపారమున వ్యగ్రములగుట కవకాశము లేకుండుటచే, సర్వేంద్రియములకు నయనము ప్రధానముగావున వాని కార్యములనన్నిటిని నయనములే చక్కఁబెట్టుచున్నవఁట. సర్వేంద్రియముల మూలమునఁ గలుగు ననుభవమును నయనముల మూలముననే యనుభవింపఁదొడంగెనని యెంతయు గంభీరముగాఁ దెలుపుచున్నాఁడు. ఆ సమయమునఁ దన యున్కియుఁ, బరిజనములును దనను, దనచేష్టలను జూచుచున్నారను సంకోచమైన నాతనికిఁ గలుగలేదు ఆకాంతిఁ గ్రోలినకొలఁదిని కరంబొప్పని తమక మాతని చిత్తము గప్పివేసి యాతనికి మఱింత పరితాపమును గలుగఁజేసినది. మనోవికారముల క్రమాభివృద్ధి (development) నెంతరమ్యముగా వర్ణించుచున్నాఁడో చూడుఁడు. మొదట మనోజవికారమగ్నుఁడు, పిదప రాగసాగరపూరనిర్మగ్నుఁడు, అనంతరము తమకము మనమును గప్పివేయఁగాఁ బరితప్తుఁడు, ఆవెనుక డెగ్గలం బంతకంతకు నగ్గలింప నొదవు చెమటతోఁ జిత్తంబు చెదరిన

వాఁడు నై, తుదకు నెందు మెలఁగఁ దలఁచెడి యా సింహబలుఁడు అనంగుపట్టి యాడెడు జంత్రంబువగిది నుండెను. మొదట నా "సాలఁతుక కాంతినే రూపాభిమానియగు నాతఁడు నిశ్చలముగాఁ గ్రోలినను, తమకము హెచ్చినకొలఁది ఆనిశ్చలత చెదరి, యాతనిదృష్టి యామె ప్రత్యేక శరీరావయవములమీఁదికి వ్యాపించినది. అప్పుడు

"తన్వంగి మవ్వంపుఁ దనులత నెసఁగెడు
　　　　నునుగాంతి వెల్లువ మునఁగఁబాఱె"ను;
"కిసలయహస్త కెంగేల నేపారు గ్రొ
　　　　మ్మించు నలయించ మిగులఁ బర్వె"ను;
"కమలాస్య ముద్దుమొగంబు లేమెఱుఁగుల
　　　　మొత్తంబడరి చుట్టు ముట్టికొనియె;"
"ధవళాక్షి తొంగలిఱెప్పల చెన్ను
　　　　కప్పను చీఁకటి కవియుదేర."

వీనిని జూచినకొలఁది వెగ్గలంబంతకంతకు నగ్గలించినది. దానిఫలముగాఁ జెమటపట్టినది. ఆతని యప్పటిస్థితి మనకు గోచరింపఁ జేయుటకుఁ గా నెట్టి సూక్ష్మవిషయములను గూడ విడువక సూచించుచున్నాఁడు. రాగసాగర నిమగ్నుఁడు, వివేక విదూరుఁడు, బుద్ధిహీనవాఁడు నైనను, కీచకునిదృష్టి నెచ్చట ప్రసరించునట్లు చేసినాఁడో తిక్కన చూడుఁడు. ఆతన్వంగితనులత, కిసలయహస్త కెంగేలు, కమలాస్య ముద్దుమొగము, ధవళాక్షితొంగలిఱెప్పలు అని భావగంభీరములగు విశేషణములతో ప్రధానావయవములను, బాహ్యదృష్టికిఁ గనఁబడెడు ముఖ్యావయవములను మాత్రమే వర్ణించెనుగాని తరువాతి ప్రబంధకవుల వలె నఖశిఖపర్యంతము వివస్త్రయగు స్త్రీని వర్ణించినట్లు వర్ణించలేదు. తిక్కనార్యుని శృంగారవర్ణనలలోని విశేషము లతిగంభీరములు, నతి

రమణీయములు. కీచకుఁడుచేయు శృంగారవర్ణనములోనైన నెచ్చట నసభ్యశృంగారపు సాక్షైనను గానరాదు. ఎన్నిసారులు వర్ణించినను, కనుగవ, తనులత, ముద్దుమొగము, పదతలములు, మృదుకరములు వీనినే వర్ణించుచుండును. పరిధృతవస్త్రులగు వారల యవయవములలో బాహ్యదృష్టికిఁ గనఁబడు నవయవము లివియేగదా. ప్రబంధకవు లాంతరంగిక దృష్టి, లేదా మనోదృష్టితో వారుకట్టిన యుడుపుల లోపలఁ చూచి నూఁగారు, వళులు, ఊరువులు, బాహువులు మొదలగు వానిని వర్ణించు చుందురు. శృంగారమనునది యవయవముల యొప్పులోనేకాక, వానివలనఁ బైకి ప్రసరించు కాంతి విశేషము, లావణ్యతేజము నందును, వానివలన వ్యక్తము చేయఁబడునాంతరంగిక గుణసంపదయందునే యున్నదని ఘోషించువాఁడువలెనే, తనులతకాంతి, కెంగేలనేపారు క్రొమ్మించు, మొగంబులే మెఱుఁగులమొత్తము, అప్పలచెన్ను, వీనినే ప్రశంసించినాఁడు. కీచకునివంటి వివేకవిదూరుఁడు_కీచకాధముఁడుగూడ, నీయవయవముల మూలమున వ్యక్తమగురేఖ, గరువతనము, చెన్ను మొదలగువానినే ప్రశంసించునట్లు చేసినాఁడు తిక్కన. తిక్కనార్యుని శృంగారవర్ణన లపూర్వములు, ననన్యసామాన్యములు ననుటకు సందేహము లేదు.

ఇట్లింతవఱకు ద్రౌపదీకీచకులచే నొక్కపలుకైన పలికించక వారియింగితాకారచేష్టాదులను మాత్రము వర్ణించుచు నవియొండొరుల మనోవృత్తుల నెట్లు మార్చుచున్నవో సినీమాచిత్రమునవలెఁ జూపుచు నొకవిధమగు మూఁగనాటకమును బ్రదర్శించినాఁడు. ద్రౌపదీ కీచకులను గూర్చిన యీమనోవృత్తివర్ణనమంతేయు తిక్కనార్యునిచేఁ గల్పితమెగాని మూలమున నేమియుఁ గానరాదు.

"తాం దృష్ట్వా దేవగర్భాభాం చరన్తీం దేవతామివ,
కీచకః కామయామాస కామబాణేన పీడితః."

'తాం దృష్ట్వా' అనుదానినిబట్టి ఎట్లుచూచినాఁడో, కీచకుఁడు చూచి యెట్లైనాఁడో చెప్పుటకు తిక్కన 12 పద్యముల గ్రంథమును పెంచినాఁడు. పైశ్లోకము తరువాత కీచకుఁడు సుదేష్ణయొద్దకుఁబోయి యామెను గూర్చి యడుగకయే, ద్రౌపదియొద్దకే పోయి పలికినట్లు దక్షిణదేశప్రతులలో నీక్రింది శ్లోకములు కనఁబడుచున్నవి:—

"సతాం సైరంధ్రివేషేణ వసంతీం రాజవేశ్మని,
ఉపగమ్యానవద్యాంగీం పాంచాలీమిద మబ్రవీత్;
కాసి త్వం చారుసర్వాంగి శ్యామా వేదికృశోదరి."

బ్రౌన్‌దొరగారి తెలుఁగుప్రతిలో మాత్ర మీ శ్లోకములతరువాత నిట్లు కలదు:—

"వైశంపాయనః

తదా తు దృష్ట్వా చలతీం చ కీచకః
తత స్సమభ్యేత్య నరాధిపాత్మజామ్,
ఉవాచ కృష్ణా మభిసాంత్వయం స్తదా
మృగేంద్రకన్యా మివ జంబుకో వనే.

కీచకః

న త్వం పురా జాతుమయేహ దృష్టా
రాజ్ఞో విరాటస్య నివేశనే శుభా,
... ... ... ... ...
... ... ... ... ...
దాస స్తవాహం పృథుతామ్రలోచనే
వశానుగో వారణఖేలభామిని." మొ.

ఉత్తరదేశ పాఠమునను, కుంభఘోణ ముద్రితప్రతిలోను (ఈ విషయమున నిదియుత్తరదేశపాఠము ననుసరించినట్లున్నది)—

"సతు కామాగ్ని సంతప్తస్సుదేష్ణా మభితోగతః,
ప్రహసన్నివ సేనానీ రిదం వచన మబ్రవీత్,
నేయం పురా జాతు మ యేహ దృష్టా
రాజ్ఞో విరాటస్య నివేశనే శుభా,
... ... ... ...
కా దేవరూపా హృదయంగమా శుభా"

అను శ్లోకముల తరువాత

"గత స్సుదేష్ణా మభిమన్త్ర్య కీచకః
తత స్సముభ్యేత్య నరాధిపాత్మజామ్,
ఉవాచ కృష్ణా మభిసాన్త్వయం స్తదా,
మృగేంద్రకన్యామివ జంబుకో వనే."

అను శ్లోకము కలదు. ఈ సందర్భమున తిక్కన రచనలో మొదట కీచకుఁడు సుదేష్ణకు మ్రొక్కఁజనువాఁడై యామెయొద్దకుం జని, ద్రౌపదినిగూర్చియడుగ నామె యీతని పలుకులను గీటునఁబుచ్చిన పిదప ద్రౌపది ననునయించినట్లుగా నుండుటచే నుత్తరదేశపాఠమునే యనుసరించినట్లున్నదని యిదివఱకె మఱియొకసందర్భమునఁ దెలుపఁబడియున్నది గదా. అట్లు కందర్పసర్పగోచరుండైన కీచకుండు, భావప్రపంచమును వీడి బాహ్యప్రపంచమునఁబడి యక్కోమలి కల రూపు నిజసహోదరివలనం దెలియందలంచి, దానిదెసం దగిలినదృష్టి యెట్టకేనియుం దిగిచికొని, చని యద్దేవికిం బ్రణమిల్లినాఁడు. ఆమెయుం భ్రాతృప్రేమ విశేషముగాఁ గలదియగుటచేతను, నింతకాలమునుండి

యీతఁ డూరలేక యిప్పుడే వచ్చినవాఁడగుటచేతను, నత్యాదరముతో "కాంచనపీఠము వెట్టఁగఁబంచి ప్రియముచూడ్కి నొసఁగుచు" నాతనిని సంభావించినది.

ఆమె యిట్లీతనియెడఁ జూపిన ప్రేమయు, చనవునే ద్రౌపదివిషయమున నాతఁడు సంకోచింపక సంపూర్ణముగా నడుచుటకు మఱింత యవకాశము నిచ్చినవి. ఆచనవు నండగాఁ జేసికొనినాఁడు గనుకనే మఱేమియు కుశలప్రశ్న చేయకయే, యాతఁడప్పుడు పాంచాలింజూచి వేగపడి యామె కులము చరిత్రమునడిగి, "దీనిపై నెయ్యముకల్మి యేకొలఁది నీమది కింతయు నాకు నెఱుంగఁజెప్పుమా" యని యాతురముతో నడిగినాఁడు. ఇచ్చట తిక్కన సంస్కృతమునందువలెఁ గీచకుఁడు ముందే బయలుపడునట్లు చేయక మాటలలోనైనను గొంత నిగ్రహ మవలంబించునట్లు చేసినాఁడు.

"రూపేణ చోన్మాదయతీవ మాం భృశం_
దృఢంహి కామస్య కరోతి మాం వశే,
నచాన్య దత్రౌషధ మద్య మే మతం_
అహోను మే స్యాత్పరిచారికా శుభా."

అను మూలమునందలి వానిపల్కులను వదలివేసి, సుదేష్ణను మూలములో కన్న గడుసుదానిఁగాఁ జేయఁదలంచినవాఁడు గావున, నాతని ప్రసంగ ధోరణిని బట్టియు, నింతసేపటినుండియు ద్రౌపదిని తేరపారి చూచు చుండుటను బట్టియు, నయ్యంగన "యితఁ డనంగశరదళిత హృదయుఁ డయ్యెనకట, యీతని చిత్తవృత్తి మరలుప ననురూపంబగు నుపాయ మది యెయ్యదియో" యని తలంపసాగినదని తెలిపి, అపుడే యీమె ముందు సంగతి నాలోచింపఁ గడంగినట్లు సూచించినాఁడు. తిక్కన మొదటనే యీతఁడు దుర్విదగ్ధుఁడు, బలగర్వితుఁడు నని చెప్పియే

యున్నాఁడు. పట్టినపట్టు వదలువాఁడుకాఁడని యప్పకుఁ దెలియును. కావున దీనినుండి మరల్చునుపాయమేమా యని చింతింపసాగినది. తాత్కాలికముగా నొకయుపాయమును బన్నినది. అప్పటి కాతని మాటలు గీటునంబుచ్చి వినీవిననట్టు నటించి యొండు పలుకులు జరిపినదఁట. సుదేష్ణ నెంతగడుసరిగను, ప్రౌఢగను సూచించి నాఁడో తిక్కన గమనింపుఁడు. ఇట్టిప్పటికి సుదేష్ణ యెట్లో గడుసుదనముచేఁ దప్పించుకొన్నది. ఈతండును "సత్వహీనుండు" గావున,— మనోనిగ్రహము లేనివాఁడగుటచే, హృదయావేగము సరికట్టుటకుఁ దగిన బలములేని వాఁడగుటచేఁ, దనయప్ప యుద్దేశమేమో కనుఁగొనుటకైన నిరీక్షింపక, క్రమ్మఱ, ద్రౌపదియొద్దకే పరుగెత్తినాఁడు. అచ్చట 'నట్టాడుచు' నామెతోఁ బలికినాఁడఁట. ఈ 'అట్టాడుచు' ననుపద మా సందర్భమున నాతఁడు సంకోచభావముతో పలుకఁజూచుచు నాచుట్టు పట్ల తిరుగుచుండుటను ఎంతయో చక్కఁగా మన కనులయెదుటఁ బెట్టుచున్నది. ఇట్టి చిన్నిచిన్ని పదములను సమయానుకూలముగఁ బ్రయోగించుటచేతనే తిక్కనార్యుఁ డాయాపాత్రల స్వభావోన్మీలనమును, ఆయా కథావస్థల (situations in the story) దృశ్యత్వమును సాధించుచున్నాఁడు.

ద్రౌపదీకీచకుల సంభాషణక్రమమునఁ గూడ మూలములోని దానికిని, తెలుఁగునందలి దానికిని విశేషవ్యత్యాసము కలదు. అందలి యత్యుక్తులు, అనుతాపవాక్యములు "దాసస్తవాహం పృథుతామ్రలోచనే" యను దాసోహములు నిందేమియు లేవు. బందార్కరు పరిశోధనాలయమువా రాదరించినప్రతిలో కీచకుఁ డేమియు నత్యుక్తులకు దిగనేలేదు.

"ఇదంచ రూపం ప్రథమంచ తే వయః
నిరర్థకం కేవల మద్య భామిని"

అని రెండు సొడిమాటలను మాత్రమే చెప్పినట్లున్నది. తక్కిన యుత్తర దక్షిణదేశ ప్రతులలో ననేకశ్లోకములు చేర్పఁబడినవి. కాని తిక్కన రచనకును వానికి నెట్టిపోలికయుఁ గనఁబడదు.

కీచకుఁడట్లు ద్రౌపదియొద్దకే పోయి తనయప్పవలనఁ దెలిసికొనఁ దలఁచిన విషయమునుగూర్చియే ప్రశ్నించినాఁడు.

"ఇవ్వసుమతి నేపొలఁతుల
కివ్విధమునఁ జెలువు గలదె యెన్నంగను నీ
వెవ్వరి తనయవు నీపతి
యెవ్వఁడు పేరేమి చెప్పు మిందునిభాస్యా."

రూపాభిమాని గావున 'నామె చెలువమును' గూర్చియే ప్రశంసించినాఁడు. నీపతి యెవ్వరు, నీవెవ్వరితనయ వని యడిగినాఁడు. మూలములో వలె

"మన్యే త్వాం దేవలోకాచ్చ చ్యుతాం తారాం యదృచ్ఛయా,
అభూషితాపి జ్వలసే కా త్వం సౌదామనీ యథా"

యని యత్యుక్తులకు నలంకారములకు దిగలేదు. మఱియు నామె తాను చెప్పుమాటలను వినుచున్నదా లేదా యను విషయమునే గమనింపక వరుసగా 15,20 శ్లోకములు చదువ మొదలుపెట్టలేదు. తిక్కనార్యుఁ డెప్పటికప్పుడు నాటకములోవలెనే యొకరు మాటలాడుచుండ వీరిమాటలు వినువారి మనోవృత్తుల నెట్లెట్లు మార్చుచున్నవో, వారేమని తలంచుచుండిరో యను విషయమును వెంటనే కనఁబఱచుచుండును. కీచకుఁడు ప్రశ్నింపఁగా ద్రౌపది ప్రత్యుత్తర

మీయలేదు. కాని విననేలేదా? కాదు. వినియు విననిగా భావించి నిర్వికారయై యూరకున్నదట. ఆతఁ డడిగిన ప్రశ్నల కప్పటిస్థితిలో నామె యుత్తరమిచ్చుట కవకాశము లేదు. ఇంతేగాక యాతని వైఖరి నంతను గనిపెట్టినదిగావున, ధీరయగు నామె యుత్తరంబీయక యాతని మాటలను లక్ష్యపెట్టని దానివలె నిర్వికారయై యుండుటచేతనే యాతనిని జంకింపఁదలఁచినది. కాని యామె నిర్వికారయగుటచేతనే కీచకుని చాపల్యమును హెచ్చినది. కావున నా చపలుఁడు వెండియుఁ బలుకసాగెను. చపలుఁడను విశేషణ మీసందర్భమున నాతని కెంత సముచితంబై యున్నదో పరికింపుఁడు. ఆతనిపలుకులు, నాచాపల్యము నెంతచక్కఁగా సూచించుచు నామె సౌందర్యమునుగూడ వర్ణించునవై యున్నవో చూడుఁడు.—

" తెలిగన్నుఁగవ కాంతి పొలుపార నించుక
　　గను విచ్చి చూచినఁ గాదె యబల
చెలువంపు నెమ్మోము నెలమి సొం పినుమడి
　　గా నల్ల నవ్వినఁ గాదె యింతి
దంతమౌక్తికరుచి దలకొన మఱుమాట
　　పలికినఁ గాదె యుత్పలదళాక్షి
యుల్లంబు సరసత దెల్లంబుగా లీలఁ
　　గైకొన్నఁ గాదె పంకరుహవదన
అనుచుఁ జూచుఁ జేరు నమ్ముగ్ధ పలుకులు
వినఁగఁ గోరుఁ గేలు దనదు కేలఁ
గీలుకొలుపఁ దలఁచు గీచకాధముఁడు ని
జానురక్తిఁ దెలుప నప్పళించు.

ఈ సీసపద్యములోని మొదట నాలుగుపాదములలో పాంచాలి తానుపల్కిన పల్కులను వినమిగా భావించి నిర్వికారయైయుండుటను దెలిసికొనిన కీచకుఁడు, లేదా తననుజూచి మోహమును జెందుటచే నర్ధాంగీకార మౌనమును వహించినదని భావించిన కీచకుఁడు విలాసచేష్టల నేమైన చేయవలదేయని ప్రార్థించినట్లుగా నామెసౌందర్య వర్ణనము చేసినాఁడు. ఆ భావగర్భితములగు విశేషణములు, ఆ భావములయందలి సక్రమత ఆయాంతరంగిక భావములకును, బాహ్యాకృత్యములకును గనపఱచిన సాందికయును ప్రత్యేకముగా గమనింపఁదగియున్నవి. నీవు అబలవైనచోఁ గన్నువిప్పిచూచిన చాలుఁగదా యని ప్రశ్నించి యామె చూచునేమో యని తా నామెవంక తేఱిపాఱఁజూచును. కొంచెము ప్రౌఢవైనచో నించుక చిఱునవ్వైన నవ్వరాదా యని కొంచెము దగ్గఱకుఁ జేరును. ధీరవైయైనచో మఱుమాట పలుకఁగూడదా యని ప్రశ్నించి పలుకునేమో యని వినఁగోరుట నభినయించును. ఇంకను సరసురాలవైనచో హృదయమునందలి యాసరసత్వమును బయలుపఱుచు శృంగారవిలాసముల నేమైనఁ జూపుచు నా కయిఁగొనరాదా యని పలికి యామె కేలు తన దు కేలఁ గీలుకొలుపఁదలఁచు. ఇంకను నామె యేమియు నుత్తరం బీయకపోవుటచే తానె సాహసించి నిజానురక్తిని వెళ్లఁబోసుకొనను బలాటపడుచున్నాఁడు. ఎవరు? సాహసింపఁదలఁచిన 'కీచకాధముఁడు'. ఎట్టియభిప్రాయగర్భితమగు విశేషణముచే నాతనిని బేర్కొన్నాఁడో తిక్కన! పరాంగనపైఁ దనమాశ్కి నెక్కొల్పుటయే గాక, కేలు దనకేలఁ గీలుకొలిపి, నిజానురక్తిఁ దెలుప సాహసించిన వాఁడు గనుకనె 'కీచకాధముఁడని' యాతనిని బేర్కొన్నాఁడు. నిజానురక్తిని దెలుపఁదలఁచినవాఁడయ్యును తమకము హెచ్చుటచేఁ గలిగిన యావేగమున నామె చలింపకుండుటలో నయ్యంగన హృద్గతాభిప్రా

యమేమో యూహింప వెరవునూలినవాఁడై, తాను చేయఁదలఁచిన పనినిగూడ చేయలేక, చెప్పఁదలఁచిన మాట చెప్పలేక, యొడలు కంపింప, నెన్నిరీతుల నారసిన నామె మనము పట్టువడకుండుటను, నామె యనాదరమునె చూపుచు నిర్వికారయయి యుండుటను గాంచి తుద కెట్లో

"చెలువ యింక నొక్కించుకసేపు నీవ
నాదరంబున నెప్పటియట్ల యున్న
మన్మథుఁడు సమయించిన మగుడ నన్నుఁ
బడయవచ్చునె యెన్నియుపాయములను"

అని డొంకతిరుగుడుగా నెట్లో మొండిచేతిని బయలుపెట్టినాఁడు. దీని లోఁగూడ నాతని రూపాభిమానిత్వము, దుర్విదగ్ధత్వము కనఁబఱచి నాఁడు.

ఇట్లు కీచకుఁడు తనయభిలాషను దేటపడం బలుకుటచే నింత సేపు నిర్వికారయై తనను గానట్లూరకుండిన ద్రౌపది కలుషించినది. ఈ పరిభవవికారం బామెకు దుర్వారంబే యైనది. కాని యావికారము పైకిఁదోఁపకుండఁ దన్నుందాన యుపశమించుకొనినది. అంత నప్పటి స్థితినిగూర్చియుఁ, దానప్పుడు చేయఁదగిన కార్యమును గూర్చియు నాలోచించుకొనఁ దొడంగినది. కాని తొందరపడలేదు. ఎట్టి శాంతచిత్తత్వము — సంసిద్ధత్వము (preparedness); కష్టములయందు, పనిమీరి వచ్చినపుడు తాను జేయవలసిన దానినిగూర్చి యాలోచన, ధైర్యస్థైర్యములు, నేర్పరితనము—ఎట్టిగుణములను తిక్కన యీ ద్రౌపదియందు సూచించినాఁడో చూఁడుఁడు. "వీఁడు దురభిమానియై యున్నవాఁడు. వేగిరపాటు వలనుగాదు; నేరుపుతోడన తప్పిం

చుకొనవలయు"నని తలంచినది. కీచకుఁడు రూపాభిమాని. "మన్మథుఁడు సమయించిన మగుడ నన్నుఁ బడయవచ్చునె" యను నాతని దురభిమాన పూరితములగు వచనములకుఁ బ్రత్యుత్తరముగా "నీరూపమునకుఁ దగి నట్లుగా నారూపము లేదు. నాజోలికి రాకు"మని చెప్పి వారింపఁజూచినది.

"నాయున్న భాముఁ దలఁపవ
యీయెడ లీచీక యిట్టి యేనపుఁజందం
బోయన్న! మదనవికృతిం
జేయుననుట యెంతయును నిషిద్ధము గాదే."

'ఓయన్న' యని సంబోధించినది. నీవు నాఁడుపుట్టువులతోడఁ బుట్టి నావుగదా యని యనునయించినది. తన హీనరూపమును, నేనపుసందమునే గాక, హీనవంశాభిజాతత్వమును, సతీత్వమును గూడఁ దెలిపి, 'యిట్టి నన్నడుగఁదగునే' యని తగవుతోఁ బ్రతిమాలుకొనినట్లు పలికినది. ఈసందర్భమున నాఁడుఁ బుట్టువులతోడ నీవునుబుట్టినావు అను తెనుఁగు నానుడి (బహుశః అనతిదూరమునున్న సుదేష్ణను జూపుచు) యెట్టి సమయమున నెంత యర్థవంతముగా, నెంత గుణవత్తరముగా (effective) తిక్కనద్రౌపదిచేఁ బ్రయోగింపఁ జేసినాఁడో గమనింపుఁడు.

ఇట్లు ద్రౌపది తన యుద్దేశమును "వీడఁగఁబల్కిన"ది. ఇంత సేపటి నుండియు ద్రౌపది మాటలాడకపోవుటచే 'నయ్యంగన యింగితం బూహింప వెరవుమాలి' "కామీ స్వతాం పశ్యతి" యన్నట్లుగా నున్నాఁడు కీచకుఁడు. ఈమాట లతని సంశయమును విడఁగొట్టి కొంచెము మేల్కొల్పినవి. తనరూపమును జూచి ద్రౌపది తనను మోహింపకుండునా యనుసంశయ మిప్పటికి కొంచెము తగ్గినది. కావున "మన్మథుఁడు సమయించిన మగుడ నన్నుఁ బడయవచ్చునే" యన్నవాఁడు

గారవంపుఁ బలుకులలోనికి దిగి యామెసౌందర్యమును వర్ణించుచు నామె తనను గూర్చి చెప్పుకొనిన మాటలను బ్రత్యాఖ్యానము చేయవల యునని తలంచినాఁడు. ఆమెసౌందర్యమును వర్ణింప మొదలుపెట్టినాఁడు.

"నెత్తమ్మిరేకుల మెత్తఁదనముఁ దెచ్చి
యచ్చునఁ బెట్టిన ట్లుండ మొంది
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి
కుప్పలు చేసిన ట్లొప్పు మెఱసి
చందురు నునుగాంతి కందేర్చి కూర్చి బా
గునకుఁ దెచ్చినయట్లు కొమరుమిగిలి
యలికులంబుల కప్పు గలయంత్రయును బుచ్చి
నారువోసినభంగి నవకమెక్కి
యంఘ్రితలములు కుచములు నాననంబు
కచభరంబును నిట్లున్న రుచిరమూర్తి
యనుపమానభోగములకు నాస్పదంబు
గాదె యీత్రిప్పు లేటికి కమలవదన."

ఇక్కడ ద్రౌపదీసౌందర్యమును కీచకునిచే వర్ణింపఁజేసినరీతిని బట్టి తిక్కన ప్రబంధముల శృంగారవర్ణనపద్ధతికి దారితీసినవాఁడై నాఁడు. ఇక్కడ విశేషమేమనఁగా నిది రాగరసమగ్నుఁడైన కీచ కుఁడు చేసినదిగాని తిక్కన స్వయముగాఁజేసినది కాదు. కీచకుఁడైనను ద్రౌపది తన యేపుచందంబు మదనవికృతిం జేయునా యని పలికిన దానికిఁ బ్రత్యుత్తరమునిచ్చు సందర్భమునఁ జెప్పినది. అట్టి స్థితిలో కీచకుఁడైనను నఖశిఖపర్యంతము నామె యవయవ వర్ణ నకు దిగక, పైకి ప్రధానముగాఁ గనఁబడుచు నామె సౌందర్య

మూర్తిని స్ఫురింపజేయు నంగములనే వర్ణించినాఁడు. కీచకునికిని తిక్కనార్యునికి వలెనే యంగనా సౌందర్య వర్ణనవిషయమున 'నా రుచిరమూర్తి' యొక్క లావణ్య స్ఫురణమునందే దృష్టిగాని, ప్రత్యేకావయవములయం దంతవిశేషముగా లేదు. కీచకుఁడు తన రూపమందెగాక యితరులయొక్కయు సుందరరూపసామాన్యమం దభిమానము కలవాఁడనుట కీవర్ణనమునం దామె రుచిరమూర్తి నాతఁడు ప్రశంసించుటయే తార్కాణము. తిక్కన తాను మొదట వేసిన విశేషణములను సార్థకములుగాఁ జేయుటలో నెట్టి జాగరూకత వహించునో గమనింపుఁడు. ఇట్లామె రుచిరమూర్తిని వర్ణించి నేరుపుతో స్వాధీనముచేసికొనవలెనని ద్రౌపదియుక్తులకు సమాధానము చెప్పుచున్నాఁడిక్కడ కీచకుఁడు. కాని సంస్కృతమునందువలె మహోపన్యాసమును జేయలేదు.

"ఈ యొడ లీచీర యిట్టియేవపుచందంబని" పలికినదానికి బదులుగా నామెసౌందర్యమును వర్ణించి, నేరుపుతో తప్పించుకొనుటకుఁ బలికినదని గ్రహించినవాఁడువలెనే "యీ త్రిప్పులేటికి కమలవదన" యని బదులు చెప్పినాఁడు. "హీనవంశాభిజాతి"ను, "పతివ్రతనన్నడుగఁదగునే" యను నీరెండు విషయములకును రెండుత్తరము లీక్రింది పద్యమునఁ జెప్పుచున్నాఁడు. తిక్కన సంభాషణను యుక్తిప్రత్యుక్తిరూపముగా నడిపించునేగాని సబబు సందర్భము లేకుండ మాట్లాడించఁడనుటకుఁగా నిది యింతగాఁ దెలుపఁబడుచున్నది.

"నీవు దుర్జాతి గామికి నీవ సాక్షి
పరసతీ సంగమున వచ్చు పాపమునకు
నోర్తుఁ గాని సైరింపఁగా నోపఁ బచ్చ
విలుతు తూపుల తాఁకున కలరుఁబోఁడి."

ఇంతకుఁ బూర్వము కేవలము తన యభిలాషను మాత్రము దెలిపినాఁడు. ఇప్పుడు మఱియొక మెట్టెక్కిన దీతని సంభాషణక్రమము. పాప చింతలేక యెట్టిసాహసమునకైన సిద్ధపడున ట్లగపడుచున్నాఁడు. నేర్పుతోఁ దప్పించుకొనుట కవకాశమిచ్చునట్లు కనఁబడలేదు. కావున నీమారు ద్రౌపదికి బాగుగఁ గోపము గదిరినది. వీఁడు నీచుఁడు గావున జంకించినగాని పోఁడని తలంచినది. ఆస్థితిలో కీచకుని జంకించుటకును, ద్రౌపదికి గదిరిన కోపమును వెలిపుచ్చుటకును తిక్కన యెట్టి గంభీర మగు శైలిని, దానికిఁదగిన వృత్తము నవలంబించినాఁడో చూడుఁడు. శార్దూలవృత్తమును వాడినాఁడు.

"దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీర నిర్మథన విద్యాపారగుల్, మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యంబెమ్మెయిన్ గీచకా!"

'కీచకా' యని సంబోధించినది. 'ఓయన్న' యనుసమయము దాటి నది గదా యిపుడు. అత్యంతగంభీరము, భయంకరమునగు 'దుర్వా రోద్యమేత్యాద్యతి దీర్ఘసమాసముతో పాటు మత్పతుల్, గీర్వాణా కృతుల్, గంధర్వుల్, అను నీహలంతపదములన్నియు నెదుటి వానిని జంకించి యదల్చివేయుటకుఁ దగినవియై యున్నవి. అవసరము కలిగినఁ గాని, తిక్కన ప్రౌఢసంస్కృత దీర్ఘసమాసములను వాడఁడు. ఈసం దర్భమున నీపద్యమును ద్రౌపదిచేఁ బలికించి దాని కంఠమున గంభీరం బగు నామెస్వభావమును వెల్లడిచేసినాఁడు. మఱియు నామె చెప్ప దలఁచిన విషయము నంత నొక్కపద్యముననే యిమిడ్చినాఁడు. ఆసం గ్రహ నైపుణ్యము (brevity of expression) బరికింపుఁడు. ఇట్టి సమాసములనే కాక యీశార్దూలవృత్తము సైతము తిక్కన చాల అరు

దుగనే వ్రాసినట్లున్నాఁడు. తిక్కన కవితయందు ఛందోవృత్తముల వాడుకను గూర్చి ప్రత్యేకముగాఁ బరిశీలింపవలసియున్నది. ఏయేసందర్భములందే యే వృత్తములను వాడి రసము నెట్లు పోషింపవలయునో తిక్కనకు బాగుగాఁ దెలియును ఉదాత్తత, గాంభీర్యము, మొదలగు గుణములు కావలసినచోట నీశార్దూలవృత్తము నీతఁడు ప్రయోగించు చున్నట్లు తెలియవచ్చుచున్నది.

సంస్కృత మూలమున ద్రౌపది పలికిన పలుకులకును, దిక్కన రచనకును విశేషభేదము కలదు. అక్కడ ద్రౌపది ధర్మాధర్మవిచారణతోఁ గూడిన యొక ధర్మోపన్యాస మిచ్చినది.

"స్వేషు దారేషు మేధావీ కురుతే యత్నముత్తమమ్;
స్వదారనిరతో హ్యేవ నరో భద్రాణి పశ్యతి.
స్వదారేషు రతిర్ధర్మో మృతస్యాపి నసంశయః;
అధర్మ మయశశ్చాపి ప్రాప్నుయాశ్చ మహద్భయమ్.

ఇట్లుచెప్పుచుఁ బోయి

"కామవేగోద్ధతాంగేన గంధర్వాః పతయో మమ;
తే త్వాం నిహన్యుః కుపితా స్సానుబంధ మమర్షిణః
దుర్లభా మభిమన్యానో మాం వీర రభిరక్షితామ్;
పతిష్య స్యవశోస్తూగ్రం పక్వం తాళఫలం యథా.

"గంధర్వాఃపతయోమమ- తేత్వాంనిహన్యుః" అను దానికిగాను తిక్కనార్యుఁ డీదుర్వారోద్యమేత్యాది పద్యమును రచించినాఁడు. ఈసందర్భమున సామాన్యముగా పురాణాదులయందుఁ గానవగు నుపమాద్యలంకారములతోఁ గూడిన పద్యము లనేకములు దక్షిణదేశోత్తర దేశపాఠములలోఁ గలవు.

"త్వం కాలపాశం ప్రవిముచ్యకంఠే
ప్రవేష్టు మిచ్ఛ న్నధమ ప్రవేశమ్;
హుతాశనం ప్రజ్వలితం మహావనే
నిదాఘమధ్యాహ్న ఇవాతురస్స్వయమ్.
"త్వం తారకాణా మధిపం యథాశిశుః;
తథాహి మాం ప్రార్థయసే సుదుర్లభామ్"

కాని తిక్కనార్యుఁడు వీనిజోలికిఁ బోలేదు. ప్రాచీనమూలపాఠమని బం. పరి. వారు గ్రహించినపాఠములో ద్రౌపది సంభాషణమంతయు 9 శ్లోకములలో మాత్రమే మిగుల సంగ్రహముగా నున్నది. తుదిశ్లోకము లలంకార సహితములైనవియు కొన్ని గలవు. తిక్కనార్యుఁ డీపాఠమునే యాదరించినాఁడనుకొన్నను, అందలి

"త్వంకాలరాత్రీ మివ కశ్చి దాతురః
బలా దివ ప్రార్థయ సేఽద్య కీచక!
కింమాతరం క్లేశయతో యథా శిశుః
చన్ద్రిం జిఘృక్షన్నివ మాం జిఘృక్షసి."

ఇత్యాది శ్లోకములలోని యుపమానముల నేమియు గ్రహింపనే లేదు. అలంకారముల నాదరించుట కేవల స్వాభావిక రచనాశీలుఁడగు (realistic style) తిక్కనార్యున కిష్టమే లేనట్లు స్పష్టమగుచున్నది. అందు ముఖ్యముగా సంభాషణసందర్భమున వాదప్రతివాద యుక్తిప్రత్యుక్తి కల్పనారీతినే (argumentative style) యవలంబించును గాని అలంకారభూయిష్ఠ మగు భాషతో నాయాపాత్రలచే మాట్లాడింప యత్నింపఁడు. మూలములో కవితా సౌందర్యమును బెంపొందించునుద్దేశముతో గొన్నిటిని, భారతము పంచమ

వేదంబై ధర్మబోధకగ్రంథముగాఁ దలంపఁబడుటచే, ధర్మబోధకము లగు శ్లోకములను గొన్నిటిని, సమయము దొరకినపుడెల్ల నాయాపాత్ర లచేఁ బలికించుచుండుట నాచారమైన ట్లున్నది. అట్లే యిచ్చట ద్రౌపదిచే పరదారాభిమర్శనము పాపమని బోధించు నొకయుపన్యాస మిప్పించినారు. కాని తిక్కనార్యుఁ డీభారతమును కేవలధర్మబోధకం బగు గ్రంథముగఁజేయుట కెప్పుడును బ్రయత్నింపలేదు. సందర్భాను కూలముగా నీతిబోధ యావశ్యకమైనపుడు, ధౌమ్యాదుల నీతిబోధనలవలె చక్కగా రచియించునేకాని సమయము దొరకినపుడెల్ల ధర్మబోధకుఁ గడంగఁడు. ఆతనిదృష్టి యెల్లపుడును రసపోషణమందును, ఔచిత్యముతోఁగూడిన శీలభావపోషణమునందును, ఆయాపాత్రల మానసిక వృత్తి వివరణమునందును, కథాప్రవృత్తికి స్వాభావికత్వగుణ సంపాదనమునందును (make the movement of the story realistic) కావ్యకళా సౌందర్యమునందునే, నిశితవ్యగ్రంబై (keen) యొప్పుచుండును కావుననే యాతఁడు మూలములోని యలంకారముల జోలికిపోనే లేదు.

అట్లు ద్రౌపది పరుషవాక్యములతో కీచకుని జంకించి యావలకుఁ బంపివేయవలయునని తలఁచి యతిభీకరంబుగఁ దన పతుల ప్రతాపమును వర్ణించినది. కాని సింహబలుఁడు కేవలము రూపాభిమానియే గాఁడు. స్వబల గర్వితుఁడు గూడనై యున్నాఁడు. తిక్కన ముందుగనే యాతని స్వభావగుణములను సూచించి, యాగుణముల నీతని సంభాషణమునను, చర్యలలోను గనుపఱుపకుండునా! సంస్కృతమూలములో నీ సంభాషణక్రమమే లేదు. మూలములో నొక్కసారియే తన యభిలాషను దెలుపుచు నొకగొప్ప కామోపన్యాసమును జేసినాఁడు.

దానికిఁదగిన ధర్మోపన్యాసమును ద్రౌపది చేసినది. అంత

"ప్రత్యాఖ్యాతశ్చ పాంచాల్యా కీచకః కామమోహితః,
ప్రవిశ్య రాజభవనం భగిన్యా అగ్రతస్థితః."

ప్రత్యాఖ్యాతుఁడై అక్క యొద్దకుఁ బోయినాఁడు. ఇదియే మొదటి సారి పోవుట. ఈయుపన్యాస భాగమునంతను తిక్కన నాటక భాగముగ మార్చి వీరిసంభాషణ నెంతరమ్యముగ నడిపించినాఁడో గమనింపుఁడు. ద్రౌపది జంకించిననుఁ బలగర్వితుఁడగు కీచకుఁడు జంకువాఁడు కాఁడు.

"అనుఁడు నతఁ డిట్టులనియె నా యలఘుబాహు
బలముఁ జెనయంగ భవదీయ పతుల కారు
మూఁడులోకంబులందు నెవ్వాఁడు లేమి
నిక్కువంబింత సమ్మము నీరజాక్షి

ద్రౌపదియొక్క ఈయభిప్రాయముకూడ గీచకునియొద్ద పనికిరా లేదు; కావున నిఁక సహింపలేని స్థితి వచ్చినది. ద్రౌపదికి ఇది నాల్గవస్థితి— మొదట నిర్వికార; పిదప కలుషించియు నుపశమించుకొనిన నేర్పరి; పిదప కుపితయై జంకింపఁదలఁచినది. చివరకు 'సైరంధ్రిక్క' ధిక్కరించుచు రావణాదుల సాదృశ్యమును జూపి యందనిమ్రాఁకుల పండ్లు గోయఁదలఁచుట హితవుగాదని తూలనాడి పొమ్మన్నది. "వివేకవిహీనా"యని సంబోధించినది. ఇది యెంత సాభిప్రాయ సంబోధనమో గమనింపుఁడు. వివేకవిహీనుఁడు గనుకనే తాత్కాలిక ప్రియమును బడయఁగోరి యందనిమ్రాకుల పండ్లుగోయఁదలఁచి హితవును—ఆత్యంతికసుఖమును గలుగఁజేయు మాటలను జెవినిబెట్టకున్నాఁడు. ఈసంబోధనలలోఁ గూడ తిక్కనార్యుఁ డెట్లు సంభాషణక్రమమునకుఁ దగిన యౌచిత్య

మును బాటించినాఁడో చూడుఁడు. మొదట మాటలాడనే లేదు తరువాత 'ఓయన్న' యని యనునయించినది. పిదప 'కీచకా' యని యని జంకించినది. చివరకు 'వివేకవిహీనా' యని ధిక్కరించి తిట్టినది.

ఇటుధిక్కరించిన యింతి "పలుకులయందలి యర్థమును గానసేరక" నెవ్వగ మనమునఁ బెరిగొన, జిన్నఁబోయిన మొగముతో నాసింహబలుఁడు తన యప్పకడకు మగుడ జనియెను. మూలములో "భగిన్యా అగ్రతస్థితః" అని మాత్రముండఁగా 'మగుడ' యని తిక్కన యెంతయు జాగరూకతతో రచించినాఁడు.

"సతు మూర్ధ్న్యంజలిం కృత్వా భగిన్యాశ్చరణా వుభే;
సమ్మోహాభిహత స్తూర్ణం వాతోద్ధూత ఇవార్ణవః
సప్రోవాచసు దుఃఖార్తో భగినం నిశ్వసన్ముహుః."

మూలములో కీచకుఁడు సుదేష్ణ కిప్పుడే మ్రొక్కినట్లున్నది. ఈపాదముల మీఁదఁబడి మ్రొక్కుట నింకను తిక్కన వెనుకకుఁ బెట్టినాఁడు. ఈమధ్య వీరిద్దఱికిని గలసంభాషణము నతిరమ్యముగ బెంచినాఁడు. సుదేష్ణశీలమును మూలమునందు కంటె కొంతమార్చి విచిత్రముగఁ బోషించినాఁడు. ఆమె తుదకుఁ దమ్మునికిఁ దోడ్పడ నిశ్చయించికొని యకృత్యంబున కొడఁబడుటకుబూర్వ మామె వానినివారించుటకై చేసినయత్నములను వివరించి కథనంతను క్రమపద్ధతిని నడుపుకొనుచువచ్చి తుదకొకయుచ్చస్థానము నెక్కించి (he gradually worked up the story to a climax) యప్పుడు కీచకుఁడు సుదేష్ణపాదములపైఁ బడినట్లు తెలిపినాఁడు.

కీచకుఁడు మదనాగ్నిజ్వాలలు,దనుకఁగ నిట్టూర్పు గాడ్పు దందడి నిగుడ నా సుదేష్ణయొద్దకుఁ బోయినను, నింతకుఁ బూర్వ మాతఁడు ద్రౌప

దీనిగూర్చి యడిగినపుడే యీతని సంగతి గ్రహించి యీతని చిత్త వృత్తి మరలుప ననురూపంబగు నుపాయముఁ గానలేనిదగుటచే, నిప్పుడు నేమియు మార్గముదోఁచకుండుటచేఁ గాఁబోలు తననుగానట్లూరుకొనినది. కాని యూరార్పదొరకొనలేదు. పైగా తప్పించుకొన దలఁచిన దానివలె నావలకుఁబోయినదట. మూలములోవలె "స ప్రోవాచసుదుఃఖార్త్తా" అని కీచకుఁడు వెళ్లినతోడనే యామెకు నమస్కరించి తన సంగతి చెప్పుకొనుట కవకాశ మిచ్చుట కలుగలేదు. సుదేష్ణ విషయమునఁ గొంతయభినయము సూచించినాఁడు తిక్కన. ఇదియు నిచ్చటి యామెశీలమునకుఁ దగియేయున్నది. తమ్మునియెడల మిగుల సోదర ప్రేమ కలదేయైనను తానీవిషయమున జోక్యముకలుగఁజేసికొనకుండ తప్పించుకొనఁ జూచుటవలననే యీమె గడుసుదనము ప్రౌఢత్వమును వెల్లడియగుచున్నవి. కాని కీచకుఁ డేమిచేయఁగలఁడు. ఆమెవెంటఁ బడినాఁడు. ఇప్పుడా ద్రౌపది యామెయొద్ద లేదన్న సంగతి తెలిసియు "ఏనప్పుడు నీకుంజూపి యన్వయనామధేయంబు లడిగిన యప్పొలఁతివలనం జిక్కి చిత్తం బుత్తలపడుచున్నది. యటమీఁద నీవ యెఱుంగుదు. అయ్యింతి యింతసేపు నీచేరువనుండి యిప్పు డెటమెలఁగె" నని యేమియునెఱుఁగనట్లు—తానామెచే ప్రత్యాఖ్యాతుఁడగుటను గోపనము చేసి—యామెనడిగినాఁడు. మూలములో నీగుప్తభాషణం బేమియు లేదు.

" యథాసుదేష్ణ సైరంధ్ర్యా సంగచ్ఛేయం సకామయా;
తథా శీఘ్రం కురుష్వాద్య మహాన్ ప్రాణాన్ ప్రయాసిషమ్.
యదీయ మనవద్యాంగి న మామద్యాధికాంక్షతే;
చేతసాభిప్రసన్నేన గతో౽స్మి యమసాదనమ్.
తమువాచ పరిష్వజ్య సుదేష్ణా భ్రాతరం ప్రియమ్;
భ్రాతుర్జీవితరక్షార్థం సమాశ్వాస్యాసితేక్షణా."

అప్పుడు సుదేష్ణ వెంటనే (బందార్కర్ పరి
రించిన మూలపాఠములో) యిట్లు బదులుప

"స్వమర్థ మభిసంధాయ తస్యార్థ మభిచి
ఉద్వేగంచైవ కృష్ణాయాః సుదేష్ణా సూ
పర్వరీణం సముద్దిశ్య సురామన్నంచ కా
తత్రైనాం ప్రేషయిష్యామి సురాహారీం

ఇక్కడ సుదేష్ణ కీచకునికిఁ దోడ్పడుటలోఁగల
రెండుముక్కలలో తెలుపఁబడి యున్నది.
తమ్ముని జీవితమును రక్షించుట-ముఖ్యమైనది
అనఁగా తనభర్త యీమెను మోహించునేమో
చుకొనుట రెండవది. కృష్ణయొక్క యుద్వే
తించినదట. ఏలనో?

తెలుఁగులోఁగూడ భ్రాతృజీవితరక్షణ
తిక్కనయు సూచించినాఁడు. దానికిఁ దగి
దికమును పెంచి యీమె యా తఁడు తఁ
యము చేయుటకుఁ దగినదే యనిపించుటకు
న్నాఁడు. ఇఁక దక్షిణదేశప్రతుల పాఠముఁ
ష్ణశీలమును తిక్కన పోషించినట్లుగా లేదు.
తవలకుఁ గాపాడి సమర్థించుటకై ప్రయత్నము
న్నది. తమ్మునికార్యమున చివరకు విధిలేక
నామె ద్రౌపది కపకారము చేయఁదలఁచుకొ
నితో వాదించినట్లు సూచింపఁబడినది. ఈవాద

లోనే, తిక్కన సుదేష్ణకును, దక్షిణదేశప్రతులలోని సుదేష్ణకును స్వభావములోఁగల తారతమ్యము వ్యక్తమగుచున్నది. తిక్కన యీమెను కీచకునికిఁదగిన యప్పగాఁ జేసినాఁడు. దక్షిణదేశప్రతులలో నట్లులేకుండుటచే తిక్కన యుత్తరదేశప్రతులను బట్టి ప్రాచీనపాఠముగాఁ గనఁబడుచున్న మూలమును బట్టియే రచించి సందర్భానుకూలముగాఁ దన కల్పనాచాతుర్యమును వెలయించినాఁడని యూహింపఁ దగియున్నది. దక్షిణదేశ ప్రతులలో కీచకునికి ప్రత్యుత్తరముగా సుదేష్ణ యేమనునో చూడుఁడు:

"శరణాగతేయం సుశ్రోణీ మయా దత్తాభయాచ సా;
శుభాచారా చ భద్రం తే నైనాం వక్తుమిహోత్సహే.
నైవాచ శక్యా హ్యన్యేన స్ప్రష్టుం దుష్టేన చేతసా;
గంధర్వాః కిలపంచైనాం రక్షంతిచ మహాబలాః."

ఆమె శుభాచార; ఆమెకు నే నభయమిచ్చితిని గావున నేనామెతో నేమియు చెప్పనన్నది. చెప్పక యీమె నేమైన కాపాడఁగలిగెనా? లేదు. తిక్కనయొక్క సుదేష్ణ మాయలాడి, గడుసరి, జంత. లోపల నొకవిధముగానుండి పైకి వేఱువిధమునఁ గనఁబడుచుండును. ఇప్పుడు ప్రత్యాఖ్యాతుఁడై తనయొద్దకువచ్చిన తమ్ముని వేగిరపాటు చూచి పైకేమియుననక, యాతనిస్థితిగతులన్నియు గమనించుచునే యుండెఁగావున శిరఃకంపంబు చేసినిజాంతర్గతంబున నిట్లు తలంచెను.

"రాగరసమగ్నుఁడయ్యె సైరంధ్రిఁజూచి
యకట వీనికి నేమి యపాయ మగునో
వలదు తగదన్న నుడిగెడువాఁడు గాఁడు
మాయదైవము యేనేమి సేయుదాన"

అని చింతించి వీనికిఁదగిన తెఱంగున వారించిచూచెదగాక యని యూహించినది. శిరఃకంపంబుజేసి నిజాంతర్గతంబున అని సమ యానుకూలములు (apt), స్వాభావికములు, భావస్ఫూర్తి ప్రదర్శకములునగు తిక్కనార్యుని యభినయ సూచనలను (realistic and psychological touches) పరికింపుఁడు. సుదేష్ణ మనోవృత్తు లెట్లు ప్రసరించుచున్నవో గమనింపుఁడు. దక్షిణదేశపాఠములలో వలె 'పాపము ద్రౌపది శరణాగత శుభాచార, నేనామెకభయమిచ్చినాను, ఆమెకు చిక్కు కలుగకుండ నీతనినెట్లువారింతుననికా దీమె యోచించినది. ద్రౌపదిని జూచి రాగరసమగ్నుఁడయ్యెనే. ఆమెను గంధర్వులు రక్షింతురని చెప్పినది. వీఁడు వలదన్న నుడిగెడు వాఁడు కాఁడు-దుర్విదగ్ధుఁడు" కావున తనతమ్మునకెట్టి యపాయము గలుగునోగదా యని చింతించుచున్నదే కాని, ద్రౌపదిని గూర్చి యీమె కేమియుఁజింతయే లేదు. "మాయదైవము నేనేమిచేయుదాన" అని తిక్కన విసిరిన తెలుఁగుపలుకుబడి యెంత సమయానుకూలముగ స్వాభావికముగ నున్నది! ఐనను "వానికిఁదగిన తెఱంగున" వారించి చూచెదను గాక యని తలంచినది. దక్షిణదేశపాఠములలో వారించినరీతిని వారింపలేదు. తిక్కన యీమెను క్షిత్తౌన్నత్యము కలదానినిగాఁ జేయఁదలంపలేదు. ఒకవిధమగు నైచ్యగుణము నాపాదింపఁదలఁచినాఁడు. కావున కీచకుని స్థితికిఁదగినట్లుగనే వారింపఁ జూచినది. తమ్మునికిఁదగిన యప్పయే యని చెప్పవలసియున్నది. ఆ తగినరీతి యెట్లో చూడుఁడు:

"లలితంబులగు మట్టియల చప్పు డింపార
 నంచకైనడి నడ నల్లవచ్చి
యొడమేని నెత్తావి సుడియంగఁ బయ్యెద
 పగము దూలించి పై మగుడఁ దిగిచి

సోలేఁడు నెలదీఁగ లీలఁ గ్రాలుచు వింత
చెలువంబుఁ దలకొనఁ జేరి నిలిచి
తెలిగన్నుఁగవ నెచ్చెలియైన లేఁతన
వ్వొలయంగ సరసంపుఁ బలుకు పలికి
మెఱయు రాగంపుఁజేయ్యేల మెయికొనంగ
నెడఁ సొగయించు మాటల నెలమిమిగుల
నిన్ను ననురక్తిఁగొలుచు నన్నెలఁత లుంచ
నీరసాకార సైరంధ్రిఁ గోరఁదగునె.

ఎచ్చటను బరుషాక్షరములు లేక మెత్తని యచ్చుఁదెనుఁగుపదముల మృదులంబగు కూర్పుచే నమర్చి భావానుగుణంబగు ధ్వని కలుగునట్లుచేసి, తమ్మునిస్థితికిఁదగునట్లుగా—మదనోద్రిక్త మనస్కుఁడగు తమ్ముని మనసున కెక్కునట్లుగా—జెప్పుటలో సుదేష్ణాచాతుర్యమునేగాక యప్రతిమానంబగు తన కవితాచాతుర్యమును గూడ తిక్కనార్యుఁడు వెల్లడించినాఁడు. పోలికచే (by comparison or contrast) సైరంధ్రియొక్క నీరసాకారమును స్ఫురింపఁజేయుటకే సుదేష్ణయాతనిననురక్తిం గొలుచు నెలఁతలరాగంపుఁజేయ్యేలను సొగయించుమాటలను వర్ణించి చెప్పినది. నిజమేకాని కులీనయగుస్త్రీ, యుదాత్తచిత్తయగువనిత తమ్మునితో నిట్లు పలుకుననుట మాత్రము సంభావ్యముగాఁ గనఁబడదు. కావుననే యీ నెలఁతల శృంగారవర్ణన, ఇకముందు చేయఁబోవు జారపొందునుగూర్చిన వర్ణననీమెచేఁజేయించిన తిక్కనార్యుఁడిట్టి సూచనలచేతనే (indirect touches) సుదేష్ణ యంతయుదాత్తచిత్త, యున్నతస్వభావ కాదని సూచించుచున్నవాఁడువలె నున్నాఁడు. ఆమెశీలమునకు నైచ్యము నాపాదింపఁ దలఁచియే యిట్లు చేయుచున్నాఁడు.

ఇప్పటి స్థితిలో కీచకుని కీమాట లేమియు రుచింప లేదు. అప్పలుకుల దెస ననాదరంబుసేయుచు 'నీరసాకారయని యామె చెప్పినదానిని ప్రత్యాఖ్యానము చేయుటకుఁగా ద్రౌపదిసౌందర్యమును వర్ణింప మొదలు పెట్టినాఁడు. ద్రౌపది సౌందర్యవర్ణనమున కెట్టి సందర్భమును కల్పించి కొనినాఁడో తిక్కన గమనింపుఁడు. అంతేకాని సమయము దొరకినదిగ దాయని గంటలకొలఁది యవయవవర్ణనను సాగింపఁజేసినవాఁడు కాఁడు తిక్కన. ఆవర్ణనలో నైనను తిక్కనవర్ణనకును, ప్రబంధవర్ణనలకును గల తారతమ్యము కనఁబడుచునే యుండును. ఇది మదనాగ్నిజ్వాలల వేఁగుచున్న కీచకునిచేఁ జేయించిన వర్ణన. అయిన నెంతయుదాత్తగుణశోభితంబై యున్నది. మన్మథోద్రేకముకలవాఁడు చేసిన స్త్రీవర్ణనయైనను, ఎచ్చటనైన నీచభావసూచనలకైన (indications of low sensuality) నవకాశమిచ్చినాఁడా! సౌందర్య వర్ణనమునకుఁగా నీతఁడు గ్రహించిన రీతియే (aspect of beauty) వేఱు. ఆసౌందర్య స్వరూప నిరూపణపద్ధతియే క్రొత్తదిగా నుండును. రూపాభిమానిగదా కీచకుఁడు—ఇఁక నాతని పలుకులనే గమనింతము

"నాకొలువువార కార
న్నాకేశుం గొలుచు నంగనలలో నైనన్
లేకునికి నాకుఁ దెల్లం
బాకొమ్మకు నీడు వోల్ప నయ్యెడు సుదతుల్"

"గండుమీలకుఁ బుట్టి కామబాణములలోఁ
గలసి యాడెడునట్టి కన్నుఁగవయు
బిసకాండముల శిక్షఁ బెరిఁగి లేఁదీఁగల
మెచ్చకయున్నట్టి మృదుకరములు

చిగురులతో సంధి సేసి యంబుజముల
　　పైనెత్తి చనునట్టి పదతలములు
గలకంఠముల చేతఁ గఱచిన విద్యవీ
　　ణలకిచ్చునట్టి తిన్నని యెలుంగు
నత్తెఱంగున రేఖయు నవ్విధంబు
గరువపందంబు నమ్మెయి కలికితనము
నట్టి చెన్నును సైరంధ్రి యందె గాక
కలవె యొరులకు నెఱుఁగక పలికితబల!

ఆమె కన్నుఁగవ, కరములు, పదతలములు, ఎలుంగు వీనినిమాత్రమే గ్రహించి యామెయాకారమును సౌందర్య స్వరూపమునే వర్ణించి నాఁడు. సౌందర్య వర్ణనములో నెలుంగును దాని మాధుర్యమును వర్ణించిన యాంధ్రకవులు చాల తక్కువగా నున్నట్లు కనఁబడును. ఆ సౌందర్య మూర్తియొక్కయు, రేఖ, గరువపందము, కలికితనము, చెన్నుమాత్రమే, యెంచి ప్రశంసించినాఁడు. ఈరీతి వర్ణనయునపు రూపమే. ఆమె సౌందర్యము నాతఁడు భావనాదృష్టితోఁ జూచి, యామె మూర్తియొక్క లావణ్యతేజమును గని యానందించుచున్నట్లు కనఁబడునే గాని, బాహ్య చర్మ చక్షువులతోఁ జూచి వర్ణించుచున్న వాఁడు వలెఁ గానరాఁడు. మఱియు నా యా పదప్రయోగము నందలి యౌచిత్యమును, దానివలనధ్వనించు భావగరిమను బరికింపుఁడు. కన్నుఁగవ కామబాణములతోఁ గలసియాడునఁట. పదతలములు పైనెత్తి చనునఁట, ఎలుంగు వీణియలకు విద్యనిచ్చునఁట. ఇంతేకాక ద్రౌపది యొక్క సౌందర్యస్వరూపముయొక్క భిన్నచ్ఛాయల నెట్లు కనఁబరచినాఁడో! మొదట నామెరేఖ (general features) అవయవ స్ఫూర్తి ముఖలక్షణముల నెన్నినాఁడు. పిదప గరువతనము (dignified

bearing) పిదప కలికితనము (prettiness), చెన్ను (shining beauty) తిక్కనద్రౌపదిలో నిది యొక విశేషమైన ముఖ్యలక్షణము. దీనిని కీచకునిచేతను గూడ గుర్తింపఁజేసినాఁడు. ఈ సౌందర్య భావచ్ఛాయలను కీచకునిచే గమనింపఁజేయుటచేతనే వాని దుర్విదగ్ధతను సార్థకపఱచుచున్నవాఁడువలె నున్నాఁడు. వీని లక్షణములను గుర్తించుటలో వీనికి మంచి వైదగ్ధ్యమే కలదుగాని యది దుర్వినియోగము చేయఁబడినది. వీనిని కనుఁగొన లేకపోయినదని తలంచినాఁడు గనుకనే సుదేష్ణను 'అబల' యని కీచకుఁడు సంబోధించినాఁడు. "కావున నా యెలనాఁగ నేమి యుపాయంబుననైన నన్నుం జేర్పవైతేని కందర్ప దర్పంబున నలందురి పందుదు నన్నాఁడు. కాని 'ప్రాణానయాసిషం' "గతో ఒస్మియమసాదనం" అని మూలములోని యత్యుక్తులను తిక్కన యీతనిచేఁ బలికింప లేదు. అప్పుడు సుదేష్ణ యవలంబించిన యుక్తి మార్గమేమియు నుపయోగకారి కాకుండుటచే, నిఁక నీతిమార్గము నవలంబించి ధర్మబోధ చేయఁగడంగినది. పరపతీసంగమమునఁ గల దోషములను జూపి వారింపఁ దలఁచినది. ధర్మమార్గమునఁ జెప్పఁబడెడి దోషముల కాతఁడు లక్ష్యము చేయఁడేమోయని, దీనివలన నాతఁడు బడయఁదలఁచిన సౌఖ్యము సౌఖ్యముకాదని రెండవయుక్తిగాఁ జెప్పినది. సుదేష్ణశీలమునకుఁ గొంత నైచ్యము నాపాదింపఁ దలఁచియే తిక్కన యీమెచే జారపొందును గూర్చి యట్లు పలికించెఁగాని కులాంగన సహజంబగు సంకోచమును సిగ్గును (modesty) వీడి తమ్మునితో నైన నిట్లు పలుకునాయని సందేహము కలుగకమానదు.

అన్నిటికంటె ముఖ్యమగు యుక్తి–ముఖ్యముగా సుదేష్ణ మనమున భయముగొల్పిఁ బాధించుచున్న కారణము–మఱియొకటి కలదు.

అది ద్రౌపది బలవిక్రమసంపన్నులగు గంధర్వులను పతులను గలిగి యుండుట.

> "వారలఁదలఁచిన నాచిత్తము, దలఁకెడు నదియేల
> నీకుఁ దమ్ముఁడ చెపుమా"

అని యింత సేపటినుండియుఁ జెప్పిన యుక్తుల (arguments) వలనఁ దేలిన ప్రధానోద్దేశమును (central idea) క్రోడీకరించి (sum up) ఫలితార్థమును దేల్చి యనునయ పూర్వకముగా బ్రతిమాలుకొనినది. ఈ యుక్తికల్పనము సంభాషణాక్రమము నంతయును తిక్కనదే. చిట్టచివరకు బాగుగనచ్చెడి చక్కని లోకోక్తివంటి వాక్యముతో బ్రతిమాలుచు వానిమనస్సును మరల్పయత్నించినది.

> "కానితెరువునఁ బోయినఁ గలుగునయ్యా
> బ్రదుకు, చవి యెంతయైన నపథ్యములకు
> వేడ్క చేయుదురయ్యా వివేకు లెవ్వ
> ధమున నాబుద్ధి వినవయ్యా తమక ముడిగి.

ఇక్కడఁగూడ నీతని బ్రతుకు కెట్టిభంగము కలుగునో యనియె యీయామె భయము. కాని యీమాటలు వానికి సహింపరానివైనవి. తక్కిన యుక్తులకన్నిటికిని బదులు చెప్పుటకు వీలులేకపోవుట చేతను, దాను బలగర్వితుఁడగుటచేతను దన కనువైన గంధర్వులను గూర్చిన విషయమును మాత్రము గ్రహించి, వారివలన నామెకుఁ గలిగిన భీతిని బాప యత్నించినాఁడు. ఇప్పు డాతనివైఖరిని తిక్కన "యిట్లనివల్కె సుదేష్ణతోడ నతఁ డుద్ధతుఁడై" యని యెంతచక్కఁగా వర్ణించినాఁడో చూడుఁడు. ఈ యాథార్థ్య మీతని ప్రతివాక్యమునను నిండి వెల్లివిరియుచున్నది.

"వనితా! యే నొక పల్కు పల్కెదఁ జతుర్వారాశిమధ్యంబునన్
ఘనబాహాబల మొప్పు నన్ను నెదురంగా నోర్చువాఁ డెవ్వఁ డి
వ్వనిఁ జిక్కింపఁ జెల్లు నెవ్వనికి నాహా యీ విరాగంబునన్
దనుకేళిన్ సలుపంగఁ బొమ్మ యనుచుం దా గేలి సేయంగఁ జాడగ్."

ఈపద్యప్రారంభమున 'వనితా' యని యప్పనుగూర్చి చేసిన సంబోధనమునందే యీతని యౌద్ధత్యము వ్యక్త మగుచున్నది. తక్కిన పద్యమున నాతని బలగర్వమును స్పష్టమగుచున్నది. కీచకునియొద్ద యుదాత్తతతోఁ గూడిన గాంభీర్యము లేకపోవుటచేఁ గాబోలు నీసందర్భమున తిక్కన శార్దూలవృత్తమును ప్రయోగింపలేదు. ఇఁక తరువాతిపద్యమున నీతని యౌద్ధత్యము మఱింత వెల్లివిరిసినది. ఇక్కడ నౌద్ధత్యమునకుఁ దోడుగ దనయక్కయం దాతనికిఁ గల చనవునుగూడ నాధారము చేసికొని తన యభీష్టమును నెరవేర్చి, తనకు సహాయము చేసితీరవలయునని పంతముపట్టి బలవంతపెట్టుచున్నవాఁడు వలెను, బ్రతిమాలుచున్నవాఁడు వలెను గూడ పలుకుచున్నాఁడు. నీబుద్ధులు నాకక్కరలేదు. నాపని మాత్రము కొనసాగింపుమని సారాంశము తేల్చినాఁడు.

"బుద్ధులు చెప్పవెల్ల నట వోవిడు మెమ్మెయినైన సౌఖ్యసం
సిద్ధి యొనర్చు నాకు నెడనేసినఁ దాపము రూపమాపు నా
వృద్ధియకోరుదేని నవివేకివి నీవని నన్నుని ట్లసం
బద్ధములైన వాక్యములు పల్కక వే పిలిపింపు కోమలిన్."

అతిక్కనార్యుని స్వభావోన్మీలనచాతుర్యము, సందర్భానుకూలమును శక్తివంతము (forcible language) నగు పాత్రోచిత భాషా యోజనశక్తి బరికింపుఁడు. మూలములో నీసందర్భమున కీచకుఁడు

కుఁడు స్త్రీ స్వభావమునుగూర్చి చెప్పుచు దన యప్పతోడనే యెట్టి యసభ్యములగు పలుకులను బలికియున్నాఁడో చూడుఁడు:

“నన త్వా మనుజానాసి స్త్రీణాం గుహ్య మనుత్తమమ్,
పుత్రంవా కిల పౌత్రంవా భ్రాతరంవా మనస్వినమ్;
సహాసీనా నరం దృష్ట్వా నానాగంధవిభూషితమ్,
యోని స్సంస్వద్యతే స్త్రీణాం సతీనామపి చ శ్రుతమ్;
త్వాం నిరీక్ష్యానులిప్తాంగం సర్వాభరణభూషితమ్,
నశ మేష్యతి సైరంధ్రీ మన్మథే నాభిపీడితా.”

తిక్కనపాత్రల శీలము, భాష, యుక్తికల్పన మొదలగువానికిని దక్షిణ దేశపాఠమునందలి వానికిని గలభేదమును జూపుటకే యీపద్యము లుదాహరింపఁబడినవి.

“ఇట్లసంబద్ధములైన వాక్యములు పల్కక నే పిలిపింపు కోమలిన్”
అని తన పరనాభిప్రాయమును దెలిపి యంతటితో నూరకుండలేదు.

“అనుచు దైన్యంబు నొందెను నాననంబు
వాఁడు దిగ్గన లేచి యత్తోయజాక్షి
సరసపదంబుకడఁ జక్కఁ జాఁగి మ్రొక్కె.”

బాలములో వలె నింతకుఁ బూర్వమే కీచకుఁడీమెకు మ్రొక్కినట్లుగాఁ జేయక తిక్కన వీరిసంభాషణ నను క్రమముగాఁ బెంచుకొని వచ్చి సుదేష్ణ యేమో పలికినపిదపనే, బిక్కమొగము వేసికొని దైన్యంబుతో దనవృత్తో సప్పను బలవంత పెట్టుచు నింక నామెకు మాఱుమాటాడుట కవకాశమేమియు నివ్వక దిగ్గన లేచి యామె కాళ్లపైఁ బడునట్లు చేసినాఁడు. సుదేష్ణ యీకార్యమున కొడఁబడుటకు ముఖ్యకారణము భ్రాతృప్రేమయని చూపుటయే తిక్కన యుద్దేశము. కావుననే వి

సహజప్రేమను గూర్చి మొదటినుండియు నాతఁడు సూచించుచునే వచ్చినాఁడు. కీచకుఁడు దగ్గర లేచి వచ్చి మ్రొక్కినమాటలో తిక్కన చేసిన నాటకాభినయ సూచనము (sign of dramatic action) ఆకోథారంగము నంత నెట్లు మనకన్నులఁ గట్టుచున్నదో గమనింపుఁడు. ఆతఁ డట్లు మ్రొక్కుటతోడనే సుదేష్ణ చిన్నవోయి నదఁట. పిదప నిట్లు కార్యనిశ్చయము చేసినది:

"ఆవల వచ్చు నాపదల కన్నిటి కోర్చి లతాంగిఁ గూర్చి గా
కీవెడమాటలన్ మరలఁ డెన్నివిధంబులఁ జూపి చెప్పినన్
గావలుఁడైన వీఁడు దగుకార్యము వట్టునె, వీని కెమ్మెయిన్
జావు నిజంబు మన్మథుని శాతశరంబులనైన నక్కటా

ఇక్కడ సుదేష్ణ యాంతరంగికోద్దేశములను (motives for future action) కవి బయలువెట్టినాఁడు. మూలమున నిట్టికార్యాలోచనము, కార్యవిమర్శనము, నిశ్చయము, నేమియు లేవు. పైఁగా మూలములో నీడు పు మొదలుపెట్టినదఁట. ఆ సుదేష్ణ తెనుఁగువారి సుదేష్ణవలె గడుసరి కాదు. మొదట నీవిషయమున జోక్యమే కలుగఁజేసికొనననని చెప్పి నది ("నైనాం వక్తు మిహోత్సహే".) కాని కీచకుఁడు బలవంత పెట్టుటచే

"ఏవ ముక్తా సుదేష్ణాతు శోకేనాభిప్రపీడితా,
అహో దుఃఖ మహో కృచ్ఛ మహో పాపమితిస్మహ.

ప్రారుద ద్భృశదుఃఖార్తా విపాకం తస్య వీక్ష్య సా,
పాతాళేషు పతత్యేవ విలపన్ బడబాముఖే;
అకర్తవ్యే హి మాం పాపే నియుంక్షసి నరాధమ."

కొంత యేడుపేడిచినపిదప (అకర్తవ్యమున నియోగించుచున్నందులకు. 'నరాధమా' యని తిట్టినది)

"విదితార్థా కరిష్యామి తుష్టో భవ కులక్షయే,
గచ్ఛ శీఘ్ర మితస్త్వం హి స్వమేవ భవనం శుభమ్"

అని యట్లే చేసెద నింటికిఁ బొమ్మని చెప్పి పంపివేసినది.

మొత్తముమీఁద కథ యొక్కటియే యైనను—జగత్ప్రసిద్ధమైన్నదే యైనను—ఆయాపాత్రల యుద్దేశములను, స్వభావములను, కృత్యములను వ్యక్తపఱచి ప్రదర్శించుటలో (Presentation) తిక్కన యవలంబించుమార్గము వేఱుగా నుండును; స్వతంత్రమైనదిగా నుండును; రమ్యతరంబై యుండును. సుదేష్ణకుఁ గల భ్రాతృప్రేమయు, నాతనికామెయందుఁ గల చనవును తిక్కన రమ్యతరంబుగఁ బోషించి యీకథాసందర్భమున నొక క్రొత్త రుచి కల్పించినాఁడు. వీఁ డెన్ని మాటలను జెప్పినను వినువాఁడు కాఁడు. మన్మథుని శాతశరంబులనైన వీఁడు చావవలసినవాఁడె యని విచారముచే సందేహము లేకయే నిశ్చయించినది. ఈకారణముచే నీతఁడు చావకుండఁ దా నెట్లైనఁ గాపాడినచో, వావల వచ్చు వాపసల విషయమై తరువాతఁ జూచుకొందముగాక యని తలఁచినట్లున్నది. ఈతఁడు చాటుకొనిన పరాక్రమాతిశయమును బట్టి యొకవేళ నాగంధర్వుల నీతఁడే చంపివేసి ద్రౌపదిని దక్కించుకొనకూడదా యనియుఁ దలంచియుండును. అనునిట్టి యామె యాంతరంగిక భావముల నీమాటలలో తిక్కన ధ్వనింపఁజేయుచున్నాఁడు.

ఇట్లు తలపోసి చరణపీఠంబు కడఁ జాఁగిలియున్న తమ్ముని నల్లన నెత్తి యాతని యందలి ప్రేమచేతను, జాలిచేతను క్రమ్ముకొనివచ్చి క్రిందపడ జాఱిపోవుచున్న కన్నీళ్లను కనుఁగవలో ద్రింగికొనుచు నామె

ధీరత్వమునకు లోపము రాకుండ నాఁపివేసినది. సంస్కృతమునందలి సుదేష్ణ 'ప్రారుదత్ భృశదుఃఖార్తా' మిగుల దుఃఖించిన ట్లున్నది. ఎందుకని? "విపాకం తస్య వీక్ష్య" - ఆతని విపాకమును జూచి యాతఁడు ఘోరనరకమునఁ బడనున్నాఁడని తలఁచి — అనఁగా నీతని లోకాంతరావస్థను గూర్చియై యున్నది. కాని యీమె కిక్కడ దుఃఖమునకుఁ గారణ మొకవేళ గంధర్వు లీతని జంపుదురేమో యని. గంధర్వులశక్తిని గూర్చి తనకుఁగల భీతిని వెల్లడించి వారింపనెంచినను, ఆతఁ డెద్దానిని లక్ష్యపెట్టువాఁడు కాఁడని. ఇట్టిస్థితిలో నాతఁడు దైన్యముతోఁ దనకాళ్లపైఁ బడుటను జూచి, ప్రేమానురాగములతోఁ గూడిన యామె హృదయము కరఁగి జాలిచే కన్నీళ్లు వచ్చినవి. వాని నాఁపుకొని, దీనుఁడైయున్న యాతనిని హెచ్చరించి ధైర్యము పలికినది:

"ఇంత దలర నేల యెమ్మెయినైనను
గొమ్మ నలవరించి కూర్చుటరుదె
యమ్మలంబు దక్క యాగడంబాడక నీ
వేఁగు మసలవలవ దింక నిచట."

తమ్మునికిఁ బ్రాణభయ మేమైనఁ గలుగునేమో యని సంకోచించుచుండెనే గాని, కొమ్మ నలవరించి కూర్చుట సుదేష్ణ కొక గొప్ప పని కాదు. ఆచాతుర్య మామెయొద్దఁ గలదు. కావున నిప్పుడు కార్యభార మంతయుఁ దనపై వైచికొని యాతని నూరడించి యింటికిఁ బొమ్మన్నది. ఆమె యూరడించు వైఖరిని (tone) గమనింపుఁడు. ఎంత యాత్మవిశ్వాసము ఉత్సాహము చూపుచున్నదో. అనంతరక కర్తవ్యమును గూడఁ దెలిపినది:

"ఆసనమునకని నీదు ని
వాసమునకు దినములో నవశ్యంబును నే
నా సుదతిం బుత్తెంతు ని
జాసక్తి ఫలింప నలుపు మభిమతకేళిన్."

మూలములో నున్న 'సురా మన్నం చకారయ'—సుర, అన్నము, మధుమాంసాదులనన్నిటిని తిక్కన విడిచిపెట్టినాఁడు. ద్రౌపదిని లోఁబఱచుకొనుటను గూర్చియు మూలమున తెలుఁగునకంటె భిన్నముగనే యున్నది.

"తత్ర సంప్రేషితా మేనాం విజనే నిరవగ్రహే,
సాంత్వయేథా యథాన్యాయం యది సామ సహిష్యతి;
సమ్యక్కృత మిదం సర్వం శేష మత్రానుచింతయ."

ద్రౌపది లోఁబడుట సుసాధ్యము కాదను సూచన యిందుఁ గలదు. తెలుఁగులో సుదేష్ణ "నిజాసక్తిఫలింప నలుపు మభిమతకేళిన్" అని యాతని కోరిక సులభముగా నెఱవేఱునని చెప్పఁగడంగి నట్లున్నది. మఱియుఁ గీచకుని యాసక్తి యీమె సంపూర్ణాంగీకారమును బడసినదిగా సూచించుచున్నట్లున్నది.

తిక్కన రచనలోని సుదేష్ణయొక్క గడుసుఁదనము చాతుర్యమును ద్రౌపదిని కీచకునింటికిఁ బంపు సందర్భమున మఱింత బాగుగఁ గనఁబడును. తమ్ముని సమాధానపఱచి పంపి, పిదపఁ బాంచాలిని రావించి సుదేష్ణ 'తృష్ణ భావించుచు' పలికినది. ఏమి యాతిక్కనార్యుని రూపసంపాదనసొంపు (picturesque description)! ఈయభినయ సూచనచే ముందు చెప్పఁబోవు మాటల కెట్టి యౌచిత్యము, కల్పించినాఁడో చూడుఁడు. 'భావించుచు' అనుపద మెంతగంభీరమైనది. తృష్ణ కలిగిన

ట్లుగాఁ దలంచుకొని యాలోనితలంపున కనుగుణంబులగు ముఖవైఖరి, చేష్టాదులచే (facial expression and actions) దానిని వెలిపుచ్చుచు—అనఁగా నిజముగా లేకున్నను, ఆమెకు తృష్ణగలిగినదని యాకారచేష్టాదుల చేతనే చూచువారు తెలిసికొనులాగున నభినయించుచు—ద్రౌపదితో నెంత యనునయపూర్వకముగా, నెంత స్నేహభావముతోఁ జనవుతోఁ బలుకుచున్నదో చూడుఁడు:

"ఒదవెడు తృష పెల్లిదమున
వదనము తడుపట్లు వట్టె వాసితరాజ
న్మదిరారస మానఁగ నా
హృదయంబున వేడ్క యెసక మెసఁగెడుఁ దరుణీ.

"కీచకుని యింట నెప్పుడు
వాచవియగు బహువిధముల వారుణి గలుగున్
వే చని యచటికిఁ గొనిర
మ్మా చూతము గాని నీగమనవేగంబున్."

ఇచ్చటఁ దనకు తృషాతిశయముచేఁ గలిగిన యాసక్తతయే ప్రధానకారణముగాఁ గనఁబఱచుచు బంపఁదలఁచినదేగాని, మూలములో వలె తన యధికారము, బలవంతము, పట్టుదలయునే కారణముగాఁ గనపఱుప లేదు. తనకుఁగలిగిన బాధను తొలఁగింపుమని వేడికొనినట్లుగాఁ జెప్పుటచే ద్రౌపది యీామెను బ్రతిఘటింప నోరెత్తలేకుండఁజేసినది. నిజముగ నప్రధానమగు నీవిషయమునకుఁ బ్రాధాన్యము కలుగఁజేసి-తనకుఁ గలిగినదన్న తృష్ణను, దానిమూలముననైన వేగిరపాటును, మాటుగాఁజేసి, ద్రౌపదిని గీచకునింటికిఁ బంపుటయను విషయమును కప్పిపుచ్చినది. "వేచని కొనిరమ్మా చూతముగాని నీగమనవేగంబున్"

అని (నిత్యవ్యవహారమునఁ బ్రయోగించెడి జాతీయము నెంతశక్తిమంతముగ తిక్కన ప్రయోగించినాఁడో చూడుఁడు.) ఆమె యంతయాతురముతో, అంతచనవుతో, నంతప్రశంసాపూర్వకముగ, నంతబాధపడుచు, వేగిరపడుచు చెప్పిన ట్లుండుటచే, ద్రౌపది కీవిషయమునఁ బ్రవర్తించుటా, మానుటా యనువిషయమునుగూర్చి యాలోచించుట కైన నెడ మీయకుండఁ జేయవలయునని తలంచినట్లున్నది. తనవాక్చాతుర్యముచే సుదేష్ణ యిచ్చట కల్పించిన గమనవేగపరీక్షవైపునకు ద్రౌపది దృష్టి నాకర్షించుటచే నామెకుఁ గీచకునింటికిఁ బోవుటలోఁ గల భయము మాటుపడి పోవలసినదే! మూలములో సుదేష్ణవాక్యముల కీయొడుపు అందము లేనేలేదు.

"తత సైరంధ్రి మాహూయ సుదేష్ణా వాక్య మబ్రవీత్,
గచ్ఛ సైరంధ్రి మత్ప్రీత్యా కీచకస్య నివేశనమ్;
సురా మానయ సుశ్రోణి తృషి తాహం విలాసిని."

అని మాత్రమే యున్నది. తాత్పర్యార్థం బొక్కటేయైనను మూలశ్లోకములకును, తిక్కనార్యుని పద్యములకును భావప్రదర్శన చాతుర్యమునను (skill in the method of imaginative presentation)· దానివలనఁ గలిగిన మనోజ్ఞత్వమునను (impressiveness) ఎంతో వ్యత్యాసమగపడుచున్నది.

"అనవుడు" ఆమెమాటలను విన్న ద్రౌపది విషమస్థితి యెట్లు వర్ణించినాఁడో చూడుఁడు:

"ఉల్లము దల్లడిల్లఁ దనువుద్గత ఘర్మజలంబుఁ దాల్చుచున్
డిల్లపడంగ నాకిది గడింది విచారము పుట్టె నందుఁ బో
నొల్ల ననంగరా దచటి కూరక పోవఁగ రాదు నేర్పు సం
ధిల్లఁగఁ దీనిఁ బాపికొను దీమస మెట్టిదియొక్కొ దైవమా."

సుదేష్ణ యతిగడుసుఁదనముతోఁ దెచ్చిపెట్టిన విషమస్థితికిఁ దల్లడిల్లిన దైనను సుదేష్ణకంటె నెక్కుడు సహజధైర్య గాంభీర్యములు కలది గావున ద్రౌపది నేర్పుతో నీసంకటమును బాపుకొను మార్గము నారయ సమకట్టినది. మూలములో పెటుకుగా వెంటనే

"అబ్రవీత్ శోక సంతప్తా నాహం తత్ర వ్రజామి వై"

అని నేనచ్చటికిఁ బోవనని కేవలము భీరువులాగున చెప్పినట్లున్నది. తిక్కన యిచ్చట నొక సంకటస్థితి (conflict) ని దెచ్చిపెట్టి, ద్రౌపది యాసంకటమున నెట్టినేర్పుతోఁ బ్రవర్తించినదో, యామె నియోగించిన పని తన గౌరవస్థితికిఁ దగినది కాదని స్నేహపూర్వకముగనే—కీచకునివలనఁ దనకుఁ గల భయమును గూర్చి యెత్తకయే—చతురగంభీరములగు వాక్కులచే నాత్మగౌరవమును నిలుపుకొనుట కెట్లుయత్నించినదో చూపినాఁడు. తాను సత్త్వవృత్తితో బహుమానపాత్రమై, బహుమాన తత్పరతఁజరించుచుఁ దనయోగ్యతకుఁ దగినపనులఁ జేయుటకుగా నుండెనేగాని, దుష్కృత్పరివార. యోగ్యపరిచారము చేయుటకుఁ గాదని చెప్పి దానికిఁ దగినవారిని పంపుమని కోరినది. అని యింక ననునయపూర్వకముగానే

"అతివ తగునమ్మ నీగృహ
మతి నిర్మల చరిత భరిత మని యీ యెడ మ
త్పతుల యసన్నిధినైనను
మతి నూఱడి యున్నచోట మన్ననఁ దప్పన్."

నీయిల్లు నిర్మలచరితభరితమని తలంచి నీయందఁ జేరినట్టి సాధువుల కేయపాయమును రాకుండఁ గాపాడవలెఁ గాని, వారి కేదైన నపాయము కలిగినచో నీకు నింద కలుగదా యని తనకొఱకే గాక, యామెహితవును గోరి చెప్పినట్లుగా పలికినది. అట్లు హితవు గఱపి, "మొదటనే నీచములగు

పనులకు నేఁ జాలకునికిఁ జెప్పికదా ప్రవేశించితిని. నన్నట్టిపనులకుఁ బను పఁదగునా" యని వెనుకఁ దాను చెప్పినమాటలను జ్ఞాపకముచేసి యెత్తి పొడిచినది.

"యెవ్వారేని యింటి కెద్దియే నొకటికి
నన్నుఁబంపఁ దగునె నాఁడె నిన్ను
గొలుచునెడ నరుజ్ఞ గొనవె నీచములగు
పనుల కేను జాలకునికిఁ జెప్పి

ఇట్టి సందర్భములలో తిక్కనార్యుఁడు వెనుకటి పదములనే సరిగాన నువదించుచుండును. వెనుక నిట్లే పలికినది.

"నీచములయ్యెడు పనులకు
నాచాలమి యెఱిఁగి మున్ననకుఁ బాత్రముగా
నీచిత్తంబున గైకొని
యాచారము దప్పకుండ నరయుము మునన్నున్."

సుదేష్ణతో ద్రౌపది చెప్పినమాటలు, ఆమె వాదము కేవలము వ్యర్థముకాలేదు. వీనిని విని సుదేష్ణ తానట్లు ద్రౌపదిని నియోగించుట యందలి యనుచితమున కనయము శంకించినదఁట. కాని తాను చేయున దనుచితకార్యమే యని తెలిసికొనియుఁ దమ్మునియందలి ప్రేమచే

"...లతాంగి మదింద
మ్మని వలవంతఁ దలఁచి యి
ట్లనియెం బాంచాలితోడ సాదరవృత్తిన్."

ఇప్పుడైనను సుదేష్ణకుఁ గోపము వచ్చినట్లు తిక్కన సూచింపలేదు. మూలములో (దక్షిణదేశపాఠములో)

"ఏవ ముక్తాతు పాంచాల్యా దైవయోగేన కైకయీ,
తాం విరాటస్య మహిషీ క్రుద్ధా భూయో௨న్వశాసత;
కీచకంచైవ గచ్ఛ త్వం బలాత్కారేణ చోదితా,
నాస్తి మే௨న్యా త్వయా తుల్యా సా త్వం శీఘ్రతరం వ్రజ."
అవశ్యం త్వైవ గన్తవ్యం కిమర్థంవా విపశ్యసి,
ఉక్త్వా చైనాం బలాచ్చైవ వినియుజ్య ప్రభుత్వతః."

అని కోపముతో బలత్కారముగాఁ బంపినట్లున్నది. బం. పరి. నారి పాఠములో మాత్ర మిదేమియు లేదు.

"సుదేష్ణోవాచ"

"నైవ త్వాం జాతు హింస్యాత్స ఇత స్సంప్రేషితాం మయా,
ఇత్యస్యాః ప్రదదౌ కాంస్యం సోపదానం హిరణ్మయమ్."

అని మాత్రమే యున్నది. ఇక్కడకూడ కోపము తెచ్చికొని బలవంతముచే పంపినట్లు లేదు. తెలుఁగు భారతములోని సుదేష్ణ 'సాదరవృత్తితోనే' ద్రౌపదిని 'సఖీ'యని సంబోధించి యెట్లింకను దనకార్యమును సాధించుకొనుటకు యత్నించుచున్నదో చూడుఁడు. "ఇంత దలర నేల యెమ్మెయినైనను గొమ్మ నలవరించి కూర్చు టరుదె" యని యిదివఱకె యామె నెట్లో యొప్పించి పంపించుట దనకు సుసాధ్యమేయనియు, దన కట్టి నైపుణ్యము కలదనియుఁ జెప్పనే చెప్పినది. కావునఁ దా నిప్పుడనుచితమునకు శంకించియు బుద్ధిపూర్వకముగఁ జేయుచున్నదే గావున, తనకార్యము నెట్లయినను సాధించుకొనుట కనునయమార్గమునే యవలంబించినది. ద్రౌపది స్థితి నెఱిఁగినదైనను తమ్మునియెడల ప్రేమాతిశయమున ననుచితకార్యమునకైన వెనదీయ లేదు. తిక్కన మొదటి

నుండియు సుదేష్ణను విశేషముగ భ్రాతృప్రేమకలదానినిగా సూచిం
చుచు నామె నతి ప్రజ్ఞావంతురాలగు ధూర్తగాఁ (a clever and
talented rogue) జేసినాఁడు. చూడుఁడు, ద్రౌపది కీమెచెప్పిన
ప్రత్యుత్తరమునందే యిది స్పష్టము:

"అక్కట నేను వేడ్కపడి యానెడి యాసవ మర్థిఁ దేర నొం
డొక్క నికృష్టుఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో
సెక్కఁగఁ జేసి నన్ను నతిహీనవిధాననియుక్తఁ జేతగా
నిక్కము యుమ్మలించి తిది నెయ్యముతియ్యము కల్మియే సఖీ."

తనను సమర్థించుకొనుటే గాక మరల ద్రౌపదిపైననే నేరము మోపు
చున్నది. నీయందలి గౌరవముచేతనే నిన్నీపనికి నియోగించినది.
ఈమాత్రము దానికి గల్లంతుచేయుట స్నేహధర్మమా యని స్నేహభా
వము నూఁతగాఁగొని వాదింపఁ దొడంగినది. ఎవ్వరేనియింటి కొద్దియే నొ
కటికిఁ బంపఁదగునా యని ద్రౌపది యనఁగా, అదేలాఁటియిల్లా, నిన్నెఱు
గని వారెవరు, నీగౌరవము పెంపునుగూర్చి యందఱితోను నెల్లప్పుడు
చెప్పుచునే యుందునుగదా యని యన్నింటికి నన్ని ప్రతియుక్తులుఁ
బన్ని బదులుచెప్పి, యింక ననేకభంగుల ప్రార్థించి సాదరముగను, స్నేహ
ముగనే దనకార్యమును సాధించుకొన యత్నించినది. ద్రౌపది
యుక్తులేమియు నామె యొద్ద పనికివచ్చినవి కావు. ఆమెకుఁ జిత్తం
బున "నింక పెద్ద పెనంగఁ జనదీయమతోడ" ననువిచారము పుట్టెను.
విధిలేక, ఆమెతో వాదింపలేక, కాదనుటకు సందులేక ద్రౌపది కీచకు
నింటికిఁబోవ స్వయముగా నంగీకరింపవలసి వచ్చినది. మన మరియాడు
చుండ ననుమానముతోడనే యామె దనయంగీకారమును దెలిపిన వెం
టనే సుదేష్ణ తాను సామముచేతనే గెలిచితిని గదా యని 'హర్ష

ముచేనుప్పొంగుచు' కాంచనచషకముఁ దెచ్చి యందిచ్చినది. మూలము లోని నిర్జీవంబగు కథకును అత్యంత మనోజ్ఞంబగు నీదృశ్యంబునకు నెంతో భేదము కలదో పరికింపుఁడు.

ద్రౌపది నెట్లయినఁ దమ్మునింటికిఁ బంపుటకుఁ గాఁ బన్నిన పన్నుగడలు, ఎత్తిన యెత్తులు, చేసిన దొంగప్రార్థనలు, బ్రతిమాలుటలు నట్లుండ, పిదప కీచకునిచే త్రోపులఁబడి, విరటుని సభకుఁబోయి, యందును దనమొఱ యాలకించు వారిఁ గానక తిరిగి తనయింటికి వచ్చిన ద్రౌపది నోదార్చుటలో నామెచూపిన శాఠ్యమును (roguery) బరికింపుఁడు. తిరిగివచ్చు ద్రౌపదియే తనచిత్తంబున సుదేష్ణను గూర్చియు, నామె చర్యలనుగూర్చియుఁ దలపోయుచు, నామె 'జంత'యని పలుకుచు నామె స్వభావమును జక్కఁగా వివరించినది.

"న న్నిటు లాదురాత్ము సదనంబునకుం జను మన్న జంతకే
బన్నము లన్నియుం దెలియఁ బల్కెదఁ గాక" యని తలంచి యామె
యొద్ద కార్తయై పోయినది. ఆర్తయై పోవునప్పటి యామె రీతిని, పిదప సుదేష్ణ బూటకములను నెంత స్వాభావికముగా, సందర్భానుకూలముగా వర్ణించి యాపాత్రలను దృగ్గోచరము చేయుచున్నాఁడో చూడుఁడు:

"కన్నుల బాష్పపూరములు గ్రమ్మఁగ మోమున దైన్య మొందఁగా
నన్నలినాక్షి తొట్రిలుచు నంగము దూల సుదేష్ణపాలికిన్"

జనుటయు, నప్పుడు పరమధూర్తయగు నాసుదేష్ణయు

"చనిన నయ్యోలనాఁగయు సంభ్రమంబు
దెచ్చికొని తా నెఱుంగని తెఱఁగు దాల్చి
శాఠ్యమున నుమ్మలించి పాంచాలితోడ
నెలుఁగు వేఱొకభంగిగా నిట్టు లనియె."

ఇచ్చట పాత్రోచితముగ సమకూర్చిన చిత్రోన్మీలనసామగ్రి కంత కును మూలమున "విరాటస్య మహిషీ శాల్యమాస్థితా" యని యొక్క మాటమాత్రమే యున్నది.

దక్షిణదేశపాఠములలో వాంసు కుంతి కిసర్వాంగిరైయి యాసభనుండి వెడలి పోయినదని చెప్పఁబడి యున్న దే గాని, తెలుఁగులోవలె సుదేష్ణ యామె నిట్లు వర్ణించినట్లు లేదు. ఎలుఁగు వేళాకోకభంగిగాఁ జేసి తన కామె యెడల గల యత్యంతాదరమును దెలుపుచున్నదివలెనే సుదేష్ణయే యిట్లు వర్ణించుట యా 'జంత' కెంతయుఁ దగియేయున్నది. ఈవర్ణనమును సుదేష్ణచేఁ జేయించుటలో తిక్కన యెట్టికళాచాతుర్యమును జూపినాఁడో గమనింపుఁడు. ఇచ్చటఁగూడ 'నామె చెన్నుతలుఁగుట'ను, వదనముచిన్నఁబోవుట, కనుగవ విన్ననగుట, కురు లొప్పు గందుట లనే వర్ణించినాఁడు.

> "ధరణీపరాగంబు వొరసి ధూసరితమై
> చెడియె నీ మేను చెన్నుఁ దఱఁగఁ
> జిత్తంబు తలపోఁతఁ జేడ్పాటు వొదవినఁ
> జెలువ నీనెమ్మోము చిన్నఁబోయెఁ
> గన్నీరు వఱ్ఱోడి కాంతి యెంతయుఁ గుంది
> నెలఁది నీకనుగవ విన్ననయ్యె
> ప్రస్వేదమునఁ దోఁగి ఫాలంబుతో నంటి
> యుగ్మలి నీ కురు లొప్పు గందె."

మోము చిన్నఁబోవుటకు "చిత్తంబుతలపోఁతఁ జేడ్పాటు వొదవుట" కారణముగాఁ జెప్పుచు, నాంతరంగిక వృత్తులకును బాహ్యాకారమునకును గల పొందికను జూపినాఁడు. ఆమెమనోవ్యథ యామె యాకారము

నందు, ముఖవైఖరియందును ప్రతిబింబించుచుండెనని సూచించినాఁడు. ఇచ్చట సుదేష్ణచేఁ జేయించిన ద్రౌపది యాకారవర్ణనమునకుఁ దగి నట్లుగనే, సింహబలునిచే భంగపాటుపడి దైన్యంబు నొంది విరటుని సభ కేఁగుచుండిన ద్రౌపదిని తిక్కన యెట్లు వర్ణించినాఁడో చూడుఁడు. అచ్చటను నామె మేదినీరేణువుతోఁ గూడిన మేను. ఇచ్చటి ముఖము నకు బదులుగా, వేఁడిగాడ్పునిగుడ్చు నాసిక, అశ్రుకణములతోఁగూడిన కన్నుగవ, నెమ్మొగమున నెరసినకురులు — ఈనాలుగింటినే వర్ణించి యామె దైన్యస్వరూపమును మనకన్నులయెదుట పెట్టినాఁడు. ఎట్టి లలితములు, హృద్యములు నగు నుపమానములతో వర్ణించినాఁడో చూడుఁడు. తిక్కనకు చెదరిన సౌందర్యమును వర్ణించుటలో నత్యాసక్తి యున్నట్లగపడును. మఱియు దానట్లిచ్చట వర్ణించి; యారూప మట్లే యున్నది గదా, చూచినారా, సుదేష్ణకుఁగూడ నట్లే కనఁబడి నది, యని మనకుఁ దెలుపువాఁడుంబోలె, నామెచే నారూపము నట్లే వర్ణింపఁజేసినాఁడు. పూర్వోత్తరసందర్భములలో నాతఁడు కల్పించు సాందిక, ఆ సాందికను జాపుటలో వహించు జాగరూకత యాతనిపరిణత కళాసౌభాగ్యమును వేనోళ్ల చాటుచుండును. ఆవర్ణననుగూడ నిచట పొందుపఱుపక తీరదు:

"ఎలదీఁగఁ గప్పిన లలితపరాగంబు
        క్రియ మేన మేదినీరేణు వొప్పఁ
జంపకంబున నవసౌరభం బెసఁగెడు
        కరణి నాసిక వేఁడి గాడ్పు నిగుడఁ
దోయజదళముల తుది మంచు దొరఁగెడు
        గతిఁ గన్నుఁగవ నశ్రుకణము లురల
నిందుబింబముమీఁది కందు చందంబునఁ
        గురులు నెమ్మొగమున నెరసియుండ

సర్వజనసంవ్యయైన పాంచాలి సింహ
బలునిచే నివ్విధంబున భంగపాటు
దనకు వచ్చిన నెంతయు దైన్య మొంది
యవ్విరాటుని సభఁ జేర నరుగుటయును."

ఇట్టిప్పటి యథాస్థితి వర్ణింపఁబడి యుండఁగా, మఱికొంతసేప
టికి, అనఁగా నీమె విరటుని సభనుండి బయలువెడలి నడిచి సుదేష్ణ
యొద్దకుఁ బోవునప్పటి కీమె యాకార మేస్థితిలోనికి వచ్చియుండునో,
వచ్చియున్నదో, చక్కఁగ వర్ణింపఁబడినది. మొదట మేన మేదినీరేణు
వును, నాసిక గాడ్పులు నిగుడుచు, కన్నుఁగవనుండి యశ్రులురలుచు;
కురులు చెదరియు నుండఁగా, సుదేష్ణ చూచునప్పటి కాస్థితి వలనఁ
గలిగిన ఫలితముగా — లేదా, అట్టిస్థితిలో నామె యెండలో నడిచి వచ్చు
టవలని ఫలితముగా — ధూసరితమైన మేను చెన్ను దఱిఁగినది. మోముచి
న్నఁబోయినది. అప్పుడు కన్నులనుండి యశ్రువులు కారుచుండ నిప్పు
డా కన్నీటి కాలువలచే కనుఁగవ విన్ననైనది. అప్పుడు చెదరియున్న
కురులు ఇప్పుడు చేతులచే ఫాలంబుతో నంటికొని పోవుటచే నొప్పు
గం[illegible]యున్నవి. ఇట్లే పూర్వోత్తరసందర్భములకుఁ బొందికఁ గల్పించు
టలో నీ తిక్కనార్యుని శక్తి యనితరసాధారణంబు. ఉత్తరను గూ
ర్చిన సౌందర్యవర్ణనములోఁ గూడ, మొదట బృహన్నలయొద్ద విద్యఁ గఱచు
టకుఁగా నొప్పఁజెప్పఁబడిన కాలమునందలి యామె కలికితనమునకును
సమారొక సంవత్సరము గడచినపిదప బృహన్నలను సారథిగాఁ గైకొ
నుమని చెప్పుటకై యీమె పోవుసందర్భమున వర్ణించిన యామె ప్రౌఢ
[illegible] భేదము చూపి, కాలగతిని బట్టి యామె యవయవస్థా
[illegible]యందు, లావణ్యమునందు నెట్టిమార్పులు గలిగినవో సూచించినాఁడు.
లోఁతునకు [illegible] నీ తిక్కనార్యుని కథా సౌందర్య వారా
శిలో నూతన రత్నములు దొరకుచునే యుండునట్లు తోఁచుచున్నది.

అట్లు తనయొద్దకుఁ జేరిన ద్రౌపది దైన్యస్వరూపమును వర్ణించి,

"ఏదికారణమున నెవ్వ రెచ్చోట నీ
కేమి కీడొనర్చి రట్టిపాటి
సాహసికులా వారిఁ జంపుదు నొంపుదు
భంగపఱతు నిఱుమాఱతుఁ జెఱుతు."

అని పలికినది. ఈపలుకులలోని యంత్యనియమ మామె తెచ్చికోలుసంభ్రమమునకును, శాఠ్యమునకు నెంత తగియున్నదో చూడుఁడు. పిమ్మట ద్రౌపది చెప్పిన ప్రత్యుత్తరమును, సుదేష్ణయౌదార్యమును బరిశీలించిన నామె స్వభావ మింకను వ్యక్తము కాఁ గలదు. ద్రౌపది నీ వెఱింగియు నెఱుంగమి భావించిన నింక నేమని పలుకంగలదాన నైనను వినుమని వెనుక జరిగిన సంగతియు సూక్ష్మముగ నొక్కపద్యములోఁ దెలిపినది:

"నను నీ వప్పుడు సూతమందిరమున న్మద్యంబుఁ దెమ్మన్నఁ బో
యిన నాతం డవినీతి సేసినను జే [illegible] మత్స్యావనీ
శుని యాస్థానము గుఱుక్క వేచనినఁ దచ్చోఁ దీవ్రకోపంబునన్
వెనుకం గూఁడఁగ ముట్టి పట్టికొని తన్నెం బల్కు లింకేటికిన్."

ఈపద్యం బెట్లు పరుసులిడుచు వివక్షిత కథాంశమును క్లుప్తముగా (concisely), సరళముగా (Simply), సువ్యక్తమగునట్లుగా (clearly), మనమున నాటునట్లుగా (impressively) చెప్పుచున్నదో గమనింపుఁడు. పిదప సుదేష్ణ యౌదార్య మామె శీలమునకుఁ దగినట్లే యున్నది. ఆక్షణముననే కీచకుని దండితుఁ జేసి యీయామె కాష్ఠోద మొనర్చునఁట. ఈ యసత్యసంభాషణ ఫలాని యెట్టిదో పాండుసుత వల్లభకు తెలియును. కావున దాని "నాలముచేసి" తగినట్లే సమాధానము చెప్పినది:

"నీ వింత యలుగ నేటికి
నావంతయుఁ బౌరజన మనఃఖేదము నో
క్కావంత ద్రిక్కుఁ డుండఁగ
లావంతులు మత్పతులు గలరు పగఁ దీర్పన్."

నీ వేమియు కోపగింప నక్కఱలేదు. కీచకుని దండింప నక్కఱయు లేదు. నాపతులే యాపని చేయఁగల రన్నది. నీవు పూనుకొనినను నావంత దీరు ననుట నిశ్చయము లేదు గాని వారు నామనఃఖేదము నావంత ద్రిక్కుఁడుండఁ దీర్చెద రన్నది. తనవంతనే గాదట: పౌరజనమనఃఖేద మునుగూడ నొక్కావంతయుఁ ద్రిక్కుఁడుండఁ దీర్తురని చెప్పినది. దీనిని బట్టి ద్రౌపదిని వలెనే పురస్త్రీలను గూడ బాధించుచుండుటచేఁ గాఁబోలు, పౌరజనులకుఁగూడ గీచకుఁ డత్యంతకంటకుఁడై యుండె ననియు, నింతకాలము నుండియు బలగర్వితుఁడు, దండనాథుఁడునై, రాజునకు మఱంది యగుటచే పౌరుఁలేమియుఁ జేయలేక యాతని బాధలను సహించుచుండిరనియు తిక్కన సూచించినవాఁడైనాఁడు. ద్రౌపది విరటుని యెదుటఁబడి మొఱవెట్టినప్పుడే

"విరటుఁ డుల్లమున నక్కుటికం బొలయంగ నంగనం
గనుఁగొని కీచకుం గినియఁగాఁదగుసత్త్వము లేమిఁజేసి సాం
త్వనములు పల్కి రోమభరితస్థితిఁ గంపితమూర్తియైన యా
తనిసుదికుందువాపి"

యెట్లో యాతని నావలకుఁ బంపివేసిన వాఁడయ్యెను. అట్లండ ఱుఁ జూడఁగా నచట నమ్మొయి నాద్రౌపది ననిందితశీల నాకీచకుం డెందును నెట్టి యంగనల నెవ్వరుఁ జేయని యట్లు చేయఁగా, విరటుఁడు గాని, తత్సభవారు గాని యేమియు ననలేకపోయి

నప్పు డితర సామాన్య పౌరజనుల స్థితినిగూర్చి చెప్పెడి దేమున్నది? దీనివలన విరటుఁ డెంతవఱకుఁ గీచకుని బాహుబలముపై నాధారపడియుండెనో వ్యక్తమగుచున్నది. ఇక్కడ తిక్కన కీచకవధను గూర్చిన కథలో నొక క్రొత్త విషయమును ప్రవేశపెట్టినాఁడు. నూతనోద్దేశ (motive) కల్పనము చేసినాఁడు. ఈ ద్రౌపది చెప్పిన మాటలచే కీచకుఁడొక్క ద్రౌపదినెగాక, ఇంతకుఁ బూర్వ మనేకులగు పౌరజనులను గూడ బాధలు పెట్టుచు పౌరజనకంటకుఁడు గూడ నైయున్నాఁడని తెలియుచుండుటచే, నీ కీచకవధకు సన్నిహితకారణము ద్రౌపదియే యైనను, దీనిమూలమున నా పౌరజనుల కందఱకు నత్యంతోపకార మగుచున్నట్లు వ్యక్తమైనది. దీనిమూలముగా భీముని కృత్యమున కొకవిధమగు ఘనత కూడ కలుగుచున్నది. తమ కుపకారకులైన బ్రాహ్మణ కుటుంబమునకుఁ బ్రత్యుపకారము చేయుటయే సన్నిహితకారణముగా, బకాసురునిఁ జంపి యేకచక్ర పురవాసుల కందఱికి మహోపకారముం జేసినట్లే, యిచ్చటను ద్రౌపదీ పరాభవ పరిమార్జనము కారణముగా విరాటపౌరుల కుపకారము చేసినవాఁ డైనాఁడు. ఒక్కమాటచే తిక్కన యెట్టి మహద్విశేషమును సాధించినాఁడో చూడుఁడు. మూలములో నేమూలను గూడ పౌరజనులను గూర్చిన సూచనయే గానరాదు.

ద్రౌపది యట్లు నిర్లక్ష్యముగా బదులు చెప్పుటతోడనే సుదేష్ణయుఁ, దత్పరిజనములును వగఁబొంది యామె కెన్ని సాంత్వనములనో చెప్పిరి. కాని యామె నోదార్పలేకపోయిరి. ఎన్ని చెప్పిన నామె మజ్జనభోజనంబులకుఁ జొరలేదు. దీనికిఁ గారణముగా మూలములో కీచకుని వధార్థమై వ్రతదీక్షను బొందినదని యున్నది.

"సుదేష్ణా మేవ ముక్త్వాతు సైరంధ్రీ దుఃఖమోహితా,
కీచకస్య వధార్థాయ వ్రతదీక్షా ముపాగమత్;
అభ్యర్థితాచ నారీభి ర్మానితాచ సుదేష్ణయా,
నచ స్నాతి నచాశ్నాతి న పాంసూ న్పరిమార్జతి."

తిక్కన యాకారణమును బహిరంగముగ వ్యక్తముచేయకయే ద్రౌపది యపకృత యగుటచే స్త్రీసహజం బగు కోపమును వీడక మజ్జన భోజనాదులనుగూడ మానివేసిన దని మాత్రమే చెప్పినాఁడు. అలుకచేత "అలిగినదై" తిండిమానిన దన్నట్లు సూచించినాఁడు. ద్రౌపది యిట్లుండుటచే నీమె మాటలు నిజమే యగును గాఁబోలు నని తలంచి సుదేష్ణ చేయునది లేక నివ్వెఱఁగందియుండెనట. తక్కిన యంగనలైతే గీచకుని నీచత్వంబుఁ దలంచి యిట్టి దుర్మార్గునకు చేటుఁవాటిల్ల వలసినదే యని యెంచి, యద్దాని కొఱ కెదురుచూచుచున్నవారు వలె "వానిచేటున కొడంబడిరి."

ఇక్కడ మూలములో దక్షిణదేశప్రతులలోఁ గీచకుని పాదఘాతమును బడియు దుఃఖార్తయగు ద్రౌపది యాతని నెందులకు శపింపలేదని జనమేజయుఁ డడిగినట్లును, దానికి బదులుగా కీచకుని పూర్వవృత్తాంతమును జెప్పినట్లును "కీచకోత్పత్తి కథన"మను నొక ప్రత్యేకాధ్యాయము కనఁబడుచున్నది. ఉత్తరదేశప్రతుల పాఠమునను బం. పరివారి ముద్రితప్రతిలోను నిది యేమియు లేదు. తిక్కనకాలమునకుఁ గూడ మూలమున నిది చేరియుండలేదేమో. లేదా ద్రౌపదిని శాపానుగ్రహసమర్థయగు నతిలోక వనితగాఁ గాక (superhuman) సామాన్య మానవస్త్రీగానే తిక్కన చిత్రింపఁ దలచినాఁడుఁ గావున దీని నంతను వదలివేసినాఁడని తలంచినను తలంపవచ్చును.

తిక్కనార్యునిచేఁ గేవలము మానవప్రకృతి గలదిగనే చిత్రింపఁబడిన యీద్రౌపది పరిభవానల సంతప్తయై నిజశయనస్థానంబునకుం జని, తల్పంబుపై మేను వైచి, యపాంగంబులం దొరఁగు కన్నీరు చెవుల కొలంకులునిండ నెవ్వగలు నివ్వటిలం దలపోసినది. ఈసందర్భమున తల్పంబుపై మేను బడవైచుట యనున దెంత స్వాభావికము! ఎంతయు చిత్రమునై యున్నది! అనఁగాఁ దనశరీరమే తనకు భారమై, ఆబరువును క్రిందఁబడవైచినట్లుగా—అనుద్దేశపూర్వకముగ (mechanically) తల్పముపైఁ బడవేసినదే గాని చింతాభరముచే నిజముగా నిద్రయేమాత్రము పోలేదని యీయొక్క మాటచేతనే సూచించినాఁడు. ఒక్కమాట చేతనే తిక్కనార్యుఁ డెట్టివిశేషమును సాధించి, రచనలో నెట్టి సంగ్రహ నైపుణ్యమును (economy of art) వ్యక్తపఱచినాఁడో చూడుఁడు.

ఆసమయమున సింహబలునిఁ జంపఁగలవాఁ డెవఁడని యాలోచన.

"ప్రబలుం డారయ నాసిం
హబలుం డాతని జయింప ననిలతనయు బా
హుబలంబ చూడఁదగు దై
వబలంబును నీతనికి నవశ్యము గల్గున్."

ఇట్లీమె తలపోఁతకుఁ దగినట్లుగనే తరువాత కీచకవధను గూర్చి విన్న దుర్యోధనుఁడు చేసిన యూహకును దీనికిఁగల భావసాదృశ్య రామణీయకమును గమనింపుఁడు:

"సింహబలుఁడు భీమసేనుండు శల్యుండు
హలధరుఁడు సమానబలము వారు."
"తక్కిన వారలాతనికి దవ్వులపోటులవారు వాయుజుం
డొక్కఁడ యింక సింహబలు నుద్ధతి మాన్చిన మాన్చువాఁడు."

ఇట్లూహించి రాత్రిసమయంబగుట సమస్తజనంబులు క్రమంబున నిద్రింపందొడంగినం దానును బయలుదేఱి, మహానస గృహంబునకుం జని, సుప్తుండైన భీముని మేలుకొలుపుటకుఁగాఁ జేసిన "మందసంభాషణ" రూపంబగు సంబోధనమును అందామె భీము నెత్తిపొడిచిన విధమును గమనింపుఁడు:

"నన్ను పరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సుఖోచిత శయ్యను నిద్రసేయ నీ
కన్ను మొగుడ్చు నూఱటకుఁ గారణ మెయ్యది భీమసేన మీ
యన్న పరాక్రమంబు వల దన్న నొకో దయ మాలి తక్కటా."

ఆశైలియందలి ధారాళత (flow), సభలో నతిక్రుద్ధుఁడై విరటునిఁగూడఁ జావఁగొట్టెద నన్నవాఁడు తనసతికిఁ గలిగిన పరాభవము మాటయే మఱచినట్లుగా సుఖనిద్రఁ జెందుచున్నందులకుఁగా ద్రౌపది చేసినయెత్తిపొడుపు, వెంటనే, యది భీముని స్వభావముపై దోషారోపణము (reflect) కాకుండునట్లుగా, దానికిఁ గారణము ధర్మజుని నెత్తిపైఁబెట్టి నట్లతిదీనముగాఁ బల్కుట యెంతేయు రమ్యముగానున్నది. ఇట్లు సంబోధించు ద్రౌపది పాణిస్పర్శనమున మేలుకాంచినాఁడు భీముఁడు. అది యర్ధరాత్రంబనియు, నచ్చట మహానసంబగుటచేఁ గాఁబోలు దీపములేకుండెననియు వీరిసంభాషణాదికము చేతనే యెంతచక్కఁగాఁ చెప్పకయే చెప్పినట్లు సూచించినాఁడు. తిక్కనమూలములో పాణిస్పర్శనము గాక పరిష్వంగమే జరిగినట్లు చెప్పఁబడియున్నది.

" సా తం మహానసే ప్రాప్య భీమసేనం శుచిస్మితా,
ఉపతిష్ఠత పాంచాలీ వాసితేవ మహావృషమ్;

పర్యష్వజత పాంచాలీ సా భీమం పాండునందనమ్,
సింహం సుప్తం వనే దుర్గే మృగరాజవధూ రివ;
భీమసేనం సమాశ్లిష్య హస్తినీవ మహాగజమ్."

అభ్యభాషత."

ఇక్కడ వెలుఁగైన లేనియప్పు డీయర్ధరాత్రమున శుచిస్మితమును జూచు వా రెవ్వరు? భీముఁడు నిద్రించుచుండెను. శుచిస్మితత్వమువలనఁ గలుగు ఫల మేమియుఁ గనఁబడదు. చీఁకటి కనుకనే తిక్కనఁ ద్రౌపది స్మితము చేఁ గాక "కంఠధ్వనిచేతను," పిదప "పాణిస్పర్శనముచేతను" మేలుకొలిపినది. తిక్కన రచన దేశకాలస్థితుల కత్యంత సముచితంబై యుండుటను గమనింపుఁడు. మూలమున నామాట్లాడిన రీతియు,

" ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే భీమసేన యథామృతః"

అని తనభర్తను 'యథామృతః' అని పలుకుట అంత ప్రశంసనీయముగఁ గానరాదు. భీమునకు కొంచెము కునుకు పట్టినది. కంఠధ్వని వినఁబడలేదు. కాని పాణిస్పర్శనము గలుగుటతోడనే మేల్కాంచె. అట్లు మేలుకాంచిన భీముఁ డిది యెవ్వ రని యడిగినాఁడు. చీఁకటిలో నా వచ్చిన దెవరో యాతనికిఁ దెలియలేదు. ద్రౌపది 'నే'నని బదులు చెప్పినది. అప్పు డామె యెలుంగును బట్టి యామెను గుర్తుపట్టినాఁడు. అంత యర్ధరాత్రమున చీఁకటిలో నామె వచ్చుటకుఁ గలకారణము నూహించినాఁడు. "కీచకుని దురాచరణంబు నాకుఁ బ్రకటించి వాని నిర్జింప నియోగించునదై యరుగుదెంచెఁ గావలయు" అని సరిగనే యూహచేసినాఁడు. ఈమాత్రము భీమునకుఁ దెలియదా? ఊహింపలేఁడా? మధ్యాహ్నమో, సాయంకాలమో జరిగిన విషయమునే బొత్తుగా మఱచిపోయియుండెననుట కేవల మసంభావ్యము. అట్లనుట భీముని కేవలము

మోటమొద్దుగాఁ జేయుటయే కాని మఱియొకటి కాదు. తిక్కన భీముని యూహాపోహలు, వినయవిధేయతలు, గౌరవమర్యాదలు కూడ కల వానినిగాఁ జేసెనే కాని కేవలము మొండిసాహసము, బండధైర్యము మాత్రమే కలవానినిగాఁ జేయలేదు. ఇట్లిచ్చట నీతఁడు ద్రౌపదివచ్చిన కార్యము నూహించిన ట్లుండఁగా, మూలమున ద్రౌపదికి జరిగిన పరాభవ మును గూర్చి యేమియు నెఱుఁగనివానివలె పలుకును.

"అథాబ్రవీ ద్రాజపుత్రీం కౌరవ్యో మహిషీం ప్రియామ్,
కేనా స్యర్థేన సంప్రాప్తా త్వరి తేవ మమాంతికమ్;
న తే ప్రకృతిమా న్వర్ణః కృశా పాండుశ్చ లక్ష్యసే,
సుఖంవా యదివా దుఃఖం శుభంవా యదివా శుభమ్;
యథావ త్సర్వ మాచక్ష్వ శ్రుత్వా జ్ఞాస్యామహం పరం,
అహమేవహి తే కృష్ణే విశ్వాస్యః సర్వవస్తుషు;
అహ మాపత్సు చాపి త్వాం మోక్షయిష్యా మ్యసంశయమ్,
శీఘ్రమ ముక్త్వా యథాకామం యయి త్తే కామం వివక్షితమ్;
గచ్ఛస్వ శయనాయైవ పురా త్వనో ఽవబుధ్య తే."

సుఖమో దుఃఖమో, శుభమో అశుభమో, నీవు చెప్పఁదలఁచినదేమో శీఘ్రముగాఁ జెప్పి యెవరు చూడకుండ తిరిగిపొమ్మని చెప్పినాఁడు. ఈతనివలె 'నేనేని న్నాపదలనుండి తప్పించెడివాఁడను. నీకు విశ్వాస్యుఁ డను' అని తిక్కన భీముఁడు ప్రగల్భములు కొట్టుకొనలేదు. ఇదివఱలోఁ గీచకునిచేఁ దన్నువడి రాజసభకుఁ బరివిడివచ్చినపు డట్లామె పరా భవింపఁబడుటనే చూచి భీముఁడు క్రోధోద్దీపితుఁ డయ్యెనే గాని యం తకుఁ బూర్వమున జరిగినకథ యంతయు నాతనికి సంపూర్ణముగాఁ దెలిసి యుండలేదు. విరటుఁడు గూడ దానిపూర్వోత్తర సందర్భములను

గూర్చి యేమియు నడిగి యుండలేదు. ద్రౌపదిస్థితికి సూక్ష్మమున నక్కటికంబు మాత్రమే పొంది, సాంత్వవచనములఁ గీచకుని మదికుందు వాపి యింటికిఁ బంపివేసినాఁడు. ద్రౌపదీకీచకులకుఁ గలిగిన తగవు విషయమై వారికిఁ గాని, యీ భీమునికి గాని యేమియు తెలియలేదు. కావున నంతకుఁ బూర్వమున జరిగినకథ యంతయు నామెచేతనే చెప్పింపఁదలఁచినాఁడు. "అత్తెఱఁగిత్తెఱవ దాన చెప్ప వింటు ననితలఁచి"యే, యింత ప్రొద్దేల యిచ్చోట కేఁగుదేరఁ గారణం బేమియని, యడిగినాఁడు. ఆతఁడీప్రశ్న యెందుకు వేసినాఁడో ముందుగనే గ్రహించి దానికిఁ దగినట్లె ప్రత్యుత్తర మిచ్చినది ద్రౌపది:

> "ఎఱిఁగి యెఱింగి నన్నడుగనేమిటి కప్పు డెఱింగి యింతకు
> న్మఱచుటఁగల్గెనే నది వినం బని లేదటు గాక యున్న రూ
> పెఱిఁగియు నేన చెప్ప విన నిష్టము గల్గుట చాల లెస్స య
> త్తెఱఁగెఱిఁగించెదన్ వినుము తెల్లముగా మొదలింటనుండియున్."

అని వెనుకటి వృత్తాంత మంతయుఁ దాను కీచకునిఁగోపించి పలికిన దుర్వారోద్యమేత్యాది పలుకులనే యనువదించి చెప్పినది. సుదేష్ణచేఁ గీచకనివాసంబునకుఁ బోవ నిర్బంధింపఁబడినపుడు "మనంబున నన్నెవ్వారికి నేమి చేయవచ్చునని మీలావు నచ్చి సూతునింటికి సురకుం బోయితి" నని పలికి భీముని నుబ్బఁజేసినది. భీమునికిఁ గోపముఁ బుట్టించుటకుఁగా నాసభయందు ధర్మజుని ప్రవర్తనను ఖండించినది. కాని భీముఁడు అవమానమును సహింపలేనివాఁడును, మహోగ్రకోపవివశుండునై యున్నను, యుక్తాయుక్త విచక్షణము లేనివాఁడు కాఁడు. కావుననే "యప్పుడు ధర్మజుఁడు ధైర్యహేమాచలుఁడై యమ్మెయి వారణసేయకున్న నే నీచత మత్స్యవిభునిం బరివారము నుగ్గుచేసిన" సమయభంగంబై యనర్థములకుఁ గారణము కాదా యని ద్రౌపదిని మందలించినాఁడు.

సత్యవ్రత నిష్ఠుండగు యుధిష్ఠిరుండు శౌగ్దత్తకుం దగువాఁడు గాని దూఱుపడ నర్హుండు గాఁడని స్పష్టముగాఁ జెప్పినాఁడు. 'కీచకుని చంపు మనుటకుఁ గదా యిట్లు నీవు పలుకుచుండుట; దానికొఱకై ధర్మజుని దూఱవలయునా? నే నాపని నవలీలఁగఁ జేసి నీమనోభీష్టమును నెఱవేర్తు' నన్నాఁడు. భీముని స్వభావమున నెట్టి రమ్యతరచ్ఛాయలను గనుపఱచి నాఁడో తిక్కన చూడుఁడు. కాని తనయం దొకప్పుడు విచక్షణలేని భావోద్రేకము (passionate nature) గలుగుచుండుననియూ, నది నీనప్పుఁబనులకైన వెనుదీయనీయ దనియు సూచించువాఁడువలెనే, "నే నీ చత" అని తనయందు నైచ్యము నారోపించుకొనఁ గడంగినాఁడు. అనఁగా దనయందుఁగల లోపమును (weakness) గూడ భీముఁ డెఱిం గియే యున్నాఁడని చూపుటయే తిక్కనార్యుని యుద్దేశముగాఁ గనఁ బడుచున్నది. విరటుని సభలో నుండి యూవల ద్రౌపదికిఁ గలిగిన పరాభవమును జూచినప్పు డీతనికి సహజముగఁ గలిగిన కోపోద్రేకమును, అప్పటి యాతని చేష్టలను ధర్మజుఁడు వారింపకపోయినచో తను కెట్టిముప్పు వాటిల్లెడిదో యని భీముఁడు తరువాత నాలోచించుకొని పశ్చాత్తాపమును బొందినట్లు కనఁబఱచినాఁడు తిక్కన. ఆసమయమున భీముని కోపాటోపమును, నాతని భయంకరాకారమును నెంతసముచిత ముగ వర్ణించి,యప్పటి యాతని భయంకరరూపమును మనకు స్ఫురింపఁ జేయుట కెట్టి భాషాసామగ్రిని ప్రోవుచేసినాఁడో తిక్కనచూడుఁడు:

" కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నంగము
ల్దనరఁగ సాంద్ర ఘర్మసలిలంబులు గ్రమ్మ నితాంత దంతఘ
ట్టన రటదాస్యరంగ వికటభ్రుకుటీ చటులప్రవృత్తన
ర్తన ఘటనా ప్రకార భయదస్ఫురణా పరిణద్ధమూర్తియై."

ఆతనియాకారము నెంతచక్కఁగానో చిత్రించి, యొక పటుదీర్ఘసమాసముచే నాతని పండ్లు కొఱుకుట గూడ మనచెవులలో గింగురుమను నట్లుగాఁజేసి యాతనిమూర్తిని మనకండ్లయెదుటఁ బెట్టినాఁడు. ఇది కేవల మాతని బాహ్యచేష్టల వర్ణన. దీనివలన వ్యక్తముచేయఁబడిన యాతని భావము లెట్టివో, అప్పు డాతనిమూర్తి చూచినవారి కెట్టి భయంకరభావములను స్ఫురింపఁజేసెనో తెలుపుచు నాతని యాకారము నిట్లు వర్ణించినాఁడు:

"నేలయు నింగియుఁ దాళముల్ గావించి
యేపున రేఁగి వాయించియాడఁ
గులపర్వతంబులు గూర్చి యొండొంటితోఁ
దాఁకంగ వీఁకమైఁ దన్నియాడ
నేడు సాగరములు నిక్కడక్కడఁ బెట్టి
పలుచని రొంపిమై నలఁదికొనఁగ
దిక్కులు నాలుగు నొక్కచోటికిఁ దెచ్చి
పిసికి పిండలు చేసి పిడిచికొనఁగ
మిగిలి బ్రహ్మాండభాండంబు పగులవ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకాలానలమున
గండరించిన రూపంబు కరణి భీముఁ
డతిభయంకరాకారత నతిశయిల్లె."

అట్టి భీముని భయంకరాకారమును మనకు స్ఫురింపఁజేయుటకుఁగా నెట్టి యుపమానమును దెచ్చినాఁడు! ఈకోపము నంతను ధర్మజుఁడు 'నయనంబులనే వారింపఁగలిగె' ననుటచే భీముని కాతనియందుఁగల గౌరవభావ మెట్టిదో స్పష్టమగుచున్నది. ద్రౌపదియు నీయన్నదమ్ముల చేష్ట

లను జూచుచునే యున్నది. కావుననే యీతని మేలుకొలుపుచు "మీ యన్న పరాక్రమంబు వలదన్ననొకో దయమాలి తక్కటా"యని యెత్తిపొడిచినది. ఆతఁడప్పుడు వలదనుటయే క్షేమమయ్యెఁ గాని లేనిచోఁ దనకప్పుడు సహజముగఁ గలిగిన యొడలుతెలియని కోపావేశమున సమయభంగము కావించినచో నెట్టి యనర్థము కలిగెడిదో యని భీముఁడు బాగుగా తరువాత నాలోచించుకొని పశ్చాత్తప్తుఁడయ్యెను గావుననే యయ్యుధిష్ఠిరుండు పొగడ్తకుఁదగు గాని దూఱుపడ నర్హుండు గాఁడని ద్రౌపదిని మందలించినాఁడు. కీచకుని చంపుట యెంతపని గాని, యెవ్వరు నెఱుంగకుండునట్టి తెఱంగు మాత్రము దలపోయ వలసి యున్నదని హెచ్చరించినాఁడు. భీముని నెంత జాగరూకత, యుక్తాయుక్తవివేచనము కలవానిఁగా చిత్రించినాఁడో చూడుఁడు. ఆవేశము వచ్చినపు డొడలుతెలియని యావేళ మైనను యుక్తాయుక్త పర్యాలోచనము మాత్రము లేకపోలేదు. భీముని సహజావేశభావము, యుద్ధప్రియత్వము మొదలగు లక్షణముల నాయాసందర్భముల నెంతరమ్యముగా తిక్కన కన బఱచునో గమనింపుఁడు. మల్లుని చూచినతోడనే 'యాతనిపై వెరిగిన'దని వర్ణించినాఁడు గదా ఇప్పు డెవ్వరు నెఱుఁగని తెఱంగున కీచకునిఁ బరిమార్పవలయునని ద్రౌపదితోఁ జెప్పుచు, ద్రౌపది తనపడినపాట్లను, పాండవు లనుభవించుచున్న యీ దురవస్థను విపులముగ వర్ణించి, "దొరఁగెడు నశ్రుల మునిఁగిన మోమతని వక్షమునఁ జేర్చిన" సమయమున నాతఁడు 'నంబుజానన నెమ్మొగ మల్లఁదుడిచి యనునయించి తత్కరములు దన మొగంబుగదియఁజేర్చుచు నిట్టూర్పుగాడ్పు నిగుడ చింతాక్రాంతుండై యుండు'

"అక్కట మోసపోయి యడియాసలఁ జావక యున్న దానము
న్నొక్కొక్కరునిక్కా దురంతదురితోత్కట బాధలపెట్టి యున్నవా

> కెక్కుడిదుఃఖశాంతి కడు నేఁడుట యెమ్మెయిఁ గల్గనేర్చు మీ
> ముక్కున నూర్పు గల్గ నొకమూర్ఖునిచేఁ బడితిన్ సభాస్థలిన్."

> "వానిఁ దెగఁ జూడవైతేని వాయుపుత్ర
> నీవు గనుఁగొన నురినైన నీరనైన
> నగ్నినైన విషంబుననైన నేను
> మేను దొఱఁగుదు నెట్టు నీయానసుమ్ము."

అని. బాగుగా స్త్రీ స్వభావసహజం బగునటుల చెప్పి పురియెక్కించిన మీఁదటఁగూడ భీముఁడు చిఱునవ్వు నవ్వి, "కీచకునిఁ జంపుట కిమ్మెయి ఇట్టుఁ బల్కఁగా వలయునె"

> "ఎల్లి యెల్లవిధంబుల నెందు జొచ్చె
> నేని నా ధర్మతనయుండు దానవచ్చి
> యడ్డపడెనేని నీవ పెంపారుకరుణ
> గాచితేని నాచేఁబడుఁ గీచకుండు."

అని ప్రతిజ్ఞ చేసియు, "దుర్యోధనాది దుష్టలోకంబు నధోలోకంబున కనుచునంతకు మదీయాంతరంగంబు చింతాభరభుగ్నంబును, నవమాన పంకమగ్నంబును, గోపోద్విగ్నంబునునై వేగిరపడుచున్నది" యని తన కోపోద్రేకమును, వేగిరపాటును దెలిపియు, వెంటనే ధార్తరాష్ట్రుల కుం గాలావసానం బైనయట్లు సమయకాలావసానంబయ్యె; నజ్ఞాతవాసంబునకుం జొచ్చినపదునొకండు నెలలు సని పండ్రెండవనెల వర్తిల్లుచున్నది. దీనికొంత దీటైన నీదువంతయు దీఱు నూఱడిల్లియుండు" మని యామె నూఱడించి, సమయభంగము కాకుండఁ గీచకుని వధించు విధానమున కామె చేయఁదగిన యుపాయమును నొడఁబడుట భావించికొని, వానికి నర్తనశాల సంకేతప్రదేశంబుగాఁ జెప్పి యొంటిమైఁ జనుదేర నియమింపు

టను గలిపి, యా సొబగునిం దెగఁజూచి నీకుం జూపి నీచిత్తంబు వడసె దనని హెచ్చరించి, "వేగుచున్నది గావున జనులు మేలుకాంచి మన లం గాంచిరేని వంచన బయలుపడినం గార్యంబు దప్పు"నని యెంతయో జాగరూకతతో నామెను బంపివేసినట్టి భీముఁడు, పిదప "రాత్రిసమ యంబున నయ్యేడకుఁ గీచకుఁ డొంటిమెయిం జనుదెంచువాఁడై చనె" నని ద్రౌపది తెలియం జెప్పినప్పు డెట్లు 'పరమాహ్లాదంబు నొంది' కీచకు నితో నొకపట్టుపట్టి వానిని వధింపఁగల యవకాశము దొరకినదిగదా యని యుబ్బిపోయి మైమఱచెనో గమనింపుఁడు. అప్పటి యాతని యుత్సాహంపుఁ బలుకుల వినుఁడు:

> "క్రోధం బప్రతికారమై హృదయముం గుందింప నత్యంతచిం
> తాధూతాత్ముఁడనైన నాకుఁ బరమోత్సాహంబు సంధిల్లదు
> స్సాధంబైన విరుద్ధకార్య మిటు లాసన్నంబుగా సంఘటిం
> తే ధర్మాత్మజుఁ డాత్మ మెచ్చఁ బగ సాధింపంగఁ దా నల్పమే.

అని పలికియు వెలిపడ సంకేతించిన తెఱఁగున నచ్చటి కరుగునో యరు గఁడో, మఱికొందఱను దెచ్చునో యని కొండొక విచారింపకపో లేదు. ఇంతవఱకు నాతఁడు మిగుల శాంతచిత్తతతో (considerate) పర్యాలోచించుచుండె. కాని ద్రౌపది యాశంక వలదని చెప్పినతో డనే, నాట్యశాల కపశ్యము వచ్చు కీచకునితోఁ దనకుఁ గలుగనున్న సం గరమును దలఁచుకొనినంతనే, భీముని సహజస్వభావము పైకుబికినట్లుగాఁ తిక్కన యెంతరమ్యముగాఁ జూపినాఁడో పరికింపుఁడు:

> "బలియుండా సొబగుండు భావభవదర్పభ్రాంతుఁడై వచ్చి ని
> శ్చల సర్వాంగత నున్న నన్నరసి నీచండంబు గాకున్న నా
> కులతం బొందెడు నప్పు మండపము సంక్షోభింపఁగా నేతుఁ గ
> ట్టలుకన్ బెబ్బులి గోల నేచినటు లుగ్రాకార మేపారఁగాన్."

కీచకునిఁ దాఁకు సందర్భము నంతను నాతఁడు మనమున భావించుకొను సందర్భములలో నా భావనాశక్తిచే నెట్లేర్చుకొని పోఁబడి భీముఁడు తన హద్దును మీఱుచున్నాఁడో గమనింపుఁడు: "మండపము సంక్షోభింపఁగా నేయు"నట.

ఈసమయములో 'వంచన బయలుపడునేమో'యను భావము, భయము మఱుఁగుపడి పోయి నట్లున్నవి. ఇంకను నాతని భావనాబలము (imagination) ఎట్లు పలికించుచున్నదో చూడుఁడు:

"ఎఱిఁగి పిఱుసనిన వెసఁ శై
కుఱుకుదు సాళ్వము గాకి నొడిసిన భంగిన్;
వెఱచఱవం బొదువుదుఁ బఱి
పఱి సేయుదు నీదు పూన్కి పారం బెయిదన్.

"నాదు బాహుబలమునకు మాఱుకొనఁ జాలు
భుజబలంబు గలిగి పోక చిక్కి
పెనఁగి నన్నుఁ గొంత కినియింప నోపెడు
చందమైన వినుము సరసిజాక్షి!

"అవనీచక్రము సంచలింపఁగ దివం బల్లాడ నాశాచయం
బవధూతంబుగ గోత్రశైలనికరం బాకంపముం బొందన
ర్ణవముల్ ఘూర్ణన మొందఁ గ్రోధము గృతార్థత్వంబు నొందించి చి
త్రవధప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపెదన్."

అని తనక్రోధస్వరూపమును, రౌద్రాకారమును బయలువెట్టినాఁడు: అనఁగా భీముఁడు తన నిజస్వరూపము నిచ్చట బయలువెట్టినాఁ డనుట. కావుననే పాంచాలి సంచలితస్వాంత యైనది. ఇట్టి యీతని తీవ్రక్రోధంబు గుప్తసాధనంబునకు బాధకం బగునని నెమ్మదిగ బోధింపఁదలంచినది. దీనివలనఁ గలుగు ననర్థముల నెట్లుగుదిగుచ్చి చెప్పినదో చూడుఁడు!

"ఒవ్వనివాఁడు నవ్వ మహిమోపధి ధర్మసుతుండు దీనికిన్
నెవ్వగఁ బొంద భూజనులు నింద యొనర్పఁగ నేఁ డొనర్చునీ
చివ్వకు నీవు నల్కమెయిఁ జేసిన యీపని గూఢవృత్తికిన్
దవ్వగు నేని నియ్యభిమతం బొడఁగూడియు నిష్ఫలం బగున్.

"కావున వంచన బాహిర
పోవక యుండంగ ఘనరిపుం బరిమార్పం
గావచ్చు నేని యట్టిద
నావల పటు గాక తక్కనను వలదు సుమీ."

"మనరహస్యము బయలువడకుండ నీ వాతనిఁ జంప లేకపోయినచో నీవా పని నే తలపెట్టకుసుమీ' యని గట్టిగా నుందలించినది. భీముఁడును దన స్వభావమును, అందలిలోపమును (weakness) దాను బాగుగా నెఱింగియే యున్నాఁడు. కావున నే దాని నతిక్రమించుటకుఁ జేతనైన ప్రయత్నముల నన్నిటిని జేసి కార్యభంగము, సమయభంగము కాకుండ కాలము గడపుకొని వచ్చుచున్నాఁడు. తన స్వభావమునుగూర్చియే తా నేమి చెప్పుకొన్నాఁడో చూడుఁడు:

"మదమునఁ గీచకాగ్రజుఁడు మార్కొని నిల్చిన నేను కీఁకమైఁ
గదిసితి నేని యప్పుడు ప్రకాశరహస్యవిభేదబుద్ధి నా
కొదవును నైన నేఁ దలఁచి యోపినభంగి నిగూఢవృత్తిమైఁ
బదిలము గల్గి తిన్నని యుపాయమునం దెగఁజూతు నాతనిన్."

మల్లునిఁ జూచినంతనే మై పొంగినట్లుగనే, కీచకునిఁ జూచి కదిసిన యప్పుడు ప్రకాశరహస్యవిభేదబుద్ధి యాతని కొదవవదనుట నిశ్చయము. కాని యోపినంతవఱకుఁ బదిలముగానే ప్రవర్తించెదనని చెప్పినాఁడు.

భీముని సహజగుణములు, నీయజ్ఞాతవాస సమయమున నాతఁడవి పైకి రాకుండ నణఁచిపెట్టి వినయాదిగుణంబు లవలంబించి ప్రవర్తించుచున్నరీతిని, వ్యక్తముచేసి భీముని గుణశీలములను బోషించుటలో నెట్టిచాతుర్యమును తిక్కన చూపినాఁడో గ్రహింపుఁడు. మొత్తము మీఁద ద్రౌపది సహాయముతో నీకృత్యమును మిక్కిలి పదిలముగనే సాధించి యభీష్టసిద్ధిని బడసినాఁడే గాని భావోద్రేకమును బెచ్చుపెరుఁగనిచ్చి యప్రమత్తుఁడై మెలంగలేదు. సమయభంగమగునని భీముఁడు గొంకుచునే చప్పుడు చేయని గూఢవిమర్దనప్రహారములతోఁ దనమల్లయుద్ధనైపుణంబును నెఱపి వికృతిపుఁ జావు సంపి తన కసిని సంపూర్ణముగాఁ దీర్చికొనినాఁడు.

అయితే ద్రౌపదియు నాతనిస్వభావమును బాగుగా నెఱింగినది గనుకనే మిగుల జాగరూకతతో మెలంగుచు నాతని వెంటనంటి కనిపెట్టుచునే యున్నది. తాను కీచకునితో సంకేతనియమము చేసిన నాఁటి రాత్రి 'జార చోరజనంబుల మనంబు లలర' చంద్రాస్తమయం బయిన పిదప,

"పెనుమిట్టిది పల్లంబిది
యనకుండఁగ నోలమును బయలు నొక్కటిగాఁ
గను విచ్చుటయును మోడ్చుట
యును సరిగాఁ దమము పర్వె నుర్విం దోడ్తోన్."

ఆకృశోదరి వృకోదరుని కడకుం జని సమయమయ్యెనని హెచ్చరించినదఁట. ఇచ్చట సూర్యాస్తమయాది వర్ణనమును సందర్భోచితముగా తిక్కన యెంతమనోజ్ఞముగ సందర్భమున కతుకునట్లుగాఁ జేసినాఁడో చూడుఁడు. సూర్యాస్తమయమును వర్ణించి పిదప క్రమక్రమముగా రాత్రి యెట్లు ముదిరినదో ప్రబంధధోరణి నతిరమ్యముగా స్వాభావికముగా వర్ణించినాఁడు.

"చుక్కలు తోడుతోడఁ దలచూపఁదొడంగె మనోభవుండు వి
ల్లెక్కిడె చక్రవాకముల యిక్కలు రోయఁగఁజొచ్చె నేల కెం
పెక్కుచువచ్చె దీవియల యేర్పడె సోయఁగ మందె సందడుల్
దక్కెఁ బురంబువీథుల మదం బొలసెన్ విటచిత్తవృత్తులన్."

ఇచ్చట చంద్రోదయమును గాని, చంద్రికను గాని ప్రత్యేకముగా వర్ణింపలేదు. నేల కెంపెక్కుచు వచ్చెనన్నాఁడు. కాని చంద్రోదయ మంతకుఁ బూర్వమే, దినభాగముననే యైయుండెనని సూచించుచు, 'జారచోరజనంబులు మనంబు లలరం జంద్రాస్తమయంబయ్యె' నని మాత్రము చెప్పియున్నాఁడు. అనఁగాఁ గొంతరాత్రి, దాదాపుసగము రాత్రి యయినపిదపఁ జంద్రాస్తమయమయ్యెనని తెలుపుటచే నవి శుక్ల పక్షపురాత్రులనియు, బహుశః అష్టమి నవములలో నొకదినము కావచ్చు ననియు సూచించినాఁడు. అట్టి శుక్లపక్షపు టర్ధరాత్రమున గాఢతమంబు పర్వినపిదప ద్రౌపది వృకోదరునికడకుం జని యప్పుడా తఁడు దలపెట్టిన కార్యమునకుఁ దగినసమయం బయ్యెనని హెచ్చరించినది. ఇచ్చట కాలసూచన నెంతరమ్యముగాఁ జేసినాఁడో గమనిం పుఁడు. ఆతఁడును బెండ్లికి పిళ్ళిచినయట్లు వికచహృదయుఁడై తలసీర యాయితము చేసికొనెనఁట. ద్రౌపదివలెఁ గనఁబడుటకును,దనయాకార మును గోపనము చేసికొనుటకును దలచీర యాయితముఁ జేసికొనెనని చెప్పుటచే తిక్కనార్యుఁ డిట్టిసూక్ష్మవిషయములను గూర్చి చెప్పుటలో గూడ నెంత జాగరూకత వహించునో తెలియుచున్నది. ఈ నాట్య శాలకుఁ బోవుట పెండ్లికిఁ బోవునట్లే యున్నను, భీముఁడు తనభావోద్రే కమును బయలుపడనీక, పొర్లికొనివచ్చు నాయుత్సాహము నడంచి కొని జాగరూకుఁడై ప్రవర్తించినట్లు తెలిపినాఁడు.

> “గమనము వీఁక నేత్రోక వికారము పుట్టక సంగరోత్సవో
> ద్యమరభసాతిరేకము బయల్పడు టించుక లేక రోషసం
> భ్రమ మొకయింతయైనఁ బరభావనిరూప్యము గాక ద్రౌపదీ
> రమణుఁడు వోయె విక్రమధురంధరతం దగ నాట్యశాలకున్.”

అని, దానం బ్రవేశించుటలో భీముని జాగరూకతను బరికింపుఁడు. “శైలుషులుఁ బిలిచిందిచెనయెడం గలయం బరికించి”, యచట నెవ్వరు పర పురుషులుగాని, కాపలివారుగాని లేకుండఁ జూచి మఱి ప్రవేశించినాఁడు. ఎట్లు? “తన యఖండిత బాహుబలగర్వము యచ్చట ముంగలిగా, మద మత్తభద్రగజసన్నిభగతిన్”. ఆతని బాహుబలగర్వమే యాతనికి ముందు నడచి దారి చూపుచుండెనఁట. బాహుయుద్ధమునకు సన్నద్ధుఁడైయున్న భీముని నడకను తిక్కన యెపుడును మత్తగజము నడకతోడనే పోల్చుచుండును. మల్లయుద్ధసంరంభమున గర్జించియు గజాలస్యంబున నంగ ణంబు సొచ్చెను.

ఇఁక నిక్కడ మరల కీచకుని యవస్థను బరికింతము. ద్రౌపది తనతో మాటలాడి సంకేత మేర్పఱచినది మొదలుకొని కీచకుఁడును ద్రౌపది చేసిన సంకేతకాలమునకై వేచియుండి, కందర్పగోచరుండై యా వామాక్షిరుచిరలావణ్యంబును, తన్వంగిరూపును, కంబుకంధర చెన్నును, ఆయంగన సౌకుమార్యంబును, భామిని సహజవిభ్రమములను, ఆపఁడంతి చెయ్వులును, మానిని గరువంపుమాటలసొంపు, అబ్జముఖి తిన్ననినము నెమ్మనమున మాటిమాటికి నూహించుచు,

> “పలరు నలుంగులం జొనయఁ దాపభరంబున వెచ్చ నూర్పు మే
> నలయఁగ నొల్లఁబోవు నగడంబుఁ గలంగుఁ బరిభ్రమించుఁ గొం

దలపడుఁ బల్లడం బడరి ధైర్యము మాలిన బెగ్గడిల్లు వి
చ్చలవిడిఁ బేర్చి నెవ్వగల సంవడి డెందము గంది చేడ్పడున్."

ఇచ్చట కీచకుని పరితాపమును సూచించుటకు నాతని మానసిక వృత్తు లెన్నిరీతులుగా వర్ణింపఁబడినవో పరికింపుఁడు. ఇట్లు మన్మథతాప తప్తుఁడైన కీచకుఁడు మనోవేదనాపనోదనార్థంబు మందిరారామ భూమి కిం జనియెనఁట. ఇచ్చట తిక్కన యుద్యానవనవిహార, శిశిరోపచార సూర్యాస్తమయాది ప్రబంధరీతి వర్ణనల కవకాశము కల్పించికొని తరు వాతి తెలుఁగు ప్రబంధములకు మార్గదర్శి యయ్యెను. ఆయుద్యానవన మున శిశిరోపచారంబులఁ బ్రొద్దు గడపి, "గ్రుంకింపరాని ప్రొద్దరసి య రసి", యెట్లో సూర్యాస్తమయంబగుటయు గైసేసికొని, పరిజనముల వంచించి యేకాంతముగఁ గూరుచుండి ద్రౌపదినిగూర్చి కీచకుఁడు భావింపఁదొడంగిన రీతిని గమనింపుఁడు. ఆ ద్రౌపదినిగూర్చి వేసిన విశేషణపదములయొక్క భావగాంభీర్యమును, ఔచిత్యమును, సార్థకతను పరికింపుఁడు. ఆ ద్రౌపదీ సౌందర్యస్వరూపము కీచకుని భావనా దృష్టిలోఁ బడినట్లు వర్ణించుపట్ల తిక్కన చూపిన యానుక్రమతను గుర్తిం పుఁడు. ఆవామాక్షిరుచిరలావణ్యం బే యాతని భావదృష్టికి మొట్టమొ దట నానినది. లావణ్యస్ఫురణమున కక్షియుగ్మమును స్థానముగాఁ జేసిన తిక్కనార్యుని యౌచిత్యపరిజ్ఞాన గాంభీర్యము మానింతురుగాక. "దాని కళ్లలో నున్నది లక్ష్మి" అని గదా మనవారు చెప్పుచుందురు. పిదప చిత్తమున నిలిచినది యా తన్వంగి రూపము. రూపు అంగము నాశ్ర యించునదే గదా. పిదప నాకంబుకంధర యొక్క యవయవసౌష్ఠ వముచే దీపించు చెన్నుఁ దలపోసినాఁడు. మృద్వంగములు గల యాయం గన సౌకుమార్యమును దలంచుకొనెను. స్వీయకాంతివిలాసములచే నొప్పు భామిని సహజవిభ్రమముల నెనఁ గీలించెను. సుకుమారచేష్టలుగల యా

పడఁతి చెయ్వులను మదిఁ బట్టుకొలిపెను. మానవతియు, నాత్మగౌరవ మును గాపాడుకొనుటయందు పట్టుదలగల యామానిని గరువంపుమాట పొందు—మాటలపొందు, వానియందు వ్యక్తమగుచుండెడి యామె గరు వతనమును గూర్చి యూహచేసెను. ద్రౌపదియెడల మానినియను విశేష ణమును, ఆమె మాటలయెడల గరువంపుఁ బలుకులను విశేషణము నెంతయ ను చిత్రములై యున్నవి: ఈమె 'మానినీత్వము'నుఁ, గరువంపుఁ బలుకుల పొందు' నీమె ధర్మజునితోను, సుదేష్ణతోను జేసిన సంభాషణనుబట్టి మన మూహించియే యున్నాము గదా. కీచకుఁడు గూడ నామె "గరువంపుమాటపొందే యూహించి" నట్లుగాఁ దెలుపుచున్నాఁడు తిక్కన. పిదప నాతఁ డాదలితాబ్జముఖియొక్క మోము తిన్నఁద నమును మెచ్చికొనఁజొచ్చెనఁట.

ఇచ్చట కీచకుని భావనాప్రపంచమున నా ద్రౌపది సౌందర్యస్వ రూపము మొట్టమొదట ననిర్వాచ్యము, నవ్యక్తము (haz[illegible]) నగు లావ ణ్యరూపమునఁ బొడఁగట్టి, చెన్ను, సౌకుమార్యము, విభ్రమములరూప మును బొంది, పిదప చెయ్వులు, మాటపొందులలోనికి దిగి, తుద కామె ముఖకాంతిలో లీనమై యాతని మనోనేత్రమునఁ 'సువ్యక్తరూ పమునఁ బొడకట్టినది. అప్పు డాతనికోర్కులు చిగురుమొగ్గతొడఁ దొడంగి నవి. కాముని మల్లము వెడఁగుపడి వశముతప్పెనని. చింతవడితనముచే నల్లనలాడినని. లేదా, "చిత్తజుని కోల నడిగొని చిక్కువడుదు" అను పాదమును బట్టి మన్మథాగ్ని బాధింపఁజొచ్చినది.

సమయమున ద్రౌపదిచేసిన సంకేతము తలంపునకు వచ్చి యీ నడిరేయి [illegible] కలిగించినది. సంకేతము ననుసరించి వచ్చు నా డా దాయని వితర్కము. 'అర్ధ్రేల రాకపక్కువా, నన్ బెట్టి యప్పు

దానికి మన సెట్టు నిలుచు!' అని ధైర్యము. రూపాభిమానిగదా కీచకుఁడు: తనరూపమును జూచి యెట్టివారైన లొంగుదురని యాతని నిశ్చయము. కాని యామెమాట నిలుపునో నిలుపదోయని మరల సందేహించును. ఈవితర్కములో నాతని యూఁగులాటను, నురియాటను నీక్రింది పద్యమున చక్కఁగా వర్ణించినాఁడు తిక్కన:

> " అనుచు సంచలించు నడియాసఁ గ్రమ్మఱఁ
> బాసఁదలఁచి ధృతికిఁ బట్టువెట్టు
> మరుని కోహటించి యురియాడుఁ దుదిముట్టఁ
> గాన నిశ్చయించుఁ గలఁగుఁ దేలు. "

పిదప నాతఁడు భావనాప్రపంచమున సృజించిన ద్రౌపదియె ట్లాతని వంచించినది వర్ణించునపుడుకూడ తిక్కనార్యుఁ డవలంబించిన సక్రమత (orderly method) గమనింపఁదగియున్నది. మొదట నామె పొడ సూపినట్లయినది. పిదప మెలఁగినట్లయినది. కదిసినట్లయినది. ఒడఁబడ్డట్లయినది. తుదకు లలిత వివిధ విహారములకు ఎలసిసొలసినట్లయినది. కాని వెదుకగా రిత్తబయలేగానవచ్చుటచే విహ్వలించినాఁడు. ఈమనోవేదనాపనోదనంబునకై మందిరారామభూమికిం జనినాఁడు. కీచకుఁడా వనమున పరితాపముచే నొక్కయెడనైనఁ గాలూఁదక కలయం గ్రుమ్మరుచు, నందలి పక్షి మిథునముల శృంగార చేష్టలను జూచి చూచి చిడిముడిపడు, భ్రమానుపడు, వెడఁగుపడు, వెనుంబడు, తల్లడపడు, దురంతచింత బారికి నగపడు. వలవంతచేఁ బరితప్తుండగు కీచకునిచిత్తవృత్తులభిన్నచ్ఛాయ లెంత సూక్ష్మముగ వర్ణింపఁబడినవో! – ఎట్టి పదపరికరము సమకూర్పఁబడినదో పరికింపుఁడు. అట్లు పక్షిమిథునముల శృంగారచేష్టలను జూచి తపించి తుదకు భావరతంబుల శిశిరోపచారం

బులఁ బ్రొద్దు గడపెనఁట. కీచకుని భావరతముల వర్ణనము కొంచెము శ్రుతిమీఱినట్లే యున్నది; కాని, తిక్కనార్యుఁడీసందర్భము నతి జాగరూకతతోడనే నిర్వహించెను. ఈపలుకులు కీచకుని చేతనే పలికించినాఁడు గాని తాను చెప్పలేదు. అందులో కీచకుని స్థితి క్రమముగా వర్ణించుకొని వచ్చి యిప్పు డేస్థితిలోనికి వచ్చినాఁడో యిట్లు చెప్పుచున్నాఁడు:

> "ఆ ఇందీవరనయన నాత్మ నిడి వేడ్క మెయిన్
> డెందముచన విచ్చలవిడిఁ
> గందర్పుఁడు వెఱ్ఱిఁజేయఁగా నిట్లనియెన్"

అనఁగా వెఱ్ఱిప్రేలాపనలోనికి — ఉన్మత్త ప్రలాపములలోనికి దిగినాఁడని ముందుగనే చెప్పుచు నాసందర్భమున నాతని మనోరథంబులను భావరతంబుల నాతనినోటనే పలికించినాఁడు.

కీచకుఁ డట్లు భావరతంబులను, శిశిరోపచారములను బ్రొద్దుఁ గడపినను, ఆదినమున నాతని కది "గ్రుంకింపరానిప్రొద్దై"నది. ఆ దినమాతని కెట్లు సాఁగి నిలిచినది యొకచిన్న గీతపద్యమునందలి క్రియపదముల ద్విరుక్తిచే సముచితానుకూలముగ స్ఫురింపఁజేసి తిక్కన భావధ్వనులకు రచనయం దెట్టి శోభ కల్పించినాఁడో పరికింపుఁడు (sound echoing the sense)—

> " అనుచుఁ గ్రుంకింపరాని ప్రొద్దరసి యరసి
> శిశిరపర్యంకమున మేను చేర్చి చేర్చి
> వంతఁ దలపోసి తలపోసి వనరి వనరి
> మిగుల వందిరి వందిరి పొగిలి పొగిలి."

భీమునికోపాటోప వర్ణనా సందర్భమున నిట్టి ఫొందికను గమనించియే యున్నాము. ఎట్లో సూర్యాస్తమయం బగుటయు, నాతఁడు కైసేసి కొని మదనవికారోల్లాసంబున మేనుపొంగ,

"సింగం బున్న గుహానికేతమునకున్ శీఘ్రంబునన్ వచ్చు మా
తంగంబున్ బురడించుచున్"

నారంగాగారమును జేరవచ్చెను. భీమసింహము నెదుర్కొనుటకుఁ గా కీచకమాతంగఁబు వచ్చెననుటలోఁ గల సాదృశ్య వ్యంగ్య వైభవము గమనింపఁదగియున్నది. భీమకీచకుల రంగాగార ప్రవేశమును వర్ణించిన రీతియు వ్యంగ్యశోభితమే యై యున్నది. భీముఁడు తన యఖండిత బాహాబల గర్వము యచ్చట ముంగలిగాఁ బ్రవేశించెనని గదా వర్ణించినాఁడు. కీచకుఁడో, కేవల "మహంకృతి ముంగలిగాఁగ" మండపాభ్యంతరభూమిఁ జొచ్చెనఁట. భీముఁడు" "నిశ్చింతుండై సతి కేలు పట్టుకొని" చొచ్చినట్లే కీచకుఁడును "శంకయా వంతయు లేక" చొచ్చినాఁడు. కాని కారణము మాత్రము వేరు. కీచకుఁడును బలగర్వితుఁడనియే కదా మొదట తిక్కనార్యుఁడు చెప్పియున్నాఁడు. ఇప్పు డాతని "బాహుగర్వసంతమసము" స్వాంతమును గప్పివేసినది. అహంకృతిమాత్రము ముంగలియై దారిచూపినది. కావుననే శంక యావంతయు లేక ప్రవేశించినాఁడు కీచకుఁడు. భీముని స్వాంతము సంతమసాంధముకాదు. కావుననే జాగరూకుఁడై యా ప్రదేశము నిర్జనమై యున్నదో లేదో యని, కీచకుఁ డొకవేళ ముందుగనే వచ్చి బయట తారాడుచున్నాఁడేమోయని కెలఁకులఁ బిఱింది దెసయుఁ గలయం బరికించి, తమస్సుచే దురభివేశంబై,

"ధ్వాంతాకారితఁ కుడ్యకుట్టిమ ఘనస్తంభావళీరూపమున్
ప్రాంతాదిప్రవిభాగబోధరహిత ప్రాగ్ద్వారముంగాతర
స్వాంతత్రాసకరంబు"

నైన యాలోచనం గీచకునికంటె ముందుగాఁ దానే ప్రవేశించెను. కీచకుఁడు వచ్చునా రాఁడా యనుసందియ మీతనికి లేదు. ద్రౌపదిచేసిన సంకేతబలమును, కీచకుని రాగాంధత్వము తప్పక వానిం దోడితెచ్చునని యీతఁడు నిశ్చయించెను. బయటఁ గీచకుని రాకను వేచియుండ నావశ్యకతయును లేదు. ద్రౌపది లోన సెజ్జఁ జేరియుండు ననియే కీచకుఁడు తలంచును గాని బయట వేచియుండు నని తలంపఁడుగదా. మూలమున నిట్లే గలదు:

"భీమోఽథ ప్రథమం గత్వా రాత్రౌ ఛన్న ఉపావిశత్."

కాని పతికేలు పట్టుకొని పోయినట్లు మాత్రము లేదు. ఇదివఱలో భీముఁడీ నర్తనాగారమును చూచెనో లేదో, ఇప్పుడది ప్రాంతాది ప్రవిభాగబోధనసహితమై యున్నది. కావున చిరపరిచితయై యున్న ద్రౌపది లోనికిఁ దీసికొనిపోయి సెజ్జను గనుపఱచఁగా, నాతఁ డద్దానిఁ జేతితో నరసి కనుఁగొని దానికనతిదూరంబునం బాంచాలి నోసరిల నునిచి తా నా శయనంబున కీచకునిరాకను వేచియుండెననుట సముచితంబై యున్నది. ఇంకేఁగాక కీచకుఁడు సంకేతంబున కొడంబడినాఁడని విని భీముఁ డుప్పొంగి "అవనీచక్రము సంచలింపగ......" నూతనకపరౌద్రం బేర్పడం జూపెద నని చెప్పుటచేఁ బాంచాలి సంచలితస్వాంత యైనది. అప్పుడు ద్రౌపది "ఎంసన బాహిరపోవక యుండంగ రిపుం బరిమార్ప వలయుఁగాని యటు గాక తప్పిన నలుసుమీ" యని మందలించినను, అతఁడు నేను పీఁకమై గదిసితినేని యప్పుడు ప్రకాశ రహస్య విభేదబుద్ధి నా కొదవునె, యైన నామోహినభంగి చేసెదనని బనులు పలికియున్నాఁడు. మూలమున నింతకంటె తీవ్రముగా తెగఁబడి చెప్పినాఁడు కాని తిక్కన సమయానుకూలముగ నాతని శీలమును వ్యక్తము చేయుట కెంత కావలయునో అంత వఱకే గ్రహించినాఁడు.

" తం గహ్వరే ప్రకాశే వా పోథయిష్యామి కీచకమ్,
అథ యోత్స్యామి మత్స్యాంస్తే హంస్యే మత్స్యానపి ధ్రువమ్;
తతో దుర్యోధనం హత్వా ప్రతిపత్స్యే వసుంధరామ్."

భీముఁడు గీచకుని వధించుటలో రహస్యవిభేదమార్గము నవలంబింపకుండఁ జూచుటకే ద్రౌపది యాతని వెంటఁ దగిలి లోనఁ బ్రవేశించి యనతిదూరమున నోసరిలి కనిపెట్టియున్నది. కీచకుఁడును ద్రౌపది తనకు ముందుగనే వచ్చి యుండునని తలంచిన వాఁడువలెనే మండపాభ్యంతర భూమిఁ జొచ్చి, తఱియం జని యా చీఁకటిలో తడుముకొనుచు నారసి, సెజ్జఁ గాంచి యది రిత్తశయ్య గాకుండుటను దెలిసికొని కేలు సాఁచెను. చీఁకటిలోఁ గీచకునితడుములాట నెంతయుఁ జక్కఁగా సూచించినాఁడు తిక్కన.

అప్పుడు భీముఁడు కోపవేగమునఁ గంపము నొందు నిజాంగకంబులను దన ధృతి పెంపున నచలితంబుగఁ జేసెనఁట. భీముఁడు భావోద్రేకము నెట్లడంచుకొన్నట్లు తిక్కన వ్యక్తము చేయుచున్నాఁడో చూడుఁడు. మఱియు నీచలనమును గుర్తించినచో మొదటనే కీచకుఁ డనుమానము పడుట కవకాశము కలదు. అట్టి యనుమానకారణమ్ము లేకుండఁ జేసినట్లు సూచించినాఁడు. తద్వచనముచొప్పు, తదీయచేష్టలను గను మతితో 'నవికార నిగూఢ నిజప్రకారుఁడై' భీము డుండెను. పిదప కేలు సాఁచి కీచకుఁడు దన "రూపాభిమానిత్వము"ను వెల్లడించుకొనుచుఁ దనలావణ్యమును, రూపమును, విలాసములను, దనవివేకమును కొని యాడుకొనుచుండ, భీముఁడు నుచితనిగూఢభంగులగు భాషణముల్ దనప్రియకు వినిపించుటకై యాతనితో నిట్లనియె. సందర్భము నకుఁ దగినట్లుగా భీమునిలో భీకరంబగు కొంత హాస్యరస ప్రాదుర్భావము (grim humour) న కవకాశము కల్పించి పలికించినాఁడు తిక్కన:

" ఇట్టివాఁడవు గావున నీవు నన్నుఁ
బొగడికొనఁ దగదకట నా పోల్కి యాఁడు
దాని వెదకియు నెయ్యెడ నైన నీకు
బడయవచ్చునె యెఱుఁగక పలికి తిట్లు.

" నాయొడలు సేర్చినప్పుడ
నీయొడ లెట్లగునో దాని నీ వెఱుఁగవు న
న్నే యబలలతో డిదిగాఁ
జేయఁదలంచితివి తప్పు సేసితి గంటే.

" నను బుట్టి నీవు వెండియు
వనితలసంగతికిఁ బోవువాఁడవె యైనం
దను వేఁ బడసిన ఫలమే
కనియెద విదె చిత్తభవ వికారము లెల్లన్ "

మూలమున రెండు శ్లోకములలో సూచింపఁబడిన యాకీచక భీమ సంవాదరీతిని తిక్కన రమ్యతరంబుగా రచియించినాఁడు. మూలమున

" అకస్మాన్మాం ప్రశంసంతి సర్వా గృహగతాః స్త్రియః,
సువాసా దర్శనీయశ్చ నాన్యోఽస్తి త్వాదృశః పుమాన్.

భీమసేన ఉవాచ

దిష్ట్యా త్వం దర్శనీయోఽసి దిష్ట్యాత్మానం ప్రశంససి,
ఈదృశశ్చ త్వయా స్పర్శో దృష్టపూర్వో న కర్హిచిత్."

అని కలదు. తిక్కన దీనినే పెంచి రచించినాఁడు. 'అనవుడు మన మున, నిస్సీయనుట' 'ఉచితనిగూఢభంగులగు భాషణముల్ దన ప్రియ వినుపించుట' అనునుద్దేశ (motive) కల్పనము తిక్కనార్యుఁ డాదృశ్య

మును స్వాభావికముగాఁ (realistic) జేయుటకొఱకు స్వయముగాఁ జేర్చినవే. ఇంతే గాక భీముఁడు రంగాగారమును జేరుట, కీచకుఁ డచటికిఁ జనుట మొదలుగాఁగల విషయములను తిక్కనార్యుఁడు ప్రబంధ రీతిఁ బెంచి రచించినాఁ డనుటకు మూలములో నావిషయమంతయు రెండుశ్లోకములలో సులభముగాఁ జెప్పివేయుటను బట్టియే తెలియఁగలదు.

"భీమోఽథ ప్రథమం గత్వా రాత్రౌ ఛన్న ఉపావిశత్,
మృగహారీ ఇ వాదృశ్యః క్రుద్ధ స్తత్ర వినిశ్వసన్;
కీచకశ్చాప్యలంకృత్య యథాకామ ముపావ్రజత్,
తాం వేలాం నర్తనాగారం పాంచాలీ సంగమాశయా."

ద్రౌపది సమయం బగుటను దెలుపుట, భీముఁ డామెను జూచి "నాతోన వెనుక నల్ల నంతంత నరుగు దె"మ్మని చెప్పి, తాను తలసీర యూయిత్రము నేసికొని ముందు నడచుట, రంగాగార మధ్యప్రదేశంబున విరాటనందన లీలాపర్యంకం బరసి కని దాని కనతిదూరంబునం బాంచాలి నో సరిలనుంచుట, తన నిగూఢభాషణంబులు ప్రియకు వినిపించుట యివన్నియు తిక్కనార్యుఁడు స్వయముగాఁ దెచ్చిపెట్టినవే. వీని మూలముగా నాయర్ధరాత్రమున చీఁకటిలో జరిగిన విషయమంతయు మన కవలీల దృగ్గోచరము చేసినాఁడు. పిదప వారియుద్ధమునుగూర్చి

"అన్యోన్య జయ సంరంభా త్పరస్పర జయైషిణోః,
వాలిసుగ్రీవయో ర్భ్రాత్రోః పురా వానరసింహయోః;
ఉభావపి ప్రకాశేతే ప్రవృద్ధౌ వృషభావివ,
అభిపత్యాథ బాహుభ్యాం ప్రత్యగృహ్ణా దమర్షతః;
మాతంగ ఇవ మాతంగం ప్రభిన్నకరటాముఖమ్"

అని యిట్లు వర్ణించుచు,

"తయో ర్భుజవినిష్పేషా దుభయో ర్బలినో స్తదా,
శబ్దః సమభవ ద్ఘోరో వేణు స్ఫోట సమో యుధి."

అని వారియుద్ధమువలన ఘోరమైన శబ్దము బయలుదేఱినదనియు,

"స్పర్ధమానౌ బలోన్మత్తౌ తౌ వృషౌ సూతపాండవౌ,
నిశీథే పర్యకర్షేతాం బలినావివ నిర్జనే;
తత స్తద్భవనశ్రేష్ఠం ప్రాకంపత ముహుర్ముహుః,
బలవచ్చాపి సంక్రుద్ధా వన్యోన్యం తా వగర్జతామ్."

ఆభవనమంతయు కంపించినదనియు మూలమున గానవచ్చుచున్నది. ఇంత శబ్దము, గందరగోళము నయినప్పు డచ్చటి వారలు లేమి చేయుచున్నారో చెప్పలేదు: తిక్కన యీచిక్కును తప్పించుటకే యొక్కని హేతుకల్పనము చేసినాఁడు.

"తన యగపా టొరు లెఱుఁగుదు
రని సూతుఁడు, సమయభంగ మగునని భీముం
డును గొంకుచుఁ జప్పుడు సే
యని గూఢ విమర్దన ప్రహారములఁ దగన్."

మల్లయుద్ధనైపుణంబు మెఱయఁ గడంగి పోరిరని చెప్పియున్నాఁడు. తుదకు "కీచకు ధరణీస్థలిం జదిపి చక్కటిముద్దగఁ జేసెఁ దుష్టుఁడై"— భీముఁడు 'తుష్టుఁడై' యట్టి వికృతపుఁ జావు సంపెనని చెప్పినాఁడు. అంతటితో పోనీయక ద్రౌపదికిఁ జూపినాఁడఁట. మూలమునను

"తం సంమథిత సర్వాంగం మాంసపిండోపమం కృతమ్,
కృష్ణాయై దర్శయామాస భీమసేనో మహాబలః"

అని యున్నది. ఆ గాఢాంధకారములో నాతఁ డెట్లు చూపినాఁడో, యామె యెట్లు చూచినదో యని మనకు సందేహము కలుగవచ్చును.

కాని తిక్కన గూఢయత్నమున ననలముం గొనివచ్చి యాయామె కాంతనిని జూపినట్లు చెప్పుచు, నావెలుఁగున నాసందర్భములో నా ద్రౌపదీ చిత్రమును, ఆమె మనోవృత్తులను, అద్భుతాకారచేష్టాదికమును మనముగూడ చూచి యబ్బురపడునట్లుగాఁ జేసినాఁడు. ఇట్లన లముఁదెచ్చి చూపుటలో నాతని యుద్దేశమునుగూడ వ్యక్తముచేసినాఁడు. ఇంతసేపటినుండియు వీరు యుద్ధము చేయుచుండుటయే ద్రౌపదికిఁ దెలియును గాని చీఁకటిలో వా రెట్లు క్రిందుమీఁదు పడుచున్నది, భీముఁడు కీచకు నెట్టిచావు చంపుచున్నది ద్రౌపదికిఁ దెలియుట కవకాశము లేదు. కావున భీమునికిఁ దాను కీచకుని జంపితినని నమ్మక మున్నను కీచకుని కొకవేళ ప్రాణ మింక నున్నదేమో యని ద్రౌపది శంకించి మనమున నూరట, ధైర్యము పొందకపోవచ్చును. చీఁకటిలోఁ జూచినంతమాత్రమున వాఁడు క్రిందఁబడి మూర్ఛపోయి యున్నట్లు తెలిసికొనవచ్చునే గాని వాఁడు సంపూర్ణముగా విగత ప్రాణుఁ డైనట్లు నిశ్చయించుట కవకాశ ముండదు. భీముఁడు చెప్పినను ద్రౌపది కింకను సందేహము మనమునఁ బీడింపవచ్చును. ఇట్టి చిక్కులు లేకుండఁగా భీముఁడు చేసినాఁడు.

> "తన కడిమి కలిమి నచ్చియు
> మనమునఁ దలఁ కడర సూతిమరణంబు గనుం
> గొనుటకుఁ దల్లడపడు ప్రియ
> వనిత కతనిచావు సెప్పి వడిఁ దన్మాత్రన్.

"అనలము గూఢ యత్నమున నయ్యెడకుం గొనివచ్చి దానిఁ జ
య్యనఁ వెలుఁగొందఁజేయుటయు, నచ్చెరువున్ భయమున్ బ్రియంబునున్
బెనఁగొనఁగాఁ గనుంగొనియె భీతమృగేక్షణ భీము డాయఁగాఁ
జని కడు నక్రజంబయిన చందమునం బడియున్న కీచకున్."

ఈ దృశ్యమునంతను, అనఁగా, అచ్చెరువున్, భయమున్ ప్రియంబును బెనఁగొనఁగా నాకీచకునిం జూచు భీతమృగేక్షణ స్వరూపమును మన కనులయెదుటఁ బెట్టుటకే తిక్కన ఆ భీమునిచే వెలుఁగు తెప్పించినాఁడో యన్నట్లు కనఁబడుచున్నది. ఆ సమయమున నామె కాశ్చర్యము, భయము, ప్రియమును గలిగినవఁట. ఇట్టి సందర్భములలో సామాన్యముగా మనోవృత్తులను వివరించుపట్ల తిక్కనార్యుఁడు మాఁడేసి విశేషణములను బొందుపఱచుచుండుట యాతని కలవాటుగా నున్నట్లున్నది. 'భీతమృగేక్షణ' యను ద్రౌపదికిఁ జేర్చిన విశేషణ మెంత సందర్భానుకూలమై యున్నది. భీతమృగేక్షణములతోఁ జూచినదఁట. ఆమె మనోవృత్తులనే గాక స్త్రీసహజములగు నామె చేష్టల నెంతయద్భుతముగా వర్ణించి యావెలుఁగునఁ జూపుచున్నాఁడో చూడుఁడు. ఆమె యాకీచకుని, భయముచే 'భీము డాయఁగాఁజని', మాఁచినదఁట. స్త్రీలు సహజభీరువులుగదా!

"మాఁచుచు చేరి వ్రేల్మిడుచుచుం దల యూఁచి విషణ్ణ చిత్తయై
యా చపలాక్షి ముక్కుపయి నంగుళముం గదియించి దీనికై
కీచక యింత సేసితి సుభిక్ష్యముఁ బొందుదు గాక యింక న
ల్లేచిన నిట్లు గా కుడుగునే యనుచుం వెఱఁ గందుచుండఁగన్."

మాఁచినతోడనే కోపముచే వ్రేల్మిడిచినదఁట. తనకు గిట్టనివారిపై వ్రేల్మిడుచుట స్త్రీల కెంత సహజకృత్యమో, తిక్కన యెంత జాగరూకతతో నద్దానిని సూచించినాఁడో గమనింపుఁడు. కాని యాతనిచావు తలంచినంతనే జాలి కలిగినది. పాపము! అని తలయూఁచినది. విషణ్ణచిత్తయైనది. ఎంతపని జరిగినది యని యాశ్చర్యము. ముక్కుపై నంగుళము ఘటించినదఁట. తనను బాధపెట్టినందులకుఁ దగినశాస్తి యయిన

దని సంతృప్తి. ఇట్టికార్యము సాధ్యమైనందుల కాశ్చర్యము. ఎట్టిదృశ్యము మనకనులయెదుటఁ బెట్టినాఁడో గమనింపుఁడు. ఆ ద్రౌపదిచేష్టలు, ఆమాటలు నెంత స్త్రీజనసహజములై యొప్పుచున్నవి !! ద్రౌపది యాతని చావునుగూర్చి తృప్తి పొందినదని తెలిసికొనినతోడనే

"పూనిక నెఱపితి సతి యను
మానము పరితాపభరము మాన్పితినని లో
నేనని మదిఁబొంగెడు పవ
మానసుతుం డిట్టు లనియె మానినితోడన్."

భీముఁడు తనసాధించిన కార్యముపట్ల గర్వాతిరేకమును, మదిఁ బొంగెడు సంతోషాతిశయమును దెలుపు పలుకు లెంత ధారాళములై, వేగవంతములై (racy style), సరళములై (simple), ఉత్సాహపూరితములై, సందర్భానుకూలములై యున్నవో పరికింపుఁడు. భీమునిచే శార్దూలవృత్తమునసే పలికించినాఁడు తిక్కన:

"చింతాశల్యము వాసెనే భుజబలోత్సేకంబు నీ కక్కనే
శాంతిం బొందెనె రోషపావకుఁడు దుశ్చారిత్రునిం జూచితే
సంతోషించితె యిట్లు గాక బ్రదుకన్ శక్యంబె దుర్వృత్తి నీ
చెంతం జేరిన యట్టివీరులకు నాచేతం బయోజాననా."

భీమునిమాటలకుఁ దగినట్టులనే భీమునిశీలమునందలి విశేషగుణముల నన్నిటి నెన్నుచు, నాతని యుత్తమనాయకత్వమును స్థిరపఱచుచు ద్రౌపదిచే స్తోత్రము చేయించినాఁడు తిక్కన. ద్రౌపదికిఁగల సమయస్ఫూర్తి గుణముకూడ వెల్లడిచేసినాఁడు. ఏయేసందర్భములఁ దనభర్తల నెట్లుగా ననునయించి, ప్రశంసించి వారియానుకూల్యమును బొందవలయునో యామెకు బాగుగాఁ దెలియును. వారి మనస్తత్త్వమును గని

పెట్టి తదనుగుణంబుగ వర్తించునది గావుననే యైదుగురుపతులతో నిర్వహించుకొనుచు వచ్చినదని సూచించుచున్నాఁడు. భీముని కేవల బాహుబల సంపన్నుండగు మోటువెద్దునఁగాఁ గాక యుత్తమనాయకునిగఁ బ్రదర్శింపవలె నను తిక్కనార్యుని యాశయమే యిప్పు డీ ద్రౌపది పలికినపలుకులమూలమున వ్యక్తము చేసినట్లూహింపఁ దగియున్నది.

"కొలువులోపల నిన్న కోప మగ్గలెత్తినఁ
దలఁకక నిలిచిన ధైర్యమహిమ
నేనిందుఁ జనుదెంచి నిర్వికారతఁ బ్రజ
కన్నులు గప్పిన గౌరవంబు
మనవారిలోన నొక్కనికైనఁ బిల్వ కు
త్సాహంబు సేసిన సాహసంబు
లోకదుర్జయుఁడగు కీచకునిని బ్రే
ల్మిడి రూపు మాపిన కడిమి సొంపు
చూపఁ దలపోయ మెచ్చ సంస్తుతి యొనర్ప
నాతరంబె నీయుత్తమనాయకత్వ
మెఱిఁగి నిన్నుఁ గొనియాడ నే నెంతదాన
మహితవిస్మయానందనిర్మగ్న నైతి."

అని యిట్లు తిక్కనార్యుఁడు భీముని యుత్తమనాయకత్వమును ద్రౌపదిమూలముగా మన కెఱింగించి మనముకూడ నామెతోపాటు తని ప్రవర్తననుగూర్చి విస్మయానందమగ్నుల మగునట్లు చేసినాఁడు.

ఈ కీచకవధఘట్టమును ప్రబంధమునకు భీము నుత్తమనాయకునిగాఁ జేసినట్లు సూచించినాఁడు. ఈకీచకుఁడు నిచ్చిన పిమ్మటఁ బుట్టు నవిశేషములను మఱియొక యాశ్వాసమునఁ జెప్పఁదలఁచినాఁడు.

భీముని విక్రమప్రదర్శనము, ద్రౌపదీపరాభవము, కీచకవధను మాత్రమే ప్రధానవస్తువుగాఁ జేసికొని యీయాశ్వాసమున వస్త్వైక్యమును సమకూర్చికొని సూర్యోదయ సూర్యాస్తమయాదివర్ణనలను, ఉద్యానవనవిహార, శైత్యోపచారాదులతోఁ గూడినశృంగార వర్ణనములను, మల్లయుద్ధాదుల వర్ణనములనుఁ జేర్చి; "చింతాశల్యము వాసెనే"యని తుదకాశ్వాసాంతమున నభీష్టార్థసిద్ధిని వ్యక్తముచేసి, యీఘట్టము నొకవిధమగు నాటకముగను, ప్రబంధముగను గూడఁ జేసినాఁడు తిక్కనార్యుఁడు.

## కీచక వధానంతర విశేషములు

ద్రౌపది యట్లు చేసిన స్తోత్రపాఠము కర్ణరసాయనంబగుటయు భీముఁ డింకనచ్చట తడయంజనదని ద్రౌపదితోఁ జెప్పి చయ్యన నేఁగి శరీరప్రక్షాళనంబు నేసికొని మహానసమందిరమున శయ్యాతలంబునఁ గూర్చుండెను. భీముఁ డిచ్చటఁ గనఁబఱచిన జాగరూకతను బరికింపుఁడు. ఎవరైన వత్తురేమో యనిగాని, కావలివారు మేల్కాంతురేమో యనిగాని సందేహించి వెడలిపోయియుండును. ఇంతేగాక వెంటనే ద్రౌపది కావలివారినిఁ బిలిచి యీవిషయమును వారి కెఱింగించుటకవకాశమును గల్పించినాఁడు. మూలములో బం. పరి. వారిపాఠంబున మఱునాఁ డుదయమున నుపకీచకులందఱుజేరి కీచకుని దహనసంస్కారమును జేసిన ట్లున్నది.

"తతః కల్యం సమాగమ్య సర్వే తే తత్ర బాంధవాః,
రురుదుః కీచకం దృష్ట్వా పరివార్య సమన్తతః."

మఱికొన్ని యుత్తర దక్షిణదేశప్రతులలో 'కల్యే' అనుదానికి బదులుగా 'కాలే' అని గలదు.

కాని యిచ్చట ద్రౌపది "యింతపం భీముఁడు వంటయింటికిం బోవునని నిశ్చయించి" నర్తనశాల వెలువడి కావలివారలం బిలిచి తానే ఆరాత్రియే వారికిఁ గీచకుని మరణవార్తఁ దెలిపినట్లును, ఆకలకలము విని కీచక వ్రజంబప్పుడే చేరినట్లును తిక్కనరచనలోఁ గలదు. ద్రౌపది భీముఁడు మహానసము వెళ్లువఱకు వేచినపిదప వారలఁ బిలచిన దను విషయము దక్షిణప్రతులలో నున్నదిగాని యుత్తర దేశ పాఠమున లేదు.

"వారు సంభ్రమించి వడిఁ గోలదివియలు
గొనుచు నులివుమిగులఁ గూడఁ బాఱి
నృత్తశాలఁ జొచ్చి రత్తఱి నాకల
కల మెఱింగి కీచకవ్రజంబు."

భీముఁడు వంటలవాఁడగుటచే 'ననలముఁ గొనివచ్చి చయ్యన వెలుఁగొందఁజేసె'నని చెప్పినాఁడు. ఇచట కావలివారలు కోలదివియలు గొనుచువచ్చుట యెంత యనుచితముగా నున్నదో చూడుఁడు. వారులివుమిగులఁగూడఁ బాఱుటయు నాకలకలంబు విని కీచకులుగూడ 'నత్తఱి' నారాత్రియే "కడువెస నచ్చి" యనేక విధములఁ బలవించుచుండ, బంధుజనంబులును గూడంబారి

దుర్జయం

"స్త్రైనబలంబు గానితెరువై తన కిత్తఱిఁ దోడుగాని యా
కీర్తని మనంబుఁ గీడుపరికించునె, క్రొవ్వునఁ జేటుదప్పునే."

అని నిందింపసాగిరి. ఈ నింద మూలమున దక్షిణదేశప్రతులలోఁ గూడ లేదు. అంతలో నొక్క యుపకీచకుండు నిజ సహోదరులం జూచి, 'మన మెంత పనవి పిలిచిన విననేర్చునె సింహబలుఁడు, వేగమ యితనిం గొని పోవఁగవలయుం గాక" యని చెప్పఁగా సూతులు దాని

కిచ్చుకొని తమయన్నకు నగ్ని యిచ్చువారైరి. ప్రాతఃకాలము వఱకు వేచియుండక యారాత్రియే 'వేగము' కొనిపోవుట యనునది తిక్కనార్యుడు స్వయముగాఁ దెచ్చిపెట్టిన మార్పుగాఁ గనఁబడుచున్నది. దీని మూలముగా నుపకీచకులను మఱునాటి యుదయమునఁ గాక యా రాత్రి చీఁకటిలోఁ జంపినట్లుగాఁ జేసి యీ సందర్భమున కొక విధమగు సుసంభవత్వము (Probability) నాపాదించినాఁడు. పట్టపగలే యిందఱు కీచకు లొక్క మానవుని—అందును విరటునియొద్ద వంటల వాఁడుగా నుండెఁ దామెఱిఁగియున్న వానిని జూచి యానవాలు పట్టలేక గంధర్వుఁడని భయపడి పాఱి, వానిచే హతులయి రనుట కంటె, రాత్రికాలమునఁ గటికచీఁకటిలో నాతని స్వరూపమును గుర్తింపలేక పోవుటచే, దవ్వుదవ్వులన యుదగ్రరూపకలితుఁడైన భీముఁ గనుఁగొని నడవక నిలిచి,

> "ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రింకెట్లొక్కొ యంచుం భయం
> బొదవం బల్లములందు డాఁగియు సమీపోర్వీజముల్ ప్రాఁకియుం
> బెదరం బాఱియు నీరు చొచ్చియును నిశ్చేష్టం బదద్వంద్వముల్
> గుదివడ్డం బెగడొందియుం భరిత సంక్షోభాత్ములై రత్తఱిన్.

అని చెప్పుటయె యుక్తతరంబై యున్నది. భీతులైన సూతులు ద్రుపదసూతిసమేతము గాఁగ నగ్రజప్రేతము వైచి పాఱుటచే, వారిని సమయించినపిదప శమితక్రోధుండై వచ్చి భీముఁడే "పాంచాలీ బంధమోక్షంబు" గావించినవాఁ డయ్యె. భీముఁడు ద్రౌపది కొఱకుఁ గాఁ దమను వెంట నంటుచున్నాఁడని తలంచి కీచకు లామెను వదలి పారిపోయిరి.

"విముచ్య ద్రౌపదీం తూర్ణం ప్రాద్రవన్నగరం ప్రతి,
భీమః, తతః ఆశ్వాసయత్ కృష్ణాం ప్రతిముచ్య విశాంపతే."

అని యుత్తరపాఠమున సందిగ్ధముగా నుండ దక్షిణపాఠములో "ప్రతిముచ్య చ బంధనాత్" అని స్పష్టముగా భీముఁడే బంధనమునుండి విడిపించినట్లు కనఁబడుచున్నది. భీమునిచేతనే బంధమోక్షణము చేయించుటకు తిక్కనకళాచాతుర్యమే మూలము కావచ్చును. ఇంక నిశ్చింతంబునం జనుమని ద్రౌపదిని వీడ్కొలిపి తానును వేఱొకమార్గమున మహానసగృహమున కరుగుదెంచె.

"అంతం గుంతీ నందన
కాంతాచింతామహాంధకారముతో న
త్యంతంబు మచ్చరించెనొ
సంతమసంబనఁ ప్రభాతసమయంబయ్యెన్."

ప్రభాతవర్ణనమును జేయుటకుఁ దిక్కనార్యుఁడెట్టి చక్కని సందర్భమును గ్రహించినాఁడో పరికింపుఁడు. ఆరాత్రితో ద్రౌపది చింతామహాంధకారం బంతయుఁ దొలఁగెనని చెప్పుచు ప్రకృతికిఁ గథావస్తువుతో సంబంధము కల్పించినాఁడు. దక్షిణదేశప్రతులలోఁ గూడ 'తతః కల్యే సమాగమ్య' యనుచోట 'తతః కాలే' యని పాఠభేదమున్నను, ఆకాలమెప్పుడో తెల్లవాఱినపిదపనో, చీఁకటి యుండఁగానో, చెప్పుటకు వీలు లేకుండుటే కాక, తరువాతకీచకులు ద్రౌపదినిగూడఁ గీచకునితో దహించుటకుఁగా విరటుని ననుజ్ఞ వేఁడిన సందర్భములోఁ

'సైరంధ్ర్యా ఘాతితో రాత్రౌ తం దహేమ సహానయా.'

అని 'రాత్రౌ' అని చెప్పుటచే, నీయనుజ్ఞ వేఁడినకాలము మఱునాఁ డుదయముననే యని స్పష్టమగుచున్నది. కాఁబట్టి యుత్తరదక్షిణ

పాఠములు రెంటిలోఁగూడ మఱునాఁ డుదయముననే కీచకసంస్కా-
రోపక్రమము జరిగినట్లు తెలుపఁబడినదనుట స్పష్టము. ఇదియంతయు
రాత్రియే 'వేగము' జరిగినట్లుగా తిక్కనార్యుఁడే మార్చి యాకథాసం
దర్భమునకు చక్కనిపొందిక గల్పించినాఁడు. పగలు ప్రాతఃకాలమున
భీముఁడు గోడలు దాఁటి వెడలుట, విరటునిగృహమున లేక యెటకేనిం
బోవుట, పగలు కీచకులచే గుర్తింపఁబడకుండుట, యిట్టి యసంగతవిష
యములకుఁ జోటు లేకుండఁ జేసినాఁడు. దీనిని జూచియే 'కల్యే' యను
టకు బదులుగా 'కాలే' యనుపాఠమును గల్పించి యీచిక్కు తరువాతి
వారు తప్పింపఁదలఁచి యుందురు. కాని అది తప్పనేలేదు. పిదప కీచ
కులచావుఁ జూచిన పౌరులు కొందఱు విరటునితో సైరంధ్రియు గంధర్వు
లును నగరమున కనర్థపరంపర దెచ్చుచున్నారని చెప్పినమీఁదట నాతఁడు
భార్య నామెను పంపివేయుటకుఁ బ్రేరేపించినట్లున్నది. మూలమున.
కాని తిక్కన విరటుఁ డారాత్రియే కీచకానుజులు నిరవశేషంబుగా
హతులగుటను విని చకితచేతస్కుఁడై, సహోదరమరణ శోకాయత్త
చిత్తయగు జీవితేశ్వరి నుచితాలాపంబుల ననునయించి యామె నెట్లయిన
నిచ్చోటు వాపవలయుఁగాన నాదుపలుకుగాఁ జెప్పుమని మిగుల భయాం
తురములతోఁ బ్రేరేపించుచుఁ దనభీరుత్వమునుగూడవ్యక్తము చేసికొనెను.

"పురుషు లాలతొంగి పొరువునఁ బోయినఁ
జేటు వచ్చుఁ గానఁ జెప్పు నేను
వెఱతు నాఁడువారు వెరవుతో మృదువచో
రచనఁ జెప్పు టరయ నుచితవృత్తి."

ఇంతకుఁ బూర్వము కీచకులు "ద్రౌపదిని గీచకుని యొడలిపయిం
బెట్టి కాల్చు టుచితంబని" తలంచి విరటుని కెఱింగించి చేయువారై

యాతనితోఁ జెప్పవచ్చినపు డాతఁడు వెనుక కీచకుని వారింపలేకపోయి నట్లే వీరిని వారింపలేక, తన మనంబున వీరి సంబంధంబు చూపి నేను వారిం చితి నేనియు నుడుగంగలవారు గారనియు, గంధర్వులు బలవంతులు గావునఁ దద్రక్షితయైన సైరంధ్రి కపాయంబు వొందదనియు నూహించి, "మీకుం బోలిన తెఱంగు సేయుం"డని చెప్పినట్లు తిక్కన రచించి విర టుని మనోదౌర్బల్యమును, ఒక విధమగు భీరుత్వమును వ్యక్తము చేసి నాఁడు. గంధర్వులు బలవంతులు గావున ద్రౌపది కపాయంబు రాదను కారణముచే నీతఁ డంగీకరించె నను నుద్దేశకల్పనము (motive) తిక్కన చేసినదే. ప్రాచీనప్రతులలోను బం. పరి. వారిపాఠములోను

"ఉపక్రమంతు సూతానాం తచ్చ రాజా న్వమోదయత్;
సైరంధ్ర్యాః ప్రేక్షమాణాయాః సహిద్రాహం విశాంపతే."

అని మాత్రమే కలదు. దక్షిణదేశప్రతులలో "పరాక్రమంతు సూతా నాం జ్ఞాత్వా" అనుపాఠము కలదు. మొత్తముమీద తిక్కనరచన విర టుని స్వభావోన్మీలనమునకుఁ దోడ్పడుచున్నదనుట స్పష్టము.

ద్రౌపది కన్యకాపరివృతయై సుదేష్ణయొద్దకుఁబోయినప్పు డామె లోపలినుండి పొంగిపొరలివచ్చు సంతోషభావాదికము, తత్సూచక ములగు ముఖవికాసాదికము నెట్లు బయలుపడనీక యాఁపుకొని, ధీరయై నిర్వికారయై కనుపడినదో, తన యభీష్టసిద్ధి కలుగుటచే సహజముగ బయ లుదేరు సంతోషభావము నడఁచివేయుట కామె ప్రయత్నించినప్పు డెట్టి భావసంఘర్షణము (conflict of feelings) కలిగినదో, ఆమె యెట్లు భావగోపనము చేసినదో తిక్కనార్యుఁ డతిచమత్కారముగఁ జూపి నాఁడు. మూలమున నుత్తర దక్షిణదేశ పఠములలోఁగూడ నీమనోవృత్తి వివరణమేమియు లేదు.

"తతస్స్నైహావకన్యాభి ర్ద్రౌపదీ రాజవేశ్మని,
ప్రావిశచ్చ సుదేష్ణాయాః సమీప మనసూయినీ.—"

తెలుఁగున తిక్కన యొకసీసపద్యము నే రచించినాఁడు:

"ముదమున నెలమి సొంపొదవి నెమ్మొగమునఁ
దోఁపంగవచ్చినఁ ద్రోచి త్రోచి" etc.,

పిదప 'భయశోకంబులు దనహృదయంబునఁ బిరిగొన విరాట ధరణీనాథప్రియ ద్రుపదనందనకు వినయపూర్వకముగా సంభావన చేసెను. ఇంతకుఁ బూర్వము జంతయై, 'శాత్యమునుమ్మలించిన' సుదేష్ణ ద్రౌపదిపలుకులు సార్థకము లగుటతోడనే భయముతోడను, వినయపూర్వకముగను సంభావనచేయఁగడంగెను. ఇందలి మనోవృత్తి సూచనలు మూలమున లేవు.

'రాజా బిభేతి భద్రంతే గంధర్వేభ్యః పరాభవాత్;
త్వంచాపి తరుణీ సుభ్రూ రూపే ణాప్రతిమా భువి.'

అని మాత్రమే కలదు. ఈ శ్లోకమునకు బదులుగా తిక్కనార్యుని రచన యెంత గుణవత్తరము (effective) గా నున్నదో పరికింపుఁడు.

"తనమనంబునఁ గదిరిన యనుజవియోగతాపం బుత్కటంబు బగుటయు నిట్లనియె.

"బిరుదు లగు మగలు గలరని
తరమిడి చంపింపఁజూచెదవు జనములు నీ
పొరువునఁ బోవెఱతురు మా
పురమును రాష్ట్రంబు వెడలిపొ మ్మెందైనన్."

ఇట్లు సుదేష్ణపలుకగా ద్రౌపది యిఁక 'పదుమూఁడుదినంబులమాత్రకుం భవన్మందిర వాస మియ్యకొనినం గడతేరుమదీయవాంఛ'యనిపలికి తుదకు

తనపతు లీనరపతికి శుభప్రతిపాదకు లగుదురని చెప్పినది. ఉత్తరదేశ పాఠములో 'తతో మా ముపనేష్యంతి' అని తననుతీసికొని పోవుదురన్న విషయము తిక్కన వదలివేసినాఁడు. కాని సుదేష్ణ తనను నిలుపుకొను నట్లు చేసికొనుటకుఁగాఁ ద్రౌపదిచే మిగుల యుక్తియుక్తముగా నునయపూర్వకముగాఁ బలికించినాఁడు. ముందు జరుగఁబోవు కథనుగూడ సూచించినాఁడు.

కీచకుని గంధర్వు లతిరహస్యప్రకారంబునఁ జంపి యాతనితమ్ముల నారాత్రియ తెగఁజూచిరనువార్తయే దుర్యోధనుఁడు పాండవులయునికినిగూర్చి యూహించుట కెట్లు ప్రోత్సాహకమై గోగ్రహణ సంకల్పమును సంపాదించినదో యిదివఱకే కొంతపరిశీలించియున్నాము. ఇప్పు డీ పర్వమున నిది, కీచకులబారినుండి రహస్యముగ ద్రౌపదీమోక్షణమును సాధించి యుత్తమనాయకుఁడను బిరుదునుబొందిన భీముఁడు, గోగ్రహణసందర్భమున శత్రువులచేఁ జిక్కిన విరటుని మోక్షణమును బహిరంగముగ శత్రుసేనలతోఁ బోరాడి సాధించుటచే నాబిరుదును సార్థకత్వమును బొందించుకొనుట కవకాశము కల్పించినది. పాండవులు విరటుని వెంబడించు సందర్భమున నుత్తరదేశపాఠములో:

> 'కంకవల్లవ గోపాలాః దామగ్రంథిశ్చ వీర్యవాన్,
> యుధ్యేయు రితి బుద్ధిర్మే వర్తతే నాత్ర సంశయః;
> ఏతేషా మపి దీయంతాం రథా ధ్వజపతాకినః.

అని విరటుఁడే చెప్పినట్లున్నది. ఆతని యూహకుఁ గారణ మగపడదు. కాని దక్షిణదేశప్రతులలో

> "రథేషు యుజ్యమానేషు కంకో రాజాన మబ్రవీత్;
> మయా హ్యస్త్రం చతుర్వర్గం హ్యవాప్తో ఋషిసత్తమాత్.

అని సమయముకనిపెట్టి చెప్పుకొనినట్లు మాత్ర మున్నది. ఇది తిక్కన రచనకు దగ్గరగానున్నను, తిక్కనరచన స్వతంత్రంబై యాతని కళాశక్తిని ప్రకటించుచున్నదనుటకు సందేహము లేదు. విరటుఁడు బలంబులంగూర్చి కొనుటకుఁ బురబహిరంగణంబునం గొండొక సేపు నిలుచుట —— అదే మంచి సమయ మని తలంచి, ఆసమయముననే యంతంతం జూడనూపిన పవన తనయు మాద్రీతనయులను నిలువుం డని నిపుణంబుగా నియోగించుట, తాను మత్స్యమహీవల్లభు నల్లనచేరి పలుకుట, తన్నుఁగూర్చి చెప్పుకొని, మున్నను వీరలు మువ్వురఁగడకలకాలఁను లే నెఱుంగుదు కొంతకొంత యని వారికాలఁదులనుగూర్చి తెలుపుట, మొదలగునదంతయు నా సన్నివేశమునకు (Situation) స్వాభావికత్వగుణము నాపాదించుటకుఁగాఁ దిక్కనార్యుఁడు చేసిన కల్పనమే.

ఇట్లు పాండవులు విరటునితోఁగూడి యుద్ధమునకై పోయినను ఆతనితోఁ గలిసి శత్రుసేనలతో యుద్ధము చేసినట్లు తెలుఁగు భారతములోఁ జెప్పఁబడియుండలేదు. బం. పరి. వా రాదరించిన ప్రాచీన పాఠములోఁగూడ లేదు. కాని దక్షిణదేశప్రతులు కొన్నింటిలో

"యుధిష్ఠిరోఽపి ధర్మాత్మా భ్రాతృభి స్సహిత స్తథా,
వ్యూహం కృత్వా విరాటస్య అన్వయుధ్యత పాండవః."

అని యుధిష్ఠిరుఁడు తమ్ములతోఁగూడి యొకవ్యూహముపన్నికొని విరటునికి సహాయమై యుద్ధముచేసినట్లుగాఁ జెప్పఁబడియున్నది. తిక్కన విరాటుడు సుశర్మమీఁద దనరథంబుఁ దోలింపగా నిద్దఱును దలపడి కోపంబు రూపంబులైనట్లు శౌర్యోన్నతిం బోరిరని చెప్పెనేకాని, పాండవులు వాని కీపగటిపూట జరిగిన యుద్ధములో సాయపడినట్లు చెప్పకుండుటచే నుత్తరపాఠమునే యనుసరించిన ట్లగపడుచున్నది.

ఆదినముతోఁగాని వీరికిఁ బదుమూఁడేండ్లు నిండవు గావున వీరప్పుడు బయలువడ నిశ్చయించుకొనలేదు. రాత్రియుద్ధమం దైనచో వీరు బయలుపడుట కవకాశ మంతగా నుండదు. వీరి సమరోత్సాహమును దీరును. గావున నీ సందర్భమునంతను గుర్తించినవాఁడువలెనే

"తనమనుములు పాండుతనయు
లని సేఁతకు వేడ్కసేయు టాత్మఁ గని తమం
బున మెఱయనేరరని వ
చ్చినక్రియ శశి పూర్వశైలశిఖరం బెక్కెన్."

ఇట్లు సమయ సముచితంబుగ నత్యంతగంభీరార్థసూచకం బగునట్టుల నుత్ప్రేక్షించుచు తిక్కన చంద్రోదయవర్ణనమును జేసి యా వెన్నెలలో వీరు పోయినట్లు తెలిపినాఁడు.

ఇఁక నుత్తరగోగ్రహణసందర్భమున కౌరవసైన్యమును జూచిన పిదప నుత్తరార్జునుల సంభాషణయు, అర్జునుఁడు కురుసైన్యమునుగవిసి పోరుసల్పినరీతియు, నెంత సక్రమము, సహేతుకము, సుప్రయుక్తము నగుపద్ధతిని (well arranged plan) తిక్కనార్యుఁడు నడిపియున్నాఁడో యింక పరికింతము. కురుసైన్యమును జూచి యుత్తరుఁడు భయభ్రాంతుఁడై "సైన్యమిది యేఁ జేరఁగ శక్తుండనే", "వికర్ణకర్ణాది యోధవీరుల కెదురే", "మనకు మార్కొనునట్టి కొలఁదిగాదు" అని వాపోవుచున్నను, ఆ 'మనకు' అనునది తనకు వర్తింపదని తెలుపువాఁడువలెనే అర్జునుఁడు వీని మాటలను లక్ష్యపెట్టక తన దారిని దాను ముందుకు రథమును దోలుకొని పోవుచుండెను. అర్జునుని యీ నిర్లక్ష్యభావమును బ్రత్యేకముగాఁ జెప్పక తరువాతి యుత్తరుని మాటలచే సూచించినాఁడు. తిక్కన.

"కౌరవసేనఁజూచి వడకఁదొడఁగెఁ మదితోన మేను నీ
పూరక పోవుచున్కి యిది యొప్పునె యెప్పటిభంగి"

అప్పు డనాదరమును జూపు 'దరహసిత వదనముతో' ముందుగా "నస దృశలీలఁ బొల్చు రథికావళి" మీఁదికిఁ బోయి తాఁకుట తన యుద్దేశము కాదని, తాము వచ్చినపని కూడ నదికాదని, గోధనమును వేగ మరల్చుటయే ప్రథమకర్తవ్యమని, ఆయామిషమునుగొని మార్గమువట్టిన తుచ్ఛసైన్యమునే తాముముట్టవలసినదని, కొంత యూరటఁబలికి తాను నిర్దేశించుకొనిన యుద్ధపద్ధతిని (Plan of attack) సూచించినాఁడు. మొదటనే కురుసేనలజోలికిఁ బోవక, వీఁ డొంటిగ నేమి సేయునని వారు చూచుచుండగనే, ముందుపోయి, 'మార్గముపట్టిన తుచ్ఛసైన్యము'ను దాఁకి గోవులను విడిపించి, యా సందర్భమున సేన లడ్డంబైనచో వారితోఁ బోరాడవచ్చునని యర్జునుండు వేసిన యెత్తు. ఈ పద్ధతి ప్రకారమే యాతఁడు పోయి విజయముఁ గాంచినాఁడు. దీని కనుకూలముగనే తిక్కనయు గోవులను మరల్చుట యుద్ధసన్నాహము వఱకు మాత్రమే నాల్గవయాశ్వాసమునఁదెల్పి, యుద్ధము నైదవయాశ్వాసము నకుఁ ద్రోసివేసినాఁడు. అట్లు తనయుద్ధక్రమమునుగూర్చిన యుద్దేశములను దెల్పి

"అంతిపురంబులోనఁ గల యంగనలెల్లను నెమ్మనంబులన్
సంతసమందగాఁ బసులఁ జయ్యనఁ దెచ్చెదనంచుఁ బూని"

వచ్చుటను జ్ఞాపకముచేసి యొత్తిపొడిచినాఁడు.

దీనితో నుత్తరునికి ఎలుఁగుపడినది! 'పసులదయ్య మెఱుఁగు, పడఁతుల సంతోషమేలనాక' న్నాఁడు. ఇఁక సూరుల లక్షణములను దెల్పి కొంచెము పురెక్కింపఁదలఁచినాఁడు గాని, ఉత్తరుఁ డట్టివారి

లోఁ జేరినవాఁడు కాఁడుగదా! ఈ సందర్భమున నర్జునుని యనుభవము నకుఁ దగినట్లుగాఁ బలికించినాఁడు తిక్కన—తనయనుభవమును గూడ వెల్లడించుచున్నవాఁడేమో! అర్జునుఁడు చెప్పిన యీ మాటలన్నియు నుత్తరునికి వెడమాటలైనవి. ఎవఁడైన నొంటిఁ దలపడి యట్టి కురుసేన నోర్వఁగలఁడని యాతఁ డూహింపఁగలఁడా? కావున నిఁక భారమంత యుఁ దనపైని వేసికొని

"నను సైరంధ్రి గడంగి పేర్కొనియె దానం బెంపుమైఁ బిల్చి తో
డని తోడ్తెచ్చితి నీవు బంటుతనము ట్లగ్గించి పోరాళి దీ
వన లిచ్చెం దుదిఁ బోయి కౌరవులు గోవర్గంబుఁ గొంపోవఁగాఁ
గని యేఁ గ్రమ్మితి రిత్తపోదుశ భయోత్కంపంబు నీకేటికిన్."

"కౌరవసైనికులెల్లఁ జూచి
వెఱగుపడ వేగమును లావు వెరవు మెఱయ
గదుపుఁ బెట్టించి పోదము గ్రమ్మఱంగ"

తానె యంతను నిర్వహింపఁగలనని సూచించినాఁడు. కాని యుత్తరుని కీమాట లెట్లర్థమగును. 'నను నాఁగకు నీక్రొవ్వులుగ దేనిఁ దలపడు' మని శరములు శరాసనములు నరదముపై డిగ్గవిడిచి, వాని తోపాటు లజ్జనుగూడ నచ్చటనే విడిచి పురిదెసకుఁ బోవఁబాఱెను. అతని వెయిది పట్టుకొనఁబోయిన నర్జునుఁజూచి 'అజ్ఞులు కొంద అప్పు డపహాసము సేయుచుఁ దద్వికృతకాయముమీఁద దృష్టినిల్పి, ప్రాజ్ఞులు మూర్తిసౌమ్యత - ఉదాత్తత మొదలగువానిఁ జూచి సంశయముఁబొంది, తుదకు నిశ్చయ రహితహృదయు లయిరని చెప్పిన తిక్కనరచన ప్రాచీనంబగు నుత్తరదేశపాఠమునే పోలియున్నట్లున్నది.

" సైనికాః ప్రాహసన్ కేచిత్ తథారూప మవేక్ష్యతామ్;
సుశీఘ్ర మనుధావన్తం సంప్రేక్ష్య కురవో౽బ్రువన్......
ఇతిస్మ కురవ స్సర్వే విమృశంతః ప్రథకపృథక్

'సైనికాః కేచిత్' అని 'కురవః' అని ఉన్నదానికి బదులుగా తిక్కన 'అజ్ఞులు' 'ప్రాజ్ఞులు' అనువిభాగము కల్పించి, వారెట్లు విమర్శించినది చెప్పినాఁడు. కాని దక్షిణదేశప్రతులలో ద్రోణుఁడు, కృపుఁడు, కర్ణుఁడు మొదలగువారందఱు దీర్ఘోపన్యాసముల నిచ్చినట్లు చెప్పఁబడినది. ఆవచ్చినవాఁడు ఫల్గునుఁడని ద్రోణుఁడు నిశ్చయించి పల్కిన పిదప నుత్తరదేశపాఠములో భీష్ముఁడే యుద్ధమునకుఁ దగినయేర్పాటులఁ గూర్చి చెప్పినట్లున్నది.

భీష్మఉవాచ:

" అథ యా మామికా బుద్ధిః శ్రూయతాం యదిరోచతే,
క్షిప్రం బల చతుర్భాగం గృహ్య గచ్ఛ పురం ప్రతి;
తతో౽పర శ్చతుర్భాగో గాః సమాదాయ గచ్ఛతు."

కాని దక్షిణదేశపాఠములలో తెలుఁగు రచనలోవలె ద్రోణుఁడే నిర్ణయించినట్లున్నది.

" భీష్మస్యోపరతే వాక్యే తథా దుర్యోధనస్యచ,
ప్రాప్త మర్థ్యం చ యద్వాక్యం ద్రోణ శ్చాహ ద్విజోత్తమః."

తిక్కన 'ద్రోణుఁడే' 'కార్యగతియు' 'గయ్యంబుభంగిని' (plan of attack) గూర్చి చెప్పుట యుచితమని తలంచి, అట్లాతనిచేఁ జెప్పింపఁగా సురనదీసూనుండు దానికియ్యకొని రాజన్యునకు సైన్యంబుఁ బంచియిచ్చి యాతఁడు చెప్పినరీతిని మోహరించెనని చెప్పియున్నాఁడు.

"అహంవై సర్వసైన్యస్య పార్ ష్ణింస్థాస్యామి పాలయన్;
అనుదానికి సరిగా "తాలధ్వజంబెత్తి మెఱసి తాను వెనుకయయి నడిపించుచుండె"నని రచించినాఁడు.

ఆ కురుసైన్యంబు లెట్లు నడచుచున్నది యొక్కసీసపద్యమున వర్ణించినాఁడు. ఇక్కడను నడచుచున్న కురుసైన్యమునే వర్ణించెనే గాని, తనవర్ణనకొఱకుగా వారి నచ్చట కొంతసేపు నిలువఁబెట్టలేదు. తిక్కన సామాన్యముగా నడుచుచున్న అనఁగా కథావ్యాపారమునందు వ్యాపృతమైయున్న వ్యక్తులను సందర్భానుకూలముగా వర్ణింపయత్నించునే కాని, తన వర్ణనకౌశలమును—లేదా కండూతిని—వ్యక్తముచేయుటకో—మాన్పుకొనుటకో, వర్ణింపదొరకొనఁడు. ఆవర్ణించుటలోను, ఆసందర్భమున నొకవైపునుండి వారిని సమీపించుచున్నయర్జునునిరాక ఆసేనలపై నెట్లు తన ప్రభావమును నెరపుచున్నదో, అప్పటి వారి స్థితి యెట్లున్నదో, అది యెట్లు వారిపైఁ బ్రతిఫలించుచున్నదో తెలుపుచు నాదృశ్యమును మనకనులయెదుటఁ బెట్టుచున్నాఁడు. మూలమునందలి

"తథా వ్యూఢే ష్వనీకేషు కౌరవేయై ర్మహారథః;
ఉపాయా దర్జున స్తూర్ణం రథఘోషేణ నాదయన్."
"దదృశు స్తే ధ్వజాగ్రం వై శుశ్రువుశ్చ మహాస్వనమ్;
దోధూయమానస్య భృశం గాండీవస్యచ నిస్వనమ్."

అను దాని యర్థము నెంతస్వాభావికముగాఁ బెంచి వర్ణించినాఁడో పరికింపుఁడు:

"దేవదత్తాభీల రావంబువీనఁ గర్ణ
 ములం దీటుకొన లేటమొగము వడుచు

రథనేమిదళిత ధరాధూళి యంగంబు
　　　　లెల్లఁ గప్పఁగ వెలవెల్లనగుచు
బహుళకపిధ్వజప్రభలు లోచనములు
　　　　మిఱుమిట్లుగొనఁ బర్వ మెండుకొనుచు
నుద్భటాకారగసముద్ధతి మనము లు
　　　　త్తలపాటుదోఁపంగఁ దల్లడిలుచు
నడచు కౌరవరాజ సైన్యంబు గదిసెఁ
దీగ దిగిచినగతిఁ దన తేజు మెఱయ
రయముమైఁ జని ప్రళయభైరవసహస్ర
గర్జనోదగ్రతర్జనుఁ డర్జునుండు."

క్రోశద్వయ మాత్రమునఁగూడ ముట్టి తలయెత్తి చూచి యాకౌరవసేనాసన్నివేశ మెట్లున్నదో, అందు దుర్యోధనుఁ డెచ్చటనుండెనో పరికింపఁజొచ్చెను. ముందు రాజగు దుర్యోధనునిపైఁ బడి యెట్లయిన నాతనిఁ జిక్కించుకొనినచో, దాన నంతయుఁ జక్కంబడునని యాతని యుద్దేశము. ఆతనినిఁ గానకపోయినచో నీసేనజోలికిఁ బోవక "వీరిని ట్రిప్పల డించి యాకరువు సేదఁగఁ బోదముగాక ప్రేల్మిడిఁ" అని గోవులను ముందు విడిపింపవలయునని యెత్తువేసినాఁడు.

"విచ్చి చనకుండఁ బసులం
దెచ్చుట మునుమున్న వలయు తెఱఁ గాపనికిం
జొచ్చి యది చక్కఁ బెట్టఁగ
నచ్చోటన దాయ మనకు నగపడెడు బలే."

ఉరగకేతనుండు సేనలో లేఁడు గావున నాతండు గోవులఁ గొనిపోవనోపు నని యూహించినాఁడు. నిరామిషంబగు సేనతో నని

సేయ నాతనికిఁ బనిలేదు. కావున వీరియ్యెడ నెయిది యడ్డపడి తడవు సేయకమున్న పసులం బెట్టించుకొనవలయునని తలంచెను. ఈతలంపు ద్రోణుఁడు కనిపెట్టినాఁడు. మొనఁ గలయఁజూచి యూరక చనుట యాతని యనుమానమునకుఁ గారణమైనది.

> వాసవాత్మజుండు వసుధేశనందను
> మెట్టికొనిన నొకటి పుట్టెనేని
> మన ప్రయోజనంబు మఱియేమి పసు లవి
> యేటి కొండుధనము లెల్ల నేల.

అని పలుకుచు రాజరక్షణతత్పరుండై ముందుకుఁ బోయెను. అర్జునుఁడు సేనలు కూడ ముందుకు నడచివచ్చుచుండుటను గనిపెట్టి అవి వచ్చి పడకుండగనే, గోవర్గమును జీలఁదీయుటకుగా నావెంటి నడుమంగాఁ జొచ్చి, నిశితశరపరంపరలచే నాసేనల నచ్చటనే నిలిపి తెలిపిచూపి వెలిచీర సారించి, దేవదత్తంబుపూరించి కదుపులను దక్షిణదిశకు దొలలంబాఱునట్లు చేసెను. మరల నీసేన లాపసుల కడ్డపడకుండ వాని కెదురై గోపసంఘమును "కొనిపొండు పసుల నోడక, యని తానెలుఁగిచ్చి వీటికై నూల్కొలిపెను." మూలమున

> "తస్య శంఖస్య శబ్దేన రథనేమి స్వనేనచ,
> ఊర్ధ్వం పృచ్ఛా వ్యధుస్వానా రేభమాణాః సమన్తతః;
> గావః ప్రతినివర్తన్త దిశ మాస్థాయ దక్షిణామ్."

అనియున్నను ఆ సేనాసన్నివేశము, అర్జునునిపన్నుగడ, (Strategic move) దానిప్రకార మాతఁడు తనయభీష్టమును సాధించినరీతి మన మనోదృష్టికి గోచరంబగుటలేదు. తిక్కన యాసన్నివేశమంతను ఆసేనల యొక్కయు, అర్జునునిరథముయొక్కయు నడకలను గూడ మనకుస్పష్ట

ముగఁ జూపియున్నాఁడు. పసులం బెట్టించుటతో -"గోగ్రహణము"తో బాలవ యాశ్వాసమును ముగించి, కౌరవవీరులతోడి యుద్ధము నైదవ యాశ్వాసమున వర్ణించినాఁడు.

ఈయుద్ధవర్ణనసందర్భమున నుత్తరదక్షిణదేశ ప్రతులకుఁ గొంత భేద మగపడుచున్నది. గోవులను విడిపించినవెంటనే కురువీరు లెదుర్కొనినట్లును

"గోషు ప్రయాతాసు జవేన మత్స్యాన్
కిరీటినం కృతకార్యం చ మత్వా;
దుర్యోధనా యాభిముఖం ప్రయాతాః
కురుప్రవీరాః సహసాభిపేతుః."

అప్పు డర్జునుఁ డుత్తరునితో

"యోయోద్ధు మాకాంక్షతి సూతపుత్రః
తమేవ మాం ప్రాపయ రాజపుత్ర;
దుర్యోధనా పాశ్రయజాతదర్పం"

అని కర్ణునిపైకి రథముతోలుమనిచెప్పి యాతనితో యుద్ధముచేసి యోడించినట్లును,

అపయాతేతు రాధేయే దుర్యోధనపురోగమాః;
అనీకేన యథాస్వేన శరై రార్ఛంత పాండవమ్.

పిదప దుర్యోధనాదు లెదుర్కొనఁగా, నపుడు కౌరవవీరుల లక్షణములను వర్ణించి వేఱువేఱుగా భీష్మద్రోణాదుల నుత్తరునకుఁ జూపినట్లును గలదు.

"ధ్వజే కమండలు ర్యస్య శాతకుంభమయః శుభః."

కాని దక్షిణదేశప్రతులలోను, తిక్కన తెనుఁగు రచనలోనుగూడ మొదటఁ
కర్ణునితోడి యుద్ధమునుగూర్చి యేమియు చెప్పఁబడలేదు. అనతిదూర
వర్తియగు చక్రవర్తి దెసం గనుంగొని భూమింజయుఁ డక్కడఁ దేరు పఱు
పం బనుపఁగా కురువీరు లడ్డపడుటయు, రాజును పసులు పట్టుపడుటకు
నిట్టూర్పు నిగుడించుచు వెన్నుదన్ని నిలిచెననియు, నప్పు డర్జునుఁడు
'వీరరసమయాత్మకుఁ' డగుచు

"కనుఁగొని యెలనవ్వొలయ వ
దనమున గరువంపుఁ జెన్ను దలకొనఁగా న
ర్జునుఁడు విరాట సుతున కి
ట్లనుఁ గేవల వీరరసమయాత్మకుఁ డగుచున్.

కౌరవవీరుల వేఱువేఱ నిరూపించి చెప్పినట్లున్నది. అనఁగా యుద్ధ
మునకుఁ బూర్వమే కౌరవవీరుల నుత్తరునకు నిరూపించిచెప్పుట జరిగిన
దన్నమాట. ఈ సందర్భమున నర్జునుని స్వరూపము నెంత చక్కఁగా జిత్రిం
చిపెట్టినాఁడో తిక్కన గమనింపుఁడు. ఇంతకాలమునకు వీరితో యుద్ధ
ము సంప్రాప్తమైనది గదా యని కాఁబోలు ఎలనవ్వు. లేదా ఇంత
మంది చూచుచుండగనే కదుపులఁ జెట్టించితిమిగదా ఇప్పుడు రాజును
తప్పించుటకు మాత్ర మెట్లో వీ రడ్డపడఁగలిగిరి—అని ఇఁక వీరికిని నా
ప్రతాపము గనఁబఱచెదగాక యను భావము మనమునఁ బుట్టుసరికి వద
నమున గరువంపుచెన్ను దలకొన్నది. యుద్ధము ప్రారంభింపవలయు
ననుకొనఁగానె యర్జునుఁడు వీరరసమయాత్మకుఁ డైనాఁడు. ముందప్పటి
వీరులనుగూర్చి యుత్తరునకుఁ దెలుపఁదొడంగెను. ఉత్తర దేశప్రతులలో
మొదట రాధేయునితో యుద్ధమైనపిదప, భీష్మాదివీరుల నుత్తరుని కెఱిం
గించినపిదప నింద్రాదిదేవతలు విమానములలో వచ్చి యభ్రవీథిని నిలచి
నట్లు వర్ణింపఁబడినది. ఈ వచ్చినవారిలో శిబి, యయాతి, నహుష,

గయ, రఘు, కృశాశ్వసగరాదు లున్నారు కాని పాండురాజుమాత్రము లేఁడు. తిక్కన దేవతల రాకనుగూర్చి యింతకుఁ జాలపూర్వమే అనఁగా భీష్మాదులు యుద్ధసన్నాహమును చేసికొని యర్జుని రాకను జూచుచుండిన సందర్భముననే తెలిపినాఁడు. అందిరాజులపే ళ్లన్నియు చెప్పక స్వర్గమందున్న రాజులందఱు వచ్చిరనియు, పాండురాజుగూడ వచ్చి చూచుచున్నట్లును తెలిపినాఁడు.

తెలుఁగులో యుద్ధప్రారంభమునకుఁ గారణము అశ్వత్థామసోపాలంభవాక్యములకుఁ గినిసి కర్ణుఁడు తలపడుటయే యైయున్నది. కాని బం. పరి. పాఠమును బట్టి అర్జునుఁడు కృపుని రథమునకుఁ జుట్టు తిరిగి యాతనితోఁ బ్రారంభించిన ట్లగపడుచున్నది. కృపభంగమైన పిదప ద్రోణునితోడను, అనంతరము ద్రోణపుత్రునితోడను, ఈతనితోడ యుద్ధము చేయుచుండఁ గర్ణుఁడు మధ్యవచ్చుటచేఁ ద్రోణపుత్రుని వదలి కర్ణునితోడను, పిదప భీష్మునితోడను, దుర్యోధనునితోడను, పిదప సంకులయుద్ధమును జేసిన ట్లగపడుచున్నది. కాని తిక్కన యుద్ధవర్ణనము వేరుమార్గమున నొకక్రమపద్ధతి నవలంబించిన ట్లున్నది.

మొదట నశ్వత్థామపైఁ గినిసి కర్ణుఁడు తలపడఁగా, ద్రోణుఁడు ద్రోణసుతుఁడు, కృపుఁడు, శాంతనవుఁడు నాతనికి ముందుగనె గడంగిరి. సంకులయుద్ధము జరిగినది. ఇందు మొదట నర్జునుఁడు శత్రువుపైఁ జేసిన బాణప్రయోగముగాక శత్రుబాణముల నొకఁడు నెట్లు చక్కసాబాలుగా వ్రయ్యలు వాపెనో, తుత్తునియలుగాఁ ద్రుంపెనో ఇసుమంతలుగా నఱుమాడెనో, చిఱునుగ్గుగాఁ బొడిచేసెనో వర్ణించెను. పిదప వర్మస్తోమంబులను శిథిలముచేయుట పగతుర జర్జరితాంగులను జేయుటను వర్ణించెను. దీని ఫలముగా

"శక్తిస్ఫార ధనంజయాయతభుజా సంరంభగాండీవని
ర్ముక్తక్రూరశరావళీదళితశత్రువ్రాతముల్ శోణితా
సిక్తాకారతఁబొంది సాంద్రకుసుమశ్రేణీ వికాసోల్లస
ద్రక్తాశోక తరువ్రజంబులక్రియన్ రంజిల్లి యొప్పె"

నని వ్యక్తపఱచినాఁడు. తదవసరమున దొర లొక్కపెట్ట నర్జునుం బొదువుట, అప్పుడీతని బాణవిజృంభణము:

సమవిషమ వినిమ్నోన్నత
సమీప దూరస్థలములు సదృశములుగఁ జి
త్రము క్రియ నవిహతగతులను"

చను నాతని రథగతిచే బలమును రెండుపాయలుగను, నాలువుగను, మూలల నానాశకలాకృతిగను జేసి వలయముల్ సని చించి చిక్కుపఱచుట, ఈ మొదలగు శిక్షితచిత్ర సంగరవిశేషముల నత్యద్భుతముగా వర్ణించి "యత్తఱిన్ సహస్రాంశుతనూజు సారథి రథాశ్వచయధ్వజముల్ పరాస్త్రశస్త్రక్షతి లేక యొప్పె" నని మరల దానిఫలమును వెంటనే వర్ణించి చెప్పినాఁడు. యుద్ధసమయమున నర్జునుఁడు 'వేల్పువచ్చినయట్ల మేనువొంగ, నలిరేగి' యుండునో అట్లే తిక్కనార్యున కట్టి యుద్ధవర్ణన సందర్భమున నత్యావేశము గదురును. అర్జునుని సంకులయుద్ధమును వర్ణించి, 'యా సంగ్రామం బభిరామం బయ్యె నెట్లు ఘోరప్రకారం బయ్యెనో' ప్రబంధరీతి నలంకారభూయిష్ఠంబై పటుసమాసజటిలం బగు దీర్ఘంబైన గద్యలో వివరించినాఁడు. ఇంతవఱకు సంకులయుద్ధవర్ణనరీతు లైనవి. ఇక "సవ్యసాచి ప్రత్యేక ప్రధన కుతూహలాయత్తచిత్తుం డయ్యె"నట. మొదట 'వృషభంబున కాదికొను బెబ్బులియునుం బోలె రాధేయుదెస నడ

చెను." వీరిద్దఱు నొండొరులఁ దలపడుట సూచి యుత్కటమగు నచ్చెరు
పాటు గౌతుకంబు నడర నయ్యెడ నాకురుసేన లూరక చూచుచుండె
నట. తిక్కన ద్వంద్వయుద్ధవర్ణనలలో నీరీతి వర్ణన మొక విశేషము.
'వెఱవఱచి సూతపుత్రుఁడు పఱచుటయు,' పార్థుఁడు ద్రోణునిపైఁ
బోఁదలంచి "గురులకు మార్కొనియెదము రాజధర్మంబున కీడునఁ జేసి
యింత పుట్టఁగవలసెఁ" అని సమర్థించుకొనుచు నెదుర్కొనెను. ఇది
తెలుఁగు బ్రౌన్‌దొరగారి ప్రతిలో నున్నదిగాని తక్కిన దక్షిణదేశప్రతు
లలో గానవచ్చుటలేదు.

అర్జునుఁ డాచార్యునకు భరంబుగ నేట్లాడుటను జూచి యశ్వ
త్థామ యాతనిఁ దాఁకెను. ద్రోణతనయు తూణీరంబులు శరశూన్యం
బులగుటచే, నధికుండగు నప్పాండవమధ్యముం గనుఁగొని కృపుఁడు
సెంగటం దలమీఱిన, గురుపుత్రుని రథమువిడిచి యాతనిం గవిసె
నట. క్రమముగా నొకరిపిదప నొకరితో నీతనికి పోరు సంభవించు
టను ఎట్లు సకారణంబుగ వ్యక్తముచేయుచున్నాఁడో తిక్కన పరి
కింపుఁడు. కృపుఁడు ప్రయోగించిన శక్తినిగూడ 'గడికండలు'
చేయఁగా నాతఁడు తేరుడిగ్గి కవిసి తుదకు వెఱఁగుపాటున ద్రోణపుత్రుని
రథం బెక్కెనట. అప్పుడు సేనలన్నియు భీష్ముని మఱువుసొచ్చు
టయు, మధ్యవచ్చిన వృషసేనాదులను జంపి భీష్మునితో యుద్ధముచేసి
యాతఁ డొల్లఁబోయి సోలుచు రథకూబరమాత్రఁగ జేసికొని నిల్చిన
ట్లుగా నొనర్చెను. పిదప నుత్తరుఁడు వెనుకకు లాగుచున్నను 'కవ్వడి
నవ్వుచు' నేనుండ నీకోహటింపనేల యనిచెప్పి 'ఎల్లపనులును జక్క
నయ్యె రాజొక్కఁగుండు గోఱంత' యని యాతనిపైఁ దేరుఁ బోనిమ్మ
నెను. దుర్యోధనుఁ డీతనికిఁ జాలలేక సైన్యములు విచ్చిపాఱ నీతఁడును
మరలుటయు, వీరిని వెంబడించి తనతోడంబుట్టువుల ప్రతిన లూహించి

యొందుఁజేయ నోపక ధార్తరాష్ట్రులను భంగపెట్టందలంచి సమ్మోహ నాస్త్ర ప్రయోగముం జేసెను.

దీనినిఁబట్టి మూలమునందలి క్రమమునకును, తిక్కన రచనయం దలి క్రమమునకును నెట్టి భేదము కలదో, తిక్కన యుద్ధవర్ణనము మూల ములోవలె దారి తెన్నులేక యుండక యొక నిర్దిష్టక్రమము సహే తుకమార్గము (a logical order and arrangement)తోఁ గూడి యున్నదని చూపుటకే యింతగాఁ జెప్పఁబడినది.

దీనినిఁబట్టి తిక్కనార్యుఁడు గ్రహించిన సంస్కృతమూలప్రతి యిప్పుడు దొరకినవానిలో నతిప్రాచీనంబని తలంపఁబడుచుండి, బండా ర్కారు పరిశోధనాలయమువా రవలంబించిన పాఠమునకు మూలమైనట్టి ప్రతికే, దగ్గరగా నుండియుండుననియు, "నందలియర్థంబు సంగతంబు సేసి"కొని కావ్యకళాదృష్టితో నద్దాని నొక "ప్రబంధంబుగ" రచింప దొరకొనిన సందర్భమున ననేకవిధములగు మార్పుల నాతఁడు చేసెన నియు, వీనిలోనియర్థము సందర్భానుకూలముగా కొన్ని దక్షిణదేశపు మూలప్రతులలోని కెక్కుట సంభవించియుండుననియుఁ దలంచుట కవ కాశ మేర్పడుచున్నది. ఆ మహాకావ్యంబు నర్థంబు, సంగతంబు సేయు నెడల నాతఁ డొనర్చిన మార్పులయొక్క సారస్యమును, ఔచిత్యమును గొంతవఱ కాయాభాగములను మూలముతో సరిపోల్చునప్పుడు గమ నించియే యున్నాము. ఇఁక నాతనిస్వతంత్రకల్పన లాతనికళాప్రతి భల నెట్లు వ్యక్తపఱచెనో పరిశీలింతము.

---

౪

# తిక్కనార్యుని కళాప్రతిభలు

ఆంధ్రవాఙ్మయమున నాంధ్రకవులు ప్రత్యేకముగాఁ బరిణతి నొందించినదియు, కేవల సంస్కృత మూలమునకు భాషాంతరీకరణ గ్రంథమని చెప్పఁదగనిదియు నగు కవితాశాఖ యేదియని ప్రశ్నించి నచో నది యాంధ్రప్రబంధశాఖయే యని చెప్పక తప్పదు. ఇది శిష్ట కవితాశాఖయని చెప్పఁదగియున్నది. ఆంధ్రవాఙ్మయము రెండుశాఖలు గలదిగా బయలు దేరిన ట్లగపడుచున్నది. అందు దేశీయచ్ఛందములలో రచింపఁబడి, ద్విపదలు, పదములు, పాటలు మొదలగువాని రూప మున నుండి జనసామాన్యమున వ్యాప్తిఁ జెందియున్న దేశీయకవిత మొదటిశాఖ. ఇది తరువాతికాలమున భారతాది గ్రంథములరూపమున బయలు దేరిన శిష్టకవితయొక్క ప్రాబల్యముచే నణఁగఁద్రొక్కఁబడినను నంతఃప్రవాహినిగాఁ బ్రవహించుచు నప్పుడపుడు పొడసూపుచునే యున్నది. దానిచిన్నెలే సోమనాథ రంగనాథాది శైవవైష్ణవకవుల ద్విపద కవితలయందును, తరువాతి కాలమున పల్నాటి వీరచరిత, కాటమరాజుకథ, చిన్నన్న ద్విపదలు, బొబ్బిలిపాట, బాలనాగమ్మకథ, లంకాయాగము, కుచ్చలకథ, లక్ష్మణదేవరనవ్వు మొదలగు వానియం దును, నింక ననేకములగు స్త్రీలపాటలయందును గొంతవఱకుఁ గానఁ బడుచున్నవి. ఈ దేశీయకవితాశక్తి నవలంబించి రచింపఁబడిన ద్విపద గ్రంథములు, నాటకములు ననేకములు దక్షిణదేశ వాఙ్మయశాఖలో గూడఁ గానవచ్చుచున్నవి. అందలి నాటకములన్నియు సంస్కృత నాటక నియమముల ననుసరించి రచింపఁబడినవిగాక దేశీయపద్ధతి నను

సరించియున్నవి. ఉత్తరాంధ్రమున నింతకాలమునుండియు స్త్రీలపాట లమూలముగానైన నిలచియుండిన యీ దేశీయకవిత యిటీవలి కాలమున పాశ్చాత్యనాగరకత, పాశ్చాత్య విద్యావిధానములును స్త్రీజన సంఘమునఁగూడ విశేషముగ వ్యాపించుచుండుటంజేసి, కళ్లజోళ్లు, కాలేజీలు, హార్మనీలు, బ్యాంకుట్యూనులు మొదలగువానియం దత్యాదరముగల యిప్పటి నాగరకస్త్రీజనము పాత ముసలవ్వలపాటలయం దాదరములేని వారగుచుండుటచే నవి యంతరించిపోవుటయే తటస్థించునట్లున్నది. కావున నాశాఖాకవిత కేవల మంతరింపకుండునట్లుగా నిప్పటికిని వృద్ధస్త్రీలయొద్ద నిలచియున్న పాటలను పోగుచేసి పరిశుద్ధమగు పాఠముతో నచ్చువేయించి యీ దేశీయ కవితాశాఖను గాపాడవలసిన యావశ్యకత గనఁబడుచున్నది.

నన్నయకుఁ బూర్వము రెండుమూడువందల యేండ్లనుండియు కన్నడదేశమునందు వలెనే, యాంధ్రదేశమునందును శిష్టకవితారచన ప్రారంభింపఁబడి యుండునుగాని, "ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠరచన"కు నన్నపార్యుఁడే గట్టిపునాదులను వేసినవాఁడని చెప్పకతప్పదు. ఈతని తరువాతికవులును, అందు ముఖ్యముగా తిక్కనార్యుఁడు నీ శిష్టకవితామార్గమునే యనుసరించినను, కేవల మాదారి నేపడిపోక తన కవితయం దాంధ్రదేశీయతాగుణము నాంధ్రజాతీయము నచ్చుపడున ట్లొనర్చి యసమానంబులగు తనకళా ప్రతిభలను వెలయించి, స్వతంత్రమగు నాంధ్రకవిత బీజములను వెదచల్లి యాంధ్రప్రబంధశాఖకు మార్గదర్శకుఁ డైనాఁడు.

తరువాతికాలమునందలి యాంధ్రకవులు నీతని మార్గములనే యనుసరించినను, ఈ వాఙ్మయముపై సంస్కృతభాషాప్రభావమునకు, ఆలంకారిక నియమముల ప్రభావమునకును దోడుగా నాయాకవుల స్వ

పాండిత్య ప్రకటనోద్యోగము ప్రబలుటచే, నీప్రబంధకవితయే తక్కిన శాఖలనన్నిటిని ద్రోసివైచి, తానై నిలచినను, మొత్తముమీఁదఁ దన సహజతాగుణమును గోలుపోయి, రానురా నొకవిధ మగు కృత్రిమ రామణీయకమును వహించి విజృంభింపసాగినదని చెప్పవలసియున్నది. ఇట్లాంధ్రప్రబంధ పరిణామము నన్నెచోడ తిక్కనాదులకాలము నుండియు నన్వేషించి తెలుసుకొనవలసియుండును. ఆంధ్ర ప్రబంధ కర్త యాంధ్రకవితా పితామహుండగు నల్లసాని పెద్దనార్యుఁడనియే తలంపఁబడుచున్నాఁడు. కాని నిజముగ నాంధ్రప్రబంధకన్యకు పితామహుఁడు పెద్దనార్యుఁడేయైనను, నంతకంటె ప్రపితామహుఁడు తిక్కనార్యుఁడు మఱియొకఁడుగలఁడని మనము ముఖ్యముగా గుర్తింపవలసియున్నది. పెద్దనార్యుని తరువాతి సాహిత్యచక్రవర్తులందఱు తాతకు తప్పులుదిద్దినట్లుగా పితామహునికవితకు మెఱుఁగువెట్ట యత్నించినట్లు కనఁబడుచున్నను, వీరు పెట్టినది తళుకుమెఱుఁగేగాని సహజకాంతికాలేదు. వీరిసాహిత్యచక్రవర్తిత్వమే యీ ప్రబంధములందు సహజకవిత సన్నగిలుటకు ముఖ్యకారణంబైనది. ఆంధ్రభాషలో సహజకవితను రుచిచూడవలెనన్న భారతకవులయొద్దకు, నందు ముఖ్యముగా తిక్కనార్యునొద్దకుఁ—బోవలసినదే. తరువాతికవులలో పలువు రాతని కవితాచ్ఛాయల ననుసరించి రచింపయత్నించిరి గాని, ఆ కవితాశిల్పము, ఆసహజగుణసంపద యేయొక్కనికిని సంపూర్ణముగా నబ్బియుండలేదు. తరువాతి యుగమునందలి కవులకు స్వపాండిత్యప్రకర్ష ప్రకటనోద్యోగము, అపూర్వకల్పనా సంయోజనమందుఁ బ్రీతి, శబ్దాడంబరమునందు లౌల్యము, ఆలంకారికనియమములందు, సాంకేతికజీవితమునం దాదరము హెచ్చుగుట తటస్థించుటంజేసి తిక్కనార్యుని సహజకవితయందు వారిదృష్టి సరిగాఁ బడలేదు. వారి యభిప్రాయములకు

సరిపడిన కొన్ని సందర్భములందు మాత్రమే తిక్కనకవిత ననుకరింప యత్నించి, ఆసందర్భము నట్లు రచించుటలో తిక్కనచూపిన యౌచిత్యపరిజ్ఞానమునైనను సరిగా గుర్తింపక యాతనివర్ణనల కింకను మెఱుఁగు పెట్టఁ దలంచినవారై తమపాండిత్య ప్రకర్షనే చూపుచు వికృతపువర్ణనలలోనికి దిగినవారైరి. భారతకథ యను మేలిమిబంగారమునఁ దన సహజకవితా చాతుర్యముచే నసమాన తేజోవిరాజమానంబులగు ప్రబంధ మణులను పొదిగి యాంధ్రవాణి కమూల్యాలంకారములను జేసినవాఁడు తిక్కన. పైబంగారముమీఁద వికృతపునగిషీపనులను విపరీతముగాఁ జేసిచూపుటచే నందు పొందుపరుపఁబడిన ప్రబంధమణుల సహజవిలాసమును, గాంతిని తగ్గించినవారు తరువాతి ప్రబంధకవులు. పురాణప్రబంధయుగముల మధ్యనున్న శ్రీనాథయుగ మొకసంధియుగమని యింతకుఁ బూర్వమే చెప్పియున్నాను. ప్రబంధావతారమార్గము నన్వేషించి తెలిసికొనవలె నన్నచో నీసంధియుగమందలి కవులు పూర్వయుగము నందలి పురాణకవితలో నిమిడియున్న ప్రబంధచ్ఛాయలను పైకిఁదీసి, వీనికి సంస్కృతమహాకావ్య విశేషముల నింకనుజేర్చి, తమపాండిత్య ప్రకర్షను జూపుకొనుచు, నెట్లు క్రమముగాఁ బూర్వయుగమందలి పురాణకవితను, సంస్కృతకావ్యమునకును భిన్నమయ్యును, వానియంశములనుమాత్రము కొన్నిటినిగ్రహించి యొకప్రత్యేక స్వతంత్రస్వరూపమును బడసిన యాంధ్రప్రబంధముగాఁ బరిణతి నొందించినారో పరిశీలింపవలసియుండును. ప్రబంధస్వరూపనిర్మాణము (Form construction) విషయమునఁ దరువాతికవుల సాధన కొంత తోడ్పడినను, ప్రబంధలక్షణములలో నుత్తమలక్షణము లనేకములు తిక్కనార్యుని కవితయందే కానవచ్చుటంజేసి యాతనికవితయే యాంధ్రప్రబంధమునకు మూలము—పుట్టుకస్థానము నని చెప్పదగియున్నది.

తిక్కనార్యుఁడు సంస్కృతమూలమునందలి కథనే తెలుఁగున రచించుచున్నను, ఈవిరాటపర్వమున నొకవిధముగ ప్రబంధైక్యమును సమకూర్చుట కెట్లు ప్రయత్నించెనో యిదివరకే కొంత చెప్పియున్నాను. ఆంధ్రప్రబంధమున కితఁడే దారిచూపెననుటకుఁ దగిన మఱికొన్ని నిదర్శనముల సూచించి విడిచెదను. సంస్కృతమూలమునఁ గానరాక, యీతఁడు స్వయముగాఁ జేర్చినవలసిన విషయము లనేకములు ప్రబంధఫక్కికి మూలములైనవి. అందు తిక్కన దేశాభిమానమును వ్యక్తపఱచు దేశీయాచారవర్ణనలును గలవు. విరాటపర్వ మొక ప్రబంధమనుటకు దగిన యీక్రిందిసామాన్య ప్రబంధలక్షణములను, సందర్భములను గొన్నిటిని గమనింపుఁడు.

ఇష్టదేవతాస్తుతి, తానురచింపఁబోవు కృతినిగూర్చిన వితర్కము, కృతిప్రశంస, కృతిపతినిగూర్చిన యాలోచన, (ప్రబంధమందలి కథినాథుఁడు) స్వప్నము, కృతిపతితనకుఁ గృతినిమ్మని యడుగుట ప్రతిజ్ఞ, షష్ఠ్యంతములు, కృతిపతిసంబోధనము, వస్తునిర్దేశము, (మహితసము జ్వాలాకృతులు), విరాటపురప్రవేశము, కృతిపతిసంబోధనము, ఆశ్వాసాంత గద్యము. రెండవయాశ్వాసమున భీముని మల్లయుద్ధవర్ణనము, కీచకుఁడు ద్రౌపదిని చూచుట, మోహించుట, ద్రౌపదీకీచకుల సంభాషణము, సుదేష్ణసహాయము, కీచకుఁడు మోహమునఁ బరితపించుట. కీచకునిశృంగారవిలాసవర్ణనము, ద్రౌపదినిఁ బట్టుకొనఁబోవుట, తన్నుట, ద్రౌపది భీమునితోఁ దనభంగపాటు చెప్పుకొనుట, వరూథిని భంగపాటు, ప్రభాతకాలవర్ణనము, సూర్యోదయవర్ణనము, కీచకునితమకము, కీచకునివిరహతాపము, ఉద్యానవనవిహారము, చంద్రకాంతతల్పముచేరుట, శిశిరోపచారములు, సూర్యాస్తమయవర్ణనము, తమోవర్ణనము, నర్తనాగారప్రవేశము, కీచకవధ, కృతిపతి సంబోధనము, ఆశ్వాసాంత గద్యము,

మూడవయాశ్వాసమున నుపకీచకులవధ, దుర్యోధనుఁ డీవృత్తాంతమును వినుట, దానిఫలము, దక్షిణగోగ్రహణము, ఉత్తరగోగ్రహణము, యుద్ధము, పాండవులు విరటునకుఁ గ మ్మెఱింగించుకొనుట, విరటు డుత్తరను దోడి తెచ్చుట, లగ్ననిరూపణము, వివాహము, తరలి వచ్చుట, వివాహవిధులు, తెర యెత్తుట, తలంబ్రాలు, అరణ మిచ్చుట.— ఈ విషయములను దరువాతి ప్రబంధకథాభాగములతోఁ బోల్చి చూచిన, కథాస్వరూపమున నెట్టిభేద మున్నను వర్ణనావిషయములందు విశేషముగా ప్రబంధచ్ఛాయలు కనఁబడకపోవు. ఈ వర్ణనాంశములలో మూలములో లేని దేశీయాచారములకు సంబంధించిన యనేకవిధములగు విశేషములను స్వయముగా తిక్కనార్యుఁడు తెచ్చిపెట్టి, యీ భాషాంతరీకృతగ్రంథముపై నాంధ్రతాముద్రఁ దగిలించి యాంధ్రకవితా ప్రపంచమున వసలి వేసినాఁడు. మూలకథపై నీతఁడాంధ్రతాముద్రను వేసిన రీతినిబట్టియే యీతని కళాచాతుర్యము, ప్రతిభామహత్త్వము వెల్లడి యగుచున్నవి. కావున నీతఁడు స్వయముగాఁ దెచ్చిపెట్టిన విశేషములను, వాని కావ్యసందర్భములఁ గల పొందికను గూర్చి యించుక తెలిసికొందముగాక.

విరటుని కొలువులో పాండవులు ప్రవేశించి తాము మెలంగు రీతులను సంప్రతించుకొను సందర్భమున నకులసహదేవు లశ్వశిక్షణ గోపాలనములఁగూర్చి చెప్పిన సీసపద్యములయర్థ మేమియు మూలమునఁ గానఁబడదు.

“గోడిగజాతిలోఁ గొదమపెంటుల నేర్చి
మావుల హత్తించు మార్దవంబు”

ఇత్యాది సీసపద్యము తిక్కనార్యుని యశ్వశాస్త్రపరిజ్ఞానమును జాటుచున్నదే కాని మూలమునుండి గ్రహింపఁబడినది కాదు. తరువాత విరటునియొద్ద చెప్పిన

"అన్వయవలక్షణం బాయుః ప్రమాణంబు
గన్ధంబు లింగితాకారములును"

అను పద్యమునఁగూడ మూలమున లేని విశేషములఁ దెలిపి యశ్వశిక్షా
మతోడఁ దనకుఁ గల సన్నిహితపరిచయమును తిక్కన సూచించినవాఁ
డవలెనున్నాఁడు.

"అశ్వానాం ప్రకృతిమ్ వేద్మి వినయం చాపి సర్వశః,
దుష్టానాం ప్రతిపత్తించ కృత్స్నంచైవ చికిత్సితం.
న కాతరం స్యా న్మమ వాజివాహనం
న మే స్తి దుష్టా బడబా కుతో హయః."

ఇంతమాత్రమే సంస్కృతమూలమునఁ గలదు. సహదేవుఁడు తనకుఁ గీలారి
తనమునఁ గల ప్రావీణ్యమునుగూర్చి చెప్పుచు ధర్మజుని చింతఁ బాపుట
కుఁగా పలికిన

"పంజలనైనను పల నేర్పడఁగ నొక
భంగిఁ జేపఁగఁ జేసి పాఁడిగొనఁగ"

అనుపద్యమునకు మూలమున సరియగు శ్లోకము లేమియు లేవు. ఇఁక
విరటునియొద్ద మాత్ర మిట్లు పలికిన ట్లున్నది:—

"వృషభానపి జానామి రాజన్ పూజితలక్షణాన్,
యేషాం మూత్ర ముపాఘ్రాయ అపి వంధ్యా ప్రసూయతే."

తెలుఁగులో నిచ్చట మూలములోని విషయములుకొన్ని గానవచ్చుచు
న్నను గోవులకు సంబంధించిన రోగములనుగూర్చి తిక్కనయించుక
పెంచినాడు.

"నాచేతం గ్రేపులు పురాణించుటంజేసి కొండొకకాలంబు నీ
కడుపులం బెనుతు నేనగునని కైకొనిన నాఁబోతుపంచితంబు మూర్కొని

నఁబై గాలివీచినను గొడ్డునకైనను జాలునిలుచు నుంగిడి యదురుఁ డ్రెక్క యనువానికి నా పేరు చెప్పినం జాలు మఱియుఁ బసికివలయు తెఱఁగు నెల్ల నెఱుఁగుదు,”

దీనివలన తిక్కనార్యుని పశుశాస్త్ర పరిజ్ఞానము, లేదా వస్తు పరిశీలనాశక్తి వ్యక్తమగుచున్నదని చెప్పవలసియున్నది. నుంగిడి, యదురు, డ్రెక్క మొదలైన రోగములను సూచించుపదములను, వాని చికిత్సావిధానములను, ఆంధ్రదేశమున పరిపాటిలో నున్నవానిని గ్రహించి సందర్భానుకూలముగా మూలమును పెంచినాఁడు.

విరటుఁడుత్తరను బృహన్నలకు నర్తనమునకై యప్పగించు సందర్భమునఁగూడ దేశీయాచారములను విశేషముగా వర్ణించియుండుట నిదివఱకే చూచియున్నాము. ఉన్నత రాజవంశమునందలి కన్యకకుఁ దగిన ప్రవర్తన మీ యుత్తరయెడల చూపినాఁడు తిక్కన. విరటుఁడు తనగాదిలికూఁతు సముచితరీతి నుపలాలించి బృహన్నల దెసం గనుంగొని సాదరదరహసిత రుచిరాననుండై యిమ్మగువ నీకు నాట గఱపందగు పాత్రం బగునే యని యడిగి కర్పూరసహితంబగు తాంబూలంబు వెట్టి, చిత్రంబులగు చీనాంబరంబు లిచ్చి, మణిమయంబులగు నాభరణంబు లొసఁగి సంభావించెనట. ఈయాచారములు దేశీయములే గాని మూలగ్రంథములోనివి కావు. ఇంతేకాక కూఁతు నప్పగించు విధనము “ఇక్కన్నియ నెచ్చెలులతోడ నాడమరిగినయది గాని యింతక మున్నిచ్చేడియ శిక్ష యెఱుఁగదు సుమ్మీ... నెలఁత కేఁడుగడయు నీవక పె” అని యుచితంబుగాఁ బలుకుటయు నంగనహస్తముఁ బట్టి తత్కరంబ నఁగడియించుటయు,-

“ఎల్లచుట్టములును దల్లియుఁ దోడును
జెలియుఁ బరిజనంబుఁ జెలువనీకు గురువ”

యని కూతునకు బుద్ధులు సెప్పి యామె గురువునెడల వర్తించుకొను రీతి దెలుపుచు నయ్యిరువుర నొండొరుల కప్పగించుట—ఇది యంతయు తిక్కనార్యుఁడు కల్పించినదే.

భీముని మల్లయుద్ధమును వర్ణించు సందర్భమునఁగూడ తిక్కనార్యుఁడాంధ్రదేశమున తనకాలమందలి మల్లులు పట్టు కుస్తీపట్టులను వర్ణించియుండుటను గమనించియే యున్నాము. ఇక్కడనే కాదు, కీచకుని జంపుసందర్భమునఁగూడ భీముఁడు తన మల్లయుద్ధ నైపుణ్యమును జూపినాఁడు. అక్కడకూడ వీరి కుస్తీపట్లను తిక్కన యొక్క సీసపద్యమున వర్ణించినాఁడు. వివాహ సందర్భమునఁగూడ తిక్కనార్యుఁడు విశేషముగ దేశీయాచారములను పనిపట్టి వర్ణించియున్నాఁడు. ఉత్తరా వివాహసందర్భమున పాండవులు ప్రకాశులై యుపప్లావ్యమున వసియించియుండఁగా వీరినిఁ జూచుటకుఁగా ముందు బలదేవాదులు వచ్చిరి. అప్పుడు హరి లలితమణివిభూషణములు, రుచిరాంబరములు మొదటఁ గుంతీపుత్రుల కెల్ల నిచ్చి పిదప ద్రుపదజ కిచ్చెనఁట. పిదప బహుదేశముల బంధుమిత్రవర్గములు రెండు దెఱంగుల చుట్టంబులునైన భూపతులు పెండ్లికి వచ్చినారు. విరటుఁడు పురంబున నుత్సవంబు సాటించినాఁడు. అంత,

"కలువడములు మణితోరణ
ములు గట్టిరి క్రముకకాండ మోచాస్తంభం
బులు నాఁటిరి కుంకుమమునఁ
గలయ నలికి ముగ్గు లిడిరి కర్పూరమునన్."

మత్స్యవిభుఁడు నుజ్జ్వలలీల వహించి భూమిదేవానయనాదికృత్యపరులైన జనంబుల గారవించుచుండెను.

"ఉత్తర నలంకరింప ను
దాత్తాభరణాదివస్తు తతి యొసఁగి నరేం
ద్రోత్తముఁడు నేర్పుగల చెలి
కత్తియలం బుచ్చెఁ బ్రీతి గడలుకొనంగన్."

తాను వైవాహికవర్తన సంవిధాన సావధానుండై లగ్నం బా సన్నంబగుచు వచ్చెనని ధర్మతనయున కెఱింగింపం బనిచెను. ఆతఁడు బంధుజనులఁ గూర్చుకొని యభిమన్యునకు శృంగారంబు సేయించి భద్ర గజారూఢుం జేసికొని తరలివచ్చెను. ఆ సమయమున యోగ్యవస్తువుల విస్తరిల్లిన క్రంత నడిచినది. విరటుని మందిరమునకు వరుఁ డేతేర వారలు శంఖ జయఘంటా పణవాది నిక్వాణంబులతోడ నెదుర్కొని సేసలు చల్లిరి (ఎదురుసన్నాహము). విరటుఁడు సంభ్రమమున నింటి యొద్ద పూజాపరుఁడై యుండెను. అనంతరము తెరయొద్ద కృష్ణ యుధి ష్ఠిర పార్థ మత్స్యవరు లవ్వధూవరులను నిలిపిరి. తెర యెత్తిరి. అమ్మా నినియుఁ, గుమారుఁడు నన్యోన్యావలోకనము సేసిరి. పిదపఁ దలంబ్రాలు; పాణిగ్రహణము; వధూవరు లేకాసనమున నుండుట; హోమసమయ కృత్యములు; వివాహమైన పిదప మత్స్యమహీనాథుండు మణిభూష ణాదులు పళ్లెరంబులఁబచరించి పాండవులకు వాసుదేవ పురస్సరంబుగా గట్ట నిచ్చుట; బంధువుల కర్హసత్కారంబులు; సౌభద్రున కరణం బిచ్చుట; యీ మొదలగు వైవాహికాచారముల విశేష వర్ణనమం తయు తిక్కన స్వయముగాఁ దెచ్చి పెట్టినదే. మూలములో

"ప్రతిగృహ్యచ తాం పార్థః పురస్కృత్య జనార్దనమ్,
వివాహం కారయామాస సౌభద్రస్య మహాత్మనః;
కృతే వివాహే తు తదా ధర్మపుత్రో యుధిష్ఠిరః,
బ్రాహ్మణేభ్యో దదౌ విత్తం యదుపాహర దచ్యుతః."

అని వివాహమంతయు రెండుముక్కలలో నెగురఁగొట్టి వేయఁబడి యున్నది. ఈ వివాహసమయ సముదాచారముల నన్నిటిని తిక్క-నార్యుఁ డెంతయో స్వాభావికముగా వర్ణించి తరువాతి ప్రబంధకవులకు మార్గదర్శకుఁ డయ్యెను

## తిక్కనార్యుని వర్ణనలు

తిక్కనార్యుని వర్ణన లన్నియు సహజగుణశోభితములు గాని కృత్రిమభావగర్భితములు కావు. స్వాభావికములు, సందర్భానుకూలములు నై యుండునే కాని సాంకేతికములును (conventional), పాండిత్య ప్రకర్షను జాటునవియు నై సమయము దొరకినది గదా యని చేయఁబడినవిగా నుండవు. మఱియొకవిశేష మేమనఁగా, వర్ణనలుకూడ కథాగమనమునే సూచించుచుండును గాని వర్ణనలకొఱకుఁగా కథ ఆఁగి పోయినట్లు కనఁబడదు. కథావేగమున నావర్ణన మధ్యవచ్చినను, అందలి వర్ణితాంశములు స్ఫుటముగ మనకనులయెదుట గోచరించినట్లయి మనదృష్టి యావర్ణిత వస్తుస్వరూపముచే నాకర్షింపఁబడునే కాని వర్ణనపద్ధతిపై బ్రసరింపదు. భావస్ఫురణము వెంటనే కలుగక యావర్ణన శ్లేషార్థములతోడను, గూఢభావములతోడను నిండినదై భావవేగమునకు లేదా కథాగమనమునకు నడ్డుతగిలినపుడే మనదృష్టి యావర్ణన యొక్క బాహ్యరూపంబగు రచనాశైలీచమత్కారములందుఁ దగులొక్కొనును. తిక్కనార్యుని వర్ణనలలో ననేకములు తరువాతి ప్రబంధవర్ణనలకు మార్గదర్శకము లైనవని చెప్పవలసియున్నను, అతని భావసౌందర్యము మనల నాకర్షించినట్లు భాషాసౌందర్యము మనమనముల ముందుగా నాకర్షింపదు. ఈ రెంటికి నట్టి సూక్ష్మమైన పొందిక గల్పించుటలో నీతని చాతుర్యం బప్రతిమానము. శమీవృక్షవర్ణనముఁ గూర్చి యింతకు పూర్వముననే చెప్పఁబడినది. ఇక్కడ దాని భీకర

రూపమును మనకనులయెదుటఁ బెట్టుటయే యాతని ముఖ్యోద్దేశము. ఎందుకనఁగా, పాండవులు వారియమ్ములు పెట్టుట కనువై యితరులు చెంతఁ జేరరానిదై యుండవలయును. ఇతరు లెక్కుటకు వీలు లేనిదై భయమును గొల్పునది గావలయును. ఆయుధము లితరులకుఁ గనఁబడకుండ దట్టమైన జొంపములు కలదై యుండవలయును. దానిపైఁ బెట్టినఁ దను యాయుధముల నెవరైన గుర్తించి పైకి లాగుదురేమో యనుదిగులు లేకుండ పాండవులు యథేచ్ఛనుండుట కనువైనదై యుండవలెను. ఇట్టి లక్షణములు కలదని చెప్పుటయే తిక్కన చేసిన వర్ణనయొక్క ఫలము. దాని స్వరూపమును సీసపాదములలోఁ చక్కఁగా వర్ణించి, అట్టిదానిని చూచిన వారికిఁ గలుగు భావమును సీసగీతికలో పటుదీర్ఘసమాసములలో వర్ణించి చెప్పినాఁడు. ఈ వర్ణనకొఱకుగా కథ యించుకంతైన నాఁగినదేమో చూడుఁడు. ఆ సందర్భ మెంతపొందిక గలదై యున్నదో. ధర్మజుఁడు తక్కిన యస్త్రములమాట యెట్లున్నను, గాండివము మనతోఁ గొనిపోయినచో నగపాటు నిశ్చయము గావున దీని నెచ్చటనైనను పెట్టి చనవలయునని చెప్పినాఁడు. తీసికొని చనుట విషయములోఁగాని, యొకచో బెట్టి చనుటలోఁగాని తక్కిన యన్నివిండ్లు నొకయెత్తును, గాండివ మొకయెత్తు నైనది. ఏలయనఁగా, "నది పెనుబాము చందమున నెంతయు భీషణమై జనంబులఁ బెదరఁగఁజేయు"ను. అట్లగుటఁ బెట్టి చనవలయునని, దానిని దాయుటకు హృదయ మియ్యకొనం జొరకున్నను, కిరీటి యెట్లో యూరియాడు చిత్తంబు నుత్తలం బుడిపికొని, అట్టి భీకరంబగు నాయుధమును బెట్టుటకు యోగ్యస్థలనిరూపణంబు సేయ నలుదిక్కులం బరికించెనఁట. ఆ సమయమున ప్రేతభూమి పరిసరారణ్యంబునఁ దన యుద్దేశమునకుఁ దగిన అఖిలభుజగచండమూర్తి శమీతరుచక్రవర్తి నాతఁ

డు గనియెను. అట్టి చెట్టాతనికిఁ గనఁబడియెనని చెప్పనేగాని తానుగా నాచెట్టు వర్ణించుటకు దొరఁకొనలేదు. తాను గనుఁగొనిన యావృక్షము తనుపని కుపయోగించునని ధర్మజునికి నచ్చఁజెప్పువాఁడువలెనే దాని భీకరాకారము నాతనికి

"పక్షివ్యాకులమును బరేతనిలయప్రాంతోత్థముక్తాడాకినీ
రక్షోభూతపిశాచగోచరము దుర్గంధంబునై చూడఁ జి
త్తక్షోభం బొనరించున ట్లగుటఁ జెంతం జేరరా దీ శమీ
వృక్షం బెవ్వరి కిందుఁ బెట్టుదమె పృథ్వీనాథ శస్త్రాస్త్రముల్."

తాను చూచినరీతియంతయు నాతనికిఁ జెప్పి యాతని నొప్పింపవలయుఁ గదా;—కావున,

"పెనుబోడవుఁ బఱపు జొంప
మ్మును గలయది దీన నెల్ల పురుషులకుఁ బ్రయో
జన మొకఁడు లేదు నేరం
జనఁ జూడఁగ నరయ నెక్క నమకట్టంగన్."

అనిచెప్పి 'కావున దీనియం దిడుట కార్యము' అని తననిశ్చయమును దెలిపెను. చిత్తక్షోభం బొనరింపఁగల యా శమీవృక్షముయొక్క భీకరాకారంబును వర్ణించుటకు తిక్కనార్యుఁడు శార్దూలవృత్తమును గ్రహించి క్షకారప్రాస ముంచుటలోఁ గల యౌచిత్యగుణమును గమనించి యానందింపుఁడు.

భీమునియొక్కయు, కీచకునియొక్కయు నర్తనాగారప్రవేశ సందర్భమునను, భీముఁడు విరటుని కొలువుఁ జేరి యాతనితో స్వవిషయమును జెప్పుకొనఁ గడంగినపుడును

"దేవా నాలవ జాతివాఁడ నిను నర్థిం గొల్వఁగా వచ్చితిన్"

ద్రౌపది కీచకునితోఁ బరుషవాక్యములను బలుకునపుడును

"దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్"

కావ్యాదిని కృష్ణద్వైపాయనుని మహిమాతిశయమును, భారతము యొక్క గొప్పతనమును సూచించుసందర్భమునను గూడ తిక్కనార్యుఁ డీవృత్తమునే యవలంబించినాఁడు. ఉదాత్తత, గాంభీర్యము సూచించుటకైన సంవర్భము లివి. మితిమీరినయుత్సాహము, ఔద్ధత్యమును జూపుటకుఁగూడ నీతఁ డీవృత్తమునే చేపట్టెననుటకు భీముఁడు కీచకుని జంపినపిదపఁ దన ప్రియురాలికోర్కె నెఱవేర్చితిఁగదా యను నుత్సాహమును సూచించుటకుఁగాఁ బల్కిన

"చింతాశల్యము వాసెనే రిపు భయోత్సేకంబు చల్లారెనే"

యనుపద్యమును, సుశర్మ దక్షిణ గోగ్రహణంబు చేసి కదుపులఁ గార్చిచ్చు చందంబునం బొదివి నిలిచినపుడు గోపాలకులు వారితో పోరుటను వర్ణించుసందర్భమున రచించిన శార్దూలవృత్తమును నిదర్శనము లగుచున్నవి.

"కూడం బాటి సముద్ధతిం గడఁగి తద్గోపాలకుల్ మూఁక ల
ల్లాడందాఁకి" etc.

సుశర్మపై విరటుని "రణోచితోద్యమముయొక్క పటిమను సూచించుటకుఁగా శార్దూలవృత్తమే గ్రహింపఁబడినది.

ఇట్లే తిక్కనార్యుఁ డాయా సందర్భములకు, ఆయాపాత్రల గుణశీలాదులకు, వారి సంభాషణవైఖరికిఁ దగినట్లుగను, తత్తద్రసానుకూలముగను వృత్తసంగ్రహణము చేయుచుండినట్లు కనిపెట్టవచ్చును.

ఇంతేగాక యీ తిక్కనార్యుని రచనలో భావము, భాష, శైలి, ఛందఃపరికరములు నొండొంటితో చక్కని పొందికగలవై కథాంశ మును నడిపించుచుండును నే గాని వీనిలో నేయొక్కటియు తానై బయటపడదు.

"తదనీకం మహ త్తేషాం వి స్తృతం సాగరోపమమ్,
సర్వమాణమి వాకాశే వనం బహుళపాదపమ్."

అను మూలశ్లోకములోని యుత్తరార్థమునందలి యర్థమును, లేదా ఉపమానమును గ్రహించి విస్తరించినాఁడు.

"అభినవజలధరశ్యామంబు లగునెడ
లాసజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపమచ్ఛాయంబు లగుపట్లు
కిసలయోత్కరములఁ గ్రేణిసేయ
రాజమరాళగౌరంబులై తగుచోట్లు
దఱుచుఁ బూఁబొదల చందఁబునొంద
హరిద్రరుచి సమానాకృతులగు తావు
లడరెడు పుష్పాదు లట్లు మెఱయఁ
గలయ నెగసి ధరాధూళిలలితవనము
దివికినలిఁగా పువోయెడు తెఱఁగుదాల్ప
గోగణము ముంగలిగ నేల గోడివడఁగ
నడచు కౌరవ రాజసైన్యంబుఁగనియె."

అర్జునుఁడు యుద్ధప్రారంభమునకు ముందుగాఁ గ్రోశద్వయమా త్రంబునఁగూడ ముట్టిన కురుబలంబును వర్ణించు సందర్భమునఁగూడ తిక్కనార్యుఁడు 'నడచు కౌరవరాజ సైన్యంబుఁగనియె' ననియే

చెప్పియున్నాఁడు. రెండుమైళ్ల దూరముననుండి వచ్చుచున్న యాతని రాక నీకురుసైన్యం బెట్లు గ్రహించినదో యతిస్వాభావికముగాఁ జూపినాఁడు: మొదట దూరముననున్న యప్పుడు

"దేవదత్తాఖిలరావంబు వెసఁగర్ణ
ములు దీటుకొన లేట మొగమువడుచు"

అనంతరము

"రథనేమిదళిత ధరాధూళియంగంబు
లెల్లఁగప్పఁగ వెలవెల్లనగుచు"

అంతకంటె సమీపించినపుడు:

"బహుళ కపిధ్వజప్రభలు లోచనములు
మిఱుమిట్లుగొనఁ బర్వ మెండుకొనుచు"

ఇంకను సమీపించినపుడు:

"ఉద్భటాకార సముదగ్ర మనము లు
త్తలపాటు దోఁపంగఁ దల్లడిలఁచు."

నడచు కౌరవరాజసైన్యంబు గదిసె
దీగదిగినగతిఁ దనతేరు మెఱయ
రయముమైఁ జని ప్రళయ భైరవసహస్ర
గర్జనోదగ్రతర్జనుం డర్జునుండు."

తీగదిగినగతి దనతేరు మెఱయ రయముమై యర్జునుడువచ్చుట, కౌరవ రాజసైన్యంబులు నడచుచుండుట, దూరమునుండి వచ్చునాతని రథవేగము, (వేగముగ వచ్చుటచేతనే రథనేమిదళిత ధరాధూళి పైకెగసి ముందరనడచుసైన్యంబుఁ గప్పినది) క్రమక్రమముగా నతిస్వల్పకాలముననే యాతనిరాక యీసైన్యమునకుఁ దెలియవచ్చిన రీతి, ఆరాక

యొక్క యొక్కొక చిహ్నమునే చూచుచుండుటచే, వీరి మనోవృత్తులయందుఁ గలిగినమార్పు - (మొదట లేటమొగమువడుట, పిదప వెల్లవెల్లనగుట ఆమీఁద నుత్తలపాటుచేఁ దల్లడిల్లుట) - క్రమముగా నెంత స్వాభావికముగా, నత్యద్భుతంబుగ సూచింపఁబడినవో పరికింపుఁడు. శాకుంతలమున వాయుమార్గమునఁ బోవుచున్న దుష్యంతుని రథయానమును వర్ణించిన కాళిదాసు ప్రతిభను దలపించుచున్నదీ వర్ణనము.

## ప్రకృతివర్ణనలు

తిక్కనార్యుఁడు మూలమునలేని ప్రకృతివర్ణనలను పలుచోట్లఁ దెచ్చిపెట్టినాఁడు. అవి యాయా కథాసందర్భముల కత్యంతానుకూలములై కథాప్రవృత్తికిఁ దోడుపడుచు, కథాగమనముయొక్క కాలవైఖరిని సూచించుచుండును. మఱియు నాయాపాత్రలయవస్థలతో ప్రకృతి తనసానుభూతిని దెలుపుచున్నదా యన్నట్లుండును ద్రుపదనందన పరిభవదుఃఖమున దురపిల్లుచున్నదా యన్నట్లు ప్రభాతంబయ్యెనట.

> "ద్రుపదనందన పరిభవ దుఃఖమునకు
> నుల్లమున దురపిల్లుచు నున్న సరసి
> వేఁడి నిట్టూర్పులో యన వెడలెఁ గ్రొత్త
> తావి మూఁతులువచ్చు నెత్తమ్మివిరుల."

ఉద్యోగపర్వమునఁగూడ నిట్లే "తనకులమునఁ బుట్టిన ధార్తరాష్ట్రులన్నదమ్ములతో విగ్రహించినందులకు వివర్ణుఁడై చంద్రుఁడు కందిపోయెనని వర్ణించినాఁడు. ఈ ప్రభాతకాలవర్ణనవిషయమున తిక్కన కొంతవఱకు సంస్కృతకావ్యాలంకారిక ఫక్కిననుసరించి, తరువాతి ప్రబంధ

ధోరణికి మార్గదర్శకుఁడై నాఁడు. ఇక్కడ యీతఁడు సాంకేతిక భావ యోజనము నలంకార ప్రయోగమును గొంత యవలంబించినవాఁడైనను స్వాభావికతను సంపూర్ణముగా వీడలేదు. ఈతని ప్రకృతి వర్ణనము గూడ శృంగార భావగర్భితమె. తరుణులు, పతులు గేళి సల్పుటనొక సీసపద్యమున నతిమనోజ్ఞంబుగ వర్ణించి, పిదప నంబరతలంబును వర్ణించుచు నీపై శృంగారవర్ణనతో దాని నెట్లు రమ్యముగాఁ గలిపివేసి నాఁడో చూడుఁడు: ఆ సతీపతుల కేళీ సమయమున

"రాలియున్న పుష్పప్రకరము విదిర్చి
చెన్నుగా నున్న సేసిన సెజ్జయనఁగ
వేగుటయు జుక్కలన్నియు విరిసి విశద
భాతిఁ జెలువొందెఁ జూడ నంబరతలంబు."

తరువాతి గద్యలోఁ గూడ నీతఁడు వర్ణించిన విషయములు ప్రాచీన గీర్వాణవాఙ్మయపద్ధతినే యనుసరించియున్నవి సరోవరములు, భూరుహములు, లతామంటపములు, కుముదవనంబులు, దీపంబులు, విటజన లలనాలోకనంబులు మొదలగునవియె వర్ణింపఁబడినవి. తరువాత నొక సీసపద్యములో ప్రబంధఫక్కిని రచింపఁబడిన యుత్ప్రేక్షలతో సూర్యోదయ వర్ణనము చేయఁబడినది. విశేషమేమనఁగా నిచ్చటఁ గూడ తన యద్వైతభావమును వ్యక్తముచేయక విడువలేదు.

"హరి హర బ్రహ్మమహోను భావంబు లొ
క్కటిగాఁగఁ గరఁగిన గట్టి యనగ
అతుల వేదత్రయ లతికాచయము పెను
పొందఁ బుట్టెడు మూలకందమనఁగ"

ఈసవితృదేవత త్రిమూర్తిస్వరూపమే యని ఘోషించుచున్న వాఁడువలె నున్నాఁడు. క్రుంకింపరాని సౌన్దరసియరసి తెల్లవడుసూ

తుహృదయపద్మం బలర దివసనాథుఁడే క్రుంకిపోగాఁ దానువర్ణనలతోఁ గాలయాపనము చేయుట తగదనికాఁబోలు నిచ్చట కవి సూర్యాస్తమయవర్ణనమును మాత్రము ప్రభాతవర్ణనవలెఁబొడిగించక రెండుమూఁడు పద్యములతో ముగించినాఁడు. దక్షిణ గోగ్రహణానంతరమునఁ బోలికలని వర్ణనముగూడ "బ్రోవులుగొనియున్న ప్రేవులవలన లావుగలయంచపిండు", "నఱిముఱింబెఱికిన గుఱుకులుగట్టిన మృణాళనాళంబులు" అనునిట్టియను ప్రాసగుంభితంబై ప్రబంధధోరణికి మార్గదర్శకంబైయున్నది. అట్లయ్యును వర్ణితాంశము, దృశ్యము, మనకుస్పష్టముగ గోచరించుచునే యుండును. శబ్దాడంబరమున నాదృశ్యము మఱుగుపడియుండదు. తిక్కనార్యుని సూర్యోదయవర్ణన మొకవిధమగుభక్తిభావోన్నత్యము (elevated feelings) కలుగఁజేయుచున్నదివలెనున్నది. ఆతని తమోవర్ణనమెంత స్వాభావికంబై యాదృశ్యమును మనకనుభవమునకుఁ దెచ్చుచున్నదో పరికింపుఁడు.

పెనుమిట్టిది పల్లంబిది
యనకుండఁ నోలమును బయలునొక్కటిగాఁ
గనువిచ్చుటయును మోడ్చుట
యును సరిగాఁ దమము పర్వె నుర్విం దోడ్తోన్.

నన్నపార్యుఁడు నిట్టిరచనల నతిరమ్యముగాఁ జేసియున్నాఁడు. వర్షాకాలవర్ణనమున

"ఘనతర దర్పతమంబో కా
యనఁగ ఘనాఘనతమిస్ర మవిరళమై క
ప్పినజనులకు వస్తువి భా
వన మొక్కొకమాటు గలిగె వైద్యుతరుచులన్.

కాని ప్రకృతివర్ణనలలోని భావబలము, కల్పనాచాతుర్యము నెన్నవల
సివచ్చినపుడు ప్రాచీనకవులలో నన్నెచోడునిచెప్పి మఱియొకరిని
చెప్పవలసినదే.

తిక్కనార్యుఁడీప్రకృతి వర్ణనల మూలముగా నానాదేశకాల
స్థితిగతులను సూచించుచుఁ గాలనియమమును బాటించుటలో నెంత
జాగరూకుఁడై యుండెనో యించుక తెలుపవలసియున్నది. కీచకుఁ
డప్పను మ్రొక్కుటకై పూర్వాహ్ణమునవచ్చి యామె యింట ద్రౌపదిని
జూచినాఁడు; కామించినాఁడు. ఎమ్మెయినైనను కొమ్మ నలవరించి
కూర్పఁదలంచిన సుదేష్ణ "ఆసవమునకని నీదు ని, వాసమునకు దినములో
నవశ్యంబును నే నాసుదతింబుత్తెంతు"నని చెప్పి పంపినది. ద్రౌపదియు
సుదేష్ణ మందిరంబువెడలి దినకరుం గనుంగొని కేలుమొగిచినది. పిదప కీచ
కునిచేఁ బరాభూతయై సింహబలుని జయింప ననిలతనయు బాహుబలంబ
మాడఁ దగునని యూహించి రాత్రిసమయంబగుట సమస్తజనంబులు
నిద్రింపఁ దొడంగిన పిదప శయ్యాతలంబువిడిచి మహానసంబున సుప్తుఁ
డైన వృకోదరుకడకుం జనినది. అంత రాత్రియైనది గనుక నే యాతఁడు
సుప్తుండై యున్నాఁడు. మందసంభాషణముల ప్రబుద్ధుఁడు కాలేదు
కాని పాణిస్పర్శనము కలుగుటతోడనే మేల్కాంచినాఁడు. వీరి మాట
లలోఁ గాలమిట్టె కడచిపోయినది. వేకువసమయమైనది. ద్రౌపది
తిరిగి నిద్రించు నెడకుఁబోయి పర్యంతభాగంబునఁ దనువువైచి నిదురం
బొరయని కనుదోయి మోడ్చియుండెను. అనగాఁ దెల్లవారుటకు
మఱి కొంతకాలము కలదనుట. ఈసందర్భమున కనుకూలముగానే
క్రమక్రమముగా వేకువజా మెట్లుగడచి, తెల్లవారి సూర్యోదయ
మైనదో తెలుపుచు, సావకాశముగా తిక్కన ప్రభాత వర్ణనము
చేయుట కవకాశము దొరకినది. వెనుకజాముగడచి ప్రభాతంబగుటయు

కథావేగ మాఁగి పోయినదని సూచించుటకే యాతఁ డీవర్ణన నింత పొడి
గించినాఁడు. కాని యా తరువాత రాత్రి యెప్పుడగునాయని "దివము
కాని యింక భువనంబునందెటఁ బట్టి రాత్రిలేని యట్టుగాఁగఁ జేసె నొక్క
విధి" యనుచుఁ గ్రుంకింపరాని ప్రొద్దరసియరసి పొగులుచున్న కీచకుని,
తొందరపాటునకుఁ దగినట్లుగాఁ జేయుటకో యన్నట్లు తిక్కన సూర్యా
స్తమయవర్ణనమునుమాత్ర మొక్కపద్యముతో సరిపుచ్చెను. పిదపఁ
చంద్రోదయవర్ణనము చేయకయే, చక్కలను, చక్రవాకములను గూర్చి
చెప్పి జారచోరజనంబుల మనంబు లలరం జంద్రాస్తమయమయ్యెనని
చెప్పుటచేతనే, యవి శుక్లపక్షపుమధ్యదినములని సూచించినాఁడు.
ప్రకృతకథ కనుకూలమగునట్లు గాఢతమమును వర్ణించినాఁడు. అప్పుడా
కృశోదరివృకోదరుని కడకుంజని సమయమయ్యెనని చెప్పినది. ఇట్లు
కీచకవధ శుక్లపక్షపుదినములలో నర్ధరాత్రమున జరిగినది అది యష్టమో
నవమో యయియుండును. ఆ మరుసటిదినమే సుదేష్ణ ద్రౌపదినెందేనిఁ
బొమ్మనఁగా నామె "ఇంకఁ బదుమూఁడుదినంబులమాత్రకున్ భవన్మంది
రవాస మియ్యకోనినం గడతేఱుమదీయవాంఛ" అని చెప్పినది.
కావున నప్పటికజ్ఞాతవాసపుగడు వఁక 13 దినము లున్నదని తెలియు
చున్నది. అనఁగా బహుళాష్టమితోఁ జెల్లునన్నమాట. దుర్యోధనుఁడు
విరటునిపై దండెత్తుటనుగూర్చి చెప్పుచు

"బహుళాష్టమి నీతఁడు స
న్నహనముతోఁ బసులఁబట్టు నవమిని
మనగోగ్రహణము"

అని నిశ్చయించినట్లు చెప్పఁబడినది. భీష్ముఁడజ్ఞాతవాస వత్సరవ్యాప్తి
విమర్శించుచు "పదమూఁడుహాయనములు దప్పక నిన్నటితోడన

నిండె"నని చెప్పినాఁడు. కావున ద్రౌపదిచెప్పిన 13 దినముల గడువు నకును భీష్మనిర్యాణకును తిక్కన సరిపుచ్చినాఁడు. ఇంకను సంద ర్భానుకూలముగ కాలసూచన నెట్లుచేసినాఁడో చూడుఁడు. బహుళా ష్టమిదినమున సుశర్మతో విరటునిసైన్యము యుద్ధముచేయుచుం డఁగా జీకటిపడుటచే యుద్ధమాఁగిపోవునట్లును, మఱికొంతసేపటికి చం ద్రోదయంబైనట్లును వర్ణించినాఁడు. రాత్రిభాగమున చీకటిలో యుద్ధ ముజరుగదు. కావున, తనమనుమలగు పాండవులనిఁ జేతసవేక్క సేయు టాత్మఁగని, వారికోర్కె దీర్చుటకుఁగా చంద్రుఁడుదయించెనని చెప్పి, యీచంద్రికలోఁ బాండవులు యుద్ధముచేయుటను సూచించినాఁడు. యుద్ధమైనపిదపఁ బోలికలను గలయంగఁ గొనుచు వెడలి చంద్రికా సుందరంబగు నొక్క సైకతస్థలంబున నారాత్రిపుచ్చి"రని తెలుపుచు నారాత్రి చంద్రికాసుందరంబని సూచించినాఁడు. ఇట్లు భీముఁడు విర టునివిడిపించుట యర్ధరాత్రమున వెన్నెలలో జరిగినది. భీముఁడు కీచకు నిఁ జంపుట యర్ధరాత్రమున కటికచీఁకటిలో జరిగినది. కావున నిది శుక్లపక్షపు మధ్యదినములలోను, అదికృష్ణపక్షపు మధ్యదినములలోను జరిగినదనుట స్పష్టము. ద్రౌపది 13 దినములగడవును దీనితో సమన్వ యించుచున్నది. ఈకాలసూచన మూలముగా తిక్కనార్యుఁడీకథ కెట్టి రామణీయకత నాపాదించినాఁడో చూడుఁడు!

## తిక్కనార్యుని మనోవృత్తి వివరణశక్తి-నాటక కళా చాతుర్యము

తిక్కనార్యునికథ, సచలనంబై పాత్రలుసచేతనంబులై మనల నంతగా నాకర్షించుటకుఁగల కారణములలో ముఖ్యమైనవి రెండు: అతని మనోవృత్తివివరణశక్తి, నాటకకళాచాతుర్యము. వీనికిఁదగిన

ట్లుగా సహజము స్వాభావికమునగు నాతని కవితాశైలియు, జాతీయ ప్రయోగ నైపుణ్యంబును దోడుపడి యాతనికవితాసృష్టి నప్రతిమాన మైనదానినిగాఁ జేసినవి ఆయాసందర్భముల నాయాపాత్రల కృత్యము లకును, వారి బాహ్యాకారములకును, ఆంతరంగిక వృత్తులకును గలసం బంధమును, సంఘర్షణమును, వారిమనములలో దూరి చూచినట్లుగా వ్యక్తముగ బయలుపఱచుచు, వానివానికి పొందికగల్పించు చుండు టలో తిక్కనశక్తి యత్యద్భుతమైనది. ఆతని యీమనోవృత్తి విమర ణశక్తిని గనిపెట్టనిదే తిక్కనార్యుని ప్రజ్ఞావిశేషము మనకవగాహన కాదు. ఆతని కవితాకళకంతకు నిదే మూలబీజము, మూలశక్తియని చెప్పవచ్చును. దీనికి నాటకాభినయసూచనాచాతుర్యము తోడ్పడి యాతనికవికట్టి సహజరామణీయకము దెచ్చినది. తిక్కన యవతా రికావిమర్శన సందర్భముననే దీనికి నిదర్శనములు గొన్ని చూపఁబడినవి. ధర్మజుఁ డజ్ఞాతవాసమెట్లుగడుపునో యని యర్జునుఁడు, సవితర్కం బును, సవిషాదంబును, సగౌరవమునుంగా నుపలక్షించుచుఁ బలుకును. ధర్మజుఁడు బీభత్సువీక్షించి ఘూర్ణమానమానసుండగుచు నిట్లనును. నకులునిఁజూచి నెమ్మనమ్మున నమ్మలికమ్మగునగ నెలుఁగుచందంబు వేలుగా నిట్లని, ధర్మజుని సందేహమును బాపుద్రౌపది "యనాదర మందస్మిత వదనారవింద" విరటునిప్రార్థన నంగీకరింప నొల్లనిభీముఁడు "మొఱకుదండంబున మోముడ్డముగదల్చి భూవిభుఁడు సభాజనులు వినఁ బ్రస్ఫుట నిరర్గళాలాపముల నిట్లనును." భీముని స్వభావమున కీవర్ణన మెంతయుక్తమైయున్నది. తిక్కన యీసందర్భమునచేసిన యభినయ సూచన (sign of dramatication) యాతని నాటకకళాభిజ్ఞతను (power of dramatic presentation) ఎంతచక్కఁగా వ్యక్తము చేయుచున్నది! నకులునిఁజూచి విరటుఁడు "చూచితిరే చిత్తంబు నుదా-

త్తతఁగానఁ గనయ్యెడున్ వదనమునభంగిన్" అని పలుకును. చిత్తమునం దలియుదాత్తత వదనమున ప్రతిఫలించుచున్నదట. ద్రౌపది సుదేష్ణను గొలువవచ్చునపుడు

"పరిచారికాత్వ రేఖా
పరిణతి దన మేన నచ్చుపడు భావనకుం
దిరమై తలకొను నంతః
కరణముతోఁ బురము ద్రుపద కన్యక సొచ్చె"నట.

ఈద్రుపదకన్యకను జూచినతోడనే యాదరాశ్చర్య నిర్భర యగు సుదేష్ణ నెట్లు చిత్రించినాఁడో యిదివఱకే చూచియున్నాము. ఆమె ముఖవైరి ద్రౌపదిని చూచుటతోడనే యప్రయత్నముగ గడ ల్గొనిన గేలపురఃప్రసారము, తనువున నమ్రభావము దంతమరీచుల సామినిర్గమనము, నాదరాశ్చర్య సహితయగు సుదేష్ణస్వరూపమును మనయెదుట బెట్టుటయేకాక, ఆయాంతరంగికభావమప్రయత్నముగ బాహ్యావయవముల నెట్లు నలింపఁజేసి, తద్ద్వారా తన్నుతాను బ్రకటించుకొనునో వ్యక్తము చేయుచున్నవి. ఈసుదేష్ణస్థితి ద్రౌపదిరూపము యొక్కయు, గరువతనముయొక్కయు మహత్త్వమునుగూడ వెల్లడించుచున్నది.

పార్థునకు సమయభంగంబువలని భయంబు లేకుండుటను సురనదీసూనువలన నెఱిఁగి మనంబునం బ్రియంబందిన ద్రోణాచార్యుఁడు యుద్ధసన్నద్ధుఁడై వచ్చు నర్జునునిరాక నెంతగంభీరముగా శార్దూలవృత్తములో వర్ణించినాఁడో చూడుఁడు:

"సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జిత యూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చు నో

జం గాంతార నివాసఖిన్నమతి నస్మత్సేనపై పేఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్."

మఱియు, తిక్కనార్యుని వర్ణనలో నొకవిధమగు సక్రమత, యేర్పాటు గానవచ్చుచుండును. ముఖ్యముగా వర్ణనలకుఁగా గ్రహింపఁబడు సీసపద్యములలో నిది స్పష్టముగాఁ గానవగును. వర్ణనలన్నియు సామాన్యముగా సీసపద్యములలోనే చేయుచుండును. వెనుకటి శివిరావృత్తవర్ణనమందువలెనే మొదట నాలుగుపాదములలో స్వరూపమును వర్ణించి, పిదప గీతమున దానిఫలితముగాఁ గోచరించు గుణమును (effect) గంభీరమగుశైలిలో వర్ణించుటకు ద్రౌపది భీమునితో ధర్మరాజుమహిమను వర్ణించిచెప్పుసందర్భమున నీ క్రింది సీసపద్య మొక నిదర్శన మగుచున్నది:

"ఎవ్వనివాకిట నిభమదపంకంబు
  రాజభూషణరజోరాజి నడఁగు
నెవ్వనిచారిత్ర మెల్ల లోకములకు
  నొజ్జయై వినయంబు నొఱపు గఱపు
నెవ్వనికడకంట నివ్వటిల్లెడుచూడ్కి
  మానితసంపద లీనుచుండు
నెవ్వనిగుణలత లేడు వారాసుల
  కడపటికొండపైఁ గలయఁ బ్రాఁకు
నతఁడు భూరిప్రతాపమహాప్రదీప
దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి
తలుఁడు కేవలమర్త్యుఁడే ధర్మసుతుఁడు.

అర్జునుఁడు పేడిరూపమున విరటుఁ గొల్వవచ్చునప్పు డాతని వికృతమయ్యును ప్రకాశించుచున్న వింతరూపమును మొదట నాలుగు సీసపద్యపాదములలో

"కాళ్ల యొప్పిద మాఁడు కట్టనుజ్జ్వలము చే
యంగ సంకులబాహు లంద మెడలఁ
గంమక మంగంబుకాంతికి మాటుగా
మెడ హేమపట్టిక మెఱయుచుండ
వదనంబుకోమరు భావనసేసి వేఱ గ
నుదుటిపెం పలకలఁ బొదుగఁబడఁగఁ
బవడంపుజోత్తులఁ జెవులరూ పడఁగంగఁ
బాపట తలకట్టుభంగి గప్ప"

అని వర్ణించి, యి ట్లవయవక్రమముగా వర్ణింపఁబడినవాని, సంపూర్ణాకార మెట్లుండునో కొన్నియుపమానముల మూలముగాఁ దరువాతి గీతిక యందు స్ఫురింపఁజేసినాఁడు :

"మంచు మఱుఁగుపడిన మార్తాండుఁడునుబోలె
నివుఱు గవిసియున్న నిప్పుఁబోలె
వేషధారియైన విష్ణుండువోలె న
వ్విరటుకొలువు చేర నరుఁడు వచ్చె."

ఈతని సీసపద్యపాదములు సామాన్యముగా తూఁగు కలిగిన (balanced) సమాంతరవాక్యములుగా (sentences of parallel construction) నుండుటయే కాక, క్రింది గీతపద్యమున క్రమముతోఁ దెలుపఁబడిన విశేష్యములను వర్ణించునవై యుండును. నన్నయసీసముల కిట్టిలక్షణము పట్టున ట్లగపడదు. వర్ణనసందర్భముననే గాక తెఱ

చుగా కథాకథనమునకుఁగూడ నన్నపార్యుఁడు సీసములను వాడుచుండు టచే, నొకపాదము మఱియొకపాదములోనికిఁ జొచ్చి నడుచుచుండునే గాని సామాన్యముగా నేపాదమున కాపాదము సమాంతరవాక్య రూపంబై యుండదు. ఇట్లు వర్ణనాంశముల కనువుగ సీసపద్యరచన గావించుట తిక్కనార్యుఁడే ప్రారంభింపఁగా శ్రీనాథాదులు దీనిని గ్రహించి మఱింత సానఁబట్టి, కమ్మచ్చున లాగి యధిక తేజోవంతములుగఁ జేసినారు.

ద్రౌపది భీముని యెదుట నర్జునునిగూర్చి వర్ణించిన సందర్భమున

"తొడరినహరుసైన దోర్బలంబునఁ దన్ను
మిగులంగనీఁ డను మేటిమాట
యమరేంద్రు నర్ధాసనమునకునైన న
ర్హాం డెంతయును నను రూఢిమాట
జము నిలు సొచ్చిన జంతువునైనను
గాచు నెమ్మెయి నను రాచమాట
దనుఁ గోరి యూర్వశి దాన వచ్చిననైన
లోలుండు గాఁ డను మేలిమాట"

ఇట్లు మాట, మాట యని సమాంతరవాక్యములను జెప్పి, యా నాలుగు పాదములలోను బ్రశంసించిన గుణము లివి యని మరల స్పష్టముగా గీతమునఁ బేర్కొనుచున్నాఁడు:

"శౌర్య, వైభవ, ప్రాభవ, శౌచములకు
నొరులకైనఁ గైవారమై యుల్లసిల్లు
నొక్కనికి నివియెల్లను నిక్క మట్టె
యెందుఁ గలుగునె యర్జును నీడువాఁడు."

తిక్కనార్యుని రచనలలో నేవిషయమునందైనను సక్రమత, క్రమవిధానము (regular method) స్పష్టముగాఁ గనఁబడుచునే యుండును. అతని కళ యంత యుత్కృష్టమైన దగుటకు ముఖ్యకారణ మిదియే. అది సంభాషణ గానిండు, లేదా వర్ణన గానిండు, లేదా ఆయాపాత్రలు చేయు కృత్యములు గానిండు, దేనిని గ్రహించినను ఒక క్రమము, ఒక ఉద్దేశపూర్వకమగు విధానము (a purpose and a method) లేనిదే యాతఁడు రచింపఁడా యనునట్లు తోఁచును.

కీచకుఁడు ద్రౌపది సౌందర్యమును వర్ణించుటలో

"నెత్తమ్మిరేకుల మెత్తఁదనముఁ దెచ్చి
యచ్చునఁ బెట్టిన ట్లంద మొంది"

యని యాయా యవయవములను బేర్కొనకయే వాని సౌందర్యమును నాలుగుపాదములలో వర్ణించి, చివరగీతములో క్రమముగా

"యంఘ్రితలములు కుచములు నాననంబు
కచభరంబును ని ట్లున్న రుచిరమూర్తి"

యని వానిని బేర్కొని యవి యామె మూర్తియొక్క రుచిరత్వము నెట్లు పోషించినవో తెలిపియున్నాఁడు. సీసపద్యములలోఁ జేయఁబడిన వర్ణనలలో నిట్లు రచించుటయం దీతనికి ప్రీతి మెండు. కీచకవధను సాధించిన భీముని ప్రశంసించుచు ద్రౌపది చెప్పిన సీసపద్యములో మొదటి నాలుగు పాదములలో,

"కొలువులోపల నున్న కోపము ల్మైత్రినఁ
దలఁకక నిలిచిన ధైర్యమహిమ
నేఁ డిందుఁ జనుదెంచి నిర్వికారతఁ బ్రజ
కన్నులు గప్పిన గౌరవంబు

మనవారిలోన నొక్కనినైనఁ బిల్చి కు
త్సాహంబు సేసిన సాహసంబు
లోక దుర్జయుఁ డగు నీకీచకునిని వ్రే
ల్మిడి రూపుమాపిన కడిమి సొంపు"

అను నీ నాలుగు గుణములను వర్ణించి, పిదప గీతములో, వీనిని, 'చూడఁ, దలపోయ, మెచ్చ, సంస్తుతియొనర్ప, నా తరమా' యని క్రమముగాఁ గ్రియాపదములను బొందుపఱచినాఁడు.

అర్జునుఁడు శమీవృక్షముపై నున్న బాణముల నుత్తరున కెఱింగించు సందర్భమునఁగూడ, మొదట వారివారి బాణముల లక్షణములను వర్ణించి చెప్పి, యవి

"వరుసఁ
బాండవాగ్రజుండుఁ బవనపుత్రుఁడు, నకు
లుండు దదనుసంభవుండుఁ బట్టు
నవి కుమార యగ్గవాజిన కోశ మ
హాశరంబు పార్థు నదియు చూవె"

యని 'వరుస'గాఁ దెలిపినాఁడు.

అర్జునుని శంఖారవంబు విని ద్రోణాచార్యుఁడు దుర్యోధనుని కా వచ్చునది యర్జునుఁడే యని తెలియఁజెప్పుటలో నాతఁడు వర్ణించిన క్రమముఁ జూడుఁడు:

"శ్రవణపుటంబులు వ్రయ్యంగఁ దాఁకి సం
క్షోభంబు గావించె గుణము మ్రోఁత
బ్రహ్మాండభాండంబు పగిలించి భూత ని
కాయ చైతన్య మొనరించె శంఖరవము

గగనభాగంబెల్లఁ గప్పి క్రాలుచు బెగ
డడరించె నుగ్రంపుఁ బడగపఱపు
మిఱుమిట్లు గొని చూడ్కి పఱివోవఁ బెరిఁగి ప
రిభ్రాంతి సేసెఁ గిరీటకాంతి"

అని నాలుగు పాదములలో హేతువులను ముందు వర్ణించి తెలిపి, వాని వలన ననుమేయంబు లగు వస్తువులను గ్రమముగా గీతమునఁ దెలిపినాఁడు:

"తెల్ల మిది గాండివంబును దేవదత్త
మును గపిధ్వజమును వాసవుని వరమునఁ
గన్న మకుటంబు నగు వేఱ కొన్నియైన
నుజ్వలాద్భుతభంగులై యున్నె యిట్లు."

ద్రోణుఁ డావచ్చునది యర్జునుఁడే యని చెప్పఁగా దుర్యోధనుఁ డద్దాని నమ్మక

"యర్జునుండయేని యడవి కరిగి
భ్రాతృయుతముగాఁగఁ బండ్రెండువత్సర
ములును నంద నిలువవలయు మగుడ"

అని చెప్పియున్నాఁడు గావున దానికిఁ బ్రత్యుత్తరముగా

"నీ వచ్చుచున్నవాఁడు బలవద్రిపుభీషణ రోషుఁడైన వి
వ్వచ్చుఁ"

డని నిశ్చయించుటకుఁ దగిన హేతువులను జూపినాఁడు. ఆ యర్జునుని గాండివము, దేవదత్తము, కపిధ్వజము, మకుటము నైనఁగాని యిట్లుండ వన్నాఁడు. ఈవర్ణనలో మఱియొక విశేషము గమనింపవలసియున్నది. అర్జునుఁడు దూరమున శమీవృక్షమువద్దనుండిగదా వచ్చుచున్నాఁడు.

కావున దూరముననున్న వాఁడు మొదటఁ గానరాడు. మొదట దూరము నుండియైనను వినవచ్చినది గుణము మ్రోఁత; తరువాత శంఖరవము; పిదప నాతఁడు మఱికొంత సమీపింపఁగా ముందు రథముపైని పడగపఱపు గానవచ్చును; ఇంకను సమీపించినఁగాని రథమునందున్న యాతని కిరీట కాంతి కనఁబడను. కావున నీవర్ణనమున నెట్టి స్వాభావికమగు క్రమత (order) ను పాటించినాఁడో చూడుఁడు. దీనికిఁ దగినట్లుగనే యింత శుఁ బూర్వ మర్జునుఁడు గాండివమును గ్రహించిన తోడనే "యెక్కు పెట్టి ముష్టి నలవరించి గుణధ్వని నేసిన",

"పక్షి మృగజాతు లెల్లను బ్రమసి యిట్టు
నట్టుఁ గలఁగొనఁ జెదరె వృక్షాళి యదరె
గురుబలంబును బెదరె నంబరము దిశలు
బూరటిల్లంగఁ జెలఁగె దదారవంబు"

అని యా గుణధ్వనివలనఁ గలిగిన ఫలమును వర్ణించి, పిదప

"పిడుగులపిండు బిట్టులియు పెల్లునఁ బార్థుఁడు శంఖ మొత్తినన్",
"గలఁగెన్ దోయధిసప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె..."

ననియు, హయములు నిశ్చేష్టితంబులై జాఁపకట్టుగఁబడ మత్స్యక్షితీశ నందనుఁడు నొగలపై మ్రందినట్లు మ్రొగ్గతిల జాఁగి బలితంపు మూర్ఛఁ జెందెననియు వర్ణించినాఁడు. ఇచ్చట ద్రోణునిచేఁగూడ క్రమవిషయ మున నేకాక ఫలితమునుగూర్చియు దానికిఁ దగినట్లే పలికించినాఁడు. పూర్వోత్తర సందర్భముల కట్టిపొందిక యెచ్చటఁజూచినను గనఁబడు చునే యుండును.

## తిక్కనార్యుని శృంగారవర్ణనలు

తిక్కనార్యుని శృంగార వర్ణనలలోఁగూడ నిట్టిపొందిక యత్య ద్భుతముగాఁ గనఁబఱచిన సందర్భములు కలవు. తిక్కన శృంగారవర్ణన

లలో మఱియొకవిశేషమును గూర్చి యిదివఱకే సూచించియున్నాను. ఉత్తర, ద్రౌపది మొదలగువారినిగూర్చిన శృంగారవర్ణనల నించుక జిలకింపుఁడు. ఆయాపాత్రల నెదుటనిలువఁబెట్టి వారిసౌందర్యమును నెప్పుడు తిక్కన స్వయముగా వర్ణింపఁడు. ఏదో కథాసందర్భమునకుఁ దగిన మిషను గల్పించుకొనియె వర్ణించుచుండును. లేదా, మఱియొకపాత్రచే వర్ణింపఁజేయుచుండును. తిక్కన గాదు సరేగదా, కీచకుఁడు గూడ ద్రౌపది నెదుట నిలువఁబెట్టి వర్ణించి యెఱుఁగఁడు. "సుదతీ నీమై చక్కఁ జూచుట కోడెడుఁ గనుఁబాటు వోరయునో యని తలంచి" యున్నాఁడు. అతఁ డొకవేళ వర్ణింతమని తలంచినను, "మదిఁ బొనర్చిన మాట యీ మగువ పెంపున గుదిసి నాలుకతుదికి రా"దఁట. కీచకుని చేతను నిట్లు భావగర్భితముగఁ బలికించి యామె సౌందర్య మహత్త్వమును ధ్వనింపఁజేయుచున్నాఁడే కాని వర్ణనలోని కంతగా దిగలేదు. ఒకవేళ చేసినపుడో, "ఆమె నేయున్న బాము దలఁపవ, యీయొడలీచీర యిట్టి యేసపు చందంబు" అని పలికినదానికి బదులు చెప్పుటకుఁగా నామె యంఘ్రితలములను, కుచములను, ఆననంబును, కచభరంబును వర్ణించి యామె రుచిరమూర్తిని గొనియాడెను. మఱియొకమారు "సైరంధ్రి నీరసాకార" యని పలికిన తనయప్పను సమాధానము చెప్పుటకుఁగా నామెసౌందర్యమును వర్ణించినాఁడు:

"నాకొలువువార కార
న్నాకేశుం గొలుచునంగనలలో నైనన్
లేకునికి నాకుఁ దెల్లం
బాకొమ్మకు నీడు వోల్పనయ్యెడు సుదతుల్."

అని యాతఁడు చెప్పిన ప్రత్యుత్తరము, తరువాత నాతఁడు వర్ణించి కొనియాడిన యామెరేఖ, గరువచందము, కలికితనము, చెన్ను మొద

లగువానినిబట్టి చూడఁగా నీతఁడు వాస్తవార్థమునే చెప్పుచున్నాఁడు గాని మదనోన్మాదముచే నున్మత్తప్రలాపములు చేయుచుండుట లేదని తోఁచకపోదు. ఇఁక తిక్కన సామాన్యముగా నాయా పాత్రలనడకలను వర్ణించుమిషచే వారి సౌందర్యమును స్ఫురింపఁజేయు చుండును. ఏదోసందర్భానుకూలమైన క్రియలను—నడకలను—వర్ణించుట యందే యీతని కుత్సాహముగాని, తన వర్ణనకొఱకుగా నాపాత్రల నచ్చట నిలువఁబెట్టఁడు.

అర్జునుఁడు పేడిరూప మెట్లున్నదో మనకుఁ జెప్పవలసియున్న పుడు, ఆతడు పేడిరూపమున విరటునిఁ గొల్వవచ్చుటను అనఁగా నాతనిరాకను

"కాళ్ల యొప్పిదమాడు కట్టనుజ్వలముచే
యంగసంకుల బాహుదండ మెడల

*　　*　　*　　*

*　　*　　*　　*

విరటు కొలువుచేర నరుఁడు వచ్చె"

నని వర్ణించుచు నాతని పేడిరూపము మచ్చొత్తినట్లు మన కగపఱచినాఁడే కాని, యీరాకకుఁ బూర్వమున నాతని స్వరూపమును వర్ణింప దొరకొనలేదు. కావున నిక్కడ నాతనిరాకకే ప్రాధాన్యము గదా.

ద్రౌపదీసౌందర్యమునుగూర్చి యీతఁడుచేసిన వర్ణనలు చాలవఱకు కామెనడకలకు సంబంధించినవే. "పరిచారికాత్వ రేఖా, పరిణతి దన మేన నచ్చుపడ భావనకుం, దిరమై తలకొను నంతః, కరణముతోఁ బురము ద్రుపదకన్యక చొచ్చె"టనే

"పలుమొయిల్ గప్పిన బాడఁటి నునుగాంతిఁ
గదలిన యమృతాంశు కళయుఁబోలె

యను పద్యమున వర్ణించినాఁడు.

పిదప నా వనితారత్నంబు వినయవైభవము సతీతనువొందిన చందంబునఁ గేకయసుతానుచారికల బడిన్ జని సౌధభాగంబెక్కి యాసుదేష్ణ యొద్దకు జనుటనే వర్ణించినాఁడు చూడుఁడు. ఇచ్చటఁ జనుట— పోకనుగూర్చి వర్ణించుచునే యామె సౌందర్యము నెట్లు స్ఫురింపఁజేసినాఁడో పరీక్షింపుఁడు.

"పదతలంబుల కెంపుపరగినతలము కుం
కుమ లిప్తమైన చందము వహింప
నంగంబు నునుఁగాంతి యడరిన గోడలు
వేదులు మణిమయవిధము నొంద
కనుఁగవ మెఱుఁగులు గదిరిన మందర
పుష్పోపహారంబు పోలువుదాల్ప
వేనలికప్పు పర్వినమీఁదు నీలదు
కూలంబు మేల్కట్టు కొమరువడయఁ
దానుజొచ్చిన కతన మత్స్యక్షితీశు
నింట నిమ్మయి క్రొత్తయొప్పెసక మెసఁగ
నమ్మహాదేవి యున్నెడ కల్లనల్లఁ
బాండు రాజతనూభవపత్ని యరిగె"

ఇచ్చట నాతఁడు వర్ణించినది పదతలంబుల కెంపు, అంగంబు నునుగాంతి, కనుఁగవమెఱుఁగులు, వేనలికప్పు. ఇదియైనను నామె సౌందర్యవర్ణనము కాదు. ఆమె చొచ్చినకతన మత్స్యక్షితీశు నింట క్రొత్త

యొ ప్పెట్లు కలిగినదో చెప్పుటయే. ఇందలి వ్యంగ్యవైభవము ప్రత్యేకముగా గమనింపఁదగినది.

ఉత్తరనుగూర్చిన వర్ణనలు వివాహసందర్భమునఁ గాక మఱి రెండుమారులు వచ్చినవి. ఈరెండు నామె రాకపోకలను గూర్చినవే. మొదట బృహన్నలయొద్ద విద్య నేర్పించుటకై తండ్రి రావింపఁగా

"అల్లఁదనంబున ననువుమై కొనఁజూచు
నడపుకాంతికి వింత తోడవుగాఁగ
వెడవెడనూఁగారు వింతయై యేర్పడఁ
దారనివళులలో నారు నిగుడ
నిట్టలు ద్రోయుచు నెలవులకలమేర
లెల్లను జిగియెక్కి యేర్పడంగఁ
దెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్కి
తారకంబులఁ గల్కితనము దొడర
జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు
జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
చునికిఁ దెలుపుచుండ నుత్తర సనుదెంచె
నలరువిలుతుపువ్వుటమ్ముపోలె"

ఇట్లామెరాకను వర్ణించుచు నామె జవ్వనంబు చెన్ను నివ్వటిల్లుచునికి యెట్లో సూచించినాఁడు. మఱియొకమా ఱుత్తరుని సారథ్యమునకుఁగా బృహన్నల నియ్యకొలుపుటకుఁ దా నాతనిఁ దోడ్కొని వచ్చెదనని పోయి

"అడుగుల నునుకాంతి నయ్యెడ పద్మరా
గంబుల నెలకట్టుకరణి నొప్ప

బాలింద్లు తనువెడ బ్రాలింపఁ జెన్నొందు
నసదు గౌఁదీగ యల్లాడుచుండఁ
నటివేచి వెనువెంటఁ దగులు కామాంధకా
రములీలఁ గ్రొవ్వెద గొమరు మిగులఁ
గర్ణభూషణమౌక్తిక ప్రభాడోలన
మోత్తుణదీప్తుల నినుమడింప
నందియల మొరపంబున కరుగుదెంచి
ప్రోదిరాయంచ రయమునఁ బోవు నవ్వి
ధంబు దగ నభ్యసించు చందమున దోన
చనఁగ నుత్తర నర్తనశాల కరిగె."

ఇచ్చట నీమె రాకపోకలను గూర్చి వర్ణించుటయే యీ కథా సందర్భమునుబట్టి యాతనికిఁ బ్రధానమైనను, ఈమూలముగా తిక్కన యీమెసౌందర్యమును, వయోవిలాసములను వర్ణించి యవి యీమెనడకయొక్క సొంపున కెట్లు తోడ్పడినవో చూపినాఁడు. ఇక్కడ నడక సొంపునకున్న ప్రాధాన్యము సౌందర్యమునకు లేదు. కాని యప్రధానమైనను, ఈమెసౌందర్యము, వయోవిలాసములు కాలగతినిబట్టి యెట్టి మార్పులను బొందుచున్నవో, యనువిషయము సెంతజాగరూకతతో నీపద్యములలోఁ సూచించినాఁడో పరికింపుఁడు. మొదటివర్ణనకాలమునకును, రెండవ వర్ణనకాలమునకును సుమారొకసంవత్సరము వ్యవధానముకలదు. ఈరెండుపద్యములలోనుగూడ నుత్తగచరణములు, నడుము, చన్నులు, కన్నులునే వర్ణింపఁబడినవి. మొదటిపద్యమున నవి 'జవ్వనంబు చెన్నునివ్వటిలుచునికిఁ' దెలుపుచున్నవని తెలిపినాఁడు. కాని సంవత్సరమైన పిదప నామెస్థితియెట్లుండునో, దానికిఁ దగినట్లుగ కాలానుగుణంబుగనే యెట్లువర్ణించినాఁడో చూడుఁడు. మొదట అల్లఁదనంబు

తోడి నడపు కాంతికి వింతతోడవుగాఁగ, నిప్పు డడుగులయందు పద్మ
రాగకాంతితోఁ దులయగు నునుగాంతి ప్రబలినది. అప్పుడు వెడవెడనూ
గారువింతయై యేర్పడుచున్నది. ఇప్పుడో పాలిండ్లభరముచే నడుము
కౌఁదీగ యల్లాడుచున్నది. అప్పుడు తెలతెలఁబోవుచు మెఱుఁగెక్కి
కలికితనము దొడరిన కనుఁగవల యీక్షణము లిపుడు దీప్తినొందినవి. నడక
హంసయానమును బోలినది. ఇట్లు సంవత్సరము గడచినపిదప యౌవన
ప్రాదుర్భావముగలదై యున్న యుత్తరసౌందర్యమును సమయానుకూల
ముగా వర్ణించినాఁడు. అయితే ఇవియన్నియు నామె నడకవర్ణనలో
నైక్యముందినవిగాని ప్రత్యేకముగా పనిచేసికొని వర్ణింపబడినవి కావు.
ఇట్లే తిక్కనార్యుని వర్ణనలన్నియు దేశకాలపాత్రములకుఁ దగినవై,
సందర్భానుకూలములై, సహజవైఖరిని చేయఁబడినవై యుండును.
గాని యప్రసక్తములు, పాండిత్యప్రదర్శకములు, సాంకేతిక భావగర్భి
తములునై యుండవు. సచలనంబగు వస్తువులనే (moving objects)
వర్ణించుటలో తిక్కనార్యునకుఁ గల యుత్సాహమును సూచించుటకు
మఱియొక నిదర్శనముకలదు. ఉత్తరుఁడు బృహన్నలసారథిగా గోరక్ష
ణార్థమై బయలుదేరివచ్చి పరేతనిలయప్రాంతదేశంబు చేరంజని గోగ
ణము ముంగలిగనేల గోడివడగ, నడచు కౌరవరాజసైన్యంబుం గనియెఁ
నట. ఈనడచురీతి నొకచక్కని సీసపద్యములో వర్ణించినాఁడు. ఇచ్చట
మూలములోనున్న యొక్కసూచనమాత్రమే గ్రహించి విశేషముగా
పెంచి రచించినాఁడు.

ఇఁక ఆకారగోపనము నెట్లితఁడు వర్ణించునో చూడుఁడు సుదేష్ణ
"సంభ్రమము దెచ్చుకొని తానెఱుంగని తెఱఁగునఁగాల్చి శాఠ్యమున నుమ్మ
లించి పాంచాలితోడ నెలుఁగు వేఱొకభంగిగా నిట్లులనును." భీముఁడు
"గమనము వీఁక వేఱొకవికారము పుట్టక సంగరోత్సవోద్యమ రభసాతి

లేకము బయల్పడు టించుకలేక, రోషసంభ్రమ మొక యింతయైనఁ బరభావనిరూప్యముగాక" నాట్యశాలకుఁ బోయెను. భీముని 'సహజ స్వభావమునకు నీ సమయానుకూల ప్రవర్తనకుఁ గలసంఘర్షణము నిచ్చ టను వ్యక్తము చేసినాఁడు. మఱియు కీచకవధానంతరము ద్రౌపది యేమియు నెఱుఁగని దానివలె వికృతిలేక యప్పటియట్ల సుదేష్ణ యొద్దకుఁబోవు సందర్భమున నామె హృదయగతంబగు సమ్మదపూరము నకు గలువతనమును బలితంపుఁ గట్టువెట్టి, యెట్లాకారగోపనము చేసి ప్రవర్తించినదో యత్యంతరమణీయంబుగఁ జూపఁబడియున్నది. ద్రౌపది "పులిఁగనుగొన్న లేఁడులునుబోలెను భీతి గలంగువారి, నన్నెలఁతుక యంతరంగమున నిండిన హాస్యరసంబు మోముపై వెలివిరియంగనీక" చనెనట. ద్రౌపదీ కీచకుల సమావేశఘట్టముననే తిక్కన మనోవృత్తి వివరణ చాతుర్యము విశేషముగాఁ గనఁబడుచున్నది. కీచకుఁ డామెను దగిలి చూచుట. చూచినప్పు డాతని మనోవికారముల ఛాయలు—ధృతియల్లలనాడిన తల్లడించుట—పైకొను తల పోరగించుట—మదికోర్కులు పేర్చిన నప్పళించుట—తెగనగ్గలించుట—బుద్ధిమాలినవెస గళవళించుట—మొదలైన భావచ్ఛాయలయందలి సూక్ష్మభేదములు ఎంతయు చక్కఁగా వర్ణింపబడినవి. ఆ భావచ్ఛాయలను సూచించుటకెట్టి సముచిత పదపరికరము సమకూర్చినాఁడో గమనింపుడు. తన్నుఁజూచి రోసిన డెందముగల తరుణిభావము నెఱుంగలేక మనఃకాలుష్య భయాదికారణములచే నామెయెడఁగలిగిన స్వేదకంపాది సాత్త్వికభావములు, ఆతఁడు పలుకరింపగా, నిర్వికారయైయున్న ద్రౌపదినిజూడ నాతనికిఁ గలిగిన మనోవికారములు, సుదేష్ణ పంపున ద్రౌపది కీచకునింటికిఁ బోవునప్పు డామె పరితపించిన రీతి—ఇట్టి సందర్భములం దాంతరంగిక భావములు బాహ్యాకారము లందెట్లు వ్యక్తమగునో—ఆకారగోపనము—భావసం

ఘర్షణము—ఒకరి భావములు మఱియొక భావములపైఁ బ్రసరించి వారి వారి మనోముకురముల నెట్లు ప్రతిఫలించి, వారి ముఖవైఖరి నెట్లు మార్చుచుండునో, అను నీవిషయముల నీతఁడత్యద్భుతముగా వర్ణించి యున్నాఁడు.

మఱియు నాయాసందర్భములందలి పాత్రల మనోవృత్తులకుఁ దగిన యింగితాకారములనేగాక, తదనుకూలముగ వారుచేయు నభినయమునుగూడ సూచించుచుండుటచే నీకథనమున కొకవిధమగు నాట్యకళాశోభ గల్గునట్లు చేసినాఁడు. విరటునికొల్వున భీముఁడెట్లు మెలఁగువాఁడో యని ప్రశ్నింపఁదలఁచిన ధర్మజుఁడు "అనిలతనయు నిరీక్షించి తత్కాలజనితంబయిన ఖేదంబునం దొరగ నునుకట్టు బాష్పజలంబులు మగుడనింకించుచు, నిట్టూర్పులడంచి ధైర్యంబవలంబించి యిట్లనును." ఆయుధనిక్షేపంబు కర్జంబుగాఁబలికి 'యోగ్యస్థల నిరూపణంబునకు నలుదిక్కులుం బరికించును." తన్నుఉన్న రూపెఱిఁగింపుమన్న విరటునకు ధర్మజుఁడు "సత్యమునడుపు క్రమమును గూర్చి చెప్పునపుడు" మందహాసము చేయుచుఁ బలుకును. భీముఁడు విరటునిసభను 'సమదవారణపతిగమనమున' చేర నరుగును. ఉత్తర విరటుని కొలువుసొచ్చి "నెచ్చెలిపిండు నంతంత నిలువఁబనిచి యల్లనల్లగదిసి ప్రౌఢవనిత కైవడి" తండ్రికి మ్రొక్కును. తండ్రి, బుజ్జగింపురీతియంతయు మనకన్నులకుఁ గట్టునట్లు "తిగిచికవుంగలించి" 'etc' అను పద్యమున వర్ణించినాఁడు. నకులుఁడు విరటునికొల్వు ప్రవేశించినరీతిఁ దైవయోగంబున భూవిభుండు దురగంబులఁ దేరగఁబంచి చూడఁగా, నాయాస్థానంబు సేరవచ్చి ఘోటకంబుల నుపలక్షించుచున్న, నన్నరేంద్రుండు కనుంగొని పరిజనంబులకతనిం జూపి 'ఈతఁడెవ్వఁడొకొ' యని ప్రశ్నించును. సుదేష్ణ తనను దన పాలికిఁ బిలువనంపఁగా ద్రౌపది

"తన తలచీరయరసి య
వ్వనితారత్నంబు వినయవైభవము సతీ
త్వమువొందిన చందంబున
జనియెం గేకయసుతాను చారికలబడికిన్."

విరటుఁడు భీమునికి మల్లముఖ్యుం జూపి యతనితోడి యుద్ధంబునకు సన్నద్ధుండవు గమ్మనిన నతండును ధర్మతనయుం గనుసన్నఁగయి కొని యమ్మత్స్యవిభునకు వినయంబుతో నిట్లనును. మల్లులకృత్యములు వారి యుద్ధసన్నాహము, యుద్ధమునందలి పేచీలు కన్నులకుఁ గట్టునట్లే వర్ణింపఁబడినవి. సుదేష్ణ చే ననుచితవ్యాపారమున నియోగింపఁబడిన ద్రౌపది నిర్వేదావస్థను వర్ణించుచు నామె భావఘుర్షణమునకుఁ దగిన బాహ్యవ్యాపారముల నెట్లు కనఁబరచినాఁడో గమనింపుఁడు.

"అలమటఁబొందు మాయ విధియాయని దైవముదూఱుని త్రతిం
గలరొకొనాకుదిక్కనుచు మొగంబున నశ్రులువెల్లిగొల్పు దొ
ట్రిలఁబడు జల్లనం జెదరు డెందముఁ గూడఁగ దెచ్చినన్నుఁ గే
వలమును ముట్టనెవ్వరికివచ్చు ననుం గలఁగుం వెనుంబడున్."

విరటుని సభలోనుండి కీచకుని గీటడంగింపఁజూచిన భీముఁడు అచ్చెరువనున్న యున్నతవృక్షంబు నిరీక్షించి యానవంబుపల్లటిల్ల ధర్మతనయుం గనుంగొనిన నతండు దననయనాకారంబున వారించెనట. కీచకవధానంతరము తనయొద్దకువచ్చిన ద్రౌపదిని సుదేష్ణసంభావించి యత్తరుణిం దనపరిసరంబున నునిచికొని తదీయవదనం బవలోకించి ఇట్లు పలికినది.

"నీవుచక్కనిదానవు నెలఁతధైర్య
రహితచిత్తులు మగవారురాజు దీని

దలంచిభయమంది నిన్నునీ వలచునెడకు
నరుగునట్లుగఁ బ్రార్థించి యనుపుమనియె."

ఈపలికిన పలుకులెంత యనునయపూర్వకములుగా నున్నవో పిదప యనుజ వియోగతాపం బుత్కటం బగుటతోడనే యామె పలికిన పలుకులెంత ధార్ష్ట్యముతోఁ గూడియున్నవో, వెనుకటిగీతమునందు వలెఁగాక, యీకందమునందలి పదముల జిగివి, నడక, సుదేష్ణ సహజశీలమును వెల్లడించుచు నెంత సందర్భానుకూలములై యుండెనో గమనింపుఁడు.

"బిరుదుగల మగలుగలరని
తరమిడిచంపింపఁ జూచెదవు జనములు నీ
పొరువునఁ బోవెఱతురు మా
పురమును రాష్ట్రింబువెడలి పొమ్మెందైనన్."

సుశర్మ సైన్యముచే దెబ్బలుతిన్న గోపాలకులు,
"అపదుగఁదాఁకి మేనఁదిఱచ్చి పొరిసెత్తురు గ్రమ్మపోటులన్
పసమతి తూలుచుండియును వారనిభీతిఁబదంబులన్ గడున్
వెసఁగదియన్ బురంబునకు వేగమెకొంధఱుపాఱి"

మత్స్యనాథునితో నీరెలుంగు దలంకఁబల్కిరట. విరాటుం డదిరిపడి "ఏమీ నిక్కమె మున్నెఱుంగఁ డెత్తిగర్తేశుండు" అనుచు వీరాలాపములు పల్కెను. పిదప విరాటుఁడు బలంబులం గూర్చుకొను తలంపునం బహిరంగణంబునం గొండొక సేపునిలచె"నట. ఇది మూలమున లేకున్నను ధర్మజుఁ డాతనియొద్దకుఁబోయి తాము నెంబడింపఁ దలంచుటను గూర్చి చెప్పుటకుఁ దగిన యవకాశమును గల్పించి కథకు స్వాభావికత్వము నాపాదించుటకై తిక్కన తెచ్చిపెట్టినాఁడు.

నకులుని ప్రవేశమున కనుకూలమగునట్లు విరటుఁడశ్వములను విచారించు సందర్భమును తిక్కన కల్పించుట యిదివఱలో జూచియున్నాము. ధర్మతనయుండు నట్టిసమయంబున పవనతనయమాద్రీతనయులంతంతం బొడసూపిన నిలువుండని నిపుణముగా నియోగించి తానునుమత్స్య మహీవల్లభునల్లనచేరి పలుకును. పురుహూతపుత్రుండు శుండాలరయ లీలాసమరేఖంబగు గమనంబునం బదశతమాత్ర ప్రదేశపలాయితుండైన భూమింజయు నెయిదిపట్టుకొను. కదుపులను విడిపించిన పిమ్మటను త్తరునకు గౌరవవీరులను వేఱువేఱ నిరూపించిచెప్పు సందర్భమున నర్జు నుని యాకారము నెంతచక్కఁగా సందర్భానుకూలముగా గనులకుఁగట్టు నట్లు వర్ణించినాఁడో చూచియే యున్నాము. భీష్ముఁడొల్లఁబోయి సోలుచు రథకూబరమూఁతగ నిల్చియుండ సూతుండాతని రథమావలకు గొంపోవుటయు, క్రీడి "ఇట్లజ్జెత్తిచూచి గాండీవంబు దొడసి, గుణంబు సారించి, కవదొనలు బిగియించి ఆచార్యసూర్యతనయాదుల దెసకేచి యరిగెను.

విరటుఁడు "శరములు, శరాసనము నయ్యురదము పైడిగ్గవిడిచి_ ధరణికి లంఘించె" నట. వానిని డిగ్గవిడిచి ధరణికి లంఘించెననుటలో నాతని భయావేశము, దానివలని తెగింపు, ఏదెట్లుపోయినను సరే ప్రాణము ను దక్కించుకొందమను భావము, ఇవి యన్నియు కన్నులకుఁగట్టి నట్లగుచున్నవి. తనకు బుద్ధులుచెప్పఁదొడంగిన యప్పమాటలనువిననొల్లక, నెట్లయిన నామెను తనకోర్కెఁ దీర్చునట్లొడంబడఁ జేయుటకుగాఁ గీచకుఁడు

"అనుచు దైన్యంబు నొంచెదునాననంబు
తోడ దిగ్గనలేచి యత్తోయజాక్షి
చరణపీఠంబుకడఁ జక్కఁజాఁగి మ్రొక్కె"ను.

## పాత్రపోషణ రీతులు

తిక్కనార్యుని శీలపోషణరీతు లత్యద్భుతములు. ఎవరెవరు మాటలాడినను, వారివారిమాటలు, సంభాషణలు వారి స్వభావములకు ప్రవర్తనకుఁ దగియుండుటే గాక, యితరులు వీరి స్వభావమును గూర్చి పలికిన పలుకులర్థానిని చక్కఁగవ్యక్తపఱచునవై సందర్భానుకూలము లై యుండును. తనపైవచ్చుచున్న యర్జునుం జూచి ద్రోణకృపకర్ణాశ్వత్థామల వాగ్వాదమును విని తుదకు భీష్ముఁడు కౌరవేశ్వరు నుద్దేశించి ధర్మార్థసంగతంబును హితంబుగాఁ బలికినపలుకు లెంతయు యుక్తములై, స్వభావోద్ద్యోతకములై యున్నవి. వీరాడినమాటలు తత్స్వభావానుగతంబులే. "ద్రోణాచార్యుఁడు నీతిపథంబునం బలికె. ఆచార్యతనయు వచనంబు లుచితంబులు, కృపాచార్యుం డాడిన చందంబు తెఱంగువడి యున్నది. మన్ననగల మానిసియగుట నంగరాజునకు సంగరపాటవంబు లగుమాటలు దగుం గాక." ఇఁక దేశకాలానుగుణ్యముగా నాయా పాత్రల స్వభావమునందును బ్రవర్తనయందును గలుగుచుండు మార్పులను, క్రొత్తఛాయలను నీతఁ డతి చమత్కారముగా వ్యక్తపఱచుచుండును. ఉత్తరుని స్వభావమున నీఛాయలను గమనింపుఁడు. మొదట ప్రగల్భముల నొట్టిన యుత్తరుఁడు—కౌరవరాజు సైన్యంబుఁ జూచి భయకంపితుఁడైన యుత్తరుఁడు—బృహన్నల నర్జునుగా నెఱింగి యుత్సాహవంతుఁడైన యుత్తరుఁడు—తండ్రికి ప్రవర్తనపద్ధతిని గఱపు నుత్తరుఁడు—కాలమునుబట్టి యెట్లు మాఱుచువచ్చెనో తెలుపును. సుదేష్ణా విరటుల స్వభావమును మూలమునకంటెఁ గొంచెము మార్చినాఁడు తిక్కన. తనపతియగు విరటుఁడు ద్రౌపదీరూపమోహితుఁడై యామెను కోరగా, తానామెకు రక్షకులగు గంధర్వపతులనుగూర్చి చెప్పివారించితినని తమ్మునితోఁ జెప్పకొనియు, తుదకు తమ్ముని వారింపలేక యాతని

కోర్కెఁదీర్ప సంసిద్ధురాలై 'శుభాచార' యగు ద్రౌపది నాతని యొద్దకుఁ బంప సమకట్టిన సుదేష్ణశీలము నింకను దించివేసి, కొంత వరకు విరటుని శీలమును గాపాడ యత్నించినాఁడు. మొదట నీమె యొద్ద కొలువడిగినపుడు మాత్రమీమె "విను నీరూపము సూచి మానృపతి యువ్విళ్లూరు" అనిపల్కినట్లు తిక్కన చెప్పెనేగాని నిజముగా విరటుఁడామెను కోరఁగా తాను గంధర్వులవలని భయమును దెల్పి వారించితినని యామె తమ్మునితోఁ జెప్పినట్లు మూలమునను న్నవిషయము నిచ్చట జారవిడిచినాఁడు. ఇచ్చట సుదేష్ణ కీచకునికి "దగిన తెఱంగున" అనఁగా నాతని యుత్తర స్త్రీల యనురాగంపుఁ జెయ్వులను, సైరంధ్రి నీరసాకారమును వర్ణించియు, ధర్మమార్గమును దెల్పి జారపొందును నిర్ణించి యందు సుఖము లేకుండుటను దెలిపియు, తుదకు గంధర్వులవలని భయమును సూచించియు వారించినదేగాని, గంధర్వుల భయమువలని తనభర్త యీమెను వదలు కొనినాఁడని మాత్రము చెప్పలేదు. మూలమున వ్యక్తిత్వము (Individuality) లేక యున్న సుదేష్ణశీలమును మిగుల యుక్తముగా పోషించి యీమె భ్రాతృప్రేమను వ్యక్తముచేయుచు, నతిగడుసుదానిగను పరమశాఠ్య యుక్తగనుజేసి, యీమెశీలమున కొకవిధమగు నైచ్యము నాపాదించినాఁడు (lowered her character). అజ్ఞాతవాస నియమమునంజేసి ద్రౌపదీభీముల వృత్తమునందు గలిగిన విభేదమును, వారి మనములందు గలుగు భావసంఘర్షణమును జక్కగాఁజూపుచు వారిమనోవృత్తులను సమయానుకూలంబుగ వెలిపుచ్చుచు వారిశీలముల నతిరమ్యంబుగ పోషించినాఁడు. నన్నయ ద్రౌపది తిక్కనచిత్రించిన ద్రౌపదివలె సచేతనంబై యున్నట్లగపడదు. వస్త్రాపహరణ సందర్భమున ద్రౌపదియొక్క భావవృత్తులను, శీలచ్ఛాయలను నన్నయ యేమియుఁగనుపఱపలేక పోయినాఁడు. ద్రౌపది యజ్ఞాతవాసకాలమునఁ

దాను మెలంగు రీతినిగూర్చి ధర్మజుఁ డడిగినప్పు డాతనికి బ్రత్యుత్తరము నొసంగునపుడు చూపిన యాత్మవిశ్వాసముతోఁ గూడిన యనాదరమం దస్మితభావము, సుదేష్ణకొలువులోఁ జేరనరిగి యామెయొద్దఁ బ్రవేశించుతటి వ్యక్తముచేసిన ఆత్మగౌరవము, "గరువతనము," మహిమాదికము, వివేకసుహితత్వమును, కీచకుని వారించుటకుగా నెత్తిన యెత్తుగడలు, తుదకు కోపమువచ్చి యానీచుని జంకించినరీతి, కీచకునింటికి పంప నమకట్టిన సుదేష్ణతో, కీచకునివలనఁ గలుగు భయపరాభవాదుల మాట యెత్తకయే, ఆత్మగౌరవమును, మొదట తాను జేసినసమయమునే, పురస్కరించుకొని గంభీరముగా బ్రతిఘటించుచుఁ బలికి తప్పించుకొనఁ జూచినరీతియు, వెళ్ళకతప్పక వచ్చినపుడు "పాండుపుత్రులకేనువప్పని మనంబుగలుగుదాన" నగుటచే "నన్నుఁ గేవలమును ముట్ట నెవ్వరికివచ్చును" అని తలంచి "హృదయపుండరీకమున బుండరీకాక్షు నిక్షేపించుకొని" సుదేష్ణ మందిరంబు వెడలుసమయమున జూపిన ఆత్మ పాతివ్రత్యబలము, మనోధైర్యము, భక్తివిశ్వాసములును; విరటుని సభలో "కులసతుల గరువచందము దొలఁగఁగ నట్లునికిఁ దగునె" యని ప్రశ్నించిన ధర్మజుని ప్రశ్నకు సాభిప్రాయముగా, చమత్కారముగా తనగరువతనమును నిలుపుకొనుచు, ధర్మజుని నెత్తిపొడుచుచు బదులుపల్కినరీతియు, కీచకునినిర్జింప నియోగించునదై భీమునియొద్దఁజేరి యాతనినాకార్యమునకై పురికొల్పినరీతియు, మఱునాఁడు కీచకునిమాటలకు "మెత్తపడినయట్లు సుభగమైయుండి మాపుగాఁ జూచి" కర్జంబు దప్పకుండ మిగుల జాగరూకతతో నెట్లు సంకేతంబు సేసినదియును కీచకుని చావుఁజూచి చేసిన స్త్రీ సహజములగుచేష్టలును, ఉపకీచకులవధానంతరము సహోదరమరణ శోకాతుర యగు కైకేయికడకుం జనునప్పుడు పొంగిపొరలి వచ్చుచున్న 'సమ్మదపూరమునకు గరువతనమను బలితంపు

గట్టువెట్టి', ధీరయై వికృతి లేక పలికినరీతియు, నాద్రౌపదియొక్క స్వభావస్వరూపములను రెంటినిగూడ నెంతచక్కఁగాఁ జిత్రించిచూపుచున్నవో గమనింపుఁడు. కష్టములందు సహితము ధైర్య స్థైర్యములు, ఆత్మవిశ్వాసము, నిగ్రహము, ఆత్మగౌరవము, ముఖ్యముగా 'గరువతనము' ఇవియే యీమె స్వభావమునఁ బ్రధానగుణములుగాఁ జూపినాఁడు తిక్కన. ఈమె "గరువతనము"ను గూర్చి స్వయముగనేగాక కీచకుఁడు ధర్మజుఁడు, సుదేష్ణ మొదలగు పాత్రలచేఁగూడ పలుమారు ప్రశంసింపఁ జేయుటచే, నిది యీమెయెడల నొక ప్రత్యేకలక్షణముగాఁ జూపి పోషింపఁదలచిన ట్లున్నాఁడు. తిక్కన ద్రౌపదిశీలములోని ప్రధానలక్షణము 'గరువతనమై' నట్లే తిక్కన సుదేష్ణశీలములోని ప్రధానగుణము 'శాఠ్యమై'నట్లది యామెచేసిన ప్రతిస్వల్పకృత్యములోఁ గూడ నెట్లు వ్యక్తింపఁబడెనో యిదివఱకే గమనించియున్నాము.

## తిక్కన రసపోషణ రీతులు

తిక్కనార్యుని పాత్రపోషణ పద్ధతులవలెనే రసపోషణరీతులు ననితరసాధారణములు. ఈతని కవితాకళ కంతకునుగూడ స్వాభావికత్వగుణమే (realism) మూలతత్త్వమగుటచే, నొక్కొకచో కతిచిత్పదప్రయోగముచేతనే యాయాపాత్రల స్వభావోన్మీలనమును సాధించినట్లే; ఆయాసందర్భముల యందలి పాత్రల మనోవృత్తులను, వారి సహజచేష్టలను నత్యల్పముగ వర్ణించుటచేతనే యాసన్నివేశమును మనకు గోచరింపఁజేసి యారసస్ఫురణను గలిగించుచుండును. ద్రౌపది యందలి మోహాంధునఁ బరితాపమును బొందు కీచకుని శృంగారభావములను, చేష్టలను వర్ణించుచు విప్రలంభశృంగారరసము నతిరమ్యముగాఁ బోషించినాఁడు. కీచకుని శృంగారభావములయొక్కయు, మనోవృత్తులయొక్కయు, గమనవైఖరుల నెన్నిరీతుల వర్ణించి రసము పుట్టించి

నాఁడో యిదివఱకే చూచినాము. ఇఁక దక్షిణగోగ్రహణసందర్భమునకు, నంతకంటె నుత్తరగోగ్రహణ సందర్భమునఁ 'వీరరసమయాత్మకుఁడగు' నర్జునుని పరాక్రమ విజృంభణము వర్ణించుపట్లను, తిక్కనార్యుఁడు తనవీరరస పోషణచాతుర్యమును వెల్లడించెను. ఇట్లు ప్రధానరసముల కీయాశ్వాసమునఁ బ్రాధాన్యమిచ్చి తక్కినహాస్య, రౌద్రాదుల నాయా సందర్భానుసారముగా స్ఫురింపఁజేసెను. సింహబల ప్రభృతి కీచక విధ్వంసనంబునందెలివొంది, పురంబు సొచ్చి రాజవీథి నరుగు ద్రౌపదిని జూచి పులిఁగనుఁగొన్న లేఁడులనుబోలి భీతిఁగలంగి "గరమున నుదగ్ర మప్పళించి యసుర్మరొ రక్కసి యంచు నల్ల ములుకు వారున్నై" యున్న పురజనుల భయచేష్టలను వర్ణించుచు హాస్యరసస్ఫురణ కవకాశ ము గలిగించినాఁడు తిక్కన. ద్రౌపదియు నంతరంగమున నిండినహాస్య రసంబు మోముపై వెలివిరియంగనీక చనినదఁట. ఉత్తరుఁడు

"తెప్పించి తొడుగు మీవని
యొప్పించిన నిట్టునట్టు నొఅవలుగా మైఁ
గప్పికొని యాబృహన్నల"యుఁ

గొంత హాస్యరస స్ఫురణమునకుఁ గారకుండయ్యెను.

రౌద్రరసస్ఫూర్తి భీమునియందే మనకుఁ దరచుగాఁ బొడసూపు చుండును. కీచకునిచేఁ బరాభవింపఁబడి యార్తయై విరటునిసభఁ జేరి మొఱవెట్టుచున్న ద్రౌపది సభలోనుండి చూచిన భీముని ఘనతరకోప వేగమున నిప్పులురాలు కన్నులయందును, సాంద్రఘర్మసలిలంబుగ్రమ్మిన యంగంబు లందును, 'నితాంతపంతపీడనరటదాస్యరంగవికటభ్రుకుటీ చటులప్రవృత్తనర్తనఘటనాప్రకారభయదస్ఫురణాపరిణద్ధమూర్తి' యం దును రౌద్రరస మెట్లు మూర్తీభవించినదో యింతకు పూర్వమే గమ నించియున్నాము. భీమునిరౌద్రరూపమును వర్ణించుపట్లఁ దిక్కనా

ర్యాఁడు సందర్భమునకుఁ దగిన భాష చేతనే యా రౌద్రస్వరూపము నెట్లు ధ్వనింపఁజేసెనో చూడుఁడు. భీముఁ డుపకీచకులం జంపు సందర్భమున "నాదువల్లభను వీండ్రును నింత చేసిరే యనుచు సరోష సంభ్రమత నాయిత్తమై" యొక్క—

"యున్నతావనీజంబు వెఱికి రౌద్రాతిరేక
మడర నిజభుజశిఖరంబునం దమర్చి"

"వికటభ్రూకుటిఘోరఫాల కలితస్వేదోద్భటుండుం జల
ద్వికృతోష్ఠద్వయుఁడుం బ్రవర్ధనదశావిర్భావసంభావితాం
గకుడుం జిత్రవిధానదోహల సమగ్రక్రోధవేగుండునై
బకవిధ్వంసకుఁడయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తివిస్ఫూర్తితోన్"

ఇఁక నర్ధరాత్రమున భీమునిఁజూచి పాఱు కీచకుల స్థితిని వర్ణించు సందర్భమునను, కౌరవసేనఁజూచి పాఱు నుత్తరుని వర్ణించు సందర్భమునను భయానకరసస్ఫూర్తిఁ గల్గించినాఁడు తిక్కన.

"వెలవెలఁబాఱుచు వెగడొంది పెదవుల
తడి యాఱ నెంతయుఁ దల్లడిల్లి
జల్లననంగంబు లెల్ల నిండఁ జెమర్చి
బదములుఁ గరములుఁ గుదియవడఁకు
హృదయంబు దటతట నదరంగఁ బలుకులు
దీనస్పష్టల మోము దేఱిచూచు
నెలుఁగుగద్గదికఁ దొట్రిల నేడ్చువిడుమని
ప్రార్థించు మాటఁ గీడ్పాటుదోఁప"

అని యాతని యార్తస్వరూపమును వర్ణించుచు నుత్తరుని యప్పటి బాహ్యస్వరూపమునే గాక యాతని గుండెలు తటతట గొట్టుకొనుటగూడ మనకు వినఁబడునట్లు చేసెను.

“సర్వాన్నిర్వహణేఽద్భుతం” అన్నట్లుగా తుదకైదవయాశ్వాసమున పాండవులు విరటునికిఁ దమ్మెఱింగించుకొని బయలుపడు వారై యున్న సందర్భమున నద్భుతరసస్ఫూర్తి కవకాశము గల్పించినాఁడు:

“ఇదియేమి కంక నీ వు
న్నదవృత్తిని శంకవిడిచి నాగద్దియపైఁ
బదిలంబుగఁ గూర్చుండితి
వదియును గా కిపుడు డిగ వహంకారమునన్”

అని పలికిన విరటునకు మందహాసంబుచేసి సంక్రందన నందనుండు

“కౌరవకులోన్నతుఁ డార్యనికాయసమ్మత
ఖ్యాతచరిత్రుఁ డీచిఱుతగద్దియకుం దగఁడే నరేశ్వరా.”

అని బదులు చెప్పుచు నాతని విస్మయసంశయములు పెనంగొన నాశ్చర్యరసాంబుధిని ముంచివేసినాఁడు.

శోకరసావిష్కరణము నెట్లు సాధించినాఁడో చూచుట కాశ్రమవాస పర్వమున ధృతరాష్ట్రుఁడు గాంధారీ సహితుఁడై వనంబునకుఁ బోవు సందర్భము నొకదాని గ్రహింతము. వారు నగరు వెడలి

“గొంతి మొదలైన కౌరవ
కాంతాజనులెల్ల నెవ్వగలఁ బొగులుచుఁ బ
క్ష్మాంతంబుల బాష్పసలిల
సంతానము లురలఁ దోన చనుదేరంగన్

ఏగుచుండిరట.

“పాండవాగ్రజుఁ డక్కురుభర్త వలను
శోకదీనుఁడై తప్పక చూచి యేడ్చి

వా మహారాజముఖ్యు యెందరిగెదనుచు
నోడలు కంపింపఁ జదికిలఁబడియెనధిప.

ఆ ధర్మజుని స్థితి, పలుకులు, కృత్యములు, వర్ణించి యెంతలో నా శోక రసమును పెంపొందించినాఁడో చూడుఁడు. ఏమియు చేయలేక యేడ్చి యేడ్చి తుదకుఁ 'నోడలు కంపింపఁ జదికిలబడియె' ననుట, యీ సందర్భమున నెంత స్వాభావికమై రసోద్బోధకం బగుచున్నది. ఇంకను

"నరుఁడనునయించె వెసన
న్నరపతి నెత్తుచును దానవయమును వనటం
బురపురఁ బొక్కెం గురు భూ
వర యద్దెస తెలుఁగురాదు వాక్రువ్వంగన్"

ఈ తుదివాక్యముచే నా స్థితివర్ణింప శక్యముకానిదని చెప్పుచు నా శోక రసము నెట్లు పరాకోటి నధిష్ఠింపఁ జేసినాఁడో గమనింపుఁడు. పిదప కుంతియు నరణ్యమునకుఁ బోవ సిద్ధపడుటయు, ధర్మజాదులు వలదని ప్రార్థించుటయు, నా సందర్భమున వారి సంభావణంబులు, చేష్టలు, ఏడ్పులు, ఓదార్పులు, నెంతయు నుదాత్తంబులై, యెట్టి ధైర్యవం తున కైనను కన్నీళ్లు దెప్పించునవై యున్నవి !

## తిక్కనరచన——నాటకరీతులు

తిక్కనార్యుని రచనయందలి నాటకరీతులను (dramatic elements) గూర్చి యింతకుఁబూర్వ మాయాసందర్భములఁ గొంత తెలు పఁబడియే యున్నది. కావున నా రీతి లక్షణములనుమాత్ర మించుక గ్రహింతము. విరాటపర్వము నొక ప్రబంధముగాఁ జేయనెంచినను, అందు నాటకమందువలె వస్త్వైక్యము (unity of plot) నెట్లు సాధించి నాఁడో చూచి యున్నాము. కథా వస్తువు నాటకమందు నాందీపద్య

మున వలె కథాప్రారంభముననే 'మహిత సముజ్జ్వలాకృతు'లన్న పద్యమున సూచింపఁబడినది. మూలములోని పర్వములవలెనే యిందలి యాశ్వాసములు నైదే యున్నను, అందలి కథాంశముల నాశ్వాసములుగ విభాగించుపట్ల తిక్కన కొంత స్వాతంత్ర్యము వహించినాఁడు. పూర్వాశ్వాసములందలి కథాంశము లుత్తరాశ్వాసము కథ కెట్లు దారి తీయుచు సూచకము లగునో సందర్భానుకూలముగా వ్యక్తము చేసినాఁడు. ఈ పర్వము 'నానారసాభ్యుదయోల్లాసి' యని చెప్పుచు శృంగార వీరములకుఁ బ్రాధాన్యము కల్పించి, "కుర్యాన్నిర్వహణేద్భుతం" అను నాటక నియమమున కనుకూలముగునట్లుగాఁ జివర నద్భుతరసమును బోషించినాఁడు. ఈ విరాటపర్వకథ మంగళాంతమే యగుటచే తిక్కన కేమియు చిక్కులేకపోయినది. కావుననె యుత్తరావివాహము నత్యుత్సాహముతో వర్ణించినాఁడు. ఇట్టి లక్షణములన్నియు దీనియం దీతనికిఁ గుదిరినవి గనుకనే మొట్టమొదట దీనినిగూర్చి యంతగాఁ బొగడినాఁడు తిక్కన. ఇక వస్తువిస్తర విషయమును గమనింతము. మహితసముజ్జ్వలాకృతులగు పాండవు లంగనాసహితులై యహితుల కభేద్యమగు నాపదుమూఁడగు నేఁడు గడపి బయలువడుటగదా యిందలివస్తువు. ఈ విషయమునే బీజరూపముగాఁ,—

'ఒకనాఁ డేమను నాపద
లను విడుమర గాంచి విప్రులం జుట్టలఁ బె
ట్టుకొని సుఖముండఁ బడయుదు మొకో'

యని ధర్మజునిచేఁ బలికించి,

"మనలోన నెవ్వఁ డేమ్మెయిఁ
బనివెంటను విరటుమనము వడయూద మది యె

ల్లను నేప్పజెంచి యందఱు
తనతనమదినున్న తెలుఁగు నేర్పడ చెప్పుఁడా"

అని కార్యారంభమును సూచించినవాఁడై నాఁడు. పాండవు లిట్లువిరటుని కొలువుఁ జేరి కాలముగడుపుచుండ రెండవయాశ్వాసమున సుదేష్ణ యింటనున్న ద్రౌపదిని జూచి కీచకుఁడు మోహించుట, దాని మూలమునఁ గలిగిన 'యవాంతరార్థ విచ్ఛేదమునకు' భీమునిచే రహస్యము బయలు పడకుండఁగా సాధింపఁబడినకీచకవధ, "అచ్ఛేదకారణం" బగుటచే బిందువు సూచింపఁబడిన దనవచ్చును. ఈ కీచక వృత్తాంతము కథాప్రవృత్తి కొకవిధమగు సంకీర్ణత్వము (complexity) నాపాదించిన దన్నమాట. ఈ సంకీర్ణత్వము భీముని కీచకవధ మూలముగా పెంపొంది, యీకీచక వధ వృత్తాంతమును చారులవలన విన్న దుర్యోధనుఁడు పాండవుల నెట్లైన బయలువెట్ట నుద్యోగించియున్నవాఁ డగుటచే విరటునియొద్ద పాండవులయునికి శంకించి, వీరిని బయలువెట్టుటకుగా విరటునిపై నెత్తిపోవలయునని నిశ్చయించెననుటలో నుచ్ఛస్థానమును బొందినది (reached the crisis). ఈ దుర్యోధన ప్రయత్నమే 'పతాక' యని చెప్పఁదగియున్నది. దక్షిణ గోగ్రహణసందర్భమునఁ దాము బయలుపడక విరటుని విడిపించి సుశర్మ నోడించుటచేతనే 'ప్రాప్త్యాశ' కలిగినది. దుర్యోధనుని యుద్దేశము మూలముగా, పాండవు లహితుల కప్రభేద్యమైన ఆయజ్ఞాతవాస సమయమును దాఁటుట విషయమునఁ గలిగినచిక్కు (complexity) దక్షిణ గోగ్రహణ విజయముచే కొంత విశ్లేషత్వ మార్గమును (resolution) బట్టుట కారంభించిన దన్నమాట. కథాసంకీర్ణత్వమునందలి యుచ్ఛస్థానము (crisis) సామాన్యముగా షేక్స్పియర్ కాళిదాసాదులవలెనే, యైదాశ్వాసములలోఁ జెప్పఁబడిన యీ కథలో మధ్యభాగముననే, అనఁగా మూఁడవ యాశ్వాసపు నడిమిభాగ

మనసే పెట్టుటలో తిక్కనార్యుఁడు చూపిన నాటకకళాభిజ్ఞతావైభవము నిదిఁ అకు గమనించియే యున్నాము. కాళిదాసుకూడ నేడంకములచే నొప్పుచున్న శాకుంతలనాటక చక్రమునకు నాభివలె (లేదా, ఇరుసువలె) నున్న దుర్వాసశాపమును నాలుగవయంకము మొదటనే, అనఁగా గ్రంథమునకు మధ్యముననే,యుంచి తన కళాచాతుర్యమును వెలయింపఁ జేసినాఁడు. ఉత్తరగోగ్రహణ సందర్భమున నర్జునుఁడు బయలువడుట, భీష్ముఁ డజ్ఞాతవాస వత్సరవ్యాప్తి నిరూపించి ద్రోణదుర్యోధనాదుల సందేహమును బాపుట, యర్జునుని యుత్తరగోగ్రహణ విజయము మొదలగునవి 'నియతాప్తి'ని సూచించుచున్నవి. మఱునాఁడుదయమున ధర్మజుఁడు విరటుని సింహాసనము నాక్రమించుట కారణముగా పాండవులు బయలువడుట, దాని ఫలితముగా నుత్తరావివాహము ఫలాగమమును సూచించుచున్నవి. ఇట్లే విరాటపర్వ రచనయందు తిక్కనార్యుఁడు నాటకమునకు వలయు సంధ్యాది లక్షణములను గూడ నొకవిధముగ సమకూర్చినవాఁడని చెప్పవచ్చును. ఆయాపాత్రల స్వభావమున కనుగుణంబులును, సయుక్తికంబులు, సక్రమంబులు నగు సంభాషణల మూలముననూ, ఆయాసందర్భముల నామాటలాడు వారియొక్కయు, వినువారియొక్కయు నాకారేంగితములను, హావభావాదులనువర్ణించి,నాటకకర్త యాయాసందర్భముల నాయాపాత్రలు చేయవలసిన పనులను దెలుపు (stage directions) రీతి నా పాత్రలను మన కనులయెదుటఁ బెట్టుచుండుటచేతను, రసానుగుణంబుగ వారి మనోవృత్తులను వివరించుచు నెక్కడికక్కడ నాయాపాత్రల కృత్యములను, చేష్టలను (action) పదములచే నతిస్వాభావికముగ వర్ణించి చూపుచుండుటచేతను, తిక్కనార్యుఁడు తనరచనకు నాటకతాలక్షణ మబ్బునట్లు చేసినాఁడు. మఱియొకవిశేష మేమఁగా, నాటకము లేదోయొక

విధమగు వెలుఁగులోఁ జూడఁదగినవే కాని చీఁకటిలోఁ జూడఁదగినవి కావు. కాని తిక్కనార్యుఁడు చీఁకటిలో జరిగిన ద్రౌపదీభీముల సంభాషణా సన్నివేశమును, భీమకీచకులయుద్ధమును గూడ మనకనుల కగపడునట్లు చేసినాఁడు. మూలమున నంత వ్యక్తములుగ లేని (hazy) ఆయా పాత్రలను, వారిగుణశీలములను సువ్యక్తముగఁజేసి వారి ప్రత్యేకవ్యక్తిత్వమును (individuality) స్ఫుటపఱచినాఁడు. మొత్తముమీఁద నీతని కవితకు ముఖ్యలక్షణంబగు 'స్వాభావికతా' గుణమే యాభారతకథ యెప్పుడో యెచ్చటనో జరిగినదివలెఁ గాక, మనకనులయెదుట జరుగుచున్నదానివలెఁ బ్రత్యక్షానుభవములోనికిఁ దెచ్చుటకు విశేషముగాఁ దోడ్పడినదని చెప్పవలసియున్నది. ఈగుణమునే యాతనిభాషాశైలులలోఁ గూడ మనము గుర్తింపవలసియున్నది.

## తిక్కనార్యుని భాషాశైలులు

ఈకవి చిత్రించినపాత్రము లతిమానుషలక్షణములు (super-natural) కలవారు గాని, లేక కొయ్యబొమ్మలవలె చలనములేక యున్నవారు గాని కాక మానవమాత్రులును, స్వవ్యాపారమందు వ్యాపృతులునై యున్నట్లే, వారిభావములు నతిమానుషములు, సాంకేతికములు (conventional), కృత్రిమములు గాకుండుటచే, వారిభాషయు సహజము, స్వాభావికము, నకృత్రిమమునై యొప్పుచున్నది. ఇట్టి స్వాభావికత్వమును సాధించుటకుఁగా నీతఁ డవలంబించిన రచనారీతియొక్క విశేషగుణములను, మన మారయవలసియున్నది.

౧. పూర్వోత్తరసందర్భములకుఁ జక్కనిపొందిక కల్పించుట— ద్రౌపది, ధర్మజభీమాదులు మొదట తా మెట్లు సంప్రతించుకొనినది, దానికిఁ దగినట్లుగనే వీరు విరటునికొల్వు చేరు సందర్భమున నాయా

సన్నివేశము లెట్లు కుదిరినది యిదివఱకే పరీక్షించియున్నాము. అర్జు నుఁడు గోగ్రహణసందర్భమునఁ గురుబలంబులఁ గ్రోశద్వయమాత్రంబునం గూడ మట్టి తలయెత్తి చూచి యన్నటి కౌగవసేనా సన్నివేశము నంత నుత్తరున కెఱింగించి, "కురురా జెట నున్నవాఁ డొకో"; "విచ్చి చనకుండ పసులం దెచ్చుట మునుమున్న వలయు తెఱఁగు" అని యీ రీతి తాను చేయఁదలంచిన యుద్ధక్రమమంతయుఁ (plan of attack) దెలియఁజెప్పి, తదనుగుణంబుగనే యుద్ధక్రమము నడిపి విజయము సాధించెను. భీముఁడు కీచకుని సంకేతప్రదేశమునకు రప్పింపమని చెప్పియు, "వచ్చిన నాసొబగునిం దెగఁజూచి నీకుం జూపి నీచిత్తంబు వడసెద" అని చెప్పినదానికి సరిగనే సూర్యాస్తమయం బైనపిదప నాకృశోదరి వృకోదరుకడకుం జని సమయ మయ్యెనని చెప్పి, యాతనితోన వెనుక నల్ల నరిగినట్లును, ఆతఁడు నెమ్మేను పర్యంకంబున కనతిదూరంబున నోసరిల నునిచినట్లును, తుద "కనలము గూఢయత్నమున నయ్యెడకుం గొనివచ్చి దానిఁ జయ్యనఁ వెలుఁగొందఁజేసి" యామెకా 'విసుమానవుఁ బీనుఁగు'నుఁ జూపినట్లును ప్రాచీన మూలపాఠమునందు లేని విషయ మంతయుఁ జేర్చి రచించినాఁడు. ఈ తరుఁడు తండ్రి కుత్తరగోగ్ర హణ విజయ సందర్భమును దెలుపుచు, తాను కురుసేనఁ జూచి భయ మొంది రథము డిగ్గి పాఱినది మొదలు జరిగిన వృత్తాంతమంతయు యుద్ధక్రమముతోఁ గూడ నెట్లు జరిగినదిగా ముందు వర్ణింపఁబడినదో యట్లే వర్ణించి చెప్పునట్లు చేసినాఁడు.

"తేన తే నిర్జితా గావ స్తేన తే కురవో జితాః,
తస్య తత్కర్మ వీరస్య న మయా తాత యత్కృతమ్"

అని రెండుమూఁడు శ్లోకములుమాత్రమే కలవు మూలములో. వెనుక జరి గిన విషయములనుగూర్చి మరల చెప్పవలసి వచ్చినపు డాయాపాత్ర

లాయా సందర్భములఁ జెప్పినమాటలనే మరల ననువదించి చెప్పునట్లు చేయుచుండును. ద్రౌపది భీముఁ డడుగఁగాఁ దన భంగపాటునుగూర్చి

"జన్నరూ, పెఱిఁగియు నేన చెప్పవిన నిష్టము గల్గుట చాలలెస్స య
త్తెఱఁ గెఱిఁగించెదఁ విను మెల్లముగా మొదలింట నుండియున్"

అని పలికినప్పు డామె వెనుకఁ గీచకుని జంకింపఁదలంచి కోపముతోఁ బలికిన "దుర్వారోద్య" మేత్యాదిపద్యమునే మరల నిచ్చట ననువదించునట్లు చేసినాఁడు.

౨. ఉపమాలంకార ప్రయోగము—సామాన్యముగా తిక్కన యలంకారములనే ప్రయోగింపఁడు. ప్రయోగించినపు డాదృశ్యము సునకండ్లకుఁ గట్టునట్లు చేయుటకుఁగా సాధారణముగా నుపమాలంకారమునే—పూర్ణోపమనే—ప్రయోగించుచుండును. కీచకుఁడు

" సింగం బున్న గుహానికేతమునకున్ శీఘ్రుంబునన్ వచ్చు మా
తంగంబుం బురడించుచుం బవనపుత్ర స్వీకృతంబైన యా
రంగాగారము చేరవచ్చె."

ఇక్కడ భీముఁడు సింహము, కీచకుఁడు మాతంగము. కౌంతేయుఁ డుద్ధమైన పిదప

" వాని నడంగఁ బట్టి పడవైచి మహోగ్రత నాక్రమించెఁ బం
చానన మేణముం బొదవునట్లు."

భీముఁడు కీచకుని గ్రిందఁ బడవైచి యాక్రమించు సందర్భమున నాతఁడు పంచాననము, కీచకుఁడు ఏణము నైనారు. సందర్భానుకూలముగా మార్చినాఁడు. అప్పుడు కీచకుఁ డుద్భటుండై "సమీరసుతు నల్కకుఁ బ్రాఁకిడినట్లు వీఁకతోన్" నెగసెనఁట. తీఁగెకుఁ బ్రాఁకు వెట్టిన నందిపుచ్చుకొనినట్లు పైకెట్లు విజృంభించునో యట్లే భీముని

యల్కాయు కీచకునితోడనే పైకి నెగసినవంట. అంత నీతని పిడికిటి పోటు దిన్న కీచకుఁడు నేలంబడుటను దెలుపుట కట్టి యుపమానమును గూర్చెనో చూడుఁడు:

"పల్లవప్రసూన ఫలభరితంబగు
మ్రాను గూలఁ ద్రోయు మత్తగజముఁ
బోలె వివిధ రత్నభూషణ భూషితుం
డైన సూతుఁ గూల్చె ననిలసుతుఁడు."

యుద్ధవర్ణనసందర్భమున నీతఁ డీ యలంకార ప్రయోగము విశేషముగా నొనర్చిన ట్లగపడును.

"నరు లొరులు దృశ్యములపైఁ
బరఁగింపఁగఁ జూడ్కు లెట్లు పడుఁ దప్పక య
ప్పురుషున నగుఁ డేయు నిశిత
శరములు లక్ష్యములు దప్పి నన వించుకయున్."

"కరి సాచిన తుంగమడువు
పరుసున మొన చాఁపకట్టుపడియె నతనిచేన్."

"తేజోధనుఁడగు నరుఁ డు
ద్రాఘితగతి నడుమ మెఱసి బడబాగ్ని దళం
బై జలనిధిఁ ద్రెక్కొనియెడు
నోజం గురుబలము పేర్మి యుడిపెం ద్రోణున్."

"సవ్యసాచి బాణసంఘుంబు మత్తశుం
డాల ఘూర్ణలీల సేలిపలిపె."

కేసరివిక్రముండు "బాణజాలవిన్యాసమునన్ వెసం బొదివె నర్కసుతుం గరుడుండు పాము నుద్భాసితపక్షుఁడై పొదువుభంగి." ఇచ్చట బాణజాలవిన్యాసమునకు గరుడుని 'యుద్భాసిత పక్షముల'కు నౌపమ్య మెంత చక్కగా సరిపోయినదో గమనింపుఁడు.

"సంగ్రామం బభిరామం బయ్యెను ఘోరప్రకారంబయ్యె" నని వర్ణించు సందర్భమున నుపమాలంకారమును మిగుల దీర్ఘముగఁ బెంచినాఁడు. ఇట్టి దీర్ఘోపమల (long drawn out similes) నచ్చటచ్చట తిక్కనార్యుఁడు ప్రయోగించుచు నేయుండును.

"ప్రళయాంభోధరముక్త సాంద్రవిసరత్పాషాణ వర్షంబు మి
క్కిలియై శైలము గప్పునట్లు నరునక్షీణాస్త్రసంతాన మి
ట్టలమై కప్పినఁ దీవ్రమారుతము గాఢవ్యాప్తి జీమూతమం
డలిఁ బోలెన్ విరియించె భానుజుఁ డుదస్త్రాంభోజ్వాలాకారుఁడై."

దీర్ఘతరంబైన రూపకము (a prolonged metaphor) న కుదాహరణము:

"రోషంబు భీషణ రూపమై చెలువొంద
 నతులకేతువు శిఖయై వెలుంగ
శరజాలములు పటుజ్వాలలై నిగుడ న
 ర్కతనూభవోగ్రాగ్ని ప్రజ్వరిల్ల
నుద్ధతి సైఁపక యుజ్జ్వలదివ్య ప
 తాక మెఱుంగు గా పలితధరణి
రథనేమిరవము గర్జనముగ శరపరం
 పరలు ధారలుగాఁగఁ బరఁగియుండె

నర్జునాంబుదం బనన్యసామాన్య స
ముద్యమమున ముఖపయోరుహముల
కాంతి దఱిఁగ యపుడు కౌరవసేనా స
రోవరంబు దీనభావ మొంద."

తిక్కనార్యుని యుపమానములు కొన్ని యాతని మానసికవృత్తివైభవము (intellectual similes)ను సూచించుచుండును. "రాగాదివికార నిరాసనంబునం బ్రసన్నయగు బుద్ధియుంబోలె సింహబల ప్రభృతి కీచకవిధ్వంసనంబునం దెలివొందె"నది ద్రౌపది.

నర్తనాగారము—"వివేకరహితుహృదయంబునుంబోలెఁ దమోదూషితము, విదగ్ధవనితాప్రేమంబునుంబోలె దుర్నిరూప్యము, అనభ్యస్త శాస్త్రంబునుంబోలె దుర్గమంబు, స్వప్నలబ్ధపదార్థంబునుంబోలె నదృష్టిగోచరంబు, విమతకావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబు" నై యున్నదఁట.

"కుంతీసుతకాంతా చింతామహాంధకారముతో, సంతమసము మచ్చరించిన దన్నట్లుగా ప్రభాతం బయ్యె"నఁట.

తిక్కనార్యుని యుపమాలంకార ప్రయోగవైచిత్ర్యము పరిశీలించిన కొలఁది పెంపొందుచునే యుండును.

3. సందర్భానుకూలముగ భావమును స్ఫురింపఁ జేయుపదబంధము—పదరచన, (Sound echoing the Sense).—ధర్మజుఁడు బీభత్సుని, నకులుని, ద్రౌపదినిజూచి ఘూర్ణమాన మానసుఁడగుచు, నెలుఁగు చందంబువేఱుగా, ఖిన్నాంతఃకరణుఁడగుచు, వారెట్లు మెలంగుదురో యనిపలికిన పలుకు లాతని హృద్గతావేదనను వ్యక్తము చేయుచునే యున్నవి. ఈసందర్భములందును, ద్రౌపది తనపడినపతిశోకంబు నెటఁ

గించు సందర్భమునఁ గూడ నీతని యుత్పలమాలా వృత్తరచన మెంత యు సందర్భానుకూలమై యున్నది.

వర్ణనసందర్భముల సామాన్యముగా సమాంతర వాక్యములుగల పాదములతోఁగూడిన సీసపద్యములను వాడుచుండుటయేగాక, మొదటి నాలుగుపాదములలో వస్తుస్వరూపమును వర్ణించి, పిదప దానిఁ జూచి నందువలనఁ గలుగు భావవృత్తిని (impression on the mind) వర్ణించు చుండుటను శమీతరువుయొక్క– "చండమూర్తి"ని వర్ణించిన సందర్భమునఁ బరికించియే యున్నాము. భీముని కోపాటోపమును పటుదీర్ఘ సమాసముచేఁ జక్కఁగ ధ్వనింపఁజేయుటయు గమనించి యున్నాము. 'దుర్వారోద్యమేత్యాది' పద్యమునందలి పటుదీర్ఘ సమాసము, తుదకు 'కీచకా' యను సంబోధనము, ద్రౌపది కీచకుని జంకించుట కెంతయుఁ దగియున్నవని తలఁచియున్నాము. కీచకుని యురియాటము నొక గీతపద్యమున "తుదిముట్టగాన నిశ్చయించుఁ గలఁగుఁ దేఱు"అనియు; "చిడిముడిపాటును చిడిముడిపడు, మ్రానుపడు, వెడంగుపడు, వెనుంబడుఁ, దల్లడపడు, దురంత చింతబారికినగపడు, సింహబలుఁడు" అనియు, దుర్యోధనుని చారులు పాండవులను వెనకుటను పరగఁ బొదరు పొదరు పల్లంబు పల్లంబు etc." అనియు వర్ణించి యాపద రచనచేతనే యాభావములను స్ఫురింపఁజేసినాఁడు.

ధర్మజుఁడు విరటునిఁబట్టిన సుశర్మపైకి భీమునిఁ బురికొల్పుట యందలి యాతురమును–'సత్వరంబగు చిత్తంబు' అను పదములచే స్ఫురింపఁజేసినాఁడు:

"ఎయిదు మెయిదుము రథరయ మెసక మెసఁగ"

అర్జునుని గుర్తించినయుత్తరుని యుత్సాహము:

“ననుఁబని గొమ్ము లెమ్ము కురునాథు నదల్పు మరల్పు గోవులన్.”

ఉపకీచకుల బారినుండి ద్రౌపదిని విడిపించుటకుఁగా శ్మశానము నకుఁ బోయిన భీముని క్రోధవేగమును “వికట భ్రూకుటి ఘోరఫాల కలితస్వేదోద్భటే” త్యాది పద్యరచనయే స్ఫురింపఁ జేయుచున్నది.

తనను గేలిసేయుచున్న యశ్వత్థామకుఁ గర్ణుఁడు క్రోధఘూర్ణ మానతారకుండగుచు బదులుపలుకుట యాతని స్వభావమున కెంతయుఁ దగియున్నది:

“తలఁకెడువానికిన్ మగఁడు దానఁట నన్నడకించు వాఁడిసీ, పలుకకు భీతునట్లొదుగఁ బాఱు నెఱాఱుఁడు నిన్ను నచ్చిరియే, కలనికి వచ్చితిక్”

దేవదత్త భీలరావంబునకు లేటిమెంగమువడుచు నడుచు కౌర వరాజసైన్యంబును గదిసినవాఁడు “ప్రళయ భైరవసహస్ర, గర్జనోద గ్రతర్జనుం డర్జునుండు”

కీచకునికి దినముసాగి నిలుచుట నీరచనయే స్ఫురింపఁజేయుచున్నది:

“అనుచుఁ గ్రుంకింపరాని ప్రొద్దరసి యరసి

* * * * * *

మిగుల వందిరి వందిరి పొగిలి పొగిలి.”

విరటుని యొక్కయు, నాతనికొడుకు యొక్కయు “వీరాలాప ములు” వారి యవిచారితడాంబికత్వము నెంతయు చక్కగా సూచించు చున్నవి:

“ఏమీ నిక్కమె మున్నె యుంగఁడె etc”

“తగుసారథి దొరకొనినం
బగతురభంజించు టెంత పని కదుపుల ద
వ్వుగ గొనిపోదురొకో”

శత్రువుచేఁ జిక్కిన తన్ను విడిపించిన భీమునిఁగూర్చి విరటుఁడా విస్మయము, సంతోషము జిత్తమున బెనఁగొనఁగా నిట్లనును:

"ఉపకారమొ బంటుతనమొ
కృపయో పెంపో సమగ్ర కీర్తిప్రియమో."

నానావిధ దీనాలాపములాడు నుత్తరునిఁ దేరునేరం దెచ్చి యర్జునుఁ డాతని భయముమాన్పి సారథిగాఁ జేసికొను సందర్భమున నాతనిపలుకు లెంత మృదువులై ధైర్యమును గొల్పునవై యున్నవో చూడుఁడు:

"వెఱచెకుచున్న పోటు కురువీరులతోడ నశక్యమేని య
త్తెఱఁగదియేల నీవుడుగు, తేరికిసారథిగమ్ము నాకు"

ఆయా భావములను స్ఫురింపఁజేయుటకుఁ గాని, యాయాపాత్రలగుణములను వ్యక్తపఱచుటకుఁగాని తిక్కనార్యుఁడు ప్రయోగించువిశేషణము లత్యంత సార్థకములనుట కొక్కనిదర్శనము చాలును. అర్జునుఁడుత్తరునిఁ జెట్టెక్కి గాండీవంబుదీసి యిమ్మనినసందర్భమున నాతఁడది పీనుఁగని శంకించి "నన్నీ నీచపుఁబనిఁ బనుపంగా నీకుందగునె పాపకర్మము గాదే" యనిచెప్పినపుడు, అదివిని "ధర్మనందనానుజుం డత్యాదరమున" "నమ్మము కైదువుమోపగు" నని నమ్మఁబలికెనట. తిక్కన యిచ్చట నీవిశేషణమును ధర్మనందనానుజుఁడధర్మవిషయమై యుత్తరుని ప్రేరేపింపఁడని సూచించు నుద్దేశముతోడనే వేసియున్నాఁడు. ఇందుకు నిదర్శనముగా మఱియొకచోట (4-148) నర్జునుని చేతనే యీమాట వ్యక్తము చేయించినాఁడు. ఉత్తరునికి నమ్మకముగలుగుటకై తననామములను వానియర్థములను దెల్పుచు

"పృథయుఁగఁ బలుకుదు నేయవి
తథవచనుండైన ధర్మతనయునను జుఁడఁ ౕా."

అనిపలికించినాఁడు. దీనిఁబట్టి తిక్కనార్యుఁ డాయాసందర్భముల నాయా విశేషణములను తూచి ప్రయోగించుకళాకుశలుఁ (a conscious artist) డని తెలంపఁదగియున్నది. ద్రోణుఁ డావచ్చువాఁడు ఫల్గునుఁడే యని నిశ్చయించి దుర్నిమిత్తములఁజూపి యుద్ధసన్నాహముం జేయ నుత్సహించిన సందర్భమున దుర్యోధనుఁ డాతనికి బదులుపల్కిన రీతి యాతనిస్వభావమున కెంతయుఁ దగియున్నది:

"అర్జునుఁడైననేమి సురలైనను నేమగు విఘ్నవచ్చిదో
పార్జితమైన గోగణముఁ బట్టితి మెవ్వరు వచ్చిరేని."

ఈశైలిలోనే యాతని స్వాతంత్ర్యప్రియత్వము, ఇతరులమాటను లక్ష్యముచేయ నొల్లకుండుట, ద్రోణానుపాలంభించుబుద్ధి, అర్జునునియం దసూయాపరత, మొదలగునవన్నియు స్ఫురించుచున్నవి. అర్జునుఁ డుత్తరునితో "ధార్తరాష్ట్రగజుఁ డీతనిం గదిసినప్పుడు పండువు నాకునుత్తరా" యనిపలికి అతని

"తేరుమనభారికగపడు తెఱఁగుగాంచి
యదరిబాసటలై యెవ్వ రడ్డపడిన
మెఱుఁగు మెఱసినచాడ్పునఁ దఱియఁజొరుము" అనెను.

రేఫాను ప్రాసయుక్తంబయి యీపద్యమున గంతులిడుచున్న శైలి (racy style) యందలిభావము నెంతచక్కగా వ్యక్తము చేయుచున్నదో గమనింపుఁడు.

౪. ఆంధ్రభాషాజాతీయ ప్రయోగనైపుణ్యము:—తిక్కనభారతము దేశీయపుఁబలుకుబడికి జాతీయమునకు నొకపెద్ద గని వంటిది. ఏ యొక్క కవియు నింతటి దేశీయపదజాలమును, జాతీయమును ఇంత గుణవత్తరముగా (Effectively) బ్రయోగించి యుండలేదు. అట్టి

భాషాజాతీయప్రయోగమును చేయుటచేతనే యాతని కవిత కట్టిస్వాభావికతాగుణము, మహనీయత్వము నబ్బినవి. తిక్కన భావచ్ఛాయలను సూచించుటకుగాఁ బ్రయోగించిన దేశీయపదజాల మపారము. కీచకునింటికిఁబోవు ద్రౌపదికిఁగలిగిన భయ దైన్యముల యంతరములను వర్ణించునప్పుడు ప్రయోగించిన పదజాలమును జూడుఁడ:—భయము, దైన్యము, వెగడు, తల్లడము, తలఁకుపుట్టుట, కొంకుకోలఁదికి మీఱుట, వెంబాటు, ముట్టుపాటు, వెఱఁగుపాటు, నొవ్వు, నెఱనాడుట, పగలు పగలనీనుట, దిగులుపొదువుట. కీచకుని పరితాపమును వర్ణించుచు నాతఁడు చిడిముడిపడు, మ్రానుపడు, వెడంగుపడు, వెనుంబడు, తల్లడపడు, దురంతచింతబారికి నగపడు నని చెప్పినాడు. మనోజవికారమగ్నుఁ డగు కీచకుఁడు ఉగ్గడించు, తల్లడించు, తలపోరగించు, నప్పళించు, తెగ నగ్గలించు, జనులం బరికించు, గళవళించును. సుదేష్ణ జారపాంను వర్ణించు సందర్భమున భయమున నుల్లమదరు, పుయిలోటమున మోము పుల్లగిల్లు, కలతపై చెమటలు క్రమ్మదేరు, వెగడుట చెయ్యువ్రాలుపీడుపడు, కౌతుకంబురియాడ చవులుకొనియాడు. రెండవ పర్యాయము ద్రౌపదిని సుదేష్ణమందిరమునఁ జూచి కీచకుఁడు చేయఁ దొడంగిన దుర్వికారముల నెంత స్వాభావికముగా వర్ణించినాఁడో చూడుఁడు: వెంగలిపలుకు పలుకు, నేల మునుగాళ్ళనప్పళించు, రిత్తకు రిత్త చెలఁగినవ్వు, వెడపాటపాడు, చేరువఁబొలయు, ఇక్కడక్కడఁ బడు, తగులినుమడింపఁజూచు. ద్రౌపదియందలి మోహపరితాపముచే నాతఁడు తలరు, నలంగురు, నవయు, వెచ్చనూర్చు, నొల్లఁబోవు, వెగడందు, గలంగు, పరిభ్రమించు, గొందలపడు, జగ్గడిల్లు, చేడ్పడు. ఆ సమయమున నాతని మనోవృత్తు లెన్ని విధములో! పార్థుఁడు శంఖమొత్తగా తోయధిసప్తకంబు కలఁగె, గిరివర్గమూటాడె, వసుంధర

సంచలించె, ఆశాచక్రమల్లాడె, త్రినేత్రేంద్రు పట్టము కొండలకుందె, పాతాళము ఘూర్ణిల్లె, తారకలాకులమయ్యె, వేదసంక్షోభించె. శత్రువుల శస్త్రాస్త్రసంచయము నర్జునుఁడు వ్రయ్యలు వాపె, బిట్టుత్రుంచెం నఱుమాడె, పొడిచేసె.

సందర్భానుకూలముగ నీతడు ప్రయోగించిన జాతీయము(Telugu idiom) తరువాత కవులుగాని పూర్వమున నన్నపార్యుఁడు గాని ప్రయోగించినట్లగపడదు. కాని యాపదబంధముల బిగి, శక్తి (force and vigour) యిప్పటి మన వ్యావహారికభాషలో వలెనే గనబడు చుండును. కొన్నియుదాహరణములను మాత్రము చూపెదము:

"విప్రులం జుట్టలుఁ బెట్టుకొని సుఖముండుదుమో"

"దీని నాగాదనుఁడా"

"ఈ త్రిప్పలేటికి కమలవదన" —డొంక తిరుగుడుమాటలని యిప్పుడు మన మందుము.

"కొంకు గొసరించుకయు లేక కూలఁదాఁచె"

"మీముక్కున నూర్పుగలుగ నొకమూర్ఖుని చేఁ బడితిఁగా"

"ఆపదలకల్ల నోర్చెద దానికేమి"

"విచారము కోర్కికిఁగాని వావియే"

"ఇట్టి యగాధపు బొత్తు మనంగవచ్చునే"

"నన్ను నిట్లాలి గొనఁగనేల"

"ఆకెల కొద్దుట లేదు నేనిటుఁన్"

"రాధేయుఁ డొక చీటికిం గొనఁడు"

"సంవత్సరంబునుం జేరువ చేరువల్ గడచె"

"తప్ప గ్రుంకతీఱదు నీకుఁ"

"కనికొలువు చేసికొని"

"ఆశాచక్రముల కొలఁదులు బారవెట్టంగ"

"నా నేర్చుపనుల వెంట నీకడ నిలువందలంచి"

"నేల నాలుగు చెఱఁగుల నృపులకొలువులందు వర్తించితి"

"వీనికి మార్కొనఁజాలెదు దానికి"

"ఆఁడుఁ బుట్టువులతోడన నీవును బుట్టినావు"

"వలవన్న నుడిగెడువాఁడుగాఁడు-మాయదైవము-నేనేమిచేయుదాన'

"ఆ లేమ సొలసిన చూడ్కికి జుబ్బన చూఱగాదె"

"కొనిరమ్మా చూతముగాని నీ గమనవేగంబుఁ"

"పిడుగుపడినవానిం గొఱవింజూఁడిన తెఱంగున"

"ఏడుసాగరములు నిక్కడక్కడఁబెట్టి పలుచని
రొంపి మై నలఁదికొనఁగ"

"వెనుకఁ గూడఁగ ముట్టిపట్టుకొని తన్నేఁ పల్కు లింకేటికిన్"

"అకట యూఁచుకూయు నాలకూయు లాఁతివారికై నరయవలయు"

"వీఁడొకటి కాదవునా నెఱుంగంకు"

"నెయ్యంబు తియ్యంబు నెఱప నడచి"

"వన్యసత్త్వముల పాల్పడి వచ్చినచోటఁ బూరియుఁ మొలవదె"

"నావలని మన్నన యట్టిదకాదె"

"సారథి నారయుచున్నవాఁ డెఱింగినపని సెప్పఁగాఁజలయు"

"బొమ్మ పాత్రికలకుం దెండీ"

"పసుల దయ్యమెఱుఁగు పడఁతులసంతోష మేల నాకు"

"ఎవ్విధిఁ జని తేమి యనుచు"

"చెప్పఁదొడఁగితి నింకఁ గొఱత వెట్టఁగ నేల"

"ఏచి మున్నీరు చే యీఁతనీఁద"

"తగిన వారి చెవికిఁ జేఁదుగాఁగ"

"చిత్తములం జెడనేయున్నట్టి తర మేమీరల్"

"తానట నన్నడికించువాఁడిసీ"

"తనచేతికోలఁదిచూపి క్రీడి సెలఁగె,

"కన్గిఱిపిన మాత్రలోన"

"తొల్లింటి చూఱగలదె."

"పనిఁదెపు కొంతేయుఁడు సారఁదుగాని క్రౌర్యంబునకున్"

"నీవరవాయించుక లేకపఱపవలయు రథంబున్"

ఇఁక భాషావిషయమునుఁ బరికింపఁగా నీతనికవితలో నిప్పుడర్థము మాఱిపోయిన పదజాలమెంతైనఁ గనఁబడును. ప్రయోగ వైఖరియం దును ప్రాచీనతాగుణమును బయలువెట్టు సందర్భము లనేకములు కలవు. ఇప్పు డంతగా వాడుకలో లేని ధాతువులు, భిన్నరూపములఁ జెందిన ధాతువులు ననేకములు గనఁబడును.

కూరు—"ఆశకూరిన మదితోన్"=కలుగు—'పసికి జాలఁగూర్తు నేను' = ప్రియపడు cf కూరిమి etc. త. కూర్ =అధికమగు, పొందు. త—ఆశకూర్న్దదు.

ఉడివోవు = తొలఁగిపోవు. "శక్తిని గడికండలు సేసినఁ జూచి యప్పు డాతం డుడివోక."—ఉడి + పోవు, ఉడుగు + పోవు—కాదు.

ఇప్పుడు దీనినుండి 'ఉడుగు' అను ధాతు వేర్పడినది. కన్న మున 'ఉడగు' అనియు కలదు. కావున 'ఉడుగు' అనుదానికి ప్రా మూలరూపము "ఉడి"యైయుండును—ఉడి + అగు = ఉడగు స్వర మ్యముచే (Vowel harmony) ఉడుగు, ఉడువు అయియుండున

త్రెయ్య—త్రెస్సిన "కాంతల సంకులగతిఁ ద్రెస్సితొర హారముల్" "త్రెవ్వ"—కూడఁ గలదు—"కంధరలు త్రెవ్వితలలు వ ధరరాలె" దీనినుండి ఇప్పుడు—'తెగు' ధాతువుగా నేర్పడినది. క. తె

ఎలయు—సిరియెలసి పొదల—దీనినుండి ఎలమి, మొదలగు రు ములు వచ్చియుండును.

తెలియు—బలంబులు తెలిసిన = మేల్కొనిన. వాడుక నిప్పటికి నప్పటికి గల భేదము గమనింపుఁడు.

విఱుచు = ఓడించు—"పూరాంతకారి విఱిచినయట్లు లక్ష విఱుతు." తత్త్సైన్యము సెడ, విఱిగిపాఱె భీష్ము మఱువుసొచ్చె 'తునుగు' అనునర్థ మిప్పటివలెనే యాకాలమున నున్నను, పాలువిఱ వన్నట్లుగా, సేనలు విఱిగినవనుట యిప్పుడు ప్రసిద్ధముకాదు. 'వి అనునదే 'వేఱు' రూపమునుకూడఁ బొందినది. విఱిగియే వేఱగుట

వ్రేఁగు = భారము—వ్రేఁకన, వ్రేఁకము, వ్రేఁకఁదనము— రూపములుకూడఁ గలవు "వ్రేఁకదనము దోఁచునట్లు చరింతుగా" "( పెద్దైన నోడ వారిధిఁ దరింపలేని భంగి"—భార. శాం. ౫ ఆ. ఇ యర్ధానుస్వారము – 'వ్రేంగు' రూపమును సూచించుచున్నది. క డమున ప్రోవుచేయుట, నొకదానిపై నొకటిపెట్టుట (to collect heap up) అనునర్థమున "బెరంచు" అను ధాతువుకలదు. బెరం

వెరంగు_వెరంగు_వ్రేగు_లకు సంబంధము కనఁబడుచున్నది. శబ్దరత్నా కరమున-వేఁగు=తపించు, అను దాని కిది మొదటిరూపముగాఁ దెలుపఁ బడినది. కాని తమిళ కన్నడములలో 'తపించు' అనునర్థము కలస జాతీయరూపములలో (cognate forms) రేఫ మెచ్చటను గానరాదు. 'వెం' ధాతువు. కన్న-బెంకి=వేడిమి,నిప్పు; తమి_వెక్కై; మళ-వెచ్చు, వేడియగు; కన్న-బెచ్చగె, బెచ్చనె; బెచ్చనె, మాడు=వేడిచేయు, తె-వెచ్చన. తమి_వెయిల్=సూర్యునివేఁడిమి, ఆతపము. మళ-వెయిల్, కన్న-బెసిల్ వె-వెట్ట, వేఁడిమి. ఇన్ని రూపములలో నెచ్చట రేఫము లేకుండుటచే వేఁగు-వ్రేఁగులకు సంబంధమునుగూర్చి సందేహింపవలసి యున్నది. ఇక్కడ వ్రేఁకదనము=(ద్రౌపది) గరువతనము. (dignified nature)

అఱు=క్షయించు, నశించు "ఉక్కఱ భంజింతు" cf. పెంపఱు. తమిళ. అఱు=కోయు (to cut) అఱిఱి-అట్రుం=అంతము (the end). ఇప్పుడిది 'గు' అంతమందు గ్రహించిన "అఱుగు"(=శీర్ణించు) ధాతువై వాడుకలో నున్నది. కాని 'అఱు' రూపమున నంతగా లేదు. కన్న "అఱువె" = జీర్ణించిపోవుట - (the state of being decayed or worn out.)

కిట్టు=సమీపించు. "మృగనాథునైనను గిట్టిముట్టి." ఈధాతువు తమిళ, కన్నడ, మళయాళములం దీయర్థముననే కలదు. కన్న-కిట్టు-గిట్టు=to touch, to reach. తమి-కిట్టై; మళ-కిడే = to reach, to approach. కాని యిప్పుడు తెలుఁగులో నంతవాడుక లేదు. 'అది నాకు గిట్టదు" అన్నప్పుడీధాతువే ప్రయోగింపఁబడుచుండెనేమో.

కొఱలు=ఉండు, పొందు. (శ. రత్నా.) "కఱపకతక్క రుచిత ప్రకారము శుభముం గొఱలుహితులు" ఇది ఇప్పుడువాడుకలో లేక

పోయినను, దీనిస్వరూపమే కావలయు కోఱముట్లు, "కోఱగాని" అనుపదములలోను "కొఱకు"(=ప్రయోజనమునకు) అను చతుర్థీవిభక్తి ప్రత్యయములలోను గానవచ్చుచున్నది.

మెఱయు = ప్రకాశించు—బయల్పడు (శ. రత్నా.) "తా మెఱసి బయలుపడఁ బెల్లుగవిచ్చలవిడి భోగింపక" ఇప్పుడు 'మెఱుపు మెఱసినది.' 'ఆవస్తువు 'మెఱసి' పోవుచున్నది'. 'నేను, మెఱసితిని' 'తాను మెఱసినాఁడు' అను ప్రయోగములు విరళములు. 'మెఱె' ధాతువు కన్నడమునను గలదు. "వింత తెఱవుల నేర్పుల్ మెఱయించుచు" ఇట్లు సకర్మకముగ నిప్పుడు ప్రయోగమున లేదు.

వెలుకుఱు = విహ్వలించు—చలించు; "వెలుకుఱె తాళంబీ మదిఁ దలఁచి." ఇప్పుడిది వాడుకలో నుండిపోయినది. 'బెడఁకు' అనురూపనఁ దరువాతి ప్రబంధములలో 'చలించు' అను నర్థమునఁ గానవగు. కన్నడమున పెళర్ (=భయే.) అళ్కుఱు బెళ్కుఱు అనియు, తమి_ 'పెళ్గు' (=fear, a|ram) అంజు. = అనియు గలదు. ఈ 'అంజు' ధాతువుకూడ నిప్పుడు వాడుకలో లేదు. cf. "అంజెదవుగాక నను చెంతం జేరఁగనీక"—ఉత్త—హరి.

ఈడంబోవు = వెనుదీయు. (శ. రత్నా.) "శార్దూలశుండాలాదులతో నీడంబోక పెనంగి" తమి, కన్న—ఈడు—ఈణ్డు = కలియుట (coming together, join, equality) అని యర్థము కలదు, సమానముకాక—అతిక్రమించి యని యర్థము కానోపు. ఇది యిప్పుడు ప్రచారమున లేదు.

నెక్కొను—"పాత్రిపై నెక్కొను చూడ్కి" నెల + కొను = నెక్కొను. cf. నిల్ + కొను = నిక్కొను, నిక్కు. cf. తమి—నిర్కు-ం- నిక్కాదు (నిర్కాదు) నిల్లాసు = నిలువదు.

దొరకొను—లభించు, యత్నించు, సిద్ధించు. (శ. రత్నా. "పెఱవారలు దను మెచ్చఁగెదు, తెలుఁగుల దొరకొన్న వింత తెఱవుల నేర్పుల్ మెఱయుచు" ఈ రెండుధాతువులు గూడ నీకాలమున నకర్మకముగనే గాని సకర్మకముగ ప్రయోగింపఁబడుటలేదు. కావున పై యర్థము లిచ్చుట సరిపోవునట్లులేదు. తమ తెలుఁగును తెలిసికొని నట్లయితే, "వానికూర్చిన జ్ఞానమును లభింపజేసికొనినట్లయితే" అని యర్థము చెప్పుకొనవలసి యుండును. ఈ 'దొరకొను' నుండియే అకర్మకధాతువు 'దొరకు'(=లభించు) అనున దేర్పడిన ట్లున్నది. అనఁగా దీనికి ప్రాచీనరూపము 'దొరకొను' గానోపును.

తగులు—"సంక్రందన సూతికిన్ దగిలి కన్గొనఁ జాలదె" = సక్తమై, ఆ సక్తితో. ఇప్పుడు తాఁకుట అనియర్థము. ఆధునికకన్నడము నను—'తగులు' కలదు. ప్రాచీన కన్నడమున – తాగు = to touch: తాంగు. ఇప్పుడు 'తగులుకొనిపోయినాడు' అను నప్పుడీయర్థము గానవగు.

తనుకు—"మథనాగ్ని జ్వాలలు తనుకఁగ=జ్వలింపఁగా. ఇది సందర్భానుసారమగు లక్షణార్థమైయుండు. 'తాఁకుట'యే మూలార్థము—అంటుకొనగా అనుటయు క్రమము. ఈ 'తనుకు' నుండియె 'తాంకు'—'తాంగు' 'తాఁకు' వచ్చియుండును.—కావున 'తనుకు' 'తగులు' లను 'తాఁకు' సంబంధమును గలుపుచున్నట్లున్నది.

ఏచు=విజృంభించు "ఇందిరానందను నాజ్ఞ యేచి భువనంబులఁ బ్రబ్బదె"—దీనికి మూలరూపము 'ఏఱు(=ఎక్కు)'; తమి.ఏఱు= to rise; తెలుఁగున - ఎత్తు. ఏతాము, ఎక్కుట మొదలగు పదము లీధాతువు నుండి యేర్పడి యుండును. "దానికేసిపోవుచున్నాడు" "వానికేసి.

చూచెను" అని వ్యవహారమునఁ గల 'ఏసి' అనునది 'ఏచి' యొక్క రూపాంతరమై యుండనోపు.

సుడియు—"కరువలి సుడియమి కదలక చెన్నొందు" తె-సుడి, సుడిగుండము. అను వానిలో నీ ధాతువు కనఁబడుచున్నను, ఇప్పు డది వాడుకలో 'సుట్టు'–'చుట్టు' అనురూపమున నేయున్నది. కన్న—సుత్తు

చూఁడు—"కొఱవింజూఁడిన తెఱఁగున."తమి—సుడు; కన్న—సుడు(=దాహే). 'చూడా ఱురుక్కు-అను'—'వేడిగానున్న' దనుటకిప్పుడు తమిళమున వాడుకలో నున్నది. ఇది యీయన్ని భాషలలో మిగుల ప్రాచీనంబగు ధాతువులలో నొకటి. ఇటీవలికాలమున నిది తెలుఁగులో నంత వాఁడుకలో లేదు.

అప్పళించు = కన్న-అప్పళిసు=కొట్టుట – "బాహప్పళించి"

పంబు— "పంబినకోపమున్ సమయభంగభయంబును నగ్గలించి" = అతిశయించు. ఈధాతు విటీవలికాలమున బొత్తిగా వ్యవహారమున నున్నట్లు లేదుగాని, కన్నడమున, పర్బు—పబ్బు—హబ్బు (= వ్యాపించు – ) అను రూపములుగలదై యున్నది.

తఱుగు—" నీమేను చెన్నుఁదఱిగె" = తగ్గు. 'తఱుఁగు'లో నుండియే – 'తగ్గు' – వచ్చినను ఇప్పుడర్థమునఁ వీనికి గొంతభేదముకలదు మూలధాతువు తఱ్. తఱ్ + అగు = తఱగు = ఖండించు,—తఱ్గు—తగ్గు—తక్కువ.

నచ్చి = నమ్మి – "మీలావునచ్చి"—"అమ్మా నినునమ్మి చాల విషమంబగు నిష్ఠనవాసము కొప్పికొంటి" అని 'నమ్మి' ప్రయోగము

కూడ నందే కలదు. 'ఇది నాకు నచ్చినది' అనునప్పుడుమాత్ర మీ [illegible] ధాతువు ప్రయోగింపఁబడు చున్నది. కన్న-నచ్చు' విశ్వాసే. (=) ధాతువు ప్రాచీనభాషలోనే కలదు. ఆధునికభాషలో నది 'నంబు' అను రూపమును బొందినది. తెలుఁగునను నంబిక—నమ్మికయను రూపము కలదు గదా.

భావించు = ఎంచు – తలఁచు – (శ. గత్నా.) "పాంచాలి రావించి సుదేష్ణతృష్ణ భావించుచు నిల్లనియె" మదిలో తృష్ణను తలంచుకొనిన నిచ్చట లాభమేమి? తనకు తృష్ణకలిగినట్లుగా నెదుటి వారికి 'ముఖవికారాదులచేఁ నగఁబఱచుచు"నని యర్థము చెప్పుకొనవలసియున్నది.

"భరమున నీపోరెడునెడ
బరమవిషాదంబు నీవు బలిమి మెఱసియు
ద్ధురవృత్తి జయము గొనినం
బరితోషముఁ బొందు నన్ను భావించిమదిన్"
వ. ఊహించి.

"వలలుని దెస మాలిని చూ
డ్కుల తెఱఁగెదపొందు దెలిపెడుం గంటిరె"
అని పలికినది.

విషాద సంతోషములు కలిగిన సమయమున ద్రౌపదిని "భావించి"—ఆమె ముఖవికారాదులను గుర్తించి, ఊహించి-మదిలో తర్కముచేసి—చూడ్కుల తెఱంగునుబట్టి యామె "యెదపొందు" హృద్గతాభిప్రాయమునుగనిపెట్టినదట సుదేష్ణ. అనఁగా సుదేష్ణ భావించినది—కనిపెట్టినది ద్రౌపది చూడ్కుల తెఱంగు. పిదప నాయావికారలక్షు

ణములకుఁ గారణమును 'మదినూహించినది.' దీనినిబట్టిఁ 'భావించుట' బాహ్యవ్యాపారము, ఊహించుట—మదిలో జరుగు నాంతరంగికవ్యాపారముగాఁ గన్పట్టుచున్నది. వెనుక ద్రౌపదిని రావించి సుదేష్ణతృష్ణ భావించుచుఁ బలికినది. అనఁగా తృష్ణ కలిగినట్లు ముఖవికారాదులచే వ్యక్తము చేయుచునుండెయనుట. సందర్భానుకూలముగా నీపదము నర్థము మాఱుచున్నట్లున్నది. తిక్కనార్యుని భాషా ప్రయోగ వైచిత్ర్యము, దానివలన భావ కెట్టి యపూర్వశక్తి కలుగుచున్నదో గమనింపఁదగియున్నది.

అగ్గము—"ఆపదలకు నగ్గంబయ్యెన్"=అధీనమయ్యెను. ఇది యిటీవలికాలమున నంతగా వాడుకలో లేదు. కాని దీనినుండి యేర్పడిన 'అగ్గముపడు', 'అగ్గపడు', 'అగపడు'—అను ధాతువుమాత్రము—అధీనమైనది కంటఁబడునదే గావున, 'కనఁబడు' అనునర్థమున నిత్యవ్యవహారములో నున్నది.

ఈఁగు=తొలఁగించు, నివర్తించు—"ఆంద్రకుభంగము నీఁగఁజాలువారు." కన్నడమున నిది "నీగు" (=నశించు, పోఁగొట్టు) అనురూపముకలదై యున్నది. త.నీంగు cf.—నెగయు,ఎగయు.నణిత్తు-అణిత్తు.

"ననునాఁగకు, క్రొవ్వరుగ దేని తలపడు"—అను సందర్భమున 'ఆగు' ధాతువువలెనే 'ఈఁగు' కూడా ప్రాచీనకాలమున సకర్మకముగాఁ బ్రయోగింపఁబడి యున్నది. "మెఱయు, కురియు" మొదలగునవిట్టివనేకము లింకనుగలవు. cf. "లోచనదీప్తులదర నుంకించిన నాఁగి యూఁగి" (=ఆఁపి యూఁపి).

"మనంబుల వాంఛలకుఁదగంగ నీకేపధి నీఁగువాఁడ" ఇక్కడ నిచ్చునని యే యర్థము గనఁబడుచున్నది. అది 'నీఁగు', ఇది 'ఈగు'నగునా?

తరమిడి=పరుసగా. "తరమిడి చంపింపఁజూచెదవు" కన్న-తరవిడిదు. ఈయర్థము, ఈపదముకూడ నిప్పుడు వాడుకలోనున్నట్లగపడదు. కాని 'తరవాత' 'తర్వాత' అనుపదము 'తరము'=క్రమము-అను నీరూపమునుండియే యేర్పడినట్లున్నది. cf. నన్నె-పసూ. 'తరతరంబ.'

మ్రోసిరి—"ఇట్లని మ్రోసిరిజనులు పురమునందును భూమిన్" మ్రోయు-ధాతు విప్పుడు కలదు. 'మ్రోఁగు'-మోఁగు అయినది. ఇదియే ప్రాచీనరూపమైనట్లగపడుచున్నది. తమిళ్-మురుంగు. కన్న-'మొఱె' మొఱగు-మొఱయు-మ్రోయు-మ్రోగు-(cf) సక్క-మొఱగుట, 'మొఱ' యాలకించుట. మొఱపెట్టుట, అందియల మొఱపము-etc. 'జనులు మ్రోయుట' మాత్ర మిప్పుడు వాడుకలో లేదు.

తివురు = మోఁగు-"దెసలు బీటలు వార తివురు చిందములు." దీనికి కోరు, యత్నించు' మొదలగు నర్థము లనేకము లున్నవి. కాని యిది యిప్పుడు వాడుకలోనే లేనట్లున్నది.

ఎద్దు = వెంబడించు. ఎద్దుమెద్దుమురధరయ మెసక మెసగ"- కన్న. తమి-'ఎద్దు,' ఇది ప్రాచీనధాతువే గాని యిటీవల తెలుఁగులో బొత్తుగానంతరించినట్లున్నది.

త్రెక్కొను = త్రాగు-మింగు "నడుము మెఱసి బడబాగ్ని దళం బై జలనిధిఁ ద్రెక్కొనియెడునోజం." ఇదియు వాడుకలో నుండి తొలఁగినది.

ఉదిలగొను = పరితపించు (శ. రత్నా) "ద్రౌపదీరూపమును నురిఁదగిలి తనము హృదయమును మృగము త్తఱినుదిలగొనుచు." "అట్లు మనవాగ్నినుదిలగొని యగ్నిదేవుం డకాంతతో నిట్లనియె." అగ్ని సంబంధము కలిగినపుడు పరితపించు నను నర్థము యుక్తముగనే గనఁ

బడును. కాని యీ ధాతు విటీవలికాలమున వాడుకలో నుండి పోవుటచే దానిమూలార్థమును నిర్ధారణచేయుటయు గష్టమే. ఈ ధాతువుయొక్క మూలరూపమును నిర్ధారణచేయుటలో నితర ద్రావిడ భాషలు కొంత తోడ్పడవచ్చును. తమి. ఉదై = తన్నుట (to kick) ఉదైత్తుక్కొండ్రు = తన్నుకొను. కన్నడమున 'ఒదె'—పాదప్రహరణె (to strike with the foot) (ఒడెదాడు–ఒద్దాడు= తన్నులాడు) అనియు ధాతువులు కలవు. 'మృగమురిఁబిగిలి యుదిలగొను" అనుసందర్భనను డిలకొనుటకు 'కొట్టుకొను, తన్నుకొను' అనునర్థమె యుక్తతరముగా గనఁబడుటచే, నిదియె దాని మూలార్థమనియు, పరితపించుననునది లాక్షణికార్థమనియుఁదలంపఁదగియున్నది. ఇట్లే తిక్కననాఁడు వాడుకలో నుండి తరువాత వాడుకలో నంతరించిన ధాతువులయొక్కయు రూపముల యొక్కయు, వాస్తవార్థమును నిర్ణయించుపట్ల నితర సజాతీయ భాషారూపములు కొంతవఱకుఁ దోడ్పడుచుండు ననుటను సందేహము లేదు.

కెడగూడు—"కెడగూడ దీని నీతని యొకలిపయిం బెట్టి కాల్పుటుచితం బగుయన్" = చచ్చిపోవునట్లుగా లేదా—చెడిపోవునట్లు. శబ్దరత్నాకరమున నీరూపము గ్రహింపఁబడలేదు గాని 'కెడయు= చచ్చు, పడు—అనురూపము తెలుపఁబడినది. కన్నడమున కిడు = వినాశె (to be ruined) అను ధాతువు కలదు. తమిళమున 'కెడు'= పాడయిపోవు అనుధాతువు కలదు. త. కెడు 'కెట్టాన్' = పాడయిపోయినాఁడు. తాలవ్యాచ్చగు 'ఇ'కారసాహచర్యముచే 'కంఠ్యకకారము' తాలవ్య 'చ'కారముగా మారి తెలుఁగున 'చెడు' అను రూపకము కలిగినది. చెడునుండి—చెట్ట వచ్చినది. కీడు అను ప్రాచీన రూపము కూడఁ గలదు. ఇప్పుడు 'చెడిపోవు' అను రూపమేగాని

'కెడగూడు' గాని 'కెడయు' గాని వాడుకలో లేవు. మఱియొక రూపము 'కీడ్పడు' అనుదానిని కూడ తిక్కన వాడినాఁడు "పేడియనఁ గీడ్పడియుండెనో కాక"

ఆలిగొను = అపహసించు—"అకట సైరంధ్రి నన్ను నిట్లాలిగొనఁగ నేల."—ఇప్పుడిది వాడుకలోనున్నట్లు లేదు. సంస్కృత ధాతువు 'పరిభవించు' అనునది దీని వ్యవహారమునుండి త్రోసివేసినది. కాని కన్నడమున 'అలె' పరిభావే (to slight, to disgrace) అనుధాతువు కలదు. 'అళిగొళ్'=అపహసించు, మోసగించు. కావున నిదియు ప్రాచీన ధాతువుగనే పరిగణింపఁదగియున్నది.

పుల్లగిల్లు = భయపడు (శ. రత్నా) "పురిగోలు మోమున పుల్లగిలఁగ." ఇచ్చట నీయర్థము కుదురదనుట స్పష్టమే. భీతివలనఁ గలిగిన వికారము మోమున వ్యక్తమైనదనియా? పుల్లనిగస్తువు దినినప్పుడు మోమెట్లు చిట్లింతుమో అట్లయ్యెనని యర్థము కానోపు.

ఈను— "మానితసంపదలీనుచుండు"— సంపదల నిచ్చుట. మఱియొకసందర్భమున నీధాతువు ప్రయోగింపఁబడుచున్నను ఇట్టి ప్రయోగమిప్పుడు వాడుకలో లేదు. (తమి. "శిఱప్పు ఈనుం శెల్వముమ్ ఈనుం"= మోక్షము ఇచ్చును శుభము నిచ్చును. ఈన్ఱాళ్ =తల్లి. తెలుఁగు కన్నడముల తిర్యక్ప్రసవమునకె 'ఈను. తమిళమున నట్లుకాదు')

ఈ మొదలగు ధాతువు లనేకము లిప్పటివాడుకలో లేక యితర ద్రావిడభాషలలోని ధాతువులతోఁ బోల్పఁదగి సజాతీయములైన (cognate forms) రూపములుగలిగి తిక్కనచే ప్రాచీనం బగు మూలార్థమునఁ బ్రయోగింపఁబడి యాంధ్రభాషా చరిత్రమును బదచరిత్రమును దెలిసికొనుట కత్యంతసహాయమును జేయునవై యున్నవి.

ఇంకను విచిత్రములగు ప్రాచీన ప్రయోగములు మఱికొన్ని కలవు. క్రియారూపములలోను, కారకప్రయోగమున గూడ ననేక చిత్రములు గాన నగును.

మూదల=తార్కాణము. క్రియారూపమున 'మూదలించు=హెచ్చరించు' ననునర్థమువచ్చినది. మున్+తల అనఁగా ముందుతల చూపునది. మార్గదర్శి అనునది మూలార్థము కావచ్చును.

వలను—"వంజలనైనను వల్లనేర్పడఁగ నొకభంగిఁ జేపగఁ జేసి పాడిగొనఁగ"=తగినవిధము. ఇప్పుడు 'ఆవలను' ఈవలను—ఆవల, ఈవల. ప్రక్క='వలనన్'అనునది. మూలార్థమును గోలుపోయి పంచమీవిభక్తి ప్రత్యయమై స్థిరపడినది.

విచారము—"ఈప్సితకార్యము చేయఁగా విచారమ్మనున్న" "అదియకావగచి"—వీనియర్థమునందలి మార్పు గనునింపఁదగినది.

పెల్లు—"దుర్దశలపెల్లునకు దురపిల్లుట"

వెంటను—"ఎమ్మెయిపని వెంటను"—వానివెంటఁబడిపోయెను. అని యందుముగాని, పనివెంటవెళ్లినాఁడని యిప్పుడనము.

బడిన్—అనుదానికి 'వెన్బడిన్' అని 'వెంట' పదముతోఁ జేర్పకుండ, వ్యస్తప్రయోగ మిప్పటికాలమున లేదు. కాని తిక్కన ప్రయోగమున "చనియెంగేకయ సుతానుచారికలబడిన్" అనికలదు.

చూఱ—"తొల్లింటి చూఱగలదె." 'చూఱగొను' ధాతువులో తప్ప 'చూఱ' కిప్పుడువ్యస్తప్రయోగము లేదు. తమి చూఱైయాడు=కొల్లగొను.

కలిమి— "కాంతాదులతోడి పొందుకలిమి భటునకున్"=పొందుగలిగియుండుట. ఇప్పుడు కలిమిలక్షణార్థమగు 'సంపద' యం

దేగాని, ధాత్వర్థమున వాడుక లేదు. ఇట్టిదె "కోపరసంబు పేర్మిచె రిచెన్".

గోసెకుప్ప—"దీని నీవు గోసెక్కుగఁ జేసి"=దూఱు, దోషము—గోసు—ఘోష. శబ్దభవమై యుండును. 'గోసెక్కు' అనుపదబంధము నెంతశక్తివంతముగ (effectively) తిక్కన ప్రయోగించినాఁడో చూడుఁడు.

చెట్టుపట్టు—"నన్ను నతఁడు చెట్టవట్టినన్ ద్రోచి వెసంజన్న వెనుకొనుటయు", ఇక్కడ మూలార్థమునఁ బ్రయోగింపఁ బడినది. ఇప్పుడు చేపట్టు—వివాహము అనునర్థమున రూఢిఁ జెందినది.

పై — "రెండుపైల నడతము" = రీతులుగా

పైపై—"సింహబలుఁడు నిన్ను పరిభవించి పైపైతోన యునికిం జేసి"—"పైపై పోరి రుద్రాకృతిన్" అనాయాసముగా—త. మెన్పై = మెల్ల మెల్లగా—మార్దవము (తో)

కొలఁది—"లోకుల చిత్తమునకు వేగగు కొలఁదిమనను"—(= రీతిగా) - ఈయర్థమున నిప్పుడు వాడుక లేదు. (చేసినకొలది-లేదా-నా శక్తికొలది-అనియందుము)

మెయివడి = సమ్మతి—"మెయివడి చూపుగా"

వలపు = కోరిక - మూలార్థము. "రిపుం బరిమార్పంగా వచ్చునేని యట్టిద నావలపు" cf. చేయవలయు—. ధాతువు—'ఓల్' cf. చేయనొల్ల. తమి. కన్న. మళ ఒల్, ఒల్లు.

ఓలము = మఱుగు—"ఓలము బయలు నొక్కటిగా" దీనినుండి 'ఓల మాసగొనియె' అను క్రియారూప మేర్పడినది.

ఒంటికి—"ఏచిచలంబున నొంటికిఁ జూచిన" = వేఱువిధముగా?

ఉద్దవిడి—ఉద్ద=మిక్కిలి అనునర్థముగల యుపసర్గ — కాని శ. రత్నా. న దేశ్యమనియే చెప్పబడినది. "ఉద్దవిడిన పసుల నూచ ముట్టుగఁదెత్తు" = "మిక్కిలి విడిపోయిన" cf. నన్నె. కుమా. ఉద్దపరి.

తరము—"తరమెఱిఁగి"—"మేల్ తరములు"

"ఎందు లేకునికిపలన—(లేకుండుటవలన)

"విచ్చి జనిసమస్త దేశంబులుం గ్రుమ్మరి"=విడిపోయి. ఇప్పుడు విచ్చి=విప్పి-విడదీసి.

చాలుట—కార్యంబే చందంబునఁ దెఱఁగగునా చాలుట కోర్వ వలయు. తమ—చాలు; క-సాలు=to be sufficient

కుఱుచ—"నాపలుకులు కుఱుచసేయక"

అటె—"జయలక్ష్మిం జేకొనునటె"

రూపు—గుఱ్ఱములను రూపుగా నరయుట.

పొందు—వారు తమతమ పొందుపట్లు కేగిరి

తేఱు—"గోమునమైఁగండ గ్రొవ్వు దేఱ నేర్తు" = గ్రొవ్వు పైకి గనబడునట్లుగాఁ జేయు

తేజము—"ఎంత తేజమైనవాని బుద్ధిగలుగు వారొల్లరు"

తఱుము—"కాంతారంబున తఱిమిపోవు సమయంబున" = త్వరితపడు—ఈ యర్థమిప్పుడు వాడుకలో నున్నట్లగపడదు—ఇప్పుడు "తఱిమికొని పోవుట" యని కలదు.

మొఱపము=ధ్వని "అందియల మొఱపంబున కరుగుదెంచి" ధాతువు-మ్రోఁగు-తె. పా మొఱపాలు?

"మూడమంచు", "అర్జునుడు గవియించిన యంప మూడమంచు దళముగఁ గప్పిన"— తమి. మూడు=మూయు. మూసుకొని వచ్చిన మంచు–మూడమంచు.

ఓజలు మెఱయు—భీముండ నేక విధముల నోజలు మెఱయుచు'

కొఱడిల్లు—"ఇట్టి పనికి నూఱడిల్లి తోడుకొనగ నిచట నీడగు చుట్టంబుఁదడవి పడయు వాఁడనొక్కొ." = ఉపశమించు!

"బిట్టేసిన మదనునిచే ధృతివాసిన సింహబలుఁడు.' చే=తృతీయార్థము 'మూలముగా' ననియా?

"ఇప్డు దానియ్యెడ కేసుదేవలయుటే పని సేయఁగ బూని"

"దీనిపై నెయ్యముకల్మి యే కొలది నీమదికింతయు నాకుఁ జెప్పుమా"—షష్ఠీప్రయోగ విశేషము గమనింపఁ దగినది = నీమనస్సునకు దీనిపై స్నేహముండుట.?

"ప్రియము చూపి—మునుఁగువడఁ దనుసంభావించు నెడ"

దెస = దురవస్థ = అవస్థ — "తననీచపుదెస యొరు లెఱుంగక యుండఁగ" ఇప్పుడు 'దిక్కు' 'వైపు' అనియే యర్థము.

ఐ—కలిమికి నొప్పగు నీగియు బలిమికి దొడవైనయట్టి బలగముసై."= బలగము కలవాఁడై యను నర్థమున.

"మత్స్యపతిమును దనయలుకలోనివాఁడ కాఁదలంచి"

"పలుకంగఁ జాలఁడయ్యెడునకటా"

"శౌర్యవైభవ ప్రాభవశౌచములకు నొరులకైనఁ గైవారమై యుల్లసిల్లు"

"తనవర్తనమువిన్న మునిజనంబులకైనవలవరించుకొనగవలయువాఁడు"

## ఆంధ్రభారత కవితా విమర్శనము

"రిత్తకు రిత్తచెలఁగినవ్వు"

"తమయన్నకు నగ్ని యిచ్చువారై"

"వారేమనిరేని మఱియుం దగనాడి"

"నీమాటలకు నేమిగులంగా వెఱతుఁబోదు మీ దెట్లుం డెఁ"

"మనకు మార్కొను నట్టి కొలఁదికాదు"

బాసట లేరయెవ్వరున్"

"తనతన వాహనము లాయుధము లెల్ల జనంబులు ననువు సేసికొఁ

"ఇవి నీ తెగ కొలఁదివి."

"పాండునందనులయున్న యిమ్మెయిఁ గానవేఁడి". తమి_వేం

"బలమెల్లఁ వెఱరెండురూపాయలుగఁ జొచ్చి"

"నాలువుగఁ బోయి"

"భయరసము వఱ్ఱుపెట్టునఁ బగఱవాఱ"

"పెద్దదొరలు చీరలొలుపఁబడిరి"

"పతియొఱుఁగఁడొకో జనులు నిజము సేయుదురే"

"దుఃఖములకు నగపడకుండ"

"కీచకుఁ బరిమార్చుటకిపుడు గడవఁబడియెనే"

## కారకవిశేషములు

"ఇంతకు నేర్చునీకు"

"నినుంగొని యాడుచేతఁ దానెంతయుఁ బెద్ద"

"తద్వృత్తమునకు నన్నేలుము.

"యక్షునిచే నగపడ్డవీని ప్రాణంబులు.

"విసరి నేలతోఁ ద్రేసి వీపునమండివెట్టిన"

"కీచకుని దెస నన్నొకకీడు తెరవు పొరయకుండఁగావుము"

"కీచకుదురాచరణంబు నాకుఁ బ్రకటించి"

"ఇట్లు లోకమూర్ఖునిచేఁ దుదిఁబోయి కోలుపోయిన యభిమానము"

"పృథాసుతుల దిక్కునఁ దద్దయుభీతుఁడై"

"వారికిఁ విలాపము సేసె"

"తలపోఁతగలిగి యమ్మెలఁతవచ్చుటకుఁ దానొండు వింతలు పుట్టకుండనొక్క"

"గంధర్వులచే పడి మృతినొందె"

"సైరంధ్రి కపాయము వొందదని యూహించి"

"వారికినుతింపఁగ నేల నిసర్గవృత్తుల్"

"మాకుంజూడ పాండవులు పొడవడంగి లేకపోయిరి.

"నాతోడి ప్రేముడింగడు నాతురయై"

"ఏమనివినియెదనో నీచేననుడు."

"వారలకు వగవవలదు."

"ఆతని నెవ్వరికేనియుం బొగడవలయు."

"పాపమున గురులకు మార్కొనియెదము"

ఇట్లు తిక్కనార్యుని యాంధ్రభాషా జాతీయప్రయోగ చమత్కారము లపారములై వెలయుచున్నవి. ఆతని భాషాశక్తి, ప్రయోగ-

చమత్కృతి, జాతీయవైఖరి, పదసంగ్రహణ నైపుణి, యనన్యసామాన్యములు. అప్పటి తిక్కనార్యుని భాషకును, ఇప్పటిభాషకును విశేషవ్యత్యాస మగపడుచున్నది. ధాతు, పద, కారక, క్రియారూప, జాతీయప్రయోగ విషయమున నెంతేని భేదముకలదు. ఆతని కాలము నందలి యాంధ్రభాషా స్వరూపస్థితిని గనుగొని, అది కాలక్రమమున నెట్టిమార్పులకులోనై ప్రస్తుతస్థితికివచ్చినది, అప్పటి యాతని భాష యెంతవఱకంతరించినదియు దెలిసికొనుటకుగా నాతని భారతమునందలి దేశీయ పదముల పట్టికలను తయారుచేయు టెంతయు నావశ్యకమై గన్పడుచున్నది. వీనిని తరువాతి భాషతోడను, పూర్వకవుల యొక్కయు శాసనములయు భాషతోడను బోల్చినచో నాంధ్ర భాషాచరిత్రమును గొంతవఱకు దెలిసికొనుట కవకాశమేర్పడఁ గలదు.

## ఉపసంహారము

ఇట్లు సహజంబై, సలక్షణంబై, శక్తివంతంబై, జాతీయ యుక్తంబై, దేశీయబహుళంబగు నాంధ్రభాషలో, భవ్యకవితావేశుండును, విజ్ఞాన సంపద్విఖ్యాతుఁడును, సంయమిప్రకర సంభావ్యాను భావుండునగు కృష్ణద్వైపాయనుఁ డద్ధిలోకహితనిష్ఠంబూని రచించిన తేజ్యంబగు నీ యామ్నాయమునందలి యర్థమును ప్రబంధమునందలి గ రచించియాంధ్రావళికి మోదముం గూర్ప నెంచిన తిక్కనార్యుఁడు "హృద్యాహ్లాది, చతుర్థ, మూర్జితకథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి యగు నీవిరాటపర్వమును రచించు సందర్భమున, సంస్కృత మూలమునందలియర్థమును కావ్యకళాదృష్టితోఁ జూచి యందలి విషయముల యౌచిత్యానౌచిత్యములను, గుణదోషములను బరిశీలించి మూలమునందలి విషయ మెచ్చట నుపయోగించుకొనవలెనో దానినచ్చో నుపయోగించుకొనుచు, సందర్భానుకూలముగఁ రసమును బోషించుచు, పాత్రల మును వ్యక్తీకరించుచు, సంభాషణలను బెంచుచు, కథాంశముఁ

దాగుమాటు చేయుచు, కావ్యకళా సౌందర్యమునకుఁ దోడ్పడని సందర్భ
ములను విడనాడుచు, నర్థానిఁ బోషించుట కనువగు వర్ణనలను-అనఁగా
ప్రకృతి వర్ణనలను, శీలపోషక వర్ణనలను, భావచ్ఛాయసూచక వర్ణన
లను మనోవృత్తి ప్రకాశక —ప్రస్ఫోరక— వర్ణనలను, స్వీయదేశీ
యాచార వర్ణనలను సందర్భానుకూలముగ స్వయముగ రచించి చేర్చుచు
దన భాషాంతరీ కృతగ్రంథము నత్యంత రసోద్బోధకంబై కావ్యకళకా
దర్శభూతంబై స్వతంత్రంబగు నుత్తము ధ్వనికావ్యముగనొనర్చి ధన్యుఁడై
నాడు. ఆంధ్రావళి కత్యంతమోదముం గూర్చినాఁడు. భక్తకోటికి వర
ణీయుఁడైనాఁడు. తాననుభవించిన కవిత్వతత్త్వ నిరతిశయానుభావానంద
మును దన దేశీయులకుఁ గూడ చవిగొలిపినాఁడు. ఇఁక ఉద్యోగాదులకు
తక్కిన పదునాల్గింటిలోఁ గూడ నాంధ్రావళి యీమహనీయుని
కావ్యశిల్పమహత్త్వము నారసి యత్యంతామోద భరితులై కావ్యర
సాంబుధి నద్వైతానందాంబుధి నోలలాడుదురు గాత!!!



